# ఆధునిక వ్యవహార కోశం

బూదరాజు రాధాకృష్ణ



ప్రాచీ పబ్లికేషన్స్
హైదరాబాద్

***Aadhunika Vyavahaara Kosam***
(second revised & enlarged edition)
*Budaraju Radhakrishna*



First edition : Dec, 2000, reprints Jan 2003, Oct 2005
Second edition : May 2008, reprint August 2011

Price : Rs. 165/-

**ISBN : 978-81-7443-028-1**

Title : Chandra

*Published by :*
PPC Joshi, for Prachee Publications
3-3-859/1/A, Lane Opp. Arya Samaj,
Kachiguda, Hyderabad-500 027. Ph: 93466 89306
<joshippc@yahoo.co.in>; <joshippc@gmail.com>
www.pracheepublications.com

*Typesetting :*
Balaji Graphics
Gandhinagar, Hyderabad. Ph: 27607125

*Printed at :*
Charita Impressions
1-9-1126/B, Azamabad,
Hyderabad - 500 020.

# నా మాట

ఇరవై సంవత్సరాలపాటు తెలుగు అకాడమిలో పరిశోధనశాఖాధిపతిగా పనిచేసినప్పుడు భిన్నశాస్త్రాలకు సంబంధించిన పారిభాషికపదాలను సేకరించి, ఆయా శాస్త్ర విద్వాంసులతో చర్చించి అవసరమైన సందర్భాల్లో పరిభాషను కల్పించటం నా ఉద్యోగవిధుల్లో ఒకటిగా ఉండేది. అప్పట్లో కందుకూరి వీరేశలింగం కాలంనుంచీ శాస్త్ర సాహిత్యంలో కనిపించిన, ఆయా వ్యక్తులూ సంస్థలూ పట్టికాబద్ధం చేసిన పారిభాషికాలను గూడా కేంద్రప్రభుత్వంలోని కమీషన్ ఫర్ సైంటిఫిక్ అండ్ టెక్నికల్ టెర్మినాలజీ వారు సమకూర్చిన పదజాలంతోపాటు పరిశీలించక తప్పలేదు. ఆ సంస్థనుంచి బయటపడి పుష్కరకాలం గడచినా పారిభాషికపదసేకరణమీద అభినివేశం అలాగే ఉంది.

పదవీవిరమణానంతరం ఈనాడు పత్రికల్లోని భాషాస్వరూపాన్ని అధ్యయనం చేసి 1981లో ఒక చిన్నగ్రంథం ప్రచురించాను. ఆ సంస్థ పత్రికాభాషలోని పారిభాషికాలను సేకరించి ఇంగ్లీషు-తెలుగు పదకోశం సిద్ధం చేయమన్నది. ఆ ప్రయత్నం ఫలించి 1990లో 'ఈనాడు వ్యవహారకోశం' వెలువడింది. ఈ దశాబ్దకాలంలో మరికొన్ని వేల పారిభాషికాలను సమకూర్చి పరివర్ధితరూపంలో అదే పదకోశాన్ని పునఃప్రచురించాలని ఆకాంక్షించాను. ఆ కోరిక నేటిదాకా నెరవేరలేదు. పత్రికల్లోనేగాక పాఠ్యగ్రంథాల్లో అనూదితరచనల్లో లభించిన సాంకేతికపదాలను వ్యవహారకోశంలో అంతకుముందు చేరినవాటితో కలిపి, పూర్వప్రచురణలోని దోషాలను చేతనయినంతలో సరిదిద్దుకొని, పరిష్కృత పరివర్ధిత రూపంలో ఈ ఆధునిక వ్యవహారకోశాన్ని ఈ రూపంలో ఇప్పుడు వెలువరిస్తున్నాను.

పాత్రికేయులకు, అనువాదకులకు, తెలుగులో శాస్త్రగ్రంథరచన తలపెట్టిన సాహితీపరులకు కొంతవరకయినా ఈ పదకోశం ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాను. లిప్యంతరీకరించి తెలుగులో సాంకేతికపదాలుగా వాడుతున్న పదాలీకోశంలో ఎక్కడోగాని కనిపించవు. వైద్య న్యాయ శాస్త్రాలకు సంబంధించిన ప్రాథమిక పరిభాష ఇందులో లభిస్తుంది. శక్తివంచనలేకుండా శాస్త్రసాంకేతికపదాల సేకరణ మరోవైపు చేస్తూనే ఉన్నాను. ఈ కోశం పునర్ముద్రణభాగ్యం సంపాదించుకొనేనాటికి మరికొన్ని వేల పారిభాషికాలను తెలుగు సమానార్థకాలను సేకరించి చేర్చాలనే సంకల్పముంది. ఇందులోని లోపా లోపాలను పాఠకలోకం ద్వారా తెలుసుకోగలిగినప్పుడు అవసరమైన సవరణలు చేసుకోడానికి నేనెప్పుడూ సిద్ధమే.

తొలిరూపంలో ఈ కోశాన్ని ప్రచురించిన ఉషోదయా పబ్లికేషన్సు వారికీ, తదధిపతి రామోజీరావుగారికీ, పరిష్కృత పరివర్ధితరూపంలో ఈ గ్రంథ ప్రచురణ చేపట్టిన ప్రాచీ పబ్లికేషన్సు వారికీ - ముఖ్యంగా శ్రీ పి.పి.సి. జోషీ గారికీ - నా కృతజ్ఞతలు. శ్రద్ధాసక్తులతో టైప్‌సెట్టింగ్ చేసిన బాలాజీ గ్రాఫిక్స్ వారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

నా ఇతర గ్రంథాలను ఆదరించిన సాహితీపరులు ఈ కోశాన్నీ సమాదరిస్తారని ఆశిస్తున్నాను.

- బూదరాజు రాధాకృష్ణ

హైదరాబాద్,
5-12-2000

అంకితం

కీర్తిశేషులైన నా తల్లిదండ్రులు

బూదరాజు సువర్చలా నరసింహారావులకు

## ఈ కూర్పు గురించి...

గతకూర్పు 'నా మాట'లో మాటయిచ్చిన ప్రకారం 2005 డిసెంబరు దాకా కొనసాగించిన శాస్త్రసాంకేతికపదాల సేకరణను బూదరాజు రాధాకృష్ణ గారిందులో పొందుపరిచారు. ఆ విధంగా ముఖ్యఆరోపాలూ ఉపఆరోపాలూ కలిసి రమారమి రెండువేల ఆరోపాలు యీ కూర్పులో చోటు చేసుకున్నాయి. ఆ ఐదు సంవత్సరాల కాలంలోనూ దిద్దుబాట్లు, అర్థపరిపుష్టీ చేస్తూ వచ్చారు.

ఆయన వెళ్లిపోయాక 'ఈ కోశం పునర్ముద్రణ భాగ్యం' సంపాదించుకున్నది.

గతకూర్పు ప్రూఫుల్ని తానే దిద్దుకున్నారు, నేను కూడా సాయపడినప్పటికీ. ఇప్పుడు ఆ ఆసరా లేకుండా నేనే మళ్ళీమళ్ళీ ప్రూఫులు సరిచూడవలసివచ్చింది. అందువల్ల కొన్ని లోటుపాట్లు నా కన్నుగప్పి వుండవచ్చు. అందుకు సహృదయులైన పాఠకులు మన్నించగలరని ఆశిస్తున్నాను.

ఓపికగా ఈ తరహా లోపాల్ని గుర్తించిన మిత్రులు శ్రీ నాగభూషణరావు గారికి కృతజ్ఞతలు. ఈ పునర్ముద్రణలో వాటినన్నిటిని దిద్ది అందించుతున్నాం.

అనేకమంది మిత్రులు చేసిన మూడు ప్రధాన సూచనలని యీ కూర్పు వెలువరించే సందర్భంగా దృష్టిలో పెట్టుకొనే ప్రయత్నం చేసాను : అక్షరాల్ని కొంత పెంచి కంటికి శ్రమ తగ్గించటమూ, ఆరోపాల అకారాదిక్రమంలో లోపాల్ని (రాధాకృష్ణగారు సరిచేయగా మిగిలినవాటిని) సరిచేయడమూ. మరో ముఖ్యమైన సూచన విదేశాల్లో వున్నవారి సౌకర్యంకోసం ఈ వ్యవహారకోశాన్ని ఇంటర్నెట్‌లో చూసుకునే సౌకర్యం www.pracheepublications.com లో అందించుచున్నాము.

గత కూర్పునిలాగే యీ కూర్పుని కూడా పత్రికలూ పాత్రికేయులూ పాఠకులూ ఆదరించగలరని ఆశిస్తున్నాను.

రాధాకృష్ణగారి కుటుంబసభ్యులకీ, యీ ప్రయత్నంలో సహకరించిన/సహకరించ నున్న మిత్రులందరికీ కృతజ్ఞతలు.

జూన్, 2011 - పి.పి.సి. జోషి

## బూదరాజు రాధాకృష్ణ రచనలు

అనువాదాలు : గిడుగు వ్యాసావళి : ప్రజాభాష (1957), నేటితెలుగు - నివేదిక (గిడుగు) (1991), సాగరశాస్త్రం (1996)

సహసంపాదకత్వం : ఊహాగానము - ఇతర కృతులు : అబ్బూరి రామకృష్ణరావు (1973), భారతీయ సాహిత్యం - సమకాలిక కథానికలు (1996), Brain and Language Teaching (1981)

సంపాదకత్వం : మాండలిక వృత్తిపదకోశం - వాస్తు (1968), మాండలిక వృత్తిపదకోశం - కళలు (1997), కరీంనగర్ మాండలికం (1971), విశాఖ మాండలికం (1972), వరంగల్ మాండలికం (1977), చిత్తూరు మాండలికం (1983), అనంతపురం, శ్రీకాకుళం, కర్నూలు, ఆదిలాబాదు, నిజామాబాదు మాండలికాలు (1984), వయోజనులకు పాఠాలు I & II, (1975 & '77), గ్రాంథిక వ్యావహారికవాద సూచిక (1836-1980) (1980), వాణిజ్య పదకోశం (1984), తెలుగు భాషా సాహిత్య సంస్కృతి చరిత్ర (1985), కోయబాస I & II (1985), గోండిబాస II (1985), మాచిరాజు దేవీప్రసాద్ పేరడీలు (1986), కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు - తెలుగు భాషాతత్త్వము (1989), ప్రాచీనాంధ్రశాసనాలు (క్రీ.శ.1100 వరకు) (1971), తెలుగు శాసనాలు (12వ శతాబ్ది) (1996), తెలుగు శాసనాలు (13వ శతాబ్ది) (?), ప్రసార మాధ్యమాల కోసం రాయటం - వర్తమాన వ్యవహారాలు (1996), మరవరాని మాటలు (2004), పత్రికా పదకోశం (ద్వితీయ ముద్రణ పరిష్కరణ) (2004), A Monograph on Karimnagar Dialect (1974), A Monograph on Guntur Dialect (1983), A Monograph on Warangal Dialect (1986), A Monograph on Vizag Dialect (1986), A Monograph on Srikakulam Dialect (1987), Syntactic Variation in Modern Telugu (1984), International Encyclopaedea of Indian Literature (Vol. V - Telugu) (1988).

# a

***ab acterno*** బహుపురాతనకాలంనుంచి
**abacus** లెక్కలబల్ల, పూసలచట్రం
**abaddon** నరక, నరకదేవత
**abaegenate** అన్యాక్రాంతంచేయు
**abai** పైతృక
**abalienate** హక్కును/ప్రయోజనాన్ని పరాధీనం చేయు; పట్టా ఇచ్చు, హక్కులు బదలాయించు
**abandon** పరిత్యజించు, వదులుకొను, త్యాగం చేయు, పరిత్యక్తంచేయు; పరిత్యాగం, వదిలిపెట్టడం, వేరు చేయటం
**abandonee** విడిచిన హక్కుల పరిగ్రహీత, హక్కులు పొందే వ్యక్తి
**abandoner** పరిత్యాగి
**abandonment** పరిత్యాగం, వదులుకోలు, సంయమనంలేమి
***ab ante*** ముందుగానే
**abase** అవమానించు
**abasia** గమనహీనత, నడకలేమి
**abate** తగ్గు, తగ్గించు, రద్దగు, తొలగించు, ఉపశమించు, తక్కువచేయు
**abatement** తగ్గింపు, తగ్గుదల, ముగింపు, ఉపశమనం, ఆపుదల
**abaxial** ఉపాక్ష
**abbreviation** సంక్షేపం, క్లుప్తీకరణ; సంకేతచిహ్నం
**abbreviature** సంక్షేపణం
**abdicant/abdicator** పదభ్రష్టుడు
**abdicate** పదభ్రష్టంచేయు
**abdication** పదవీత్యాగం, పదభ్రష్టత
**abdomen** ఉదరం, పొత్తికడుపు
**abdominal** ఉదర సంబంధి
**abduct** అపహరించు, ఎత్తుకొనిపోవు, లేవదీసుకొనిపోవు
**abducted** అపహృత, ఎత్తుకొనిపోయిన, లేవదీసుకొనిపోయిన
**abduction** అపహరణ, ఎత్తుకొని/లేవదీసుకొని పోవడం, శరీరమధ్యభాగంనుంచి కదిలించటం
**abductor** అపహర్త
**abena** శ్వాసావరోధం
**aberrance** అసాధారణత, అస్వాభావికత
**aberrant** అసాధారణ, అస్వాభావిక, అపసవ్య, అపగామి
**aberration** అసాధారణత, అస్వాభావికత; అపగామిత, పథభ్రష్టత, విపథనం, మతిభ్రమ; దారి తప్పటం/తొలగటం
**abet** ప్రేరేపించు, దుష్ప్రేరణచేయు, అపరాధాన్ని ప్రోత్సహించు
**abetment** దుష్ప్రేరణ, ప్రేరేపణ, ప్రోత్సాహం, మద్దతు
**abettal** దుష్ప్రేరణ
**abetter** ప్రేరకుడు, ప్రేరేపకుడు, దుష్ప్రేరకుడు
**abetting** (అపరాధ) ప్రేరేపణ
**abettoir** కబేళా, వధ్యస్థానం
**abeyance** అనిర్ణీతత్వం, ఎటూతేల్చని స్థితి; నిలుపుదల
**abeyant** అనిర్ణీత
**abhor** తిరస్కరించు, ఏవగించుకొను, రోతపడు
**abhorence** జుగుప్స, ఏవగింపు, రోత; అసంగతత్వం
**abhorrent** తిరస్కృత, అసంగత, అసహ్యకర
**abide** స్వీకరించు, కట్టుబడి ఉండు
**abiding** స్థిర, కట్టుబడి ఉండే, దృఢ
**abiding conviction** దృఢవిశ్వాసం
**abidingly** స్థిరంగా, దృఢంగా, కట్టుబాటుతో
**abilitative** సామర్థ్యార్థకం
**ability** సామర్థ్యం, సమర్థత
**ability grouping** సామర్థ్యసమూహనం
***ab-initio*** మొదటినుంచీ, ఆదినుంచీ, ఆరంభం నుంచి
***ab invito*** బలవంతంగా
**abiogenesis** అకస్మాజ్జననం
**abiogenic** అజీవజన్య
**abiotrophy** అరుగుదల, శుష్కత్వం
**abject** నికృష్ట, హీన
**abjection** నీచత్వం, నికృష్టత, హైన్యం
**abjectness** నీచత్వం, నికృష్టత
***ab judicatio*** న్యాయస్థానానికి దూరంగా
**abjuration** మాట తప్పటం, ప్రమాణపూర్వకంగా నిరాకరించటం/పరిత్యజించటం
**abjurer** మాట తప్పిన వ్యక్తి; పరిత్యాగి
**ablation** తొలగింపు, హిమక్షయం
**ablative** పంచమీ విభక్తి, అపాదానకారకం
**ablator** ఉష్ణనిరోధక(కవచ)ం
**able** సమర్థ, తాహతుగల, శక్తిగల
**able-bodied** శరీరసామర్థ్యంగల, శక్తుడైన, స్వస్థుడైన
***ablemoschus esculentes*** బెండ
**ablepsy** గుడ్డితనం, అంధత్వం

**ablution** పవిత్రస్నానం, ప్రక్షాళనం, కడుక్కోవటం
**abnegate** అధికారం త్యజించు/తిరస్కరించు
**abnegation** (ఆత్మ) త్యాగం, ఆత్మతిరస్కారం; ప్రత్యాఖ్యానం
**abnormal** అసామాన్య, అసాధారణ, వికృత, అస్వాభావిక, నియమవిరుద్ధ, విపరీత
**abnormal action** విపరీతచర్య
**abnormality** వైపరీత్యం; విపరీతతత్వం, అస్వాభావికత, అసామాన్యత, అసాధారణత, అపసామాన్యత
**aboard** విమానంలో, నావలో, రైలుమీద
**abode** నివాసం
**abolish** రద్దుచేయు, ఎత్తివేయు, అంతం చేయు, నిర్మూలించు
**abolisher** నిర్మూలకుడు, రద్దుచేసే వ్యక్తి
**abolishionist** నిర్మూలనవాది
**abolishment** రద్దు, తొలగింపు, ఎత్తివేత
**abolition** రద్దు, అంతం, నిర్మూలన, నివారణ
**abominable** అసహ్యకర, హేయ
**aboriginal** ఆది(మ)వాసి
**aborigines** ఆది(మ)వాసులు
**abort** గర్భస్రావం చేయు/అగు; ఫలితం లేకపోవు
**aborted computer file transfer** నిష్ఫల/వ్యర్థ గణకయంత్ర శ్రేణీపరివర్తన
**aborticide** గర్భస్రావకం
**abortifacient** గర్భస్రావకం
**abortion** గర్భవిచ్ఛిత్తి, గర్భస్రావం, రక్తస్రావం
**abortive** నిష్ఫల, అకాల, ఫలించని, సఫలంకాని, విఫల
**abortus** అకాలశిశువు
**abound** నిండిన, పర్యాప్త
**about** గురించి; ఇంచుమించు, దాదాపు, రమారమి, సుమారు
**above** మీద, పైన; సదరు, అధిక
**above board** నిష్కల్మష, ఊహాతీత
**above-par** మించిన, ఎక్కువ వెల గల, అధిమూల్య, అధిగమించిన
**abovesaid** ఉపర్యుక్త, పైన చెప్పిన/రాసిన, సదరు
**abraded** అరిగిపోయిన
**abrasion** రాపిడి, ఒరపిడి, అరిగిపోవడం, (చర్మం) గీచుకుపోవటం
**abrasive** కరకు, మొరటు; ఒరపిడి రాయి
**abreaction** భాషణ చికిత్స
**abridge** సంక్షేపించు, క్లుప్తీకరించు, సంగ్రహించు, తగ్గించు, కుదించు
**abridged notation** క్లుప్త/సంక్షిప్త లేఖనం
**abridgement** క్లుప్తీకరణ, సంక్షేపణం, తగ్గింపు, కుదింపు, సంగ్రహ(ణ)ం
**abroad** విదేశాల్లో, దేశాంతరంలో; పరదేశం, విదేశం, పరప్రాంతం, బయట
**abrogable** రద్దుచేయదగిన
**abrogate** రద్దుచేయు, నిరాకరించు
**abrogation** నిరాకరణ, రద్దు (చేయటం)
**abrogative** రద్దుచేయగల
**abrogator** నిరాకర్త, రద్దుచేసే వ్యక్తి
**abrosia** ఉపవాసస్థితి
**abrupt** ఆకస్మిక, అర్ధాంతరమైన
**abruptly** హఠాత్తుగా, ఆకస్మికంగా, అర్ధాంతరంగా, అకస్మాత్తుగా, సంబంధం లేకుండా
**abrus** గురివింద
**abscess** గడ్డ, కురుపు, వ్రణం, పుండు, దద్దు
**abscissa** ప్రథమ నిరూపకం
**abscission** (పుండు) కోత, కర్తనం
**abscond** కనపడకుండు, పారిపోవు, పలాయనమగు, తప్పించుకొనిపోవు, పరారగు, చెప్పకుండా పోవు
**absconded** పరారైన, పలాయిత
**absconder** పరారీ, పలాయితుడు
**absconding** పరారీ కావటం
**absconsion** తప్పించుక పోవటం, పారిపోవటం, పలాయనం, పరారీ
**absence** అనుపస్థితి, గైర్‌హాజరీ, పరోక్షం; లోపం; హాజరుకాని, లేని; అభావం
**absent** హాజరుకాని, హాజరులోలేని, గైర్‌హాజర్, అనుపస్థిత
**absent-minded** అన్యమనస్క, మతిమరుపుగల, స్థిమితంలేని, పరధ్యానంలో ఉన్న
**absentee** అనుపస్థితుడు, అనుపస్థిత, అన్యత్రవాసి, హాజరుకాని వ్యక్తి
**absentee capitalism** పరోక్ష పెట్టుబడిదారీ విధానం
**absentee landlord** పరోక్ష భూస్వామి, అనుపస్థిత భూస్వామి
**absenteeism** అనుపస్థితి, హాజరుకాకపోవటం, అన్యత్రవాసం
**absente reo** ప్రతివాది గైర్‌హాజరీ
**absolute** పరమ, కేవల, శుద్ధ, పూర్తి, సంపూర్ణ, నిరపేక్ష



**absolute majority** పూర్తి/నిరపేక్ష మెజారిటీ
**absolute monopoly** పూర్తి/సంపూర్ణ గుత్తాధిపత్యం
**absolute privilege** పూర్తిహక్కు, పూర్ణాధికారం
**absolute temperature** పరమోష్ణత
**absolute trust** సంపూర్ణవిశ్వాసం
**absolute truth** పరమసత్యం
**absolute zero** పరమశూన్యం
**absolutely** (సం)పూర్తిగా, (సం)పూర్ణంగా, నిరపేక్షంగా, కేవలం
**absolution** విమోచన
**absolutism** నిరపేక్షతావాదం, నిరంకుశత్వం
**absolve** తప్పించు, నిర్దోషిగా భావించు, వదిలించు, (నేరంనుంచి) విముక్తునిచేయు
**absolved** (నేరంనుంచి) విముక్త
**absolvent** విమోచకం
**absolver** విమోచకుడు
**absorb** పీల్చుకొను, లీనం చేసుకొను, చేర్చుకొను, కలిసిపోవు, శోషించు
**absorbance** గ్రహణం
**absorbent** శోషకం, (ద్రవ) గ్రాహకం
**absorber** శోషకం
**absorption** శోషణం, ద్రవగ్రహణం, ఐక్యం కావటం, ఏకీభవనం
**abstain** హాజరు కాకుండు, పాల్గొనకుండు; విముఖంగా ఉండు, పథ్యంగా ఉండు
**abstemious** మితాహారి
**abstention** గైర్‌హాజరీ, దూరంగా/వేరుగా ఉండటం; పథ్యం, విముఖత, దూరత
**abstinence** పరిత్యాగం, సంయమం, ఉపవాసం, లంఖణం (లంఘనం)
**abstract** *adj* అమూర్త, అరూప, సంక్షిప్త, గూఢ, శుద్ధ *n* సంక్షేపం, సారం, సారాంశం *v* సంక్షేపించు, సంగ్రహించు, పరిగ్రహించు
**abstract art** నైరూప్యకళ
**abstract goal** అమూర్తగమ్యం
**abstract language** అమూర్తభాష
**abstract noun** భావనామం
**abstracted** గూఢమైన
**abstracter** సంగ్రహలేఖకుడు, సంక్షేపకుడు
**abstraction** సారగ్రహణం, సంక్షేపణం
**abstruse** గూఢ, గుప్త, కఠిన, అర్థంకాని
**abstrusity** గూఢత, గోప్యం, కఠినత్వం
**absurd** అర్థరహిత, నిరర్థక, అర్థంలేని, అసంగత
**absurdity** నిరర్థకత, అసంగతత్వం
**abulia** నిర్ణయరాహిత్యం
**abundance** సమృద్ధి, పుష్కలత
**abundant** పుష్కల, సమృద్ధ, అధిక
**abuse** *n* నింద, తిట్టు, దుర్భాష; దుర్వినియోగం *v* నిందించు, తిట్టు, దుర్భాషలాడు; దుర్వినియోగించు
**abut** ఆనుకొని ఉండు, (హద్దులదగ్గర) కలిసి ఉండు
***abutilon asiaticum*** తుత్తురు
**abutment** ప్రతిక్రియాస్థానం; దన్నుగోడ
**abuttals** సరిహద్దులు
**abuttor** సరిహద్దుదారు
**abuzz** ముసురుకొన్న, వ్యాపించిన
**abysmal** అగాధ; నీచ
**abyss** నరకం, పాతాళం; అగాధం, సముద్రగర్భం
***acacia arabica*** నల్లతుమ్మ
***acacia planiformis*** సాలెం
***acacia suma*** తెల్లచండ్ర
***acacia sundra*** చండ్ర
**academic** విద్యాసంబంధి, విద్యావిషయక
**academic counselling** విద్యావిషయక సలహా సమావేశం
**academic discussion** గోష్ఠి, (విద్యావిషయక) చర్చ
**academic library** విద్యాలయ గ్రంథాలయం
**academic year** విద్యాసంవత్సరం
**academician** విద్యావేత్త
**academy** పరిషత్తు, విద్యాసంస్థ, అకాడమి
**acapnia** రక్తంలో బొగ్గుపులుసు వాయువు (కార్బన్ డయాక్సైడ్)
**acaricide** క్రిమిసంహారకం
**acaudal** వాలిడి, తోకలేని (కోతి)
**accede to** స్వీకరించు, అంగీకరించు, సమ్మతించు, ప్రవేశించు, చేరు
**accelerate** త్వరితం చేయు, వేగం పెంచు
**acceleration** త్వరణం, వేగవృద్ధి, త్వరితత్వం
**accelerator** వేగకారి, ఆక్సిలేటర్
**accent** (ఉచ్చరిత) స్వరం, నొక్కి చెప్పటం
**accentuate** పెంచు, తీవ్రీకరించు, తీవ్రం చేయు; స్వరితంచేయు
**accentuation** ప్రబలత, తీవ్రీకరణ, పెంచటం; స్వరణం
**accept** ఆమోదించు, అంగీకరించు, సమ్మతించు, స్వీకరించు, ఒప్పుకొను

**acceptability** స్వీకార్యత, అంగీకార/ఆమోద యోగ్యత, గ్రహణీయత, గ్రాహ్యత
**acceptable** గ్రాహ్య, అనుకూల, స్వీకార్య, అంగీకార్య, ఒప్పుకోదగ్గ, ఆమోదయోగ్య
**acceptance** ఒప్పుదల, స్వీకారం, అంగీకారం, ఆమోదం
**acceptaness** స్వీకృత వినిమయపత్రాలు
**acceptation** అంగీకరించిన అర్థం
**acceptor** గ్రహీత, స్వీకర్త
**accesory** ఉపసాధనం, సహాయకం, విడిభాగం, ఉపకరణం
**access** ప్రవేశం, (ప్రవేశ) సౌలభ్యం/సాధ్యత, దారి
**accessary** సహాయకుడు, సహాయకారి, తోడుదొంగ/సహాపరాధి
**accessibility** సులభత, సుగమత, ప్రవేశయోగ్యత, దర్శనసౌలభ్యం
**accessible** సులభ, సుగమ, ప్రవేశయోగ్య, సాధ్య
**accessing** సాధించే, సాధక
**accessio** (ఆస్తి ము.) అనువృద్ధి
**accession** గద్దె ఎక్కటం, రాజ్యస్వీకారం, విలీనత, పదవీస్వీకారం, ప్రవేశం, అనువృద్ధి, పదారోహణం
**accessories** విడిభాగాలు, ఉపకరణాలు
**accessory** సహాపరాధి, తోడుదొంగ; అనుబంధం
**accidence** తాత్కాలిక ధర్మం
**accident** ప్రమాదం, దుర్ఘటన, ఆగంతుకం
  **accident story** ప్రమాదవార్త
**accidental** ఆకస్మిక, అకాల, యాదృచ్ఛిక, ప్రామాదిక
**accidentalism** యాదృచ్ఛికతావాదం
**accidentally** అకస్మాత్తుగా, ప్రమాదవశాత్తు, యాదృచ్ఛికంగా, ఆకస్మికంగా
**acclaim** ప్రకటించు, పొగడు
**acclamation** పొగడ్త, ప్రకటన, హర్షధ్వానం; మూజువాణీ ఓటు, ఏకగ్రీవామోదం
**acclimatization** దశానువర్తనం, (వాతావరణ పరిస్థితులకు) అలవాటు పడటం, అనుకూలనం
**acclimatize** (వాతావరణ పరిస్థితులకు) అలవాటుపడు/సహించు
**acclivity** మిట్ట, ఎగుడుదిగుడు(తనం)
**accolade** ప్రశంస, పొగడ్త
**accommodate** సర్దుకొనిపోవు, స్థానం కల్పించు
**accommodating** అనుకూల, సరిపెట్టుకొనే
**accommodation** వసతి, సర్దుబాటు, సవరణ, స్థానకల్పన, జాగా, అనుకూలనం
**accommodatum** సరుకు బదులివ్వటం
**accompaniment** తోడ్పాటు, సహకారం; వంతపాట
**accompany** అనుసరించు, తోడ్పడు, సహకరించు; వంతపాటపాడు
**accomplice** తోడుదొంగ, సహాపరాధి
**accomplish** సాధించు, నెరవేర్చు, పూర్తిచేయు
**accomplished** నెరవేరిన, పూర్తి అయిన, సిద్ధించిన; నిష్ణాత
**accomplishment** సిద్ధి, సాఫల్యం, సమాపనం, సంపూర్ణత, సిద్ధహస్తత, నిర్వహణ
**accord** *n* సమ్మతి, ఒప్పందం, ఒడంబడిక, అన్వయం *v* సమ్మతించు, గుర్తింపునిచ్చు, ఇచ్చు, అన్వయించు
  **with one accord** ఏకగ్రీవంగా, ఏకాభిప్రాయంతో
**accordance** అనుకూలత, అనురూపత, ఏకీభావం
  **in accordance with** అనుసరించి, విధంగా, ప్రకారంగా, అనుగుణంగా
**accordant** ఏకీభావంగల
**accordingly** అదేవిధంగా, ఆ ప్రకారం(గా), తదనుసారం
**according to** విధంగా, ప్రకారంగా, అనుగుణంగా
**accost** పిలుచు, సంబోధించు, హెచ్చరించు, పలకరించు
**accouchement** కాన్పు, ప్రసూతి
**account** *n* ఖాతా; వివరణ, వృత్తాంతం, సంగతి *v* లెక్కపెట్టు, లెక్కించు, పరిగణించు, వివరించు
  **capital account** మూలధనం ఖాతా
  **credit account** అరువు ఖాతా
  **current account** వాడకం/చాలూ ఖాతా, కరెంట్ ఖాతా
  **debit account** ఖర్చుఖాతా, డెబిట్ ఖాతా
  **open an account** ఖాతా తెరచు/మొదలుపెట్టు
  **render an account** లెక్కచెప్పు
  **rough account** చిత్తు/కచ్చా లెక్క
**accountability** జవాబుదారీతనం
**accountable** బాధ్యతాయుత, జవాబుదారు
**accountancy** గణనశాస్త్రం, లెక్కల తనిఖీ
**accountant** గణకుడు, గణకాధికారి, అకౌంటెంట్
**accountant general** ప్రధాన గణకుడు, మహాగణకుడు, అకౌంటెంట్ జనరల్
**accounterments** (సైనిక) సాధన సామగ్రి, సేనాసామగ్రి
**accredit** స్వీకరించు, సమ్మతించు; నియమించు,



నియోగించు; జమచేయు, జమ అయినట్లు గుర్తించు
**accreditation** గుర్తింపు, ప్రాతినిధ్యం
**accredited** నియమిత, నియోజిత, అధికృత
**accredition** గుర్తింపు, ప్రాతినిధ్యం
**accretion** వృద్ధి
**accrimination** దోషారోపణ
**accrual** ప్రాప్తి, పెరుగుదల
**accrue** ప్రాప్తించు, జమఅగు, సమకూడు, లాభించు
**accrued** ప్రాప్త, జమ అయిన
**acculturation** (ప్రాబల్య) సంస్కృతీకరణ(ం)
**accuminate** మొనదేరిన
**accumulate** కూడబెట్టు, సంచయించు, పోగుచేయు, జమచేయు; కూడుకొను, పెరుగు; సమీకరించు
**accumulated** సంచిత, కూడిన, జమ అయిన, పెరిగిన; సమీకృత
**accumulation** సంచయం, సంచితం; సమీకరణ
**accumulator** సంచాయకం, సమీకృతం
**accuracy** నిర్దుష్టత, సరి, యథార్థత, ఖచ్చితత్వం
**accurate** నిర్దుష్ట, యథార్థ, ఖచ్చితమైన, సిసలు
**accurately** సరిగా, ఖచ్చితంగా, నిర్దుష్టంగా, సిసలుగా
**accurse** శపించు, దూషించు
**accusation** నిందారోపణ, నింద, ఆరోపణ
**accusative** ద్వితీయావిభక్తి, కర్మకారకం
**accuse** నిందించు, నిందమోపు, నేరం మోపు/ఆరోపించు
**accused** నిందితుడు
**accuser** ఫిర్యాది, నేరారోపకుడు
**ace** ఆసు (ముక్క); మేటి, సమర్థ
**acellulor** అకణనిర్మిత
**acephalous** తల(కాయ)లేని; నాయక(త్వ)రహిత
**acerbity** తీవ్రత, కటుత్వం, కరకుదనం
**acerous** కొమ్ములేని, శృంగరహిత
**acetabulum** సదుగుపల్లం
**ache** నొప్పి, వేదన
**achieve** సాధించు, జయించు
**achievement** జయం, (కార్య) సిద్ధి/సాధన, సాధించటం, ప్రగతి
  **achievement test** సాధన/ప్రగతి నికష/పరీక్ష
**Achilles heel** దుర్బల/అరక్షిత స్థానం/స్థలం
**achlorhydria** జఠర-అనామ్లత
**achloropsia** అంధత్వం, గుడ్డితనం
**achromatic** అవర్ణ, రంగులేని
***achylia gastrica*** నిరామ్లస్థితి, జఠరరసం లేకపోవటం
**acicular** సూచ్యాకార, సూదిలాంటి
**acid** ఆమ్లం
  **acid-base** ఆమ్ల-క్షార
  **acid-fast** ఆమ్లనిరోధక
  **acid-rain** ఆమ్లవర్షం
**acidic** ఆమ్లాధార, ఆమ్లీయ
**acidification** ఆమ్లీకరణ(ం)
**acidified** ఆమ్లీకృత
**acidifier** ఆమ్లీకారకం
**acidimeter** ఆమ్లమాపకం
**acidimetry** ఆమ్లమితి
**acidity** ఆమ్లత, ఆమ్లత్వం
**acidosis** ఆమ్లరక్తత, ఆమ్లపిత్తం
**acid test** కఠినపరీక్ష, అంతిమపరీక్ష
**acidulant** ఈషదామ్లకారి
**acidulated** ఈషదామ్లితం
**acidulous** ఈషదామ్లవంత
**acknowledge** ఒప్పుకొను, గుర్తించు, రసీదిచ్చు, అంగీకరించు, స్వీకరించు
**acknowledgment** (తిరుగు) రసీదు; స్వీకారం, అంగీకారం, గుర్తింపు
**acme** పరాకాష్ఠ, చివరిదశ, చరమదశ, చరమాగ్రం
**acnode** అసంభావ్య సంపాతం
**acorn** సిందూర కాయ/ఫలం
**acoustic** ధ్వని/శ్రవణ సంబంధి
  **acoustic phonetics** ధ్వని(లక్షణ)శాస్త్రం, అనురణనశాస్త్రం
**acoustics** ధ్వనితరంగశాస్త్రం
**acqua** నీరు, జలం
  **acqua lung** జలశ్వసనం
**acquaint** పరిచయమగు, పరిచయం చేయు, తెలుపు, తెలియబరచు, పరిచయం చేసికొను
**acquaintance** పరిచయం, తెలివిడి
**acquainted** పరిచిత
**acquarium** జలచరాలయం
**acquatic weeds** నీటి కలుపుమొక్కలు
**acquiesce** నిరాక్షేపణగా సమ్మతించు
**acquiescence** నిరాక్షేప సమ్మతి, రాజీ, మౌనాంగీకారం, తృప్తి, మౌనసమ్మతి
**acquifer** జలాశయం

**acquifers** జలమయస్తరాలు
**acquire** సంపాదించు, గడించు, ఆర్జించు, పొందు
**acquired** ఆర్జిత, సంపాదిత, గడించిన, పొందిన
**acquirement** ఆర్జన, సంపాదన, గడన
**acquisition** అధికారపూర్వక స్వాధీనం, ప్రాప్తి, ఆర్జన, సంపాదన, గడన
**land acquisition** భూస్వాధీనత
**acquit** వదిలిపెట్టు, విడుదలచేయు, విముక్తుని చేయు
**acquittal** విడుదల, విముక్తి
**acquittance** రుణవిముక్తి; చెల్లుచీటి; వేతనాల వివరం
**acquitted** (రుణ)విముక్త
**acre** ఎకరం/ఎకరా (4840 చ.గ. భూమి)
**acreable** (per acre) ఎకరం ఒక్కంటికి
**acreage** (ఎకరాల్లో) విస్తీర్ణం, ఎకరాల మొత్తం
**acrid** వగరు, కటు, తీక్ష్ణ; కుపిత, తీవ్రస్వభావం గల; చేదైన
**acrimony** కటుత్వం, తీవ్రత
**acromegaly** అతికాయత్వం
**acromion** అంసకూటం
**acronym** (ఆద్యక్షర) సంక్షిప్తపదం, కుదించినమాట
**across** అడ్డంగా, అటునుంచి ఇటు
**act** *n* చట్టం, శాసనం, విధానం, కార్యం, అంకం, పని, చర్య *v* అమలుపరచు, పనిచేయు
**act of hostility** అమిత్రచర్య, శత్రుచర్య
**act on** చర్య తీసుకొను, వ్యవహరించు
**act on one’s own** సొంత బాధ్యతమీద చర్యతీసుకొను/వ్యవహరించు
**act under instructions** ఆదేశాల ప్రకారం వ్యవహరించు
**Acterner** శంతనుడు
**acting** *adj* తాత్కాలిక పనిచేస్తున్న, స్థానాపన్న *n* అభినయం, నటన; అవిశ్రాంతి; బదులు వ్యక్తి, చర్య
**actinometer** కిరణమాపకం, (సూర్య)కాంతిమాపకం
**actiology** రోగనిదాన(శాస్త్ర)ం
**action** చర్య, వ్యాజ్యం, క్రియ, అభినయం, పోరాటం, చేత
**action, automatic** స్వయంచాలిత చర్య/క్రియ
**action, cumulative** సంచయిత క్రియ/చర్య
**action, delayed** విలంబిత క్రియ/చర్య
**action, direct** ప్రత్యక్ష చర్య/క్రియ
**action, involuntary** అసంకల్పిత చర్య/క్రియ
**action, local** స్థానిక చర్య/క్రియ
**action mycosis** గవదవాపు
**action-noun** చర్యార్థక నామ(వాచక)ం
**action, reflex** అసంకల్పిత ప్రతీకారచర్య
**action, specific** నిర్దిష్ట చర్య/క్రియ
**action, voluntary** ఐచ్ఛిక క్రియ/చర్య
**action word** చర్యావాచక శబ్దం
**take action** చర్య తీసుకొను
**actionable** దావా వేయదగ్గ, చర్యతీసుకోదగిన
**activate** క్రియాత్మకంచేయు, ఉత్తేజపరచు
**activated** ఉత్తేజిత, క్రియాత్మక
**activated carbon** సక్రియ కర్బనం
**activation** ఉత్తేజనం, సక్రియాకరణం
**activator** ప్రేరేపకుడు, ప్రోత్సాహకుడు; ఉత్తేజ కారకం
**active** క్రియాశీల, కార్యశీల, సక్రియ, చురుకైన
**active-construction** కర్తరి ప్రయోగం/వాక్యరచన
**active participation** క్రియాశీల భాగస్వామ్యం/సహభాగిత్వం
**active partner** సక్రియ భాగస్థుడు/భాగస్వామి
**active service** క్రియాశీలసేవ, యుద్ధసేవ
**active voice** కర్తరి ప్రయోగం
**active volcano** జ్వాలాముఖి, సజీవాగ్నిపర్వతం
**actively** క్రియాశీలంగా, చురుకుగా, చైతన్యవంతంగా
**activise** అనుకూలపరచు, ఉత్తేజపరచు, చురుకుపరచు
**activist** క్రియాశీలి
**activities** కార్యకలాపాలు, కార్యక్రమాలు
**activity** క్రియాశీలత, చురుకుదనం, చైతన్యం
**activity level** క్రియాశీలతాస్థాయి
**activity method** కృత్యాధారపద్ధతి
**actor** కర్త; నటుడు, (నాటక) పాత్ర(ధారి); కక్షిదారు, వకీలు, వాది; సంరక్షకుడు, వ్యవహర్త, నిర్వాహకుడు
**actor-action-goal** కర్త-కర్మ-క్రియ
**actress** నటి, అభినేత్రి
**actual** అసలు, వాస్తవిక, యథార్థ, నిజమైన
**actualist** వాస్తవికతావాది
**actually** వాస్తవంగా, యథార్థంగా, వాస్తవానికి, నిజంగా, అసలుకు
**actuals** వాస్తవిక గణాంకాలు, అసలు అంకడాలు



**actuary** బీమా గణకుడు, ఆక్చ్యువరీ
**actuate** ప్రేరేపించు, ఉత్తేజపరచు
***actus reus*** చట్టవిరుద్ధచర్య
**acuity** తీక్ష్ణత, తీవ్రత
**acumen** చతురత, నిశిత బుద్ధి/దృష్టి, బుద్ధితీవ్రత
**acupuncture** సూదిపొడుపు వైద్యం
**acute** తీవ్ర, ఉదాత్త
**acute accent** ఉదాత్తస్వరం
**adamant** కఠోర, కఠిన, దృఢ
**Adam’s apple** కంఠమణి
**adapt** అనుకూలమగు, అనుకూలింపజేయు, రూపాంతరీకరించు, అనుసరించు
**adaptability** అనుసరణీయత, అనుకూలత, ఆనుకూల్యం
**adaptable** అనుసరణీయ
**adaptation** అనుకూలనం, రూపాంతరణం, పొందిక, అనుకూలత, సర్దుబాటు, అనుసరణ
**adapted** అనుకూలిత
**adapter** సంయోజకం, అనుకూలానుసరణకర్త
**adaptive** అనుకూల, అనుసారి
**adaxial** కేంద్రాభిసార
**add** కలుపు, పెంచు, ఎక్కువచేయు, సంకలనం చేయు
**addend** సంకలితం
**addendum** అనుబంధం, పరిశిష్టం
**addict** *n* వ్యసని, వ్యసనదాసుడు *v* వ్యసనానికి లోబడు/లోనగు
**addiction** వ్యసనం, దురలవాటు
**Addison's disease** నిస్సత్తువ, నిస్త్రాణ
**add(ition)** అనుబంధం
**addition** కూడిక, సంకలనం, అదనపుచేర్పు
**additional** అదనపు
**additive** సంకలితం, ఆదేశం, ఆదేశాత్మకం
**additivity** సంకలనశీలత
**address** *n* చిరునామా; సంబోధన, ప్రసంగం, అభిభాషణ; స్వాగత/వినతిపత్రం *v* ఉపన్యసించు, ప్రసంగించు, సంబోధించు, అభిభాషించు
**presidential address** అధ్యక్ష ప్రసంగం, అధ్యక్షోపన్యాసం
**president’s address** రాష్ట్రపతి/సభాపతి ప్రసంగం
**welcome address** స్వాగతోపన్యాసం
**addressable position** గణనీయ/చెప్పదగ్గస్థానం
**addressee** చిరునామాదారు, జాబు పొందే వ్యక్తి, సంబోధితుడు
**addressograph** చిరునామా లేఖకుడు; చిరునామాలు రాసే యంత్రం
**adduce** నివేదించు, ఆరోపించు, ఇచ్చు, నిరూపించు, దృష్టాంతరీకరించు, ఎదటపెట్టు
**adduction** శరీరంమధ్యకు చేర్చటం
**adductor** అభివర్తని
**adeem** ఉపసంహరించు
**ademption** ఉపసంహరణ, వీలునామా మార్పు/రద్దు
***adenanthera aculeata*** జాన
**adept** చతురుడు, నిపుణుడు, ప్రవీణుడు, దక్షుడు
**adequacy** చాలటం, సరిపోవటం, సరిపడటం, పర్యాప్తత, సముచితత్వం, పర్యాప్తి
**adequate** చాలినంత, పర్యాప్త, తగిన(ంత), కావలసినంత, యథోచిత, సముచిత
**adfected equation** సంకర సమీకరణం
**adhere** అనుసరించు, అంటిపెట్టుకొను, అవలంబించు, అనువర్తించు
**adherence** అనుసరణ, అనువర్తన, అవలంబన, అంటిపెట్టుకొనటం
**adherent** అనుయాయి, సహచరుడు, అతికిన, అంటిపెట్టుకొని ఉన్న
**adherents** అనుసారులు, సహచరులు, అవలంబితాలు, అంటుకొని ఉండేవి
**adhesion** అతుకు, అసంజనం, అంటుకొని ఉండటం
**adhesive** అతుక్కొని ఉండే, జిగురయిన
**adhesives** అతుకుడు పదార్థాలు, జిగురులు, బంకలు
***ad hoc*** తాత్కాలిక, తదర్థ
**ad hoc committee** తాత్కాలిక సంఘం, విశేష సంఘం
**ad hocism** తాత్కాలికనిర్ణయ విధానం
**adiabatic** స్థిరోష్ణక
**adiathermanous** అధమోష్ణవాహక
***adina cordifolia*** బండారు
***ad-infinitum*** యావదనంతరం
**adipose** కొవ్వు సంబంధమైన
**adiposis** కొవ్వెక్కటం
**adipsia** దప్పికలేమి
**adjacency** సామీప్యం, దగ్గరితనం
**adjacent** ఆసన్న, సమీప(స్థ), సమీపవర్తి, దగ్గరి, ఆనుకొని ఉన్న

**adjacent angle** ఆసన్నకోణం
**adjacent side** ఆసన్నభుజం
**adjective** విశేషణం; ప్రక్రియా సంబంధి
**adjoining** సమీపవర్తి, సమీప(స్థ), అంటిఉన్న, ఆనుకొని ఉన్న, కలిసి ఉన్న
**adjourn** వాయిదావేయు
**adjourn *sine-die*** అనిర్ణీతంగా వాయిదాపడు/వాయిదా వేయు
**adjournment** వాయిదా
**adjournment motion** వాయిదా తీర్మానం
**adjudge** (న్యాయం) నిర్ణయించు, ఫైసలా చేయు, న్యాయనిర్ణయం చేయు
**adjudged** న్యాయనిర్ణయం చేసిన
**adjudicate** (న్యాయం) నిర్ణయించు, న్యాయబద్ధంగా తీర్పునిచ్చు
**adjudication** (న్యాయ) నిర్ణయం, ఫైసలా
**adjudicator** (న్యాయ) నిర్ణేత
**adjunct** సంయుక్త, సమ్మిళిత, సంలగ్న, కలిసి ఉన్న
**adjuration** ప్రమాణపూర్వక నిరాకరణ
**adjure** ప్రమాణం చేయించు, ఒట్టుపెట్టించు, అభ్యర్థించు
**adjust** సర్దు, సరిచేయు, కుదుర్చు, చక్కదిద్దు, సర్దుబాటుచేయు, సరిపుచ్చు
**adjustable** సర్దదగిన, కుదిరే, సరిచేయదగిన
**adjuster** సర్దుబాటుదారు, సర్దుబాటు పరికరం
**adjusting screw** సరిచేసే మర
**adjustment** సర్దుబాటు
**adjustment of accounts** లెక్కల సర్దుబాటు
**adjutant** సహాయకుడు, సహాయకాధికారి
**adjuvant** సహాయకౌషధం, అనుపానం; అనుబంధ
**adlegation** వాదం/దావా నిమిత్తం, రాయబార వర్గంతో పంపటం
***ad lib(ition)*** యథేచ్ఛ, ఇష్టానుసారం
***ad-litem*** దావాకోసం
**admeasurement** భాగనిర్ణయం
**adminicle** సహాయక సాక్ష్యం, బలపరిచే సాక్ష్యం
**adminicular** సహాయకం
**administer** పరిపాలించు, నిర్వహించు, అమలు జరుపు, వ్యవహరించు, వ్యవస్థీకరించు, ప్రమాణం చేయించు, (మందు, విషం మొ.) ఇచ్చు, న్యాయపాలన చేయు
**administer an oath** శపథం/ప్రమాణం చేయించు/స్వీకరింపజేయు
**administer justice** న్యాయం చేయు; న్యాయ పరిపాలన చేయు
**administration** పరిపాలన, పరిపాలన సంబంధి
**administration of justice** న్యాయపరిపాలన
**administrative** పరిపాలక, పరిపాలన సంబంధి, సర్కారీ
**administrative bottle necks** పరిపాలన సంబంధి అవరోధాలు
**administrator** పరిపాలకుడు, అధికారి, వ్యవహర్త, నిర్వాహకుడు, వ్యవస్థాపకుడు
**administratrix** పరిపాలకురాలు, అధికారిణి, నిర్వాహకురాలు, వ్యవస్థాపకురాలు
**admirable** ప్రశంసనీయ, ప్రశంసాయోగ్య, గ్రాహ్య, స్వీకార్య
**admiral** నౌకాదళాధిపతి, అడ్మిరల్
**admirality** నౌకాదళ కార్యాలయం, నౌకాదళాధికారం, నౌకాదళశాఖ; సముద్రయాన సంబంధి
**admiration** ప్రశంస, మెప్పు, మెచ్చుకోలు
**admire** ప్రశంసించు, మెచ్చుకొను
**admissibility** అనుమతి/స్వీకార యోగ్యత
**admissible** స్వీకరించదగ్గ, గ్రాహ్య, స్వీకార్య
**admissible motion** స్వీకరించదగ్గ తీర్మానం
**admissible solution** గ్రాహ్య సాధనం/పరిష్కారం
**admissible value** గ్రాహ్యమానం, అంగీకరించ దగ్గ విలువ
**admission** స్వీకరణం, స్వీకారం, ఒప్పుకోలు, ఒప్పుదల, అంగీకారం, గ్రహణం, ప్రవేశనం
**admission number** ప్రవేశసంఖ్య
**admit** అనుమతించు, అంగీకరించు, చేర్చుకొను, ప్రవేశమిచ్చు
**admittance** ప్రవేశానుమతి, స్వీకృతి, చేపట్టడం
**admitted** స్వీకృత, దాఖలైన, చేర్చుకున్న, ప్రవేశించిన
**admixture** సమ్మిశ్రణం, కలగలుపు
**admonish** మందలించు, నిందించు, బెదరించు, బుద్ధిచెప్పు
**admonition** మందలింపు
***ad nauseam*** విసిగించే
**adolescence** కౌమారం, కిశోరప్రాయం, యౌవనం; అపరిపక్వత
**adolescent** అపరిపక్వ, కిశోరావస్థలోని, యౌవన (పూర్వకౌమార)దశలో ఉన్న
**adopt** దత్తు తీసుకొను, దత్తస్వీకారం చేయు; అంగీకరించు



**adoptation** పరిసరానువర్తనం
**adopted** స్వీకృత, అంగీకృత
**adopted son** దత్తపుత్రుడు
**adopter** దత్తస్వీకర్త
**adoption** దత్తత, దత్తస్వీకారం; అంగీకారం
**adorable** పూజనీయ, ఆరాధనీయ
**adoration** ఆరాధన, పూజనం
**adore** ఆరాధించు, పూజించు, సమ్మానించు
**adorn** అలంకరించు, సజ్జీకరించు
***ad-promiser*** సహవాగ్దాత
**adrenal** అధివృక్క
**adrift** కొట్టుకొనిపోవు; అసహాయ, కొట్టుకొనిపోతున్న
**cast adrift/cut adrift** లంగరులేని, లంగరు తెగిన
**adrogation** ఒకరకం దత్తత
**adroit** నిపుణ, చతుర
**adsorbent** అధిశోషకం
**adsorption** అధిశోషణం, అధిచూషణం
**adularia** చంద్రకాంతం
**adulation** ముఖస్తుతి, చాటుకారిత
**adult** వయోజనుడు
**adult education** వయోజనవిద్య
**adult franchise** వయోజన వోటింగు (హక్కు)
**adult suffrage** వయోజన వోటింగు హక్కు
**adulterant** కల్తీచేసే వస్తువు/పదార్థం
**adulterate** కల్తీచేయు, దూషితం చేయు
**adulteration** కల్తీ
**adulterer** వ్యభిచారి, మిండగాడు
**adulterine** నకిలీ; అక్రమసంతానం
**adultery** వ్యభిచారం, మిండరికం
**adultress** వ్యభిచారిణి, మిండగత్తె
**adumbrate** రేఖామాత్రంగా చూపు
***ad valorem*** విలువనుబట్టి
**advance** *n* బయానా/బజానా, సంచకారం; (జీతభత్యాల్లో) అగావు చెల్లింపు; అభ్యుదయం, ప్రగతి, (సేనా) పురోగమనం *v* బయానా ఇచ్చు, అగావు చెల్లించు, ముందంజ వేయు, ముందుకు పంపు, (అభిప్రాయం) ప్రకటించు
**advance guard** సేనాముఖం, అనిమొన, సేనాగ్రం
**advance landing ground** సేనాముఖం దిగేచోటు, రణముఖం
**advance party** సేనాగ్రభాగం, పురోగామిదళం, ముందు(కు)పోయే దళం
**advance payment** ముందు/ముందస్తు చెల్లింపు
**advance story** పూర్వ/పూర్వాగమ వార్త
**advanced** పురోగమించిన, ముందు చెల్లించిన, ఉన్నత, పురోగామి, అభివృద్ధ, అభివృద్ధిచెందిన
**advanced base** అగ్రస్థావరం
**advanced naval base** నౌకాదళ-అగ్రస్థావరం
**advancement** పురోగమనం, అభివృద్ధి (సాధన)
**advantage** లాభం, ప్రయోజనం, వృద్ధి, పెంపు, ఉన్నతి
**advantageous** లాభకారి, లాభసాటి, లాభప్రద, అనుకూల, ప్రయోజనకారి
**adventitious** ఆగంతుక, ఆకస్మిక; అబ్బురపు
**adventure** సాహసకృత్యం, సాహసవ్యాపారం, దుస్సంఘటన
**adventurer** సాహసి(కుడు)
**adventures** సాహస కార్యాలు/కృత్యాలు
**adverb** అవ్యయం, క్రియావిశేషణం
**adversary** విరోధి, శత్రువు, ప్రతిస్పర్ధి
**adverse** ప్రతికూల, విరుద్ధ, వ్యతిరేక
**adverse balance of trade** ప్రతికూల వర్తకశేషం
**adversity** ప్రతికూలత, విపత్తి
**advertise** (వాణిజ్య) ప్రకటన చేయు, ప్రకటించు
**advertisement** (వాణిజ్య) ప్రకటన, వ్యాపార ప్రచార ప్రకటన
**advices** సలహాలు, సూచనలు, ఉపదేశాలు, లిఖితసూచనలు
**advise** సలహా ఇచ్చు, సూచించు, ఉపదేశించు, హితంచెప్పు
**advisedly** సలహాప్రకారం, ఆలోచనాపూర్వకంగా
**adviser, advisor** సలహాదారు, హితవరి
**advisory committee** సలహాసంఘం
**advocacy** పక్షవాదం, న్యాయవాదం, వకీలుపని
**advocate** *n* న్యాయవాది, వకీలు, ప్లీడరు *v* సమర్థించు, వాదించు
**advocate general** (ప్రభుత్వ) ప్రధాన న్యాయవాది, అడ్వకేట్ జనరల్
**adytum** గర్భగుడి, గర్భాశయం
***aegiceras corniculatum*** గుగ్గిలం
**aegis** గొడుగునీడ/ఛత్రచ్ఛాయ, సంరక్షణ, కాపుదల
**under the aegis of** గొడుగునీడలో, రక్షణలో, ఆధ్వర్యంలో
***aegle marmelor*** మారేడు
**aeon** నూరుకోట్ల సంవత్సరాలకాలం

**aequitas/equity** సమ ధర్మం/న్యాయం

**aerated** వాయుపూరిత

**aerated water** వాయుపూరిత జలం, సోడా నీరు

**aeration** వాయుపూరణం

**aerial** *adj* వైమానిక, వాయుసంబంధి, వాయుగత (తంతి) *n* తరంగగ్రాహకం

**aerial-root** ఊడ

**aerial-rope** అంతరిక్ష రజ్జుమార్గం

**aerial-stem** వాయుగత కాండం

**aerial-survey** విహంగావలోకనం, విమాన/వైమానిక పరిశీలన

**aerobe** వాయుసహిత జీవి

**aerobic** వాయుసహిత

**aerodrome** విమానాశ్రయం

**aero-dynamics** వాయుగతిశాస్త్రం

**aerolic respiration** వాతశ్వాసక్రియ

**aeromagnetic survey** విహంగాయస్కాంత పరిశీలన

**aero-medical unit** వైమానిక వైద్యదళం

**aerometa** వాయురూపకం

**aerometer** వాతభారమాని

**aeronaut** వైమానికుడు, రోదసీయాత్రికుడు

**aeronautical** వైమానిక

**aeronautics** విమానశాస్త్రం, వైమానికశాస్త్రం

**aeroplane** విమానం

**aerosol** గాలితుంపర

**aesophagus** ఆహారనాళిక

**aesthesia** రసానుభూతి

**aesthete** సౌందర్యోపాసకుడు, రసజ్ఞుడు, రసజ్ఞాని

**aesthetics** సౌందర్యశాస్త్రం, రసజ్ఞానవిద్య

**aestivation** పుష్పభాగవిన్యాసం

**aetiology** కారణవిజ్ఞానం

**affable** ప్రియభాషి, స్నేహమర్యాదలుగల

**affair** విషయం, వ్యవహారం, కార్యం

**affect** ప్రభావం చూపు, ప్రభావితం చేయు, మనసు కలిగించు/పుట్టించు

**affection** వాత్సల్యం, ప్రేమ, అనురాగం

**affective** భావనాత్మక, ప్రభావశాలి

**affective domain** ప్రభావశాలి పరిధి

**affectivity** ప్రభావ(కత్వ)ం

**afferent** అభివాహి

**affiance** నిశ్చితార్థం

**affiant** ప్రమాణకర్త, ప్రమాణ ప్రకటన చేసిన వ్యక్తి, అఫిడవిట్ దాఖలుచేసిన వ్యక్తి

**affidavit** ప్రమాణపత్రం, హలఫ్‌నామా

**affiliate** అనుబంధించు, అనుసంధించు; దత్తస్వీకారం చేయు; తండ్రిగా నిర్ణయించు; అనుబద్ధ

**affiliation** అనుబంధం, అనుబద్ధత; దత్తత; జారజశిశువును తండ్రిపరం చేయటం

**affinity** దాయాదిత్వం, బంధుత్వం; అపేక్ష, ప్రీతి, పోలిక, ఆకర్షణశక్తి

**affirm** స్థిరీకరించు, దృఢపరచు, ధ్రువపరచు, రూఢిపరచు, ప్రమాణపూర్వకంగా వాగ్దానం చేయు

**affirmance** ధ్రువీకరణం

**affirmant** ధ్రువీకర్త

**affirmation** ధ్రువీకరణం, ప్రమాణపూర్వక కథనం; ప్రతిజ్ఞాత(క)ం, ప్రతిజ్ఞ, ప్రమాణం

**affirmative** భావార్థక, నిశ్చయార్థక; అవునని చెప్పే, అంగీకారసూచక, విధ్యాత్మక

**affix** అంటించు, తగిలించు, చేర్చు, (సంతకం) పెట్టు, (ముద్ర) వేయు; ప్రత్యయం

**affixation** (సంతకం, వేలిముద్ర మొ.) పెట్టు/వేయు; కూర్చటం, కలపటం; ప్రత్యయాలు చేర్చటం

**affixing language** ప్రత్యయాత్మక భాష

**afflict** బాధించు, పీడించు, సతాయించు, వేధించు

**aflicted** బాధిత, పీడిత, వ్యథిత

**affliction** బాధ, వేదన, ఆపద, పీడ, విపత్తి, మానసికవ్యథ

**affluence** సమృద్ధి, సంపత్తి

**affluent** సమృద్ధ, సంపన్న, ప్రవాహశీల; ఉపనది

**afflux** ప్రవాహం

**afforce** బలపరచు, గట్టిపరచు

**afforcement** బలపరచటం

**afford** భరించగలుగు, సమర్థత కలిగి ఉండు

**affordable** భరించగల, అందుబాటులోని

**afforestation** అటవీకరణం, అడవిపెంపకం, వనమహోత్సవం

**afforestment** అటవీకరణం

**affranchise** వోటింగు హక్కిచ్చు, మతాధికార మిచ్చు, దాస్యనివృత్తి చేయు

**affray** జగడం, దొమ్మీ, కొట్లాట

**affreight** (నౌకను) అద్దెకు తీసుకొను

**affreightment** (నౌకను) అద్దెకు తీసుకోవటం

**affricate** స్పృష్టోష్మ

**affront** *n* తిరస్కారం, నిరాదరం, అవమానం,



అవజ్ఞ, అమర్యాద *v* తిరస్కరించు, నిరాదరించు, అవమానించు, అమర్యాద చేయు, అవజ్ఞ చేయు

**afloat** (నీటిపై) తేలియాడు/తేలు

**afoot** కాలినడకన; అమల్లో ఉన్న, చాలూ

**aforementioned** పూర్వోక్త

**aforesaid** సదరు, పూర్వోక్త

**afortiare** బలపరచటం

**afraid** భయపడ్డ, పిరికి అయిన, భయభీత

**aft** అవరం, పడవవెనకభాగం

**after all** (ఏది) ఏమైనా, అంతా, తరువాత, ఎన్నో చెప్పినా, అన్నీ ఆలోచించిన/జరిగిన తరవాత

**after-care** అనంతర సంరక్షణ, తరవాతి జాగ్రత

**aftermath** పరిణామం, ఫలితం

**afternoon** అపరాహ్ణం

**after-sales service** విక్రయానంతరసేవ

**after-thought** తరవాతి ఆలోచన, పునరాలోచన

**against** ప్రతికూలంగా, ఎదురుగా, విరుద్ధంగా

**agamogenesis** అలైంగికపునరుత్పత్తి

**agate** గోమేధికము, గోమేదకము

***agave (Americana)*** కిత్తనార

**age** వయస్సు; యుగం, కాలం

**age-group** వయోవర్గం

**age limit** వయఃపరిమితి

**age of consent** న్యాయసమ్మత వయస్సు

**age of retirement** ఉద్యోగ/పదవీ విరమణ వయస్సు

**agency** ముక్తియారీ, ఏజెన్సీ; కారకత్వం

**agenda** కార్యక్రమ/విషయ/చర్చనీయాంశ పట్టిక

**agenesis** అవికసితావయవాలు, అవయవా లేర్పడకుండటం

**agent** ప్రతినిధి, ఏజెంటు; కర్త; సాధకం; కారకం

**agent-provocateur** రెచ్చగొట్టే శత్రుగూఢచారి, శత్రుపక్షం వ్యక్తి

**agentive** కర్తృ; సాధక

**ageusia** అరుచి

**agglomerate** సమీకరించు, సంయోజించు

**agglomeration** నగరపరిధి

**agglutination** సంయోజనం, గుమిగూడటం

**agglutinin** సమూహనం, గుమిగూడునట్లు చేయటం

**agglutinogen** సమూహజనకం

**aggrandize** అధికం చేయు, వృద్ధిపరచు; (బల సంపదలు) పెంచు

**aggrandizement** (బలసంపదల) వృద్ధి, వర్ధనం

**aggravate** తీవ్రతరం/గురుతరం చేయు, పెంచు

**aggravation** పెంపు(దల), తీవ్రీకరణం

**aggregate** *adj* సమష్టి, మొత్తం, వెరశి; సముచ్చయం, సముదాయం *n* వెరశి, మొత్తం, సమష్టి; అన్నీ, సమస్తమూ

**aggregation** సమూహ(న)ం, సముదాయం

**aggression** దురాక్రమణ

**aggressive** కలహశీల; దౌర్జన్యపూర్వక; జగడాలమారి; దురాక్రమించే

**aggressive party** ఆక్రమణకారి పక్షం

**aggressor** దురాక్రమణ దారు/కర్త

**aggrieved** ఆర్త, పీడిత; బాధపడ్డ, నష్టపోయిన, వేదనపొందిన

**aggrieved party** నష్టపడ్డ వ్యక్తి/పక్షం; పీడిత వ్యక్తి/పక్షం, పీడితుడు

**aghast** భయభీత; త్వరిత; చపల, చంచల

**agility** చాపల్యం, చంచలత; క్రియాశీలత; త్వర; త్వరితత్వం

**aging** వయస్సు పెరుగుతున్న; వయోవృద్ధ

**agio** తరుగు, వట్టం

**agiotage** కరెన్సీ క్రయవిక్రయాలు

**agist** పుల్లరి తీసుకొనే

**agister** పుల్లరిదారు, పుల్లరి తీసుకొనేవ్యక్తి

**agistment** పుల్లరి (తీసుకోవటం)

**agitate** ఆందోళన చేయు/పడు

**agitation** ఆందోళన

**agitational approach** ఆందోళన పద్ధతి/విధానం/మార్గం

**agitator** ఆందోళనకారి, ఆందోళనచేసేవ్యక్తి

**agnate** తండ్రి బంధువు, తండ్రితో బంధుత్వంగల

**agnation** తండ్రి(తో) బంధుత్వం

**agnosticism** అజ్ఞేయతావాదం

**agony** యాతన, దుఃఖం

**agraphia** అలేఖకత, రాయలేకపోవటం

**agrarian** భూ/కృషి సంబంధి, వ్యావసాయిక

**agree** ఒప్పుకొను, సమ్మతించు, ఏకీభవించు

**agreeable** సమ్మతమైన, ఒప్పుకోదగ్గ; అనుకూల, యోగ్య; రుచికర

**agreement** ఒడంబడిక, ఒప్పందం, ఖరారునామా; సమ్మతిపత్రం; అన్వయం

**agribusiness** వ్యావసాయిక పరిశ్రమ

**agricultural** వ్యావసాయిక, వ్యవసాయ సంబంధి

**agricultural commodities** వ్యవసాయ వస్తువులు
**agricultural labour** వ్యవసాయ కార్మికులు, వ్యావసాయిక కూలీ/మజూరి
**agricultural prices** వ్యవసాయ ధరలు
**agricultural produce or production** వ్యవసాయోత్పత్తులు; ఫలసాయం; పంట
**agricultural year** వ్యవసాయ సంవత్సరం
**agriculture** వ్యవసాయం, సేద్యం, కృషి
**mechanised agriculture** యంత్ర వ్యవసాయం
**agriculturist** వ్యవసాయదారు, రైతు, సేద్యగాడు, కర్షకుడు
**agrobased** వ్యవసాయాధారిత
**agroclimatic environs** వ్యవసాయ వాతావరణ పరిసరాలు
**agronomic** వ్యావసాయిక
**agronomist** (వ్యవసాయ) క్షేత్రశాస్త్రవేత్త; వ్యవసాయశాస్త్ర నిపుణుడు
**agronomy** వ్యవసాయశాస్త్రం
***agrosti linearis*** గరిక
**agrostologist** తృణశాస్త్రవేత్త
**ague** (కఫ) జ్వరం, చలిజ్వరం
**ahead** ముందు, మొదట
**aid** *n* సహాయం, మద్దతు; చికిత్స *v* సహాయం చేయు, మద్దతిచ్చు
**aid, first** ప్రథమచికిత్స
**aid, hearing** శ్రవణ సహాయకం, వినికిడి సాధనం
***aide-de-camp*** అంగరక్షకుడు; సహాయకుడు
***aide-memoire*** చర్చానివేదిక; సంధిపత్రం; జ్ఞాపనపత్రం
**aids** ఉపకరణాలు; ఒక ప్రాణాంతక వ్యాధి
**ailment** వ్యాధి, రోగం, జబ్బు
**aim** *n* ధ్యేయం, లక్ష్యం, గురి, ఉద్దేశ్యం; *v* గురి పెట్టు/చూచు; లక్ష్యంగా పెట్టుకొను
**aims and objects** లక్ష్యాలూ ధ్యేయాలూ
**air** గాలి, వాయువు; వైమానిక
**air attack** విమాన యుద్ధం, వైమానిక చర్య
**air base** విమానస్థావరం
**air blast** వాయువిస్ఫోటనం
**air-borne assault** ఆకాశయుద్ధం
**air-chamber** గాలిగది, వాయుకోశం
**air cover** వైమానిక సంరక్షణ, విమానాల తోడ్పాటు
**air evacuation** విమానాలద్వారా తరలింపు
**air field** విమానాశ్రయం
**air force** వైమానికదళం, వాయుసేన
**air-gunner** వైమానిక తోపుదారు
**air-hunger** వాయుక్షుధ, వాయులోపం
**air lift** విమానాల్లో తరలింపు
**air line** విమానమార్గం; విమానసంస్థ
**air liner** ప్రయాణీకుల విమానం
**air-mail** విమాన తపాలా
**air marshall** వైమానిక దళాధిపతి, ఎయిర్ మార్షల్
**air masses** వాయుసమూహాలు
**air navigation** విమానయాన (మార్గదర్శన)ం
**air navigator** విమాన మార్గదర్శకుడు
**air oven** గాలిపొయ్యి
**air photo** వైమానిక ఛాయాచిత్రం
**air pressure** గాలి ఒత్తిడి, వాయుపీడనం
**air raid** విమానాలదాడి
**air-reconnaissance** వైమానిక పరిశీలన
**air services** వైమానికోద్యోగి వర్గం/బృందం
**air-ship** విమానం; గాలి ఓడ
**air-sinus** వాయుకుహరం
**air space** వాయుప్రదేశం; గగనతలం
**air task force** ప్రత్యేక వైమానికదళం
**air-way** వాయుపథం
**airconditioning** వాతానుకూలనం, అనుకూల శీతోష్ణత
**aircraft** విమాన సముదాయం
**aircraft carrier** విమానవాహక నౌక
**air defences** విమాన/వైమానిక రక్షణలు
**airing** ఆరవేయటం, ఆరబెట్టడం
**air line companies** విమానయాన సంస్థలు
**airman** వైమానిక సైనికుడు, విమానదళ సైనికుడు
**airport/airstrip** విమానాశ్రయం
**airways** ఆకాశమార్గం, వాయుమార్గం; విమానాల రహదార్లు
**airy** గాలితో నిండిన; తేలికైన, సూక్ష్మ
**aisle** నడవా; పక్కగది
**akinesia** చలనరాహిత్యం
**alacrity** సజీవత; ప్రసన్నత; హుషారు
**alae** పక్షదళం
**alarm** *n* హెచ్చరిక, భయసూచన; బెదురు, కలవరం *v* హెచ్చరించు, భయపెట్టు
**alarm chain** అలారం తీగ/గొలుసు



**alarming** భయంకర
**alarmist** భయవాది, భయవ్యాపకుడు
**alba** తెల్లని, శ్వేత
**albedo** కాంతి నిష్పత్తి; పరావర్తితకాంతి శాతం
**albinism** బొల్లి
**albino** తెల్లని; పాండు (రోగి)
**albumin** తెల్లసొన, శ్వేతధాతువు
**albuminarea** శ్వేతమేహం
**albuminuria** మూత్రంలో తెల్లసొన పోవటం
**alchemist** రసవాది
**alchemy** రసవాదం
**alcohol** మద్యం, సారాయి, మద్యసారం
**alcoholic** తాగుబోతు
**alcoholisation** మద్యసారీకరణం
**alcoholism** తాగుబోతుతనం, మద్యపాన వ్యసనం
**alcoholometer** మద్యసార మాపకం
**alcove** వేసవికుటీరం; తోటమధ్య ఖాళీజాగా
**aldebaran** రోహిణి
**alderman** పౌరముఖ్యుడు, నగరవృద్ధుడు
**ale** సారా
**aleatory** జూదపు సట్టా
**alert** *adj* జాగరూక, అప్రమత్త, చురుకైన *n* అప్రమత్తత, చురుకుదనం, జాగరూకత
**alertness** జాగరూకత, అప్రమత్తత, చురుకుదనం
**alexia** లేఖాంధత్వం, మాటలు చదవలేకపోవటం
**algebra** బీజగణితం
**algesia** బాధానుభూతి, బాధను గుర్తించగలగటం
**algorithm** పరిష్కారం
**algulose** పాచిపిప్పి
***alias*** ఉరఫ్; మారుపేరు/ప్రతినామం
**alibi** (మారుపేరున్నట్లు) వంక; అన్యత్రస్థితి, స్థలాంతరస్థితి
**alien** పరదేశి, విదేశీయుడు
**alienate** అన్యాక్రాంతంచేయు
**alienation** అన్యాక్రాంత(త్వ)ం
**alienation act** మారకపు చట్టం
**alienee** అన్యాక్రాంతమైన ఆస్థిని పొందినవ్యక్తి
**alienism** పరదేశీయత, విదేశీయత
**alienness** పరాయితనం
**alienor** అన్యాక్రాంతం చేసేవ్యక్తి
**aliens** విదేశీయులు, విజాతీయులు
**alignment** సమలేఖనం, సరళరేఖారచన
**aliment** భరణం, భృతి, మనోవర్తి, మనువర్తి
**alimentary** పోషణం/ఆహార సంబంధి
**alimentary canal** అన్నవాహిక, జీర్ణవాహిక
**alimony** మనోవర్తి, భరణం
**aliquot** ఏకాంశం
**aliquot part** ఏకాంశభాగం
**alive** సజీవ; తెలిసిన
**be alive to** తెలుసుకొను, తెలిసి ఉండు
**alkahest** సర్వద్రావకం
**alkalaemia** క్షారరక్తత
**alkali** క్షారం
**alkali reserve** క్షారనిధి
**alkali soda** సోడియం క్షారం
**alkali soil** బీడునేల, క్షారభూమి
**alkalimeter** క్షారమాపకం
**alkalimetry** క్షారమితి
**alkaline** క్షార, క్షారీయ
**alkalinity** క్షారత్వం
**alkaliser** క్షారకారి, క్షారీయకం
**alkalization** క్షారీకరణ
**alkaloid** క్షారమయ(ం)
**alkalosis** క్షారమయత, క్షారీయత
**all** అందరు, అంత, అన్ని; సర్వం, సకలం, సమస్తం
**all along** మొదటినుంచీ, ఎప్పుడూ
**all and sundry** అందరూ, వ్యష్టిగా సమిష్టిగా
**all around** అన్నివైపులా
**all at once** ఒక్కసారిగా, ఒక్కటిగా
**all in all** అంతటా, సర్వే సర్వత్ర; సమస్తం
**all India** అఖిల భారత
**all India Institute of medical sciences** అఖిల భారత వైద్యవిజ్ఞాన సంస్థ
**all India variety programme of A.I.R** ఆకాశవాణి వివిధభారతి కార్యక్రమం
**all of a sudden** హఠాత్తుగా, అకస్మాత్తుగా
**all over** అంతటా, అన్ని ప్రదేశాల్లో, సర్వత్రా
**all-pervasive** సర్వవ్యాప్త
**all-seeing** అన్నీ చూసే, అంతా చూసే; సర్వసాక్షి
**be all over** అంతమగు, సమాప్తమగు, పూర్తి అగు, అయిపోవు
**allay** తేలికపరచు, తగ్గించు; తొలగించు; శాంతింపజేయు
**allegation** ఆరోపణ, అభియోగం, ఆపాదన, (నేరం మొ.) మోపటం
**allege** ఆరోపించు, ఆపాదించు, మోపు; (సాకు) చెప్పు
**alleged** ఆరోపిత, ఆపాదిత

**allegiance** ప్రభుభక్తి, స్వామిభక్తి; విశ్వాసం, అధీనత
**allegory** రూపకం, దృష్టాంతం; కథారూపక వివరణ
**allergic** వికట, విపరీత, విరుద్ధ, వ్యతిరేక; వేదనాత్మక, ప్రతికూల; వికటించే
**allergy** వైపరీత్యం, విపరీతం; అసహనీయత; వేదన; ప్రతికూలత, వికటత్వం
**alleviate** తగ్గించు, ఉపశమింపజేయు; పైకెత్తు, ఉద్ధరించు
**alleviation** ఉపశమనం; ఉద్ధరణ
**alliance** మైత్రి, సంబంధం; వివాహం, పెళ్ళి; సమాశ్రయం
**allied** మైత్రిగల, స్నేహశీలి; సంబంధంగల
**allied forces** మిత్రరాజ్య సేనలు
**allied powers** మిత్రరాజ్యాలు
**allies** మిత్రమండలి
***allium cepa*** నీరుల్లి
***allium sativum*** వెల్లుల్లి
**allocable** కేటాయించదగ్గ
**allocate** కేటాయించు
**allocation** కేటాయింపు
**allograph** ఉపసంకేతం
**allomorph** సపదాంశం
**allonge** అనుబంధ స్థలం
**allopathy** అలోపతి, ఇంగ్లీషు వైద్యం
**allophone** సవర్ణం
**alloprope** రూపాంతరం
**alloseme** అర్థాంశ భాగం
**allot** కేటాయించు; భాగమిచ్చు, వంతు నిర్ణయించు, వాటా నిర్దేశించు
**allotment** (వాటాల/వంతుల) కేటాయింపు; (నౌకాదళంలో) వేతనభాగం; విధినిర్దేశం
**allotrophy** బహురూపత
**allotropic** రూపాంతరిత
**allottee** వాటాదారు
**allow** అనుమతించు
**allowance** బత్తా, బత్తెం, భత్యం; అనుమతి; మాఫీ, రెమిషన్; తలసరి బరువు/భారం
**make allowance for** స్థానమిచ్చు; గుర్తుపెట్టు
**alloy** మిశ్రధాతువు, లోహమిశ్రం
**alloyage** మిశ్రలోహవిద్య
**all round development** సర్వతోముఖ వికాసం/ అభివృద్ధి
**allude** జాడచెప్పు, సూచించు; స్మరించు; ఉల్లేఖించు; సంకేతించు
**allure** ప్రలోభపెట్టు
**allurement** ప్రలోభ(న)ం
**allusion** ఐతిహ్యం; పూర్వకథ; సూచిత విషయం
**alluvial** ఒండలి, ఒండ్రు
**alluvial plain** ఒండ్రునేల
**alluvial soil** ఒండ్రుమట్టి నేల
**ally** మిత్రుడు, బంధువు; సంబంధి
**almanac** పంచాంగం
**almond** బాదం
**almost** దరిదాపుగా, దాదాపు; ప్రాయశః
**alms** ముష్టి; బిచ్చం, భిక్ష
***alod litoralis*** చిన్నకలబంద
**aloe** కలబంద
**along** (వెను)వెంట; పక్క(న); కూడా
**alopecia** జుట్టు ఊడటం, కేశధ్వంసం
**alphabet** వర్ణమాల, వర్ణసమామ్నాయం, అక్షరమాల
**alphanumeric display** అక్షర సంఖ్యాప్రదర్శన
**alpine** సమున్నత
**already** (ఇంతకు) మునుపే, ముందే; మొదటి నుంచీ
**altar** బలిపీఠం; దైవపీఠం
**alter** మార్చు; దిద్దు
**alteration** దిద్దుబాటు, పరివర్తనం, మార్పు
**altercation** వివాదం, పోట్లాట, వాక్కలహం
***alternando*** ఏకాంతర నిష్పత్తి
**alternant** పర్యాయరూపం
**alternate** *adj* వికల్ప, వైకల్పిక; బదులైన; ప్రత్యామ్నాయ; ఏకాంతర *v* వికల్పించు; బదులుగా వాడు
**alternate current** ఏకాంతర ప్రవాహం, ఎ.సి. కరెంటు
**alternate delegate** ప్రత్యామ్నాయ ప్రతినిధి
**alternater** పరివర్తకం
**alternating** పరివర్తిత; పక్షాంతర(ం), వైకల్పిక(ం)
**alternation** పరివర్తనం; పర్యాయరూపత
**alternative** ప్రత్యామ్నాయ(ం); బదులు, వికల్ప(ం)
**alternative sources** ప్రత్యామ్నాయ వనరులు
**altitude** ఎత్తు, ఉన్నతాంశం, ఉన్నతి
**altogether** మొత్తంమీద, అన్నీకలిపి; అందరూ/ అన్నీ కలిసి
**altruism** పరహితవాదం, పరహితత్వం; పరార్థపరత్వం
**altruist** పరహితకారి



**altruistic** పరహిత ప్రధాన, పరహితాత్మక
**alum** పటిక
**alum, burnt** కాల్చిన పటిక
**alum, neutral** తటస్థమైన పటిక
**alumnus *(pl-alumni)*** పోషితపుత్రుడు, సంరక్షితుడు; స్నాతకుడు, పూర్వవిద్యార్థి; పట్టభద్రుడు
**alveolar** దంతమూలీయ; వాయుకోశ సంబంధి
**alveolus** దంతమూలం; వాయుకోశం
**alveo-palatal** దంతమూలతాలవ్య
**always** ఎప్పుడూ, నిత్యం, సదా, హమేషా
**amalgam** రసమిశ్రం, (పాదరస) మిశ్రమం, సమ్మేళనం, సంలీనం
**amalgamate** కలుపు, సమ్మేళనం/సమ్మిళితం చేయు; మేళవించు; సంలీనం చేయు
**amalgamating language** సంలీన భాష
**amalgamation** సమ్మేళనం, విలీనీకరణం; రసమిశ్రణం
**amaranth** పెరుగుతోటకూర
**amass** పోగుచేయు, చేర్చు; సేకరించు, సంచయించు
**amastia** అస్తనత, చనుకట్టు లేకపోవటం
**amateur** కుతూహలి, ఔత్సాహికుడు; ఔత్సాహిక
**amaurosis** అంధత్వం, గుడ్డితనం
**amaze** ఆశ్చర్యం కలిగించు, వింతపుట్టించు
**amazement** ఆశ్చర్యం; దిగ్భ్రమ, దిగ్భ్రాంతి
**ambassador** రాయబారి; (రాజ) ప్రతినిధి
**ambassador extra-ordinary and pleni-potentiary** అసాధారణ రాయబారి
**amber** జేగురు; కాషాయ (వస్త్ర)ం, సీమగుగ్గిలం
**ambidexter** ఉభయపక్ష వంచకుడు
**ambidextrous** సవ్యసాచి, రెండు చేతులతో పనిచేయగల
**ambiguity** సందిగ్ధత, అస్పష్టత
**ambiguous** సందిగ్ధ, అస్పష్ట
**ambit** పరిధి
**ambition** అభ్యుదయేచ్ఛ, గాఢవాంఛ; అత్యాశ, లాలస
**ambitious** లాలస, అత్యాశగల; తాహతుకు మించిన; గాఢవాంఛగల
**ambivalence** ద్వైధీభావం, ద్వివేగసంస్థితి
**ambiversion** మధ్యేవర్తనం
**ambivert** ఉభయవర్తి, ఉభయముఖి
**amblyopia** దృష్టిమాంద్యం
**ambrosia** అమృతం
**ambulance** రోగివాహనం; సంచారౌషధాలయం; ఆంబులెన్స్
**ambulance corps** ఆంబులెన్స్ దళం
**ambulant** చలనసమర్థ
**ambush** *n* దొంగదెబ్బ; ఆకస్మికదాడి *v* దొంగదెబ్బ తీయు/కొట్టు; ఆకస్మికంగా దాడిచేయు
**amelia** అంగహీనత
**ameliorate** బాగుపరచు, మెరుగుపరచు; ఉపశమింపజేయు
**amelioration** బాగు, మెరుగు; ఉపశమనం, ఉపశాంతి
**amenable** అనుకూల
**amend** సవరించు, సవరణచేయు
**amended form** సవరించిన రూపం
**make amends** నష్టపరిహార మిచ్చు
***amende honourable*** గౌరవప్రద క్షమాభిక్ష
**amendment** సవరణ
**amendment act** సవరణ చట్టం
**amends** (నష్ట) పరిహారం
**amenities** వసతులు, సదుపాయాలు
**amenity** వసతి, సదుపాయం
**amenorrhoea** బహిష్ఠు కాకుండటం
**amentia** స్మరణలోపం, స్మృతిలోపం; క్షీణమనస్కత
**amethyst** గరుడపచ్చ
**amiable** స్నేహప్రద, స్నేహపూర్వక; రసిక
**amicable** అన్యోన్య, సమరసమైన
**amicably** కలసిమెలసి, అన్యోన్యంగా, విహితంగా
**amicron** అతిసూక్ష్మాణువు
***amicus curiae*** న్యాయపరామర్శకుడు
**amity** మైత్రి
**amlivalent** ఉభయ(పక్ష)విరుద్ధ
**ammnion** ఉల్బం
**ammonia** అమోనియా
**ammunition** యుద్ధ సామగ్రి, మందుగుండు సామాను
**amnesia** స్మృతిలోపం, విస్మృతి; స్మృతినాశం, విస్మరణం
**amnesty** దండన విమోచనం, (సంపూర్ణ) క్షమ; (ఖైదీల) విడుదల; క్షమాభిక్ష
**amoeba** వికారిణి
**amorality** సదాచారదూరత; కాముకత్వం

**cabinet government** (బాధ్యతాయుత) మంత్రివర్గ ప్రభుత్వం
**cabinet minister** కాబినెట్ (హోదాగల) మంత్రి
**cabinet-mission** మంత్రివర్గ రాయబారం
**cabinet rank** కాబినెట్ హోదా
**cabinet reshuffle** మంత్రివర్గ పునర్వ్యవస్థీకరణ
**cabinet secretariat** మంత్రివర్గ సచివాలయం
**cabinet system** మంత్రివర్గ (పాలన) వ్యవస్థ/విధానం
**cable** *n* లోహపు తాడు, లంగరు తాడు/గొలుసు; *v* సముద్ర తంత్రీవార్త పంపు
**cablegram** సముద్ర తంత్రీవార్త
**cacanny method** మందకొడి పనివిధానం
**caco-economy** దుష్టనిర్వహణ
**cacophony** అశ్రావ్యత
**cactus** జెముడు
**cacuminal** మూర్ధన్య
**cadastral** స్థిరాస్తి పరిమితి, భూమిలెక్కల రిజిష్టరు
**cadastral objective** స్థిరాస్తి పరిమితి లక్ష్యం
**cadastre** స్థిరాస్తి రిజిష్టరు
**cadence** తాళం, స్వరావరోహణం
**cadet** సైనికవిద్యార్థి; కనిష్ఠపుత్రుడు
**cadre** శ్రేణి, స్థాయి; నియమితోద్యోగం
**caecum** అంధాంత్రం, పక్వాశయం
**caelum** ఉపరిచరవస్తువు
***caesalpina bonducella/crista*** గచ్చ
**cafe** కాఫీ/టీ కొట్టు; ఫలాహారశాల
**cafeteria** ఫలాహారశాల
**cage** పంజరం
**cahexia** క్షీణత
***cajanus cajan*** మడ్డి
***cajanus indicus*** కంది
**cajole** లాలించు, సముదాయించు, బుజ్జగించు; మోసగించు
**cajolery** లాలన, బుజ్జగింపు, సముదాయింపు; మోసం
**calamitous** దుఃఖదాయక, విపత్కర, ప్రమాదకర; భీషణ
**calamity** ఘోర దుఃఖం, దుర్ఘటన, విపత్తు
***calamus fasciculatus/rotang*** వాము
**calcaneum** మడమ ఎముక
**calcareaus** సున్నపు
**calcaria** సున్నంబట్టీ
**calcification** కాల్సీకరణం
**calcification, metastatic** విక్షేపకాల్సీకరణం
**calcination** భస్మీకరణం
**calcine** భస్మీకరించు
**calcined mercury** రసభస్మం
**calculable** లెక్కించదగిన; విశ్వసింపదగ్గ
**calculate** లెక్కించు, అంచనా వేయు/కట్టు; ఆలోచించి ఎత్తువేయు
**calculated** ఉద్దేశపూర్వకమైన, పరిగణిత
**calculating machine** గణనయంత్రం, గణకయంత్రం
**calculation** లెక్క, గణనం, అంచనా; దూరాలోచన
**calculator** గణనయంత్రం
**calculus** కలనగణితం; కృచ్ఛం, రాయి
**calculus, biliary** పైత్యకృచ్ఛం
**calculus, urinary** మూత్రకృచ్ఛం
**calender** పంచాంగం, పంజిక; సమయ నిర్దేశ(న)ం; విద్యాసంవత్సర ప్రణాళిక
**calender year** పంచాంగ సంవత్సరం
**calf** దూడ; పిక్క
**calib(e)r(e)** యోగ్యత, శక్తి, సామర్థ్యం
**calibrated** క్రమాంకిత
**calibration** క్రమాంకనం
**calibre** కొలత; అంతర్వ్యాప్తి
**call** *n* పిలుపు; సంజ్ఞ; వాటాకిస్తీ; ఈల పిలుపు, సమావేశం; వాటాకిస్తీ పిలుపు *v* పిలుచు, చూడబోవు, సన్నచేయు, అను, అరచు, నిద్రలేపు, హాజరుపరచు, ఆహ్వానించు, చదువు
**at call** వెంటనే
**call a halt** నిరోధించు, నిలబెట్టు, స్తంభింపజేయు
**call a spade a spade** నిజం చెప్పు, ఉన్నదున్నట్టు చెప్పు
**call at** నిద్ర లేపు; (ఎవరితోనైనా) సమావేశమగు
**call attention to** గుర్తుచేయు; దృష్టికి తెచ్చు
**call for** అడుగు, కోరు
**call forth** ముందుకు తెచ్చు, హాజరుపరచు
**call in** కూడబెట్టు, జమచేయు
**call in question** అబద్ధమని నమ్ము, సందేహించు; ప్రశ్నించు; వ్యతిరేకించు
**call into play** ఉపయోగ పెట్టు/పరచు; ప్రయోగంలోకి తెచ్చు
**call loan** పిలుపు రుణం
**call money** అడిగినప్పుడు చెల్లించవలసిన సొమ్ము, అకారిత ధనం



**call off** నిలిపివేయు, ఎత్తివేయు, అంతంచేయు; విరమించుకొను
**call on** పిలుచు, విజ్ఞప్తిచేయు, కలుసుకొను, సమావేశమగు
**call out** (బిగ్గరగా) పిలుచు
**call to account** లెక్క అడుగు; కుశల మడుగు
**call upon** అడుగు, చెప్పు, ప్రేరేపించు
**called bond** వసూలు వాయిదాపడ్డ పత్రం
**called-up capital** కోరిన మూలధనం
**calligraphy** (చక్కని) దస్తూరీ
**calling** పిలుపు; వృత్తి, ప్రత్యేక వృత్తిలోని వ్యక్తులు
**callosity** కాయ, కిణం
**callous** మొండి, మొద్దుబారిన, గట్టిపడిన
**callousness** నిర్దయత, మొండితనం, కఠోరత
**callus** కాయగాచిన, గట్టి
**calm** *adj* శాంత, నిశ్చల; గాలిలేని, నిర్వాత *n* నెమ్మది, నిశ్చలత, ప్రశాంతి *v* శాంతపరచు, శాంతించు; సమాధాన పెట్టు/పరచు
**calmly** నెమ్మదిగా, (ప్ర)శాంతంగా
**calmness** నిశ్చలత, ప్రశాంతి
**calomel** రసకర్పూరం
***calophyllum inophyllum*** పొన్న
**calor** వేడి, ఉష్ణత
**calorie** కాలరీ, ఉష్ణత
**calorimeter** ఉష్ణ(తా)మాపకం
**calorimetry** ఉష్ణమాపనం, ఉష్ణతామితి
**calotropis** జిల్లేడు
**calumniate** అపనిందవేయు, దూషించు, కళంకపరచు, అపవాదు/అపఖ్యాతి పాలుచేయు
**calumniation** అపనింద, అపఖ్యాతి
**calumniator** దూషకుడు, నిందాశీలి
**calumniatory** అపనిందాత్మక
**calumny** దూషణ, కళంకం, అపవాదు, అపనింద
**calx** సున్నం, లోహభస్మం
**calyx** రక్షకపత్రం
***camaraderie*** సన్నిహితస్నేహం
**cambist** వినిమయ వ్యాపారనిపుణుడు
**camel** ఒంటె, లొట్టిపిట్ట
***camelopardalis*** కల్పవృక్షం
**camera** ఛాయాచిత్రసాధనం; రహస్యం, ఛాయాచిత్రపేటిక; ఛాయాగ్రాహకం; అంతరంగిక గృహం
**in camera** రహస్యంగా, గూఢంగా, గుప్తంగా
**camouflage** నిగూఢత, ఛద్మరూపం; దాచిపెట్టడం; మభ్యపెట్టు, కప్పిపుచ్చు
**camp** *n* మకాం, శిబిరం, మజిలీ, సేనలు విడిసే చోటు *v* మకాంపెట్టు, విడియు, బసచేయు
**camp-follower** అనుచరుడు, అనుసరించే వ్యక్తి
**campaign** *n* దండయాత్ర, దాడి; ప్రచారం, ఉద్యమం *v* ప్రచారంచేయు, ఉద్యమించు; దాడి మొదలుపెట్టు
**camphor** కర్పూరం
***camphor borneo*** పచ్చకర్పూరం
***camphor sumatra*** హారతికర్పూరం
**campus** శిబిరం; మకాం; (విద్యాసంస్థ) ఆవరణ
**can** *n* పీపా, డబ్బా, (పిడిగల) పాత్ర *v* కలుగజేయు, చేయజాలు; నిలువజేయు, (డబ్బాలో) మూసిపెట్టు
**canal** కాలవ; గొట్టం, వాహిక, నాళం
**canal, alimentary** జీర్ణనాళం, జీర్ణవాహిక
**canal, anal** గుదద్వారం
**canal, auditory** శ్రవణనాళం
**canal, birth** జననమార్గం
**canal, cervical** గర్భాశయద్వార(నాళ)ం
**canal seepage** కాలవ పారుడు/పారుదల/ఊట
**canal, vaginal** యోనిమార్గం
**canale** కాలవ
**canaliculus** సూక్ష్మనాళిక
**canalisation** నాళికాకరణం
**canalize** (నదినుంచి) కాలవతీయు; మళ్లించు, మలుపు
**canard** అసత్య వార్త, పుకారు, వదంతి
**cancel** కొట్టివేయు, రద్దుచేయు; తుడుపుపెట్టు
**cancelienlus** సూక్ష్మనాళిక
**cancellation** రద్దు, కొట్టివేత; తపాలాముద్ర
**cancellous** స్పాంజివంటి
**cancer** పుట్టకురుపు; దుర్గుణం; ప్రమాదం, కర్కటం
**cancer causing** కర్కటకారి, పుట్టకురుపు పుట్టించే/తెచ్చే
**candescent** జ్వలించే, ప్రకాశించే
**candid** స్పష్ట, నిష్కపట, నిక్కచ్చి, పక్షపాతరహిత; విమర్శాతీత
**candidacy** అభ్యర్థిత్వం
**candidate** అభ్యర్థి; దరఖాస్తుదారు
**candidature** అభ్యర్థిత్వం
**candidiasis** కాండికా ఫంగస్ వ్యాధి
**candle** కొవ్వొత్తి
**candour** సరళత, నిష్కాపట్యం, నిష్పాక్షికత

**candy** కలకండ, పటికబెల్లం, మిశ్రీ
**cane** పేము; చేతికర్ర, బెత్తం; చెరకు
**cane sugar** పంచదార, చక్కెర
**canine** కోరపంటి; కొరుకుడు పళ్లు
**canis major** శ్వానం
**canis minor** పూర్వశ్వానం
**canna** మెట్టతామర
***cannabi(nu)s sativa*** కొండగోగు
**cannabis** గంజాయి
**cannibal** నరభక్షకుడు
**cannibalism** నర(మాంస) భక్షకత్వం
**canning** నిల్వచేయటం
**cannon** ఫిరంగి (గుండు), నియమం, సూత్రం, సిద్ధాంతం; విధి, చట్టం; క్రైస్తవధర్మం
**cannon fire** ఫిరంగిగుండ్ల వర్షం
**cannon fodder** బలిపశువు
**cannula** గొట్టం, ప్రవేశని
**canoe** దోనె, చిన్నపడవ
**canon** సిద్ధాంతం
**canonical** సూత్రబద్ధ, నియమానుగుణ
**canonical form** విహితరూపం
**Canopus** అగస్త్యుడు
**canopy** మండపం, వితానం, పందిరి, చప్పరం; చూరు
**cant** వర్గభాష, వృత్తిభాష; సంకరభాష, వ్యర్థ భాషణ; ఒకవైపు ఒరిగిన స్థితి, ఎగరవేయటం
**cantankerous** దుస్స్వభావంగల, కలహప్రియ
**canteen** ఫలహారశాల
**canter** గుర్రపుదౌడు
***cantharidin parviflorum/canthium didyma*** బలస
**canthoplasty** నేత్రకణ సంధానం
**canthotamy** నేత్రకణచ్ఛేదన
**cantonment** సేనాస్థావరం, సైనికనివాసం, సేనాశిబిరం, లష్కరు
**canvas** కిత్తనారగుడ్డ; బొమ్మలువేసే గుడ్డ; తెరచాప; శిబిరం; దృశ్యమాన చిత్రణం
**canvass** ప్రచారంచేయు; అర్థించు, ప్రార్థించు; తర్కించు, విచారించు
**canvasser** ప్రచారకుడు
**canyon** గడ్డ; లోయ; గభీరగహ్వరం
**caoutchouc** రబ్బరు చెట్టు
**cap** *n* టోపీ/కుళ్ళాయి *v* టోపీపెట్టు/వేయు, మూతవేయు; (కర్ర మొ. వాటికి) పొన్ను వేయు; హద్దుకు చేరు; ముఖ్యమగు/ముఖ్యుడగు
**cap, knee** మోకాలి చిప్ప
**capability** సామర్థ్యం, యోగ్యత, శక్తి
**capable** సమర్థ, శక్త, యోగ్య
**be capable** చేయగలుగు
**capacious** విశాల, విస్తృత
**capacitor** సంఘనకం
**capacity** సామర్థ్యం, తాహతు, అర్హత, యోగ్యత, శక్తి; (ఘన)పరిమాణం; పదవి, ఉద్యోగం
**capacity, vital** జీవక్షమత
**cape** అగ్రం; (సముద్రంలో చొచ్చుకొని ఉన్న) భూభాగం; చేతులులేని పొట్టిచొక్కా
**capillarity** కేశకత్వం; కేశనాళాకర్షణం
**capillary** కేశనాళిక
**capital** *adj* ప్రమాదకరమైన, మరణదండనార్హ; ముఖ్య, ప్రశస్త *n* రాజధాని, ముఖ్యపట్టణం, మూలధనం
**authorized capital** అధికృత మూలధనం
**capital account** మూలధనం ఖాతా
**capital equipment** ప్రధానసామగ్రి, మూలధన సామగ్రి; ముఖ్యోపకరణాలు
**capital expenditure** మూలధనవ్యయం
**capital goods** ఉత్పాదక వస్తువులు
**capital investment** మూలధనం పెట్టుబడి
**capital offence** చాలా పెద్ద నేరం, మరణ శిక్షార్హమైన నేరం
**capital outlay** పెట్టుబడి పెట్టిన మూలధనం
**capital payments** మూలధనం చెల్లింపులు
**capital punishment** మరణదండన
**capital receipts** పెట్టుబడి వసూళ్ళు
**capital reserve** మూలధన క్షేమనిధి
**capital ship** యుద్ధనావ
**capital stores** మూలధన సామగ్రి
**circulating capital** చర మూలధనం
**fixed capital** స్థిర మూలధనం
**floating capital** చర మూలధనం
**issued capital** జారీచేసిన మూలధనం
**make capital of** లాభంపొందు
**paid up capital** చెల్లించిన మూలధనం
**reserve capital** రక్షిత మూలధనం
**share capital** వాటా మూలధనం
**subscribed capital** చందావేసిన మూలధనం



**working capital** నిర్వహణ మూలధనం
**capitalism** పెట్టుబడిదారీవిధానం
**capitalist** పెట్టుబడిదారు (వ్యవస్థకు చెందిన)
**capitalistic** పెట్టుబడిదారీ
**capitalistic enterprise** పెట్టుబడిదారీ సంస్థ
**capitalization** మూలధనీకరణం
**capitalized** మూలధనీకృత, పెట్టుబడిలో చేర్చిన
**capitation** తల(సరి) పన్ను
**capitulate** లొంగు, షరతులకు లోబడు
**capitulation** లొంగుబాటు, (షరతులకు) లోబడటం
**capitulum** కపిచ్ఛలం
**caprice** చాపల్యం, చిత్తచాంచల్యం, చపలత్వం
**capricious** చపలచిత్తంగల, స్థిరబుద్ధిలేని
**capricorn** మకరం
**capricornus** మకర(రాశి)
***capsicum frutesenaece*** మిరప
**capsize** బోర్లపడు, బోర్లగిల్లు, బోర్లపడవేయు; తలకిందులగు
**capsule** గొట్టం, గుళిక; ఫలకోశం
**capsulectomy** గుళికకోత
**captain** *n* నాయకుడు, సైనికోద్యోగి, నౌకాధిపతి *v* నాయకత్వం వహించు, నడిపించు
**captaincy** నాయకత్వం, నేతృత్వం
**caption** (దస్తావేజు) శీర్షిక, (చిత్ర)శీర్షిక; ఖైదు చేయటం, బంధీకరణం
**cut caption** సంక్షిప్తశీర్షిక
**captivate** వలపించు; వశం చేసుకొను, (మనసు) రంజింపజేయు, మోహింపజేయు; బంధించు
**captive** బందీ, ఖైదీ
**captive reader** అభిమాన పాఠకుడు
**take captive** ఖైదు చేయు, బంధించు
**captivity** ఖైదు, బంధనం; బానిసత్వం
**captor** ఖైదీని పట్టుకొన్న/బంధించిన వ్యక్తి, బంధనకర్త
**capture** *n* బంధనం, పట్టుకోవటం, బందీ *v* పట్టుకొను, వశం చేసుకొను; లూటీచేయు; జయించు
**caput** స్వేచ్ఛ, (రోమన్ లా ప్రకారం) న్యాయసమ్మత పౌరహక్కులు
**caput, succedaneum** పుట్టినబిడ్డ తల(మీది)వాపు
**carat** వన్నె
**caravan** సార్థవాహులు, బిడారు
**carbohydrate** పిండిపదార్థం
**carbon** బొగ్గు, కర్బనం
**carbon, activated** చురుకుచేసిన కర్బనం
**carbon assimilation** కర్బనాత్మీయీకరణం
**carbon dioxide** బొగ్గుపులుసు వాయువు, కర్బనద్వ్యామ్లజని
**carbon gas** కర్బన వాయువు
**carbon-monoxide** కర్బనామ్లజనితం
**carbuncle** రాచ పుండు/కురుపు
**carcass/carcase** శవం, కళేబరం, మొండెం
**carcinogen** పుట్టకురుపు పుట్టించే
**carcinoma** (ఒక రకం) పుట్టకురుపు
**carcuncle** మాంసాంకురం
**card** *n* దళసరి కాగితం, అట్ట; పేకముక్క; పత్రం
**lay one's cards on the table** పేకముక్కలు తెరచిచూపు; మోసపుచ్చకుండు; తన వైఖరి ప్రకటించు
**sure card** తురుపుముక్క
**cardamom** ఏలకి
***cardamom fructus*** ఏలక్కాయ
**cardamoms** ఏలకులు
**cardboard** అట్ట
**cardia** జీర్ణాశయ ప్రవేశద్వారం
**cardinal** *adj* ప్రధాన, మౌలిక, ఆధారభూత, ప్రాథమిక; సంఖ్యాసూచక *n* రోమన్ కేథలిక్ మతాధికారి, పోపు కింది ఉద్యోగి
**cardinal points** ప్రధాన విషయాలు/అంశాలు; నలుదిక్కులూ
**carding** దూదేకటం
**cardiogenic** హృదయజనిత
**cardiogram** హృల్లేఖ
**cardiologist** హృదయవ్యాధి నిపుణుడు
**cardiomyopathy** హృదయజనిత వ్యాధి
**cardio phone** హృదయశ్రవణ సాధనం
**cardiophonogram** హృదయశబ్దలేఖ
**cardiospermum** బుడ్డకాకర
**cardio-vascular** హృదయ నాళికామయ
**care** *n* సంరక్షణ, పోషణ, జాగరూకత; చింత, వ్యాకులత *v* వ్యాకులపడు, జాగ్రత్త వహించు, పోషించు, రక్షించు, లక్ష్యముంచు
**care, antenatal** ప్రసవపూర్వ సంరక్షణ, గర్భిణీ సంరక్షణ
**care, health** ఆరోగ్య సంరక్షణ

**care, intranatal** ప్రసవకాల సంరక్షణ
**care of** ద్వారా, సంరక్షణలో
**care, postnatal** ప్రసవానంతర సంరక్షణ
**care-taker government** ఆపద్ధర్మ ప్రభుత్వం, అవాంతర ప్రభుత్వం
**career** వృత్తి, ఉద్యోగం, జీవనోపాధిమార్గం; జీవిత గమనం; నడత; ఉరవడి, ద్రుతగతి; ఒక పక్షం అభివృద్ధి/విజయాలు
**career master** వృత్తి/ఉపాధి నిపుణుడు
**career orientation** వృత్తి/ఉపాధి నేపథ్యం/దృష్టి
**careful** జాగ్రతగల, సావధాన, అప్రమత్త
**carefully** జాగ్రతగా, సావధానంగా, అప్రమత్తంగా
**carefulness** జాగరూకత, సావధానత, అప్రమత్తత
**careless** అజాగరూక, ప్రమత్త; లక్ష్యం/శ్రద్ధ లేని
**carelessness** అజాగ్రత, అలక్ష్యం, అశ్రద్ధ
**caret** హంసపాదు
***careya arborea*** ఊదిప్ప
**cargo** (ఓడ) సరుకు
**cargo ship/cargo vessel** రవాణా నౌక
**caricature** *n* వ్యంగ్యచిత్రం *v* (వికారంగా/వ్యంగ్యంగా) చిత్రించు
**caries** క్షయం
**caries, bone** ఎముక పుచ్చు వ్యాధి
**caries, dental** పిప్పి పన్ను, దంతక్షయ వ్యాధి
**caries, spinal** వెన్నుక్షయ వ్యాధి
**carissa** వాక
***carissa diffusa*** కరమద్ది
**carminative** వాయుహరి
**carnage** వధ, రక్తపాతం, మారణహోమం
**carnal** ఐహిక, శారీరక, భౌతిక, ఇంద్రియ సంబంధి
**carnelian** గోమేధం
**carnival** ఉత్సవం, పండగ, వేడుక, సంబరం
**carnivore** మాంసాహారి (జంతువు)
**carnivorous** మాంసాహారి
**carnivorous mammal** మాంసాహారి క్షీరదం
**carouse** తప్పతాగు, తాగి తందనాలాడు
**carp** దోషాన్వేషణ; లేనిపోని తప్పులుపట్టు, జగడగొండిగా మాట్లాడు; ఆక్షేపించు
**carpal** మణికట్టుకు సంబంధించిన
**carpel** అండకోశిక
**carpenter** వడ్రంగి
**carpentry** వడ్రంగం, తక్షణ(ం/విద్య)
**carpet** తివాచీ
**carpus** మణికట్టు
**carriage** మోతకూలి, రవాణా, మోతరవాణా; బండి, శకటం; నిర్వహణ; మాదిరి, వైఖరి
**gun-carriage** ఫిరంగి బండి, శతఘ్ని శకటం
**carrier** రవాణాదారు, వాహకుడు; వాహకం; వాహనం; దూత
**carrier, chronic** దీర్ఘకాలిక వాహకం/వాహకుడు
**carrier pigeon** వార్తావాహకమైన పావురం, వార్తావాహక పారావతం
**carrot** ఎర్రముల్లంగి
**carry** తీసుకొనిపోవు, చేర్చు; సాధించు, గెలుచు; కొనసాగించు, భారం వహించు; (బిల్లు) ఆమోదింపజేయు
**carry a bill** బిల్లు/చిత్తుచట్టం ఆమోదించు/ఆమోదింపజేయు
**carrly all before one** పెరుగుతూ పోవు, ముందుకు నడుచు, అవరోధాలన్నీ అధిగమించు
**carry a motion** తీర్మానం ఆమోదించు
**carry away** తీసుకొనిపోవు, కొట్టుకొని పోవు; గెలుచుకొను; ఆవేశపడు, వివేకం పోగొట్టుకొను
**carry conviction** నిర్ణయం ప్రకారం ప్రవర్తించు
**carry forward** ముందుకు/ఉతారు తీసుకొనిపోవు
**carry into effect** పూర్తిచేయు, అమలుకు తెచ్చు, కార్యరూపానికి తెచ్చు
**carry off** తీసుకొని/ఎత్తుకొని పోవు; గెలుచు; చంపివేయు
**carry on** కొనసాగించు
**carry one's point** మాట నెగ్గించుకొను/చెల్లించుకొను
**carry out** పూర్తిచేయు, అమలుపరచు
**carry over** దాటు, దాటించు, ఎత్తిపెట్టు; ఉతారుకు తీసుకొని పోవు
**carry the day** గెలుపొందు, సఫలుడగు
**carry through** పూర్తిచేయు, నెరవేర్చు(కొను)
**carry weight** విలువ కలిగి ఉండు
**cart** బండి, శకటం, వాహనం
**cart-load** బండెడు
**put the cart before the horse** ముందు వెనకలు గుర్తించకపోవు, అస్తవ్యస్తంగా వ్యవహరించు
**cartage** బండి బాడుగ/అద్దె/కిరాయి
***carte blanche*** పూర్తి అధికారం; సంపూర్ణాధికారపత్రం



**cartel** నిర్మాతల/ఉత్పత్తిదారుల సంఘం; యుద్ధఖైదీల మార్పిడి ఒప్పందం; హెచ్చు ధరల సమాహారం
***carthamus tinctorius*** కుసుంబ
**cartilage** ఉపాస్థి, మృదులాస్థి
**cartographer** మానచిత్రకారుడు, దేశపట రచయిత
**cartographic centre** మానచిత్ర కేంద్రం, పటాలు గీసేచోటు
**cartographic product** మానచిత్రోత్పాదితం
**cartography** మానచిత్ర/దేశపట రచనాశాస్త్రం
**cartoon** వ్యంగ్యచిత్రం
**cartoonist** వ్యంగ్యచిత్రకారుడు
**cartridge** (తుపాకి) తూటా
**carve** బొమ్మలు చెక్కు/మలచు, చిత్రించు; మాంసంకోయు; ఏర్పరచుకొను
**carve out** ఏర్పరచుకొను; ముక్కలు చేయు
**carving** చెక్కడం/తక్షణం; బొమ్మలు చెక్కటం
**caryopsis** కవచబీజకం
***caryota urens*** బెండు
**case** పెట్టె, డబ్బా, సంచి, ఒర, డొలుపు; నిజస్థితి; సంగతి, నిదర్శన, అభియోగం, వ్యాజ్యం, దావా; (వ్యాకరణంలో) విభక్తి (శబ్దపరంగా), కారకం (అర్థపరంగా); రోగి; రక్షణకవచం; దశ, అవస్థ, విచారణాంశం
**case, ablative** పంచమీ విభక్తి, అపాదన కారకం
**case, accusative** ద్వితీయావిభక్తి, కర్మ కారకం
**case, dative** చతుర్థీ విభక్తి, సంప్రదాన కారకం
**case, emergency** అత్యవసర వ్యాధిగ్రస్తుడు
**case, genetive** షష్ఠీ విభక్తి; సంబంధ కారకం
**case history** రోగచరిత్ర
**case, instrumental** తృతీయా విభక్తి; కరణకారకం
**case law** పూర్వనిర్ణయాధారిత న్యాయ(శాస్త్రం), నిర్ణయ విధి, కోర్టు తీర్పులు
**case, locative** సప్తమీ విభక్తి, అధికరణకారకం
**case, nominative** ప్రథమా విభక్తి, కర్తృకారకం
**case, oblique** ద్వితీయాది విభక్తి,తిర్యక్కారకం
**case, open** అంటురోగి
**case study** నిదర్శనాధ్యయనం
**case, vocative** సంబోధన ప్రథమావిభక్తి, సంబోధన కారకం
**in any case** ఎలాగైనా, ఏమైనా కానీ, ఏ విధంగానైనా
**in case** ఒకవేళ, అయినట్లయితే
**in the case of** సందర్భంలో, విషయంలో
**caseation** జున్ను చేయటం
**cash** *n* నగదు, రొక్కం, డబ్బు, చిల్లర *v* డబ్బు/చిల్లర తీసుకొను
**cash account** నగదు ఖాతా
**cash and carry** నగదు కొనుగోలు
**cash balance** నగదునిల్వ
**cash book** నగదు పుస్తకం
**cash box** నగదుపెట్టె
**cash certificate** నగదు పత్రం
**cash crop** వాణిజ్యపంట
**cash memo** నగదు చీటీ
**cash price** నగదు ధర/కిమ్మత్తు
**in cash** నగదురూపంలో
**cashew-nut** జీడిపప్పు, కాజు; జీడిమామిడి
**cashier** *n* షరాబు/రొక్కందారు *v* పనినుంచి తొలగించు/తీసివేయు
**casing** పెట్టె, డబ్బా, తొడుగు
**casino** నర్తనశాల; జూదశాల
**cask** పేటిక, చిన్న డబ్బీ
**cassia** పకీరు తంగేడు
***cassia auriculata*** తంగేడు
**Cassiopeia** శర్మిష్ఠ
**cast** *n* మూస; నాటక పాత్రధారులు; ఖర్చుల విధింపు *v* (పార)వేయు, వదలిపెట్టు; వ్యాజ్యంలో ఓడగొట్టు; కరిగించి పోతపోయు; ఏర్పాటుచేయు
**cast about** ప్రయత్నించు; వెదకు
**cast anchor** లంగరుదించు
**cast an eye** దృష్టిపెట్టు, కన్నువేయు
**cast a shadow** నీడపడు; ఆవరించు; ప్రభావితం చేయు
**cast ashore** ఒడ్డుకు చేర్చు, దరి చేర్చు
**cast aside** పక్కకు నెట్టు, వేరు చేయు, విసరివేయు
**cast a vote** వోటువేయు; సలహా ఇచ్చు
**cast away** దూరం చేయు, వేరు చేయు, విసరివేయు
**cast blame upon** దోషమారోపించు, నిందించు, దూషించు
**cast down** నిరుత్సాహపరచు, నీరసపరచు
**cast iron** పోత ఇనుము

**cast lots** పేరు తీయు, చిట్టీ తీయు
**cast off** *n* వెలివేసిన/వదిలిపెట్టిన వ్యక్తి/వస్తువు; పరిత్యక్తుడు *v* వెలివేయు, తిప్పివేయు, విసర్జించు
**cast one's lot with** కష్టసుఖాల్లో కలిసి ఉండు
**cast the die** అచ్చుగుద్దు, మూసపోయు; సిద్ధపరచు
**caste** వర్ణం, కులం, వర్గం, జాతి
**caste system** వర్ణవ్యవస్థ, కులవ్యవస్థ
**lose caste** కులభ్రష్టుడగు
**casteism** కులతత్వం
**castigate** దండించు, శిక్షించు
**casting** పోత (పని)
**casting vote** నిర్ణాయక వోటు
**cast iron** పోత ఇనుము
**castle** గడి, కోట, దుర్గం
**castor** ఆముదం
**castor oil** ఆముదం నూనె
**castrate** విత్తుకొట్టు, బుడ్డకొట్టు; పొగరుదీయు, సంస్కరించు
**castration** బుడ్డ/విత్తు కొట్టడం; పొగరు తీయటం; తొలగింపు
**casual** ఆకస్మిక; క్రమంగాని, ఒక పద్ధతిలేని
**casual labour** రోజువారీ కూలీ
**casual leave** ఆకస్మిక సెలవు
**casualgia** మండే నెప్పి
**casually** ఆకస్మికంగా, క్రమరహితంగా, అకస్మాత్తుగా
**casualties** సంఖ్యాబలనష్టం; హతక్షత సైనికులు
**casualty** అత్యవసరరోగి పరీక్షాస్థలం; (ఆకస్మిక) ప్రమాదం/దుర్ఘటన/నష్టం; అవఘాతం
**casualty figure** నష్ట సంఖ్య
**casualty roll** నష్ట (వ్యక్తుల) పట్టిక
**casualty ward** అత్యవసర చికిత్సాగారం
**casuarina** సరుగుడు, సరివి, చౌక
**cat** పిల్లి, మార్జాలం
**let the cat out of the bag** అసలు విషయం బయటపెట్టు
**catabolism** (Katabolism) విచ్ఛిన్నక్రియ; అపచయం
**cataclysm** జలప్రళయం; ఉత్పాతం, ఉపద్రవం; విప్లవం
**catalogue** జాబితా, పట్టిక
**cataloguing** పట్టికీకరణ, పట్టికారచన
**catalysis** ఉత్ప్రేరణ(ం)
**catalyst** ఉత్ప్రేరకం
**catalytic** ఉత్ప్రేరక
**catamaran** తెప్ప
**catapult** *n* వడిసెల *v* విసరికొట్టు, లాగికొట్టు
**cataract** కంటిపొర; ఆకాశగంగ; జలపాతం; శుక్లం
**cataract, immature** అపక్వశుక్లం
**cataract, mature** పక్వశుక్లం
**cataract, senile** వార్ధక్య శుక్లం, వృద్ధాప్యంలో వచ్చే కంటిపొర
**catarrh** జలుబు, పడిసెం
**catarrhal** జలుబుకు సంబంధించిన
**catastrophe** పెద్ద ఆపద, విపత్తు; నాటక పర్యవసానం
**catastrophism** ఆకస్మికసృష్టివాదం
**catcall** *n* పీటీ, అనిష్టం *v* పీటీ కొట్టు, అనిష్టం వ్యక్తపరచు
**catch** *n* లభ్యం; చిక్కు; కొలికి, కొక్కెం; టక్కరిప్రశ్న *v* పట్టుకొను, అందుకొను, చిక్కించుకొను; కలుసుకొను; బందీగా పట్టుకొను; (నిప్పు) అంటుకొను; అర్థం చేసుకొను
**catch at** లాగుకొను, గుంజుకొను
**catch fire** అంటుకొను, వ్యాపించు
**catch line** గ్రాహకపంక్తి
**catch on** వ్యాపించు, విస్తరించు
**catch up** పట్టుకొను; సమానమగు
**catch word** ఊతపదం
**catchment** అరగాణి, నీరు నింపే వనరు
**catchment area** ఆయకట్టు, నీటివనరు విస్తీర్ణం
**catechism** (మతంలో) ప్రశ్నోత్తర గ్రంథం; (రాజకీయాల్లో) ప్రశ్నోత్తరాలు
**catechol** కపిలిందధృతి
**catechu** కాచు
**categorical** నిరపేక్ష, నిశ్చిత, స్పష్ట; విపుల, వివరమైన
**categorically** స్పష్టంగా, విపులంగా, వివరంగా
**categorization** (సం)వర్గీకరణం
**category** తరగతి, శ్రేణి, వర్గం; స్థితి, జాతి; సంవర్గం
**catenation** పరస్పరాన్వయం
**cater** సేవచేయు, బందోబస్తుచేయు; తిండిపెట్టు
**cater-cousin** దూరపు బంధువు
**catering** వంటాపెట్టూ



**catering on railway** రైల్లో భోజన సదుపాయాలు
**caterpillar** గొంగళిపురుగు
**catharsis** దేహశుద్ధి; క్షాళన ప్రక్రియ
**cathartic** విరేచనకారి, భేది మందు
**cathartic, saline** లవణవిరేచనకారి
**cathode** రుణధ్రువం
**catholic** కేథలిక్ మతస్థుడు; సర్వసామాన్య, సర్వజనోపయోగకర, విశాలహృదయంగల
**cattle** పశువులు, గొడ్లు
**cattle feed reject** పశుగ్రాస వ్యర్థం
**cattle pound** బందెల/బంజరు దొడ్డి
**cattle show** పశుప్రదర్శన
**cattle quarantine station** రోగగ్రస్త పశుకేంద్రం
**caucus** స్థానిక సమావేశం; కుట్రదారుల ముఠా
***cauda equina*** గుర్రపుతోక
**caudal** పుచ్ఛ, పుచ్ఛీయ; తోకవంటి, పాదాభిముఖ
**cauldron** పెద్దకాగు
**cauliflower** కోసు/గోబి పువ్వు
**caulin bud** దంటుమొగ్గ
**causable** కారణసాధ్య
**causal** హేత్వర్థక
**causality** కార్యకారణభావం
**causation** సకారణత్వం
**causative** కారణమైన; ప్రేరణార్థక(ం)
**cause** *n* కారణం, హేతువు, పక్షం; దావా, వ్యాజ్యం *v* కలుగజేయు, ప్రేరేపించు, (ఉత్పత్తి) చేయు, చేయించు
**cause and effect relationship** కార్య కారణ సంబంధం
***cause celebre*** పదిమందినీ ఆకర్షించే దావా/వ్యాజ్యం
**cause-specific** నిర్దిష్ట కారణం
**make common cause** కలిసిపోవు, చేరిపోవు, ఏకాభిప్రాయానికి వచ్చు
**show cause** కారణం చూపు/చూపించు
**causeless** నిర్హేతుక, అకారణ
**causeway** కాలిబాట, పోతగట్టు
**caustic** తీవ్ర, కఠిన; దాహక
**caustic soda** దాహకసోడా
**cauterization** దహనీకరణం
**cauterization, chemical** రసాయనిక దహనీకరణం
**cauterization, electrical** విద్యుద్దహనీకరణం
**caution** *n* (ముందు) జాగ్రత; హెచ్చరిక *v* జాగ్రత చెప్పు, హెచ్చరించు
**cautionary** హెచ్చరించే, జాగ్రత చెప్పే
**cautioner** పూచీదారు, జామీనుదారు
**cautious** జాగ్రతగల, జాగరూక, అప్రమత్త
**cautiously** జాగ్రతగా, జాగరూకతతో
**cavalcade** (ఆశ్వికుల) ఊరేగింపు/దండు
**cavalier** ఆశ్వికుడు, గుర్రపురౌతు
**cavalry** ఆశ్వికదళం
**cave** *n* గుహ, బిలం
**cave in** కూరుకొని పోవు, (అండలు) విరిగిపడు
**caveat** హెచ్చరికపత్రం, చర్య విరమణ నోటీసు
**cavern** పెద్దగుహ, గహ్వరం
**cavil** *n* దురాక్షేపణ, రంధ్రాన్వేషణ, వితండవాదం *v* దురాక్షేపణ/రంధ్రాన్వేషణ/వితండవాదం చేయు
**cavitation** డొల్లకావటం
**cavity** డొల్ల; కుహరం, కోశం
**cavity, abdominal** ఉదరకుహరం
**cavity, air** వాయురంధ్రం
**cavity, amniotic** పిండకోశం
**cavity, cranial** కపాలకుహరం, పుర్రె బరిణె
**cavity, nasal** నాసారంధ్రం, నాసికాకుహరం
**cavity, oral** నోరు, ముఖరంధ్రం
**cavity, tympanic** కర్ణభేరీకుహరం
**cavum** డొల్ల
**cease** మాను, నిలిచిపోవు, అంతమగు; విరమించు, తుదముట్టించు; తుదముట్టు, కోల్పోవు, నిలిపివేయు
**cease-fire** యుద్ధవిరమణ
**cease-fire order** యుద్ధవిరమణాదేశం
**ceaseless** ఎడతెగని, నిరంతర, అనవరత; మానని
**cedar** దేవదారు
**cede** ఇచ్చివేయు; అర్పించు, దత్తం చేయు, అప్పగించు, వశపరచు; ఓడిపోవు
***cedrela microcarpa/toona*** గాలిమాను, నందిచెట్టు
***cedrus deodara*** దేవదారు
**ceiling** గరిష్ఠ పరిమితి; శిఖరం; లోకప్పు; బల్లకూర్పు
**ceiling price** గరిష్ఠ మూల్యం
**celebacy** బ్రహ్మచర్యం
**celebrate** (శుభాశుభకర్మలు) నెరవేర్చు; (ఉత్సవాలు/పండుగలు) చేయు
**celebrated** ప్రసిద్ధ, ప్రఖ్యాత

**celebration** ఉత్సవం, పండుగ, వేడుక
**celebrity** ప్రసిద్ధి; కీర్తి, ఖ్యాతి; ప్రసిద్ధవ్యక్తి
**celestial** అలౌకిక, దివ్య; స్వర్గసంబంధి, విశ్వసంబంధి
**celestial sphere** ఖగోళం
**cell** (జెయిలు) గది; విద్యుద్ఘటం; (జీవ)కణం
**cell, air** వాయుకణం
**cell, bone** అస్థికణం
**cell, fat** కొవ్వుకణం
**cell, germ** బీజకణం
**cell, giant** మహాజీవకణం
**cell-grid modelling** ఘటజాలక ప్రతిరూపణం
**cell, liver** కాలేయకణం
**cell, nerve** నాడీకణం
**cell, red** ఎర్రరక్తకణం
**cell, sickle** కొడవలి ఆకారపు కణం
**cell, white** తెల్లరక్తకణం
**cellar** నేలమాళిగ, నేలకొట్టు, పాతర
**celluar** కణసంబంధి
**celluloid** సెల్యులాయిడ్
**cement** సిమెంటు; అతికించు, (సంబంధం) కలుపు
**cement concrete surfacing** సిమెంటు కాంక్రీటు పూత (వేయు)
**cemetery** సమాధి స్థలం, గోరీల దొడ్డి
**cenotaph** గోరీ, సమాధి; స్మారకచిహ్నం
**censor** *n* దోషనిర్ణేత, పూర్వపరిశీలకుడు *v* నిషేధించు, కత్తిరించు, పూర్వపరిశీలన చేయు
**censorious** తప్పులు పట్టే, రంధ్రాన్వేషక
**censorship** దోషనిర్ణయం, ప్రచురణ/ప్రదర్శన నిషేధం; కత్తిరింపు
**censure** *n* గద్దింపు, మందలింపు; నింద, అభిశంసనం *v* నిందించు, మందలించు, అభిశంసించు
**censure motion** అభిశంసన తీర్మానం
**vote of censure** అభిశంసన వోటు
**census** జనాభా లెక్క(లు), జనసంఖ్యానం
**industrial census** పారిశ్రామికోత్పత్తుల వివరణ
**cent** నూరు, వంద; చిన్న (అమెరికా) నాణెం; నోరు
**cent percent** నూటికి నూరు పాళ్ళు/శాతం; పూర్తిగా, సంపూర్ణంగా
**Centanrus** అశ్వతర మండలం
**centenarian** శతాయుష్మంతుడు
**centenary** నూరేళ్ళ కాలం; శతజయంతి
**centennial** శతవార్షికోత్సవ(సంవత్సర)ం
**center** *n* కేంద్రం; మధ్యభాగం; కేంద్రప్రభుత్వం *v* మధ్యనుంచు, మధ్యనుండు, కేంద్రీకరించు
**center, childwelfare** శిశుసంక్షేమ కేంద్రం
**center, health** ఆరోగ్య కేంద్రం
**center, maternity** ప్రసూతి కేంద్రం
**center, primary health** ప్రాథమికారోగ్య కేంద్రం
**center, rural health** గ్రామీణారోగ్య కేంద్రం
**centipede** శతపాది (జీవి)
**central** కేంద్ర, కేంద్రీయ, మధ్య; పెద్ద, ప్రధాన, ముఖ్య
**central act** కేంద్ర ప్రభుత్వ చట్టం
**central administration** కేంద్ర ప్రభుత్వం/పాలన
**central board of revenue** కేంద్ర రెవిన్యూ బోర్డు
**central control** కేంద్ర నియంత్రణ
**central co-operative bank** కేంద్ర సహకార బ్యాంకు
**central government** కేంద్ర ప్రభుత్వం
**central jail** కేంద్ర కారాగారం
**central secretariat service** కేంద్ర సచివాలయ సేవ/ఉద్యోగం
**central vowel** మధ్యాచ్చు
**centralization** కేంద్రీకరణ(ం)
**centralize** కేంద్రీకరించు
**centralized** కేంద్రీకృత
**centrally** కేంద్రంద్వారా
**centrally administered unit** కేంద్ర పరిపాలిత భాగం
**centre** *n* కేంద్ర ప్రభుత్వం; మధ్యభాగం *v* మధ్యనుండు, మధ్యనుంచు, కేంద్రీకరించు
**centrifugal** కేంద్రపరాఙ్ముఖ; అపకేంద్ర
**centrifugation** కేంద్రపరాఙ్ముఖీకరణం
**centrifuge** కేంద్ర విముఖి/పరాఙ్ముఖి
**centripetal** కేంద్రోన్ముఖ; అభికేంద్ర
**centrode** కేంద్రపథం
**centroid** గురుత్వకేంద్రం
**century** శతాబ్దం, శతాబ్ది; నూరేళ్ళ కాలం
**cephalalgia** తలనొప్పి
**cephalic** శీర్ష, శీర్షసంబంధి
**cephalo caudal direction** శిరఃపాదాభిముఖదిశ
**cephalometry** తలకొలత, శీర్షమాపనం
**cephalon** తల, శీర్షం
**cephalotripsy** కపాల విచ్ఛేదన(శస్త్ర)క్రియ



**Cepheus** ఊర్వశీపురూరవులు
**ceramic industry** పింగాణీ పరిశ్రమ
**ceramics** కుమ్మరం, కుమ్మరిపని; పింగాణీ పని
**cereal** తృణధాన్యం
**cerebellar** చిన్నమెదడుకు సంబంధించిన
**cerebellum** చిన్నమెదడు, అనుమస్తిష్కం
**cerebral** మస్తిష్కం, పెద్దమెదడు
**cerebral palsy** మస్తిష్కపక్షవాతం
**cerebration** బుద్ధివ్యాపారం
**cerebrum** బృహన్మస్తిష్కం, పెద్దమెదడు
**ceremonial** *adj* శిష్టాచార సంబంధి *n* శిష్టాచారం; ఉత్సవం
**ceremonial guard** ఔపచారిక రక్షకదళం
**ceremonial parade** ప్రత్యేకమైన కవాతు
**ceremonius** ఆచారబద్ధ, ఉత్సవపూర్వక; ఆడంబరపూర్వక
**ceremony** ఉత్సవం, వేడుక; ఆచారకర్మ
***ceropegia gulbosa*** నల్తీగ
**certain** నియత, నిశ్చిత, నిర్ణీత; ఒకానొక; నిజమైన, రూఢి అయిన; విశ్వసనీయ
**certainly** నియతంగా, నిశ్చితంగా, నిజంగా, నమ్మకంగా
**certainty** నిశ్చయం, నియతి, నమ్మకం, తథ్యం
**certificate** యోగ్యతాపత్రం; ధ్రువపత్రం; ప్రమాణపత్రం
**certificate course** ధ్రువీకరణ తరగతి
**certificate discharge** విడుదలపత్రం
**certificate, health** ఆరోగ్యపత్రం
**certificate, medical** వైద్యపత్రం
**certificate, character** నడవడి/సత్ప్రవర్తన పత్రం
**certificate, vaccination** టీకా (ధ్రువీకరణ) పత్రం
**certification** ధ్రువీకరణ; ప్రమాణీకరణ; అంగీకారముద్ర
**certified copy** ధ్రువీకృత/ప్రమాణీకృత ప్రతి; ప్రమాణితపత్రం
**certify** ప్రమాణీకరించు; ధ్రువీకరించు; నిశ్చయంగా చెప్పు, ధ్రువపరచు
***certiorari*** సర్టియోరరి (రిట్ ఉత్తరువు)
**certiouary** ఉత్తరువు
**certitude** రూఢి
**cerumen** గుబిలి
**cervical** మెడకు/గర్భాశయ ద్వారానికి సంబంధించిన, గ్రీవాసంబంధి
**cervix** మెడ, కంఠం, గ్రీవం
**cervix, uteri** గర్భాశయద్వారం
**cess** శిస్తు, రుసుము
**cess pool** మురికిగుంట
**cessation** నిలుపుదల, విరమణ, సమాప్తి; విరామం; అంతం
**cessation of hostilities** యుద్ధవిరమణ
**cession** అప్పగింత, సమర్పణ; పరిత్యాగం; ఇచ్చివేయటం, ఇచ్చివేత
**cetus** శింశుమార(క)ం
**chafe** రాచుకొనిపోవు; ఉత్తేజింపజేయు; విసిగించు; విసుగుదల, కోపం
**chaff** *n* ఊక, తవుడు, పొల్లు, పొట్టు; పనికిరానిది, చెత్త *v* నరుకు, ముక్కలుముక్కలు చేయు
**chaffer** (నచ్చు) బేరమాడు
**chain** *n* గొలుసు, శృంఖల, సంకెళ్ళు; వరస, శ్రేణి; నిర్బంధం
**chainline** గొలుసు గీత/రేఖ
**chainline printer** రేఖాశృంఖలాముద్రాపకం
**chain reaction** గొలుసుకట్టు/శృంఖలా ప్రతిచర్య
**chain stitch** గొలుసుకుట్టు
**chained lady** ఇంద్రమద
**chaining** శృంఖలనం
**chains** గుంపులు
**chair** *n* కుర్చీ, అధికారపీఠం, పదవి; అధ్యక్ష స్థానం, పండిత పదవి *v* అధ్యక్షత వహించు
**take the chair** పదవిని/అధ్యక్షపీఠం అలంకరించు
**chairman** సభాపతి, అధ్యక్షుడు
**chalcedony** రక్తస్ఫటికం
**chalcolithic age** కాంస్య పాషాణయుగం
**chalk** సుద్ద, సీమసున్నం, సున్నపురాయి
**chalk out** సిద్ధపరచు
**challenge** *n* సవాలు, హెచ్చరిక; విపత్తు *v* సవాలు చేయు, జగడానికి పిలుచు, ఆక్షేపించు, హెచ్చరించు
**chamber** (న్యాయాధికారి) గది
**chamber, air** గాలిగది, వాయుకోశం
**chamber, anterior** ముందటిగది, ముందుగది
**chamber, inspection** తనిఖీగది
**chamber of commerce** వాణిజ్యమండలి
**chamber, posterior** వెనకగది
**lower chamber** దిగువసభ, శాసనసభ, లోక్‌సభ, విధానమండలి

**upper chamber** ఎగువసభ, రాజ్యసభ, విధాన పరిషత్తు
**chameleon** నృగుడు; ఊసరవెల్లి
**chamois leather** జింకతోలు
**champion** *n* జెట్టి, విజేత, సమర్థకుడు, అసహాయ శూరుడు *v* సమర్థించు, పక్షంవహించు
**championship** గెలుపు, పక్షసమర్థన, విజేతృత్వం
**chance** *adj* ఆకస్మిక, అదృష్టవశమైన, కాకతాళీయ, యాదృచ్ఛిక *n* అదృష్టం, అవకాశం, ఘటన *v* సంభవించు, తటస్థించు, పుట్టించు
**by chance** అకస్మాత్తుగా, అదృష్టవశాత్తు, యాదృచ్ఛికంగా, అనుకోకుండా
**chance upon** అకస్మాత్తుగా పొందు/లభించు
**stand a chance** నమ్మకం కలుగు/ఉండు
**take a chance** అవకాశం తీసుకొను, ప్రయత్నించు
**chancellor** ప్రధానోద్యోగి, ప్రభుత్వోద్యోగి, కులపతి, విశ్వవిద్యాలయాధ్యక్షుడు
**chancellor of the exchequer** (బ్రిటిష్) ఆర్థికమంత్రి
**chancellor of university** కులపతి, విశ్వవిద్యాలయాధ్యక్షుడు
**chancery** రాయబార కార్యాలయం; (బ్రిటిష్) ప్రత్యేకోన్నత న్యాయస్థానం
**chancre** సుఖవ్యాధి కురుపు
**chancre, hard** గట్టి సుఖవ్యాధి కురుపు
**chancre, soft** మెత్తని సుఖవ్యాధి కురుపు
**chandelier** లస్టరు
**change** *n* మార్పు, పరివర్తన; చిల్లర నాణేలు *v* వదులుకొను, వదిలించుకొను, తిప్పు, తప్పించు, వేరొకటిగా చేయు
**change front** రూపం/పార్టీ మార్చు
**change one's mind** మనసు మార్చుకొను
**change one's tune** స్వరం మార్చు, అభిప్రాయం మార్చు/ఫిరాయించు; చల్లబడు
**changeability** అస్థిరత్వం, మారే స్వభావం, పరిణామశీలత
**changeable** మారే, అస్థిర, చంచల, పరిణామశీల
**changeable root** ఉద్వర్తనక్షమ ధాతువు
**changeful** అస్థిర, చపల
**changeless** మారని, మార్పు లేని/కాని
**changing** పరివర్తక, మారుతుండే
**channel** కాలవ, (గొట్టపు) మార్గం; దిక్కు, పథం; (రెండు సముద్రాలనుకలిపే) జలమార్గం
**channel irrigation** కాలవనీటి పారుదల
**chant** *n* పాట, గీతం, రాగం; మంత్రం *v* పాడు, మంత్రించు
**chaos** అస్తవ్యస్తత, అరాజకత్వం, గందరగోళం, అవ్యవస్థ
**chaotic** అవ్యవస్థిత, అరాజక, సంకీర్ణ
**chap** *n* మనిషి, వ్యక్తి *v* నరుకు, చీల్చు, పగలగొట్టు
**chapel** చిన్నగుడి, ప్రార్థనాలయం
**chaperon** *n* సంరక్షకురాలు, సహాయకురాలు *v* రక్షించు; సంబాళించు
**chaplain** (క్రైస్తవ) అర్చకుడు, పూజారి
**chapter** అధ్యాయం, ప్రకరణం, పరిచ్ఛేదం; (మతాచార్య) సభ
**char** మాడ్చు, బొగ్గుచేయు
**character** గుణం, స్వభావం, ప్రవర్తన, లక్షణం, గుర్తు; యోగ్యత, సత్ప్రవర్తన; హోదా, అంతస్తు; అక్షరం, లిపి; (నాటకాదుల్లో) పాత్ర
**characteristic** *adj* స్వాభావిక, ప్రత్యేక, విశిష్ట *n* లక్షణం, విశేషగుణం, ప్రత్యేకత, విలక్షణత
**characterization** పాత్రచిత్రణ, శీలనిరూపణ, స్వభావచిత్రణం
**characterize** చిత్రీకరించు, వర్ణించు
**characterology** శీలపరిశీలన
**charcoal** (కర్ర) బొగ్గు
**charcoal, activated** ఉత్తేజితమైన బొగ్గు
**charge** *n* భారం, బరువు; (తుపాకీ) బారు/మందుగుండు; ఖర్చు, వ్యయం, వెల, ఖరీదు; ఆరోపణ, బాధ్యత, అధీనత, ఆవేశం; ఫిర్యాదు, నేరం; అధికారం; నిందారోపణ, ఉత్తరువు *v* భారంవేయు, అప్పగించు, (తుపాకి) మందు పట్టించు; వెలకట్టు; లెక్కలో రాయు; ఆజ్ఞాపించు, ఆక్రమించు; నేరం మోపు
**charge d' affaires** కార్యవాహక దూత
**charged couple devise** ఆవిష్ట యుగళోపకరణం
**charge holder** ప్రత్యేకబాధ్యతలుగల వ్యక్తి
**charge of office** కార్యభారం, పదవీబాధ్యత
**charge sheet** దోషారోపణపత్రం, అభియోగ పత్రం
**give in charge** అప్పగించు, సంరక్షణలో ఉంచు
**hand over charge** కార్యభారం అప్పగించు/బదలాయించు



**chargeable** దోషిగా నిలబెట్టదగిన, ఆరోపణీయ; ధరకట్టదగిన, వసూలు చేయదగ్గ; విధించదగ్గ
**charging** ఆవేశితం చేసే
**chariot** రథం, తేరు
**charitable** దానశీల, ఉపకారి, ఉదార, ధార్మిక, ధర్మ(బద్ధ)
**charitable endowment** దేవాదాయ ధర్మాదాయాలు
**charity** దాతృత్వం, దానశీలత; దానం, ధర్మం; ఉదారత, పరోపకారిత; దయ, కారుణ్యం
**charlatan** పండితమాని, కువైద్యుడు
**charm** *n* మంత్రం; తాయెత్తు/తావీదు; రక్ష (రేకు); ఆకర్షణ, సౌందర్యం, శోభ *v* ఆకర్షించు; మంత్రించు; ఆనందింపజేయు, మోహపెట్టు
**charnockite** కంచురాయి
**chart** (సముద్ర)పటం; చిత్రం; పట్టిక
**chart, temperature** జ్వరపటం
**charter** *n* అధికారపత్రం, శాసనపత్రం; ప్రణాళిక; హక్కు, అధికారం; దస్తావేజు
**chartered accountant** అధికృత గణకుడు
**chartered plane** అద్దె విమానం
**charter of human rights** మానవహక్కుల ప్రణాళిక
**chase** *n* వేట (జంతువు), వేటభూమి; వెంట తరమటం; అచ్చుచట్రం *v* వెంటపడు, వేటాడు; తరుము, వెళ్ళగొట్టు
**chasm** గండి, లోతైన కనుమ, అగాధం
**chassis** చట్రం
**chaste** పవిత్ర, నిష్కళంక, సదాచారి
**chasten** నిరోధించు, నిర్బంధించు, శిక్షించు
**chastise** శిక్షించు, దెబ్బలు కొట్టు
**chastisement** దండన
**chastity** సచ్ఛీలత, జితేంద్రియత, పవిత్రత
**chat** పిచ్చాపాటీ, మాటామంతీ
***chateau*** కోట
**chattel** గృహోపకరణం, సామాను; చరాస్తి
**chatter** *n* కోతి అరుపు, పిచ్చికూత, వాగుడు *v* వాగు, వదరు, పేలు
***chauffeur*** షోఫర్, (మోటారు బండి) చోదకుడు, డ్రైవరు
**chauvinism** దురహంకారం, దురభిమానం, జాత్యభిమానం; విపరీత దేశభక్తి
**cheap** చౌక, తుచ్ఛ, క్షుద్ర
**cheap and speedy justice** చౌకగా త్వరగా లభించే న్యాయ(నిర్ణయ)ం
**cheap money policy** సులభద్రవ్య విధానం
**cheapen** తగ్గించు, చౌకబరచు
**cheat** *n* మోసగాడు, కపటి; మోసం, దగా, వంచన *v* మోసపుచ్చు, దగాచేయు, వంచించు
**check** *n* అవరోధం, నిషేధం, ప్రతిబంధకం; పరీక్ష *v* అడ్డుపెట్టు, నిరోధించు, నిలిపివేయు; విచారించు, పరీక్షించు, సరిచూచు
**check list** ప్రాథమిక సూచిక
**check point** పరీక్షాస్థలం
**check-up** పరీక్ష
**keep in check** అదుపులో ఉంచు
**checked** సరిచూసిన; పరీక్షించిన
**checkmate** ఆట కట్టు/కట్టించు
**cheek** బుగ్గ
**cheer** *n* హర్షధ్వానం, చప్పట్లు, ఉత్సాహం *v* ప్రోత్సహించు, సంతోషపెట్టు, చప్పట్లుకొట్టు
**cheerful** ప్రసన్న, ఆనందిత, సంతుష్ట
**cheerfully** ప్రసన్నంగా, సంతోషంగా
**cheese** జున్ను
**cheese sick / straws** పాలవిరుగు
**cheilitis** నోటిపూత
**chelicera** కలిసర
**cheloid** (keloid) గాయపు మచ్చ/కాయ
**chemical** *adj* రసాయనిక *n* రసాయనిక (పదార్థ)ం
**chemical oceanography** సాగర రసాయన శాస్త్రం
**chemical property** రసాయనికధర్మం
**chemically** రసాయనికంగా
**chemist** రసాయన శాస్త్రజ్ఞుడు; మందులమ్మేవాడు; ఔషధవిక్రేత
**chemist, pharmaceutical** ఔషధ రసాయనవేత్త/శాస్త్రజ్ఞుడు
**chemistry** రసాయనశాస్త్రం
**chemistry, blood** రక్త రసాయనశాస్త్రం
**chemotherapy** రసాయనచికిత్స
**cheque** చెక్కు
**bearer cheque** బేరర్ చెక్కు
**blank cheque** ఖాళీ చెక్కు
**crossed cheque** క్రాస్డ్ చెక్కు
**chequered** ఎగుడుదిగుడు, క్రమరహిత; రంగురంగుల

**cherish** భావించు, మనసులో ఉంచుకొను
**chess** చదరంగం
**chess-board** చదరంగం బల్ల
**chess-men** చదరంగం పావులు
**chest** ఛాతీ, గుండె, వక్షస్థలం; పెట్టె
**chewing** నమలటం
***chiaroscuro*** వెలుగునీడల చిత్రం
**chicanery** పితలాటకం, మోసం, కుయుక్తి
**chick** కోడిపిల్ల
**chicken-pox** ఆటలమ్మ, అమ్మవారు, చిన్నమ్మవారు
**chide** గద్దించు, మందలించు
**chidoblast** దంశకణం
**chief** *adj* ముఖ్య, ప్రధాన, విశేష; పెద్ద *n* ప్రముఖుడు, నాయకుడు, అధికారి
**chief commissioner** చీఫ్ కమీషనర్
**chief editor** ప్రధాన సంపాదకుడు
**chief justice** ప్రధాన న్యాయమూర్తి
**chief minister** ముఖ్యమంత్రి
**chief of air staff** విమానదళాధ్యక్షుడు
**chief of army staff** సైన్యాధ్యక్షుడు, సైనికదళ ప్రధానాధికారి
**chief of protocol** చీఫ్ ఆఫ్ ప్రోటోకాల్
**chief reporter** ప్రధాన విలేఖరి
**chief whip** చీఫ్ విప్
**cheifly** ప్రధానంగా, విశేషంగా, ముఖ్యంగా, ప్రముఖంగా
**chiefs** తెగ/ముఠా నాయకులు
**chilblain** చలికురుపులు/గజ్జి
**child** శిశువు, బిడ్డ
**child care** శిశుసంరక్షణ
**child, handicapped** అవిటి బిడ్డ/శిశువు
**child-welfare** శిశుసంరక్షణ
**childhood** శైశవం, చిన్నతనం, బాల్యం
**chill** చల్లని, శీతల; ఉదాసీనత, ఉత్సాహలోపం
**chillies** మిరప
**chime** *n* గంట, ఝుంకారం *v* గంటకొట్టు; అంగీకారం కుదురు
***chimera*** అభూతకల్పన, భ్రమ, భ్రాంతి; కిమ్మీరం, భూతం, కల్పిత జంతువు
**chin** గడ్డం, చుబుకం
**china clay** చైనామట్టి, పింగాణీ
**china ware** పింగాణి పాత్రలు
**chip** ముక్క, తునక, పేడు
**chip of old block** పాతకాపు; పితృసమానుడు
**chirography** లేఖనకళ; దస్తూరి; సాముద్రికం; దస్తావేజులు రాసే విధానం
**chiropodist** పాదచికిత్సానిపుణుడు
**chit-chat** ముచ్చట్లు
**chitin** పెంకు
**chivalrous** దుర్బల/శరణాగత రక్షక, వీర, పరాక్రమశీలి, సాహసౌదార్యాలున్న
**chivalry** పరాక్రమం, శూరత్వం, రక్షకత్వం
**chlorination** హరినీకరణం, క్లోరినీకరణం
**chlorine** హరినం
**chlorite-schist** సుద్దరాయి
**chloronema** హరితతంతువు
**chlorophyll** పత్రహరితం
**chloroplast** హరితకణం
***chloroxylon swietenia*** బిలుగు
**choice** *adj* ఇష్టమైన, నచ్చిన; ఉత్తమ, శ్రేష్ఠ *n* ఎన్నిక, ఇష్టం, కోరిక; నిర్ణయం; శ్రేష్ఠమైనది
**choir** గాయకబృందం, భజనమండలి
**choke** నులిమివేయు, ఉక్కిరిబిక్కిరిచేయు; ఆవేశంవల్ల మాట్లాడలేకపోవు
**choking** పొరబారటం
**cholagogue** పిత్తరేచకం; మృతవిరేచనకారి
**cholangitis** పిత్తవాహినీశోథ
**cholelithiasis** పిత్తాశయంలోని రాళ్ళు
**cholera** కలరా
**cholicystitis** పిత్తాశయశోథ
**choose** ఎన్నుకొను; ఇష్టపడు, నిర్ణయించు
**choosen** ఎంచుకొన్న, ఎంపిక చేసిన
**chooser** ఎంచుకొనే వ్యక్తి; నిర్ణేత
**choosing** ఎన్నుకోవడం, ఎన్నిక
**chop** తెగనరకు, ముక్కలుచేయు; దారి చేసుకుంటూ పోవు; మాంసం ముక్క, చియ్య
**choral** బృందగాన సంబంధి
**chord** (వాద్యసాధనాల) తీగె; శ్రుతి స్వర తారతమ్యం; రజ్జువు, పాశం, దారం; జ్యా
**choreography** నృత్య సంయోజనం; నాట్యకళ, నాట్యపద్ధతి సూచన
**chorion** జరాయువు; గర్భకోశం
**choroid** గుడ్డుపొర; రంజిత నేత్రపటలం
**chorus** బృందగానం; ధ్రువాగానం
**christendom** క్రైస్తవ ప్రపంచం



**christian** క్రైస్తవుడు
**christianity** క్రైస్తవమతం, క్రీస్తు మతం
**christmas day** క్రీస్తు పుట్టినరోజు (పండగ)
**chromaffin** వర్ణరాగి
**chromatic** వర్ణసంబంధి
**chromatography** వర్ణలేఖన శాస్త్రం
**chromophobe** వర్ణవిరాగి
**chromophore** వర్ణవాహకం
**chromoscope** వర్ణదర్శిని
**chromosomal** వర్ణగ్రాహక
**chromosphere** వర్ణమండలం
**chromotropic** వర్ణాకర్షి
**chronic** దీర్ఘకాలిక; విడవని, ఎడతెగని
**chronic disease** దీర్ఘవ్యాధి
**chronicle** చరిత్ర, కాలక్రమంలో రాసిన విషయాలు
**chronicler** చరిత్రకారుడు
**chronological** కాలక్రమానుసారి, కాలక్రమానుగత (చారిత్రక)
**chronology** కాలక్రమం
**in chronological order** కాలక్రమానుసారంగా
**chronometer** కాలమాపకం
**chrysanthemum** చేమంతి
***chrysanthemum cornarium/indicum*** చేమంతి
**chrysolite** లేతగుడ్లరాయి
**chuckle** *n* కోడికూత; నవ్వటం, నవ్వుకోవటం *v* (చప్పుడు లేకుండా) నవ్వు, ప్రసన్నమగు
**chunk** ముక్క, ఖండం, అంశం, భాగం
**church** చర్చి, క్రైస్తవ దేవాలయం/మతాలయం
**churn** చిలకటం, గిలకొట్టడం, మథనం; గిలకొట్టు, మథించు
**chyle** అన్నరసం, అన్నధాతుసారం
**chyluria** మూత్రంలో బైలు పోవటం
**chyme** ఆమాశయపాకం
**cicatrix** గాయపు మచ్చ
***cicera rietinum*** సెనగ
**cilia** రోమకాలు
**ciliary** రోమక సంబంధి
**cilium** సూక్ష్మకేశం, రోమకం
***cinchona excelsa*** దుద్దుగు
**cinder** బొగ్గు
**cinderella job** నిష్ఫల ప్రయాస
**cinema** చలనచిత్రం
**cinematographic** చలనచిత్రరూపక
**cinematography** చలనచిత్రకళ
**cineration** భస్మీకరణం
**cinnabar** రససిందూరం
**cinnamon** లవంగ పట్ట, దాల్చినచెక్క
**cinnamon oil** దాల్చిన నూనె
***cinnamounma camphora*** కర్పూర వృక్షం
***cipadessa fruticefa*** తురక వేప
**cipher** సున్న, శూన్యం; సాంకేతిక లిపి
**cipher code** లిపి సంకేతం, సంకేత లిపి
**Circinus** భుజ్యమండలం
**circle** *n* వలయం, ఉంగరం, కైవారం; (గ్రహ) మండలం; కాలచక్రం; వర్ణం; సమూహం; పలుకుబడి ప్రమాణం, అధికార ప్రదేశం; వృత్తం, చక్రం *v* చుట్టూ తిరుగు, గిరగిర తిరుగు; చుట్టుముట్టు
**circle graph** (pie graph) వృత్త/వలయ పటం
**circuit** వలయం, చక్రం, విద్యుద్వలయం; ప్రయాణం, సంచారం; చుట్టూ తిరగటం
**circular** *adj* వర్తులాకార, గుండ్రని, వృత్తాకార *n* ప్రకటన పత్రిక
**circulation** చెలామణి; ప్రసరణ, ప్రసారం; అమ్మిన సంచికల సంఖ్య; పాఠకుల సంఖ్య; వ్యాప్తి
**circulation, blood** రక్త ప్రసరణ/ప్రసారం
**circulation, collateral** సమపార్శ్వ ప్రసరణ
**circulation of currency** నోట్ల చెలామణి
**circulation of money** ద్రవ్య చెలామణి
**circulation, portal** ప్రతిహార రక్తప్రసరణ
**circulation, renal** మూత్రపిండ రక్తప్రసరణ
**circulatory** ప్రసరణీయ
**circumcentre** పరికేంద్రం
**circumcircle** పరివృత్తం
**circumcision** సున్నతి/సుంతి
**circumference** చుట్టుకొలత, పరిధి; (ఖగోళ) పరిధి
**circumflex accent** స్వరిత(స్వర)ం
**circumlocution** (వాక్య) విస్తరం/విస్తరణ; డొంకతిరుగుడు ప్రసంగం
**circumscribe** హద్దు/ఆవరణ ఏర్పరచు, చుట్టూ గీత గీయు; పరిలిఖితం; వృత్తాంతర్గత
**circumscribed** గిరిగీసిన/సరిహద్దుగల
**circumspect** తెలివయిన, జాగ్రతగల, హెచ్చరికగల
**circumspection** జాగ్రత, ఆలోచనాత్మకత

**circumstances** పరిస్థితులు, సంగతులు, సందర్భాలు, స్థితిగతులు, సంఘటనలు
**under the circumstances** ఈ పరిస్థితుల్లో/సందర్భంలో
**circumstantial** ప్రాసంగిక
**circumstantial evidence** ప్రాసంగిక సాక్ష్యం
**circumvent** మోసపుచ్చు, (చట్టంనుంచి) తప్పించుకొను
**circumvented** వంచిత
**circumvention** వంచన, మోసం
**circus** సర్కస్
**cissoid** సింజిని
**cistern** కుండ, కూపం, తొట్టి
**citadel** గడి, కోట, దుర్గం
**citation** అనులేఖనం
**cite** ఉదాహరించు, ప్రమాణం చెప్పు/చూపు; (న్యాయస్థానంలో) హాజరుకమ్మని ఆజ్ఞాపించు
**citizen** నాగరకుడు, పౌరుడు
**naturalized citizen** స్వీకృతపౌరుడు
**citizenship** పౌర(స)త్వం
**citizenship rights** పౌర(స)త్వహక్కులు
**citric acid** నిమ్మఉప్పు
**citrus** నిమ్మజాతి
***citrus aurantium/sinensis*** చీనీ
**city** మహానగరం
**city father** పురప్రముఖుడు; పురపాలక సంఘాధికారి
**city state** నగరరాజ్యం
**freedom of the city** నగరస్వాతంత్ర్యం
**civic** పౌరసంబంధి, పౌరసత్వపు; నాగరక
**civic reception** పౌరస్వాగతం
**civic rights** పౌరహక్కులు
**civic sense** పౌరకర్తవ్యభావన
**civics** పౌరశాస్త్రం
**civil** వ్యావహారిక, వ్యవహారరూపక; సాంఘిక, పౌరసంబంధి (సైనిక సంబంధంలేని)
**civil administration** పౌరపరిపాలన
**civil aviation** పౌర విమానయానం
**civil court** సివిల్ కోర్టు
**civil defence** పౌరరక్షణ
**civil disobedience movement** శాసనోల్లంఘనోద్యమం
**civil law** వ్యవహారవిధి
**civil liberty** పౌర స్వేచ్ఛ
**civil list** రాజకుటుంబ వ్యయపట్టిక; ప్రభుత్వాధికారుల జాబితా
**civil marriage** సివిల్ వివాహం
**civil offences** సివిల్/వ్యవహారాపరాధాలు
**civil procedure code** వ్యవహార స్మృతి
**civil remedy** పౌర/వ్యావహారిక పరిహారం/నివారణమార్గం
**civil rights** పౌరహక్కులు
**civil servants** ప్రభుత్వోద్యోగి
**civil service** ప్రభుత్వసేవ
**civil suit** సివిల్ దావా/వ్యాజ్యం
**civil supplies** పౌరసరఫరాలు
**civil war** అంతర్యుద్ధం
**civilian** ప్రభుత్వాధికారి; సాధారణపౌరుడు
**civilian dress** పౌరదుస్తులు
**civilities** సభ్యమర్యాదలు
**civilization** నాగరకత; సభ్యత, మర్యాద
**civilize** నాగరకత/సభ్యత నేర్పు, మర్యాద చెప్పు
**civilized** నాగరక, సభ్య, మర్యాద తెలిసిన
**claim** *n* హక్కు, అర్హత, స్వత్వం *v* దావా వేయు, వ్యాజ్యమాడు, హక్కులడుగు
**claimant** హక్కుదారు, తనదని వాదించేవ్యక్తి, క్లెయిందారు
**clairvoyance** దివ్యదృష్టి, దూరదృష్టి, యోగదృష్టి
**clairvoyant** యోగి
**clamour** *n* అరుపు, బొబ్బ(రింత), గడబిడ, కోలాహలం, నినాదాలు *v* బొబ్బలుపెట్టు, గందరగోళం/నినాదాలు చేయు
**clamp** *n* తాళం, బందు; ఇటుకల కుప్ప *v* బిగించు, తాళం వేయు
**clan** వంశం, తెగ, కులం
**clandestine** రహస్య, ప్రచ్ఛన్న, గుప్త
**clapping** ఆస్ఫాలనం
**clarification** స్పష్టీకరణ, వివరణ; నిర్మలీకరణం
**clarify** స్పష్టపరచు, వివరించు; శుభ్రపరచు, శుద్ధిచేయు, నిర్మలంచేయు
**clarion** బాకా, బూర
**clarion call** పిలుపు, ఆహ్వానం; ప్రోత్సాహం
**clarion voice** ఉత్తేజక ధ్వని
**clash** *n* దెబ్బ, విరోధం, సంఘర్షణ *v* ఎదుర్కొను, ఘర్షణపడు, విభేదించు, దాడిచేయు
**clasp** *n* కొలికి, కొక్కెం; కౌగిలింత; చేతులు పట్టుకోవటం *v* పట్టుకొను, చుట్టుకొను, కౌగలించు; కొక్కెం తగిలించు



**clasper** ఆలింగనం
**class** తరగతి, వర్గం, శ్రేణి; వర్ణం; హోదా, స్థానం, రకం
**class consciousness** వర్గచైతన్యం
**class dialect** వర్గమాండలికం
**class enemy** వర్గశత్రువు
**class-meaning** వర్గార్థం
**class name** వర్గనామం
**class room** తరగతిగది
**class struggle** వర్గపోరాటం
**class teacher** తరగతి బోధకుడు
**class war** వర్గసంఘర్షణ
**classic** మహాకావ్యం, ప్రామాణిక గ్రంథం; పూర్వకావ్యం
**classical literature** ప్రాచీన/పురాతన సాహిత్యం
**classical music** శాస్త్రీయ సంగీతం
**classification** విభజన; వర్గీకరణ
**classification algorithm** వర్గీకరణ పరిష్కారం
**classified** వర్గీకృత
**classifier** వర్గకం, వర్గీకారకం
**classify** వర్గీకరించు; (తరగతులుగా) విభజించు
**classless society** వర్గరహిత సమాజం
**clause** ఉపవాక్యం, ఉపనిబంధన, ఉపాంశం; షరతు
**clause by clause** ఖండశః, భాగాలుగా, క్లాజువారీగా
**saving clause** తప్పించే/రక్షించే మార్గం
**claustrophobia** స్థలభీతి, పరిమితి భీతి
**clavicle** కంటి ఎముక; జత్రువు
**claw** నఖం, గోరు
**clawfoot** పంజావంటి పాదం
**clawhand** పంజావంటి చెయ్యి
**clay** బంక మన్ను/మట్టి, జంబాలం
**clean** శుద్ధ, పరిశుభ్ర, దోషరహిత, నిర్మల
**cleaner** శుభ్రంచేసే వ్యక్తి/సాధనం
**cleaning** నిర్మలీకరణం, శుభ్రపరచటం
**clear** *adj* నిర్మల, స్పష్ట, పరిశుద్ధ, స్వచ్ఛ; కల్తీలేని, తగవులేని *adv* స్పష్టంగా, స్వచ్ఛంగా, పరిశుభ్రంగా; పూర్తిగా *v* తేర్చు, తొలగించు, శుభ్రపరచు, స్పష్టపరచు, పరిష్కరించు
**clear-cut** సుస్పష్ట, విస్పష్ట
**clear-headed** స్పష్టాలోచనగల
**clear majority** పూర్తి ఆధిక్యం/మెజారిటీ
**clear out** ఖాళీచేయు, తీసుకొనిపోవు
**clear the way** మార్గం/దారి సుగమం చేయు
**clear up** పరిష్కరించు
**stand clear** దూరంగా/తొలగి ఉండు
**steer clear** తప్పించుకొను
**clearage** చీల్చటం, విదళనం
**clearance** తొలగింపు, తీర్చివేత; విడుదల రసీదు, రుణవిమోచనం
**clearance centre** క్లియరెన్సు కేంద్రం
**clearance certificate** చేబాకీ పత్రం
**clearing agent** క్లియరింగ్ ఏజెంట్
**clearing bank** క్లియరింగ్ బ్యాంకు
**clearly** స్పష్టంగా, పూర్తిగా
**cleavage** పగులు, చీలిక, విభాగం
**cleave** చీల్చు, పగలగొట్టు, వేరుచేయు, విభజించు
**cleft-palate** చీలిన అంగుడు
***cleisanthus collinus*** కొడిసె
**clemancy** కరుణ, కనికరం; క్షమ; క్షమాభిక్ష
***cleone pentaphylla*** వాయిల
**clergy** క్రైస్తవ మతాధికారులు; పురోహితవర్గం, మతాచార్యవర్గం
**clerical error** రాత తప్పు, లేఖక ప్రమాదం; గుమాస్తా పొరపాటు
**clerk** గుమాస్తా, లేఖకుడు
**clevage** వేర్పాటు, విభేదం
**clever** తెలివిగల, కుశల, సూక్ష్మబుద్ధిగల
**cleverly** తెలివిగా, నేర్పుగా
***cliche*** నలిగిన సామెత, పునరుక్తి, గతానుగతిక వాక్యం
**click** క్వణం
**client** కక్షిదారు; ఉపయోక్త
**clientele** ఉపయోక్తలు; పాఠకులు
**cliff** కొండకొమ్ము, శిఖరం
**climacteric** ముట్లుడిగిన
**climate** శీతోష్ణస్థితి, వాతావరణం
**climatic** శీతోష్ణ/వాతావరణ సంబంధి
**climatology** శీతోష్ణ/వాతావరణ శాస్త్రం
**climax** *n* క్రమోన్నతి, ఉత్కృష్టత, పరాకాష్ఠ; శిఖరం; పతాకస్థాయి *v* శిఖరాగ్రం/పరాకాష్ఠ చేరు
**climber** ఎగబాకే తీగ, ఆరోహకం
**climbing** ఎగబాకే, ఆరోహి

**incombustible** మండని, నిప్పంటని, అదాహ్య
**income** ఆదాయం
**income-tax** ఆదాయప్పన్ను
**income-tax officer** ఆదాయప్పన్ను అధికారి
**incoming radiation** అంతర్గామి వికిరణనం
**incommensurable** అపరిగణనీయ
**incomparable** అసదృశ, పోల్చరాని
**incompatibility** పొందిక/పొంతన లేమి, అసంగతత్వం
**incompatible** పొందిక/పొంతన లేని; విరుద్ధ ప్రకృతి గల
**incompetence, incompetency** అసమర్థత, అనర్హత, అయోగ్యత, అశక్తత
**incompetent** అసమర్థ, శక్తిహీన, అయోగ్య, అశక్త, అనర్హ
**incomplete** అసంపూర్ణ, అసమగ్ర, పూర్తికాని
**incomplete verb** అసంపూర్ణక్రియ
**incompressibility** అసంపీడ్య, అసంకోచనీయత
**incompressible** అసంపీడ్య, అసంకోచనీయ
**inconclusive** అసంపూర్ణ, ముగియని, అసమాప్త
**inconclusive debate/discussion** అసంపూర్ణ/అసమాప్త చర్చ
**incongruent/incongreous** అప్రస్తుత, అయోగ్య, నిరుపయోగకర, అసమంజస
**incongruity** అసమంజసత్వం, అయోగ్యత
**inconsiderate** అవివేక, నిర్దయ, అవిచారిత
**inconsistency** (పరస్పర) వైరుద్ధ్యం, పొసగమి
**inconsistent** పొసగని, పరస్పర విరుద్ధ
**inconstant** అస్థిర, చంచల, చపల; పరివర్తనీయ
**incontestable** వాదాతీత, నిర్వివాద, నిస్సందేహ, చర్చకు అవకాశంలేని
**incontinence** నిగ్రహరాహిత్యం
**incontrovertible** వాదాతీత, నిర్వివాద, నిస్సందేహ, చర్చకు అవకాశంలేని
**inconvenience** *n* అసౌకర్యం, ఇబ్బంది *v* ఇబ్బంది పెట్టు, అసౌకర్యం కలిగించు
**inconvenient** ఇబ్బంది పెట్టే/కలిగించే
**inconvertible** మార్చ వీలుగాని/వీలులేని
**incoordination** సమన్వయరాహిత్యం
**incorporate** చేర్చుకొను, కలుపుకొను; చట్టబద్ధ సంఘంగా ఏర్పడు
**incorporating language** కర్మబోధక/క్రియా భాష
**incorporation** నమోదు
**incorrect** తప్పయిన, సరిగాని, అసాధు, దుష్ట
**incorrigible** బాగుపరచ వీలులేని, సరిదిద్ద వీలుపడని
**incorruptible** చెరచరాని, చెడగొట్టరాని, లంచగొండిగాని; అప్రలుబ్ధ
**increase** *n* పెంపు(దల), పెరుగుదల, వృద్ధి, ఉన్నతి *v* పెరుగు, పెంచు, వృద్ధి చెందు
**increasing utility** పెరుగుతున్న ప్రయోజనం/ఉపయోగిత
**incredible** వింత, అపురూపమైన, విడ్డూరమైన, నమ్మరాని
**increment** పెరుగుదల, పెంపు, వృద్ధి; ఉపచయం; ఉపవిభక్తి
**incriminate** దోషారోపణ చేయు, నేరం ఆరోపించు
**incrimination** దోషారోపణ, అభియోగం
**incriminatory evidence** అభియోగాత్మక సాక్ష్యం/నిదర్శన, నిరూపక సాక్ష్యం
**incrustation** పటలీకరణం
**incubation** పొదగటం
**incubation period** పొదిగే కాలం/సమయం
**incubator** పొదిగే సాధనం
**incubus** గాలి, దయ్యం, భూతం, బూచి; బాధాకర వ్యక్తి/వస్తువు
**inculcate** నేర్పు, బోధించు; అలవరచు, (మనసులో) నాటు
**inculcation** బోధన, ఉపదేశం; అలవరచటం
**inculpable** నేరం కాని
**inculpate** నేరం మోపు, దోషారోపణ చేయు
**inculpatory** నేరం కిందికి వచ్చే, నేరగాణ్ణి చేసే; నిందాత్మక, అభియోగాత్మక
**incumbent** అధికారి, ఉద్యోగి; విధి, కర్తవ్యం
**incumbency** కార్యభారం, కర్తవ్యం
**incur** పడు, పొందు, పాత్రుడగు, భరించు, వహించు
**incurable** కుదరని, నయంకాని, మానని
**incursion** (ఆకస్మిక) దండయాత్ర, దాడి, పైబడటం
**incursionist** ముట్టడిదారు, ఆకస్మికాక్రమయిత
**indebted** ఋణగ్రస్త
**indebtedness** ఋణగ్రస్తత
**indecency** అశ్లీలత, అసభ్యత, అమర్యాద
**indecent** అశ్లీల, అసభ్య, అనుచిత; సిగ్గులేని
**indecision** అనిశ్చయత్వం, అనిర్ణయం, నిర్ణయరాహిత్యం



**indecisive** అనిశ్చిత, అనిర్ణీత, సందిగ్ధ
**indeclinable** అవ్యయం
**indecorous** అనుచిత, మర్యాద లేని/తప్పిన
**indefeasible** ఓటమిలేని, అజేయ్య, అజేయ; అర్థంగాని, రద్దుచేయటానికి వీలుపడని
**indefensible** సమర్థించరాని, అరక్షణీయ; రద్దుపరచ వీలులేని
**indefinable** అనిర్వచనీయ
**indefinite** అనిశ్చిత, అనిర్ణీత, నిరవధి(క), గడువులేని
**indefinite article** అనిశ్చాయకోపపదం
**indefinitely** నిరవధికంగా, గడువు చెప్పకుండా/పెట్టకుండా
**indelible** చెరగని, చెరపరాని, నశించని
**indemnification** నష్టపరిహారం చెల్లించు; భద్రత కలిగించు
**indemnify** నష్టపూర్తి చేయు, నష్టపరిహారం చెల్లించు; భద్రత కలిగించు
**indemnity** నష్టపూర్తి, నష్టపరిహారం
**indent** *n* కావలసిన వస్తువుల పట్టిక, ఇండెంట్ *v* కావలసిన వస్తువులు తెప్పించు, ఇండెంట్ చేయు
**indentation** గంటు పడటం/పెట్టడం
**indenture** ఒప్పందపు పత్రం
**indentured labour** ఒప్పందంతో కుదుర్చుకొన్న పనివాళ్లు
**independence** స్వాతంత్ర్యం, స్వతంత్రత
**independent** స్వతంత్ర
**independent member** స్వతంత్రసభ్యుడు
**independent variable** స్వతంత్ర చలరాశి
**independently** స్వతంత్రంగా
**indestructibility** అవినాశత
**indestructible** అవినాశ్య
**indeterminancy** అనియతత్వం, అనిశ్చితి
**indeterminate** అనిశ్చిత, అనియత, అనిర్ణీత; నిర్ణయించలేని/వీలుగాని
**indeterminism** అనియతివాదం
**indetiscent** అవిదారకం
**index** సూచి(క), అనుక్రమణిక; పట్టిక, ఘాతాంకం
**index, blood** రక్తాధిసూచిక
**index, cardiac** హృదభిసూచిక
**index, colour** వర్ణసూచిక
**index finger** చూపుడు వేలు
**index number of prices** ధరల సూచీసంఖ్య
**indian air force** భారతీయ వైమానికదళం
**indianisation** భారతీయీకరణ
**indicate** సూచించు, తెలుపు
**indication** సూచన, లక్షణం
**indicative mood** నిశ్చయార్థకం
**indicator** సూచకం
**indict** (నేరం) ఆరోపించు/మోపు
**indictment** దోషారోపణ
**indifference** అలక్ష్యం, ఉదాసీనత, ఉపేక్ష
**indifferent** ఉదాసీన, తటస్థ, అనాసక్త
**indifferent demands** నిష్ప్రయోజనకరమైన కోరికలు/డిమాండులు
**indigeneous** దేశీయ, స్వదేశీ/దేశవాళీ, స్థానిక, ప్రాదేశిక
**indigeneous production** దేశీయోత్పాదన, స్వదేశీ/దేశవాళీ ఉత్పాదన
**indigent** (నిరు) పేద, నిర్ధన
**indigestible** అరగని, జీర్ణం కాని/చేసుకోలేని
**indigestion** అజీర్తి, అజీర్ణం
**indignant** దుష్ట, క్రుద్ధ, ఆగ్రహం/క్రోధం/అసూయ గల
**indignation** ఆగ్రహం, రోషం, కోపం, క్రోధం
**indignity** అగౌరవం, అమర్యాద, అవమానం, తృణీకారం
**indigo** నీలి (మందు)
**indirect** పరోక్ష; సూటికాని; కుటిల
**indirect aspect** పరస్మై ప్రకారం
**indirect election** పరోక్ష ఎన్నిక
**indirect income** పరోక్షాదాయం
**indirect object** పరోక్ష కర్మ
**indirect speech** పరోక్ష సంవాదం
**indirect taxation** పరోక్ష పన్నులు
**indiscipline** క్రమశిక్షణరాహిత్యం; అమర్యాద, అవ్యవస్థ
**indiscreet** అవివేక, బుద్ధిహీన, అనాలోచిత, అవిచారమూలక, వివేకశూన్య
**indiscretion** నిరాలోచన, అవివేకం, తెలివితక్కువ (తనం), బుద్ధిహీనత
**indiscriminate** సిద్ధాంతరహిత, భేదం/అంతరం చూడని
**indiscriminately** పక్షపాతరహితంగా, నిర్ణయ శూన్యంగా, అవిచారితంగా, అనాలోచితంగా, భేదదృష్టి లేకుండా

**indispensable** అపరిహార్య, అనివార్య, ఆవశ్యక, తప్పనిసరి
**indispersable** చెదరగొట్టరాని
**indisposed** అస్వస్థ; అనిష్ట, విముఖ, విరుద్ధ, నలతగా ఉన్న
**indisposition** అస్వస్థత, నలత; అనిష్టత, విముఖత, విరుద్ధత
**indisputable** నిర్వివాద, అచర్చనీయ, అప్రశ్ననీయ; నిశ్చిత, నిరపేక్షణీయ
**indistinct** అస్పష్ట
**indistinct boundary** అస్పష్టసీమ
**individual** *adj* వ్యక్తిగత, వైయక్తిక; ప్రత్యేక, విశిష్ట *n* వ్యక్తి, వ్యష్టి, ప్రాణి, జీవి
**individual interest** వైయక్తికాభిరుచి; వ్యక్తి ప్రయోజన దృష్టి
**individualism** వ్యష్టివాదం, వ్యక్తివాదం, వైయక్తికత
**individualist** వ్యష్టివాది, వ్యక్తివాది
**individuality** వ్యక్తిత్వం; ప్రత్యేకత, విలక్షణత
**indivisibility** అవిభాజ్యత
**indivisible** అవిభాజ్య, విభజించవీలుగాని
**indolent** ఒళ్లు వంగని; మానని, నయంకాని
**indoor** ఇంటిలోపలి, గృహాంతర్గత
**indoor patient** మంచంపట్టిన రోగి, ఇంట్లో ఉన్న రోగి
**indoors** ఇంట్లో, లోపల
**indubitable** సంశయరహిత, అసందిగ్ధ; సునిశిత, పక్కా
**induce** ప్రేరేపించు, ప్రోత్సహించు, సిద్ధపరచు, ఉన్ముఖుని చేయు, ప్రలోభపెట్టు; సమ్మతింపజేయు
**induced** ప్రేరిత
**inducement** ప్రలోభం, ప్రేరణ, ప్రేరేపణ, ప్రోత్సాహం
**induct** (పదవి/ఉద్యోగంలో) నియమించు/ నియోగించు; పరిచయం చేయు
**inductance** ప్రేరకత్వం
**induction** ప్రేరణ, సమీకరణం; అనుమానం; ప్రవేశం, నియామకం
**inductive method** ఆగమన పద్ధతి
**indulge** చనువిచ్చు, గారాబంచేయు, ముద్దు చేయు; సొంత కోరికలు తీర్చుకొను
**indulgence** చనువు, గారాబం, అనుగ్రహం, కోరికలు తీర్చుకోవటం; అతిలాలసత్వం
**indulgences** పాపపరిహార పత్రాలు
**induration** గట్టితనం, కాఠిన్యం
**Indus** బాణాసురుడు; సింధునది
**Indus valley** సింధునది పరివాహప్రాంతం
**industrial** పారిశ్రామిక
**industrial conflict** పారిశ్రామిక సంఘర్షణ
**industrial crisis** పారిశ్రామిక సంక్షోభం
**industrial depression** పారిశ్రామిక మాంద్యం
**industrial design** పారిశ్రామిక పథకం
**industrial dispute** పారిశ్రామిక వివాదం
**industrial estate** పారిశ్రామిక వాడ/వాటి(క)
**industrial finance corporation** పారిశ్రామిక ఆర్థికసహాయ సంస్థ
**industrial housing** పారిశ్రామిక గృహవసతి/ కార్మిక గృహవసతి (కల్పన)
**industrial lockout** పరిశ్రమ మూసివేత
**industrial peace** పారిశ్రామికశాంతి
**industrial relations** పారిశ్రామిక సంబంధాలు
**industrial statistics** పారిశ్రామిక గణాంకాలు
**industrial tribunal** కార్మిక/పారిశ్రామిక న్యాయస్థానం
**industrial truce** తాత్కాలిక పారిశ్రామిక శాంతి
**industrial undertakings** పారిశ్రామిక సంస్థలు
**industrial unrest** పారిశ్రామిక అశాంతి
**industrialisation** పారిశ్రామికీకరణ, పరిశ్రమల స్థాపన/విస్తరణ
**industrialism** పారిశ్రామికవాదం, (భారీ పరిశ్రమలకు ప్రాధాన్యమిచ్చే) పారిశ్రామిక సమాజ వ్యవస్థ
**industrialist** పారిశ్రామికవేత్త
**industrialize** పారిశ్రామికం చేయు, పరిశ్రమలు స్థాపించు/విస్తరించు
**industrious** శ్రమశీల, శ్రద్ధాళు, పాటుపడే, కష్టపడి పనిచేసే
**industry** పరిశ్రమ
**small scale cottage industry** చిన్నతరహా కుటీరపరిశ్రమ
**small scale industry** లఘు పరిశ్రమ
**inebriation** మత్తు, మైకం
**ineffective, ineffectual** నిరర్థక, నిరుపయోగకర, నిష్ప్రయోజనకర, వ్యర్థ, అప్రయోజక, ప్రభావశూన్య
**inefficiency** అసమర్థత, చేతగానితనం, అయోగ్యత, అప్రావీణ్యం



**inefficient** అసమర్థ, వ్యర్థ, అప్రయోజక, చేతగాని
**inelastic** స్థిర, అనిబద్ధ, అవ్యాకుచిత; మార్పు/ హెచ్చుతగ్గులు లేని
**inelastic demand** సడలని గిరాకీ
**inequalities** అసమానతలు
**inequitable** అన్యాయ, అనుచిత, అక్రమ, న్యాయవిరుద్ధ
**inequity** అన్యాయం, అధర్మం, అక్రమం, న్యాయవిరుద్ధత
**inert** జడ, మంద(కొడి)
**inertia** జడత్వం, మాంద్యం, మందకొడితనం
**inertness** స్తబ్ధత
**inevitable** అనివార్య, అవశ్యంభావి, తప్పనిసరి
**inexorable** కనికరంలేని, కఠిన, క్రూర, నిర్దయ, నిష్ఠుర
**inexpensive** చౌకఅయిన, ప్రియంకాని
**inexperience** అనుభవ రాహిత్యం/శూన్యత
**infalliability** అమోఘత్వం
**infalliable** అమోఘ, తప్పని
**infamous** అప్రతిష్ఠాకర, అపకీర్తి పాలైన; హేయ, గర్హనీయ, అసహ్య
**infamy** అపఖ్యాతి, అప్రతిష్ఠ, అపయశస్సు, అపకీర్తి
**infancy** శైశవం, శైశవావస్థ, బాల్యదశ
**infant** శిశువు
**infant, premature** నెలలునిండని శిశువు/బిడ్డ
**infanticide** శిశుహత్య
**infantile** శైశవ, శిశు సంబంధి
**infantilism** పసితనం వదలక/వీడక పోవడం
**infantry** పదాతిదళం, కాల్బలం
**infect** రోగం అంటించు; బాధించు; మూగు, ముసురు; పీడించు, వ్యాపించు
**infection** అంటురోగం; అంటువ్యాధి; క్రిమి దోషం, సంక్రమణ
**infections** అంటురోగాలు
**infectious disease** అంటురోగం, సాంక్రామిక వ్యాధి
**infectivity** రోగకారకత
**infer** ఊహించు, అనుమానించు
**inference** అనుమతి, ఊహ్యం, ఊహ, ఊహా సంబంధి; రాబట్ట దగినది
**inferential** ఊహా సంబంధి, ఊహాత్మక, అనుమితి(సంబంధి), ఊహ్యం
**inferior** కింది, తక్కువైన, అవర, నీచ, నిమ్న; అంతర; కింది ఉద్యోగి
**inferiority** న్యూనత, నీచత, హీనత
**inferiority complex** ఆత్మన్యూనతాభావం
**infernal** యాతనామయ, వేదనామయ, నరకంలాంటి
**infertile** గొడ్డుమోతు, వంధ్య, గొడ్రాలయిన; బంజరు, పండని
**infertility** వంధ్యత్వం
**infestation** క్రిమిబాధితత్వం, పురుగులతో బాధ పడటం
**infidel** అవిశ్వాసి, నాస్తికుడు; (క్రైస్తవ) మత విశ్వాసంలేనివ్యక్తి
**infidelity** అవిశ్వాసం, విశ్వాసరాహిత్యం, విశ్వాస ద్రోహం, నమ్మకద్రోహం, దాంపత్యద్రోహం
**infiltrate** చొరబడు, అక్రమంగా ప్రవేశించు
**infiltration** చొరబాటు, అక్రమ ప్రవేశం; ప్రసరణం
**infinite** అనంత, అసంఖ్యాక, అగణిత, అపార, అనిర్దిష్ట
**infinite dilution** అనంత జలీకరణం
**infinite mood** తుమర్థకం
**infinitesimal** అత్యల్ప, అత్యంత సూక్ష్మ, చాలాకొద్ది; సూక్ష్మరాశి
**infinity** అనంత(త్వ)ం
**infirm** అశక్త, దుర్బల, అస్థిర
**infirmary** వైద్యశాల
**infirmity** అశక్తత, దుర్బలత, అస్థిరత, అంగవైకల్యం
**infix** మధ్యప్రత్యయం
**inflammable** దహనశీల; మండే; పురికొల్పే; ఉద్రేకపరిచే
**inflammation** దాహం, శోథ, దహనగుణం; మంట, తాపం, బాధ
**inflammatory** బాధాకర, తాపకారి; దహనశీల, ఉద్రేకజనక
**inflate** గాలి ఊదు, ఉబ్బించు, పెంచు, విస్తరించు; (కృత్రిమంగా ధరలు)పెంచు
**inflated mileage** పెంచిన/పెరిగిన ప్రయాణదూరం
**inflated price** పెంచిన/పెరిగిన ధర
**inflater** వాయుపూరకం
**inflation** వాపు, ఉబ్బు, పొంగు; ద్రవ్యోల్బణం, నోట్ల ముమ్మరం, ధరల పెరుగుదల
**inflation of currency** నోట్ల ముమ్మరం
**inflationary** ఉల్బణాత్మక, ఉల్బణపూర్వక
**inflationary period** ఉల్బణకాలం

**inflationist** ద్రవ్యోల్బణవాది

**inflection** (నామ) విభక్తి

**inflict** (శిక్షలు, కష్టాలు మొ.) కలిగించు/కల్పించు, విధించు; (శిక్ష) విధించు, మోపు, రుద్దు

**infloresence** పుష్పగుచ్ఛం, పుష్పీకరణం

**influence** *n* పలుకుబడి, ప్రభావం, ప్రాబల్యం *v* ప్రభావితం చేయు, ప్రాబల్యం ఉపయోగించు

**influential** పలుకుబడిగల, ప్రబల

**influenza** విష పడిసెం, శీతల జ్వరం

**influx** (భారీ ఎత్తు) రాక/ప్రవేశం; (మహా)ప్రవాహం

**inform** తెలియజేయు, సూచించు

**informed sources** అభిజ్ఞవర్గాలు

**informal** ఇష్టాగోష్ఠి, లాంఛనప్రాయం/ఔపచారికం కాని, అసాంప్రదాయక, అనిర్ణీత, అనిశ్చిత

**informant** (interviewer, subject) వ్యవహర్త; సూచకుడు, వార్త అందించే/సమాచారంచెప్పే వ్యక్తి

**information** సమాచారం, వార్త

**information bureau** సమాచార శాఖ/విభాగం

**information centre** సమాచార కేంద్రం

**information officer** సమాచారశాఖాధికారి

**information service** సమాచార సేవ

**information service of India** భారత సమాచార విభాగం

**information technology** సమాచార సాంకేతికశాస్త్రం

**information theory** వార్తా/సమాచార సిద్ధాంతం

**informer** ఆచూకీదారు, సమాచార సూచకుడు

**infract** ఉల్లంఘించు, అతిక్రమించు; (అధికారం) అపహరించు

**infraction** ఉల్లంఘన, అతిక్రమణ, అపహరణ

**infrared rays** పరారుణ కిరణాలు

**infrastructure** అవస్థాపన

**infrequent** విరళ

**infringe** ఉల్లంఘించు, అతిక్రమించు; నిరసించు, నిరాదరించు; లక్ష్యపెట్టకుండు

**infringement** ఉల్లంఘన, అతిక్రమణ, నిరాసం, వ్యాఘాతం, నిరాదరణ, అలక్ష్యం

**infringing copy** అతిక్రామక/ఉల్లంఘిత ప్రతి

**infuriate** రెచ్చగొట్టు, ఉద్రేకపరచు, ఉత్తేజపరచు, కోపం తెప్పించు

**infuse** కలిగించు, పుట్టించు, కల్పించు

**infusion** కషాయం; శరీరంలోకి ద్రవమెక్కించటం

**ingenious** చతుర, కుశల, మేధాశాలి

**ingenuity** చాతుర్యం, కుశలత, మేధాశాలిత్వం

**ingenuous** అమాయిక, సరళ, భోళాభాళీ, సీదాసాదా, నిష్కపట

**ingestion** మింగటం, అంతర్గ్రహణం

**ingot** పాళం/పాళా, (లోహం కరిగించి చేసిన) కడ్డీ

**ingrained** అంతర్నిహిత, అభ్యస్త, సహజ, స్థిత, గత

**ingratiate** అనుగృహీతుడగు

**ingratitude** విశ్వాసద్రోహం, కృతఘ్నత, నమక్‌హరామీ

**ingredient** అంశం, భాగం; మసాలా (దినుసులు); వస్తుగతాంశం; చేర్చిన పదార్థం

**ingress** ప్రవేశం, ప్రవేశాధికారం; ప్రవేశించు

**inguinal** గజ్జకు సంబంధించిన

**inhabit** ఉండు, నివసించు, స్థావరం చేసుకొను

**inhabitant** నివాసి, వాస్తవ్యుడు, పౌరుడు, దేశస్థుడు

**inhalation** నిశ్వాసం, ఊపిరి పీల్చటం

**inhale** పీల్చు, విశ్వసించు

**inhaler** పీల్చటానికివాడే సాధనం

**inherent** నైసర్గిక, సహజసిద్ధ, స్వాభావిక, ప్రాకృతిక, స్వతస్సిద్ధ, స్వయంసిద్ధ, నైజమైన

**inherent right** జన్మసిద్ధమైన హక్కు, స్వతస్సిద్ధమైన/కులక్రమానుగతమైన హక్కు

**inherit** వారసత్వంగా పొందు, ఉత్తరాధికారంగా సంక్రమించు

**inheritance** వారసత్వం, సంక్రమణం

**inhibit** నిరోధించు, ఆటంకపరచు, అడ్డుపడు, ఆపు

**inhibition** నిరోధం, ఆటంకం, అడ్డు, ఆపుదల; అవరోధం; చురుకుదనం తగ్గించటం

**inhibitor** నిరోధకం, అవరోధకం; చురుకుదనం తగ్గించేది

**inhuman** అమానుష, పాశవిక

**inimical** శాత్రవ, విరుద్ధ, విపరీత, హానికర, అపకారి, నష్టదాయక

**iniquitous** న్యాయవిరుద్ధ, అన్యాయపూరిత, దుష్ట

**iniquity** న్యాయవిరుద్ధత, అధర్మం, అన్యాయం

**initial** *adj* తొలి, మొదటి, ప్రథమ, ప్రాథమిక, ఆది, పదాది *n* తొలిది; చేవ్రాలు, సంతకం *v* చేవ్రాలు చేయు, సంతకం పెట్టు; ఆరంభించు

**initiate** మొదలుపెట్టు, ఆరంభించు; నేర్పు, దీక్ష ఇచ్చు

**initiative** ప్రథమ యత్నం, ప్రారంభం, ఉపక్రమం; చొరవ, ప్రేరణ, ప్రోత్సాహం



**initiative step** ప్రారంభసోపానం

**initiator** ప్రారంభకం

**injection** సూదిమందు; సూది మందివ్వటం

**injection-intravenous** నరాల్లోకిచ్చే సూది మందు

**injunction** (కోర్టు) నిషేధాజ్ఞ/ఉత్తరువు; ఆదేశం

**injunctive mood** విధ్యర్థకం

**injure** గాయపరచు, చెరుపుచేయు, హాని చేయు, నష్టపరచు

**injurious** హానికర

**injurious falsehood** హానికర అసత్యరచన

**injury** దెబ్బ, గాయం; హాని, నష్టం

**injury, grievous** తీవ్రమైన/గాయపరిచే దెబ్బ

**injury, simple** సామాన్యమైన దెబ్బ/గాయం

**injustice** అన్యాయం, అధర్మం, అపకారం

**ink** సిరా

**inkling** జాడ, సూచన

**inland** *adj* దేశీయ, దేశస్థ, దేశంలోని *n* లోతట్టు, దేశాంతర్గతం, దేశమధ్యగతం, స్థలాంతర్గతం

**inland bill of exchange** దేశీహుండీ

**inland telegram** దేశీ(య) తంతి

**inland transport** దేశీయ రవాణా

**inland waterway system** దేశీయ జలమార్గ వ్యవస్థ

**inlet** ప్రవేశద్వారం

**inlet-pelvic** కటివలయ ద్వారం

**innate** సహజ (సిద్ధ), స్వభావసిద్ధ, జన్మసిద్ధ

**innate ability** అంతర్గత సామర్థ్యం

**inner** లోని, లోపలి, దాగిన, గుప్త; నిజమైన, అసలీ, అంతర్ (గత)

**inner logic** అంతర్గత తర్కం

**innervation** నాడీప్రసరణ

**inning** సముద్ర ప్రాప్తభూమి, పరశురామక్షేత్రం

**innocence** అమాయకత్వం, నిష్కపటత్వం, నిర్దోషిత్వం, నిరపరాధిత, నిష్పాపం

**innocent** అమాయక, నిష్కపట, నిరపరాధి, నిర్దోషి, నిష్పాపి; తెలియని వ్యక్తి

**innocuous** అపాయకరంగాని, హాని చేయని

**innovation** పరివర్తన, నవప్రవర్తనం, నవీకరణం; కొత్త మార్పు; ఆచార నవీకరణ

**innovative** నవప్రవర్తక

**innovative capacity** నవప్రవర్తన సామర్థ్యం

**innumerable** అగణిత, అసంఖ్యాత, లెక్కలేని

**inoculation** టీకాలు (వేయటం)

**inoffensive** హానిచేయని, అసహ్యకరం కాని, కోపం పుట్టించని

**inoperable** శస్త్రచికిత్స వీలుకాని; అకరణీయ, అప్రవృత్త, అనాచరణీయ

**inopportune** అకాలిక, అసమయ; అసందర్భమైన

**inordinate** అమిత, మితిమీరిన, అధిక

**inorganic** నిరింద్రియ, కర్బనేతర (సంబంధి)

**inorganic salt** నిరింద్రియ/నిరంగారక లవణం

**inorganic manure** రసాయనిక/కృత్రిమ ఎరువులు

**inoxidizable** అదాహ్య, అదహనీయ

**input** నివిష్టం; ఉత్పాదకం, సాధకం

**inquest** విచారణ, శవపంచాయితీ, దుర్మరణ కారణ విమర్శ

**inquire** విచారించు, ప్రశ్నించు, అడుగు, పరిశీలించు, పరిశోధించు

**inquiry** విచారణ, ప్రశ్న, పరిశీలన, పరిశోధన; దర్యాప్తు; అన్వేషణ

**inquisition** న్యాయ/అధికారిక విచారణ, అన్వేషణ, పరిశోధన

**inquisitive** ఉత్సుక, జిజ్ఞాసు, ఉత్సాహశీల

**inquisitor** పరీక్షకుడు, విచారణాధికారి

**inroad** దురాక్రమణ, ఆకస్మిక దాడి; ముట్టడి; అవాంతరం, చెరుపు, భంగం

**insane** పిచ్చి, వెర్రి, అవివేక

**insanitary** అశుభ్ర, అపరిశుభ్ర, దుర్గంధపూరిత

**insanity** పిచ్చి, వెర్రి, అవివేకత

**insatiable** అసంతుష్ట, అసంతృప్త; అత్యాశ/దురాశ/వ్యామోహం గల

**inscribe** చెక్కు, చిత్రించు, లిఖించు; కృతి ఇచ్చు, అంకితం చేయు

**inscribed** చెక్కిన, గండరించిన; అంతర్లిఖిత

**inscription** (శిలా)శాసనం; కృతి; అంకితం

**insect** పురుగు, కీటకం, క్రిమి

**insect-borne** కీటకవాహిత

**insect-repellant** కీటక సంహారి/నిరోధకం

**insecticide** క్రిమి సంహారి/సంహారకం

**insecure** భద్రతలేని, క్షేమ(కరం)కాని, అపాయకర

**inseminate** (వృక్షాదులకు) విత్తు; గర్భాదానం చేయు

**insemination** బీజారోపణం, గర్భాదానం; శుక్ర/వీర్య నిక్షేపణ(ం)

**artificial insemination** కృత్రిమ గర్భధారణ/బీజారోపణం
**insensible** అతీంద్రియ, అచేతన, అగోచర, స్మృతి లేని, మూర్ఛనొందిన, స్పృహ తప్పిన; అర్థం లేని/కాని, తెలియని; నిర్దయ, కఠిన, క్రూర, కఠోర
**insensitive** మొద్దుబారిన, జడ, మందబుద్ధి, అనుభూతి రహిత/శూన్య
**insert** చొప్పించు, ప్రవేశపెట్టు, దూర్చు, ఎక్కించు, గుచ్చు; (ఉద్యోగంలో) ప్రవేశపెట్టు; ప్రవిష్టి
**insertion** ప్రవేశనం, చేర్చటం, గుచ్చటం, దూర్చటం
**in-service** ఉద్యోగంలో ఉన్న, వృత్తిలో ఉన్న
**in-service teacher** ఉపాధ్యాయోద్యోగి
**in-service training** వృత్తిగతశిక్షణ
**inset** *n* నివిష్టం, అంతర్నిహితం *v* లోపల ఉంచు/పెట్టు
**inside** లోపలి(పక్క), లోతట్టు; కడుపు, గర్భం
**insidious** ప్రచ్ఛన్న, కపట, కృత్రిమ, మోసకారి
**insight** అంతర్దృష్టి, పరిజ్ఞానం, లోచూపు; తెలివి; ప్రావీణ్యం
***insignia*** బిరుదు, (అధికార) చిహ్నం/లాంఛనం
**insignificant** ప్రాముఖ్యంలేని, అప్రయోజక, నిరర్థక, వ్యర్థ, అల్ప
**insinuate** పుల్లలుపెట్టు, వ్యంగ్యంగా దూషించు; క్రమంగా/నేర్పుగా ప్రవేశపెట్టు, సూచించు, ఆరోపించు
**insinuation** సూచన, వ్యంగ్యదూషణ, దురారోపణ, బుజ్జగింపు, లాలన
**insipid** చప్పని, రుచిలేని, నిస్సార; చురుకుదనంలేని
**insist** నొక్కిచెప్పు, పట్టుబట్టు, హఠం చేయు, బలవంత పెట్టు, పిడివాదం చేయు
**insistence** పట్టు, హఠం, బలవంతం
***in situ*** సహజస్థితిలో, యథార్థస్థానంలో
**insolence** అవమానకర ప్రసంగం/కార్యం; కొవ్వు, తలపొగరు, అహంకారం, గర్వం
**insolent** పొగరుబోతు, కొవ్వెక్కిన, తలబిరుసు; మర్యాద తప్పిన
**insoluble** దృఢ, పరిష్కరించరాని; (నీటిలో) కరగని, అద్రావణ
**insolvency** దివాలా(కోరుతనం)
**insolvency petition** దివాలా దరఖాస్తు
**insolvent** దివాలాకోరు
**insomnia** నిద్రలేమి, అనిద్ర; నిద్రపట్టని రోగం
**inspect** తనిఖీచేయు, సోదాచేయు, పరీక్షించు, పరిశీలించు
**inspection** తనిఖీ, పరిశీలన, సోదా
**inspector** తనిఖీదారు, పరిశీలకుడు
**inspector of explosives** పేలుడు పదార్థాల తనిఖీదారు
**inspectorate** తనిఖీ/పరిశీలక కార్యాలయం
**inspiration** స్ఫూర్తి, ఉద్దీపనం, ఉత్తేజం, ప్రేరణ; దైవావేశం; శ్వాస, ఉచ్ఛ్వాస
**inspire** ఉచ్ఛ్వసించు; ప్రేరేపించు, ఉత్తేజపరచు, ఆవేశపెట్టు, స్ఫూర్తినిచ్చు, ప్రభావితం చేయు
**inspissated** చిక్కబడిన, ఘనీభూత
**inspissation** చిక్కబడటం, ఘనీభవనం
**instability** అస్థిరత, నిలకడలేమి, చంచలత
**install** నెలకొల్పు, స్థాపించు, ప్రతిష్ఠాపించు/ప్రవేశపెట్టు; పట్టం కట్టు
**installation** పట్టాభిషేకం, రాజ్యాభిషేకం; స్థాపన, నియామకం, అధినియామకం, ప్రతిష్ఠాపన
**installations** కర్మాగారాలు, (పారిశ్రామిక) నిర్మాణాలు/స్థావరాలు
**instalment** వాయిదా, కంతి, కిస్తీ
**instalment story** ఆంశికవార్త
**instance** ఉదాహరణ, దృష్టాంతం, నిదర్శన, మచ్చు; సంకేతం; వ్యాజ్యం; ప్రేరణ, ప్రోత్సాహం
**at the instance of** ప్రేరణతో, ప్రోత్సాహంవల్ల
**instant** క్షణం; నడుస్తున్న నెలలో (తేదీ); ప్రస్తుత, అగత్యమైన, అతిముఖ్యమైన
**instant history** తక్షణ చరిత్ర
**instantaneous** తక్షణ; వెంటవెంటనే
**instantly** వెంటనే, తక్షణం
**instead** బదులుగా, ప్రతిగా
**instigate** పురికొల్పు, ప్రోద్బలం/బలవంతం చేయు; దుష్ప్రేరణచేయు, ఉత్తేజపరచు; (హత్య) చేయించు
**instigation** దుష్ప్రేరణ, పురికొల్పటం, ఉత్తేజనం
**instil(l)** నింపు, (క్రమంగా) మనసులో చొప్పించు, నేర్పించు
**instillation** (మందు) చుక్కలు వేయటం
**instinct** సహజజ్ఞానం, (స్వాభావిక) ప్రవృత్తి; ప్రకృతి, సహజబుద్ధి, అంతఃప్రేరణ, పశుబుద్ధి; సహజాతం
**institute** *n* సంస్థ; శాస్త్రం, సిద్ధాంతం



*v* ప్రారంభించు, స్థాపించు; నియమించు, నియోగించు, నిర్ణయించు, మొదలుపెట్టు, (విచారణ) ఆరంభించు
**institute of oriental studies** ప్రాచ్యవిద్యా సంస్థ
**institution** సంస్థ, (ధర్మ) సత్రం; ఆరంభం; నియమం, నిబంధన
**institutional evaluation** సంస్థాగత మూల్యాంకనం
**institutionalism** వ్యవస్థావాదం
**institutionalize** వ్యవస్థీకరించు
**instruct** నేర్పు, బోధించు, ఉపదేశించు, శిక్షణ ఇచ్చు; ఆదేశించు, ఆజ్ఞాపించు, ఉత్తరువిచ్చు
**instruction** ఉపదేశం, బోధన, చదువు; సూచన, ఉత్తరువు, ఆజ్ఞ, ఆదేశం
**instructional card** సూచనపత్రం
**instructional factor** బోధన (సంబంధి) కారకం
**instructional system** బోధనవ్యవస్థ
**instructor** బోధకుడు, శిక్షకుడు, అధ్యాపకుడు, గురువు
**instrument** పరికరం, పనిముట్టు, సాధనం, ఉపకరణం; యంత్రవాద్యం; ఆయుధం, దస్తావేజు, అధికారపత్రం
**instrument of accession** విలీనపత్రం
**instrument of ratification** ధ్రువీకరణపత్రం
**instrumental** సాధక, సాధ్యమైన; కారణమైన, హేతువైన
**instrumental case** తృతీయా విభక్తి, కరణకారకం
**instrumental music** వాద్యసంగీతం
**instrumental phonetics** ప్రాయోగిక ధ్వనిశాస్త్రం
**intrumentality** సహకారిత, సాధ్యంగా ఉండటం
**instrumentation** సాధననిర్మాణం
**insubordination** అవిధేయత, అవినయం, ఆజ్ఞాధిక్కారం
**insufficient** చాలని, సరిపోని, తక్కువైన, అల్ప
**insufflation** గాలికొట్టడం
**insular** సంకీర్ణ; ద్వీపసంబంధి
**insulation** వ్యాప్తినిరోధకం; విద్యుద్బంధనం; రక్షణకవచం; పృథక్కరణ, ఏకాకిత్వం, వేర్పాటు
**insulator** విద్యుద్బంధకం
**insult** *n* అవమానం, అనాదరణ, తిరస్కారం, నింద, పరాభవం *v* అవమానించు, అనాదరించు, దూషించు, తిరస్కరించు
**insuperable** అలంఘ్య, అసాధ్య, దాటరాని
**insurance** బీమా
**insurance policy** బీమాపాలసీ
**insure** బీమా చేయు/చేయించు
**insurgence** తిరుగుబాటు, విద్రోహం
**insurgent** *adj* తిరగబడే, విద్రోహకర *n* విద్రోహి, తిరుగుబాటుదారు
**insurrection** తిరుగుబాటు, విద్రోహం, విప్లవం; ఎదిరింపు, దొమ్మి
**intact** చెక్కుచెదరని, అంటని, తాకని; అఖండ
**intake** అంతర్గ్రహణం; చిమ్మనగొవి, వంపుకొన; (గదిలోకి) గాలి వచ్చే ద్వారం; లోపలికి తీసుకోవటం
**intake capacity** అంతర్గ్రహణసామర్థ్యం
**intangible** అస్పష్ట, అగ్రాహ్య, నిరాకార, అతిసూక్ష్మ; తాకరాని, స్పర్శజ్ఞానంలేని
**integer** పూర్ణాంకం
**integral** పూర్ణాంక ప్రమేయం, అభిన్నాంకం; పూర్ణ(ం), మొత్తం; ముఖ్య(ం), అంగభూత(ం)
**integrally** మొత్తంమీద
**integrate** ఏకీకరించు, జోడించు, కలుపు
**integrated** ఏకీకృత, సమాకలిత
**integrated approach** సమగ్ర/ఏకీకృత విధానం
**integrated child development scheme** సమగ్ర శిశువికాస పథకం
**integrated circuit** ఏకీకృత విద్యుద్వలయం
**integrated programme** సమగ్ర/ఏకీకృత పథకం/కార్యక్రమం
**integrated projects** సమగ్ర/ఏకీకృత ప్రణాళికలు
**integration** ఏకీకరణ; విలినీకరణం, విలీనత, సమైక్యం; సమన్వయం, సంఘటన
**integration of services** (ప్రభుత్వ) సేవల ఏకీకరణ
**integration phase** సమైక్య/విలీన దశ
**integrative** సమగ్ర, ఏకీకారక, విలీనక
**integrity** న్యాయవర్తన, నైతిక నిష్ఠ, చిత్తశుద్ధి, సరళత, నిష్కాపట్యం, సజ్జనత్వం, నీతి
**integument** పొర, త్వచం, స్తరం, అండచ్ఛదం
**intellect** తెలివి, బుద్ధి, వివేకం, మేధ, జ్ఞానం, ప్రతిభ; గ్రహణశక్తి
**intellectual** బౌద్ధిక, మేధాసంబంధి; బుద్ధిజీవి, మేధావి

**intellectual centre** బౌద్ధికకేంద్రం
**intellectual creation** బౌద్ధికకల్పన
**intellectual deviates** ప్రజ్ఞావిచలితులు
**intellectual property** బౌద్ధిక సంపద
**intellectually superiors** ప్రజ్ఞాధికులు
**intelligence** తెలివితేటలు, తెలివి, జ్ఞానం, వివేకం, చాతుర్యం; రహస్యసమాచారం; ప్రజ్ఞ
**intelligence bureau** రహస్యసమాచార విభాగం
**intelligence quotient** ప్రజ్ఞాలబ్ధి
**intelligent** బుద్ధిశాలి, మేధావి, వివేకి, చతురుడు, సూక్ష్మబుద్ధి; తెలివిగల
***intelligentsia*** బుద్ధిజీవులు, మేధావివర్గం
**intelligible** విశదమైన, అర్థమయ్యే, స్పష్ట, సుగమ
**intemperance** అతివ్యామోహం; తాగుబోతుతనం; అ(పరి)మితత్వం, మితిలేమి
**intemperate** మితిలేని, అ(పరి)మిత
**intend** ఉద్దేశించు, అభిలషించు, కోరు, ఆలోచించు, ఇష్టపడు
**intending** ఉద్దిష్ట, అభిలషిత, కోరే, ఇష్టపడే
**intense** అతి, మహా, ప్రబల, అధిక, అత్యంత, తీవ్ర, తీక్ష్ణ, కఠిన, సాంద్ర
**intensify** పెంచు, తీవ్రీకరించు, సాంద్రతరం చేయు
**intensive** తీవ్ర (తర), ఉగ్ర, సాంద్ర; లోతైన, దట్టమైన
**intensive and extensive cultivation** సాంద్ర విస్తృత వ్యవసాయం
**intensive cultivation** సాంద్రవ్యవసాయం
**intensive education** సాంద్ర విద్యావిధానం
**intent** *adj* స్థిర, కేంద్రీకృత *n* ఉద్దేశం, సంకల్పం, ఆశ్రయం, భావన, తాత్పర్యం
**intention** అభిప్రాయం, భావం, ఉద్దేశం, సంకల్పం, అభిమతం, ఇష్టం
**intentional** బుద్ధిపూర్వక, ఉద్దేశపూర్వక
**intentional meaning** ఇష్టార్థం, అభిప్రేతార్థం
**intentionally** ఉద్దేశ/బుద్ధి పూర్వకంగా
**inter** అంతర్/అంతర
**inter cultivation** అంతర కృషి/వ్యవసాయం
**inter-dialectal** అంతర్మాండలిక, మండలాంతర
**inter-digital** వేళ్ల మధ్య
**inter disciplinery** బహుశాస్త్రాంతర
**inter-sex** ఉభయలింగత
**inter-state** అంతర్రాష్ట్ర/అంతారాష్ట్ర
**inter-vocalic** అజ్మధ్య
**interact** ప్రవేశకం, విష్కంభం; ప్రతిస్పందించు, ప్రభావితం చేయు
**interaction** అన్యోన్య/పరస్పర క్రియ/చర్య, సహచర్య; ప్రతిస్పందన; మిథశ్చేష్ట
**interactive** అన్యోన్య/పరస్పర ప్రభావశాలి/ ప్రభావశీలి; పారస్పరిక
**intercaste marriage** కులాంతర/వర్ణాంతర వివాహం
**intercede** (ఒకరికి) అడ్డుపడు; (ఒకరికోసం) బతిమాలు, (మరొకరి కోసం) సిఫారసుచేయు
**intercellular** కణాంతర
**intercept** అంతరఖండం, అంతఃఖండం; అడ్డుకొను, దారిలో పట్టుకొను, మధ్యలో ఆపివేయు, నిలిపివేయు, నిరోధించు
**interception** అవరోధం, అడ్డుపడటం, నిరోధం
**intercession** ఒకరికి అడ్డుపడటం; మధ్యస్థం, మధ్యవర్తిత్వం; రాయబారం; మనవి, వేడుకోలు
**interchange** వినిమయం, ఆదాన ప్రదానాలు, ఇచ్చిపుచ్చుకోలు, మార్పిడి, పాటా బేరం
**intercoastal** పక్కఎముకలమధ్య; తీరాంతర
**intercontinental ballistic missile** ఖండాంతర క్షిపణి
**intercourse** లావాదేవీ; సంపర్కం, సంసర్గం; రాకపోకలు, సంబంధం; వాణిజ్యం; సమాగమం, సంభోగం
**intercourse, sexual** మైథునం/సంభోగం
**interdental** అంతర్దంత్య
**interdependence** పరస్పరాలంబనం, పరస్పరాధీనత, అన్యోన్యాశ్రయం
**interdict** నిషేధించు, వెలివేయు; నివారించు, అడ్డుపడు
**interest** అభిరుచి/ఆసక్తి, స్వార్థం/లాభం, ప్రయోజనం/ప్రమేయం
**vested interests** స్వార్థపరులు, స్వప్రయోజనాలు, స్వార్థాలు
**interested** అభిరుచి/ఆసక్తి గల, స్వార్థం/లాభం గల, ప్రయోజనం/ప్రమేయం గల
**interesting** ఆసక్తిదాయక, సంతోషప్రద
**interface** మధ్యవర్తి, వినిమయసీమ
**interfere** అడ్డంవచ్చు, జోక్యం చేసుకొను, జోలికిపోవు, మధ్య(లో)ప్రవేశించు
**interference** జోక్యం, అడ్డంకి, అడ్డుబాటు, అంతరాయం



**interferometer** వ్యతికరణ మాపకం
**interflow** అంతఃప్రవాహం; కలిసి ప్రవహించు
**intergraph** అంతర్లేఖ
***interim*** *adj* తాత్కాలిక, మధ్యకాలిక/మధ్యంతర *n* అవకాశం, అవసరం, మధ్యకాలం
**interim relief** తాత్కాలిక సహాయం
**interim report** తాత్కాలిక నివేదిక
**interior** *adj* లోపలి, లోతట్టు; దేశీయ, దేశవ్యవహారాల *n* లోతట్టు/లోపలి భాగం, మధ్యభాగం, గర్భం
**interjection** ఆశ్చర్యార్థకం
**interlink** రెంటిని కలుపు, జోడించు, సంధించు; అంతస్సంబంధం
**interlock** ఒకదానితో మరొకటి కలుపు/ జోడించు, ఒకచోట కలిపివేయు
**interlocutory** మధ్యకాలిక, మధ్యంతర, (తాత్కాలిక)
**interloper** అక్రమప్రవేశం/అన్యాయాక్రమణ చేసే వ్యక్తి, అనుమతిలేకుండా వ్యాపారంచేసే వ్యక్తి
**interlude** విష్కంభం, విశ్రాంతి, విరామ (సమయ)ం; (నాటకంలో) రెండంకాలమధ్య ప్రదర్శనం, ఉపనాట్యం
**intermarriage** ఇతరేతర/వర్ణాంతర/జాత్యంతర వివాహం, వియ్యం, ఇచ్చిపుచ్చుకోళ్లు
**intermeddle** (మధ్యలో) తలదూర్చు
**intermediary** మధ్యస్థ, మధ్యవర్తి, నడిమి; మధ్యస్థుడు, మధ్యవర్తి, మధ్యస్థితుడు
**intermediate** నడిమికాలపు, మధ్యంతర, మధ్యస్థ
**intermediate range weapon** దేశాంతరగామి క్షిపణి (1500 కి.మీ. పోగల క్షిపణి)
**interminable** అనంత, అనవరత, తుదిముట్టని, ఎడతెగని, తీరని
**interministerial committee** వివిధ మంత్రి వర్గాల (సమన్వయ) సంఘం
**intermittent** సవిరామ, విడిచివిడిచి వచ్చు, మధ్య మధ్య ఆగే
**intermolecular** అంతరణు
**intern** స్థానబద్ధం చేయు, కాందిశీకులుగా ఉండు; (ఆసుపత్రిలో పనిచేసే) వైద్యవిద్యార్థి
**internship** వైద్యశిక్షణ(లో ఒక దశ)
**internal** అంతర, అభ్యంతర, అంతర్గత, లోని, ఆంతరంగిక, దేశీయ
**internal assessment** అంతర్గత పరీక్షణం
**internal change** అంతర్విపరిణామం
**internal command** అంతర్గతాదేశం
**internal exam(ination)** అంతర్గత పరీక్ష
**interal sandhi** పదమధ్య సంధి
**internalisation** అంతరీకరణ
**internally** అంతర్గతంగా
**international** అంతర్జాతీయ
**international atomic energy agency** అంతర్జాతీయ అణుశక్తి సంస్థ
**international bank, world bank** అంతర్జాతీయ (ప్రపంచ) బ్యాంకు
**international bank for reconstruction and development** అంతర్జాతీయ పునర్నిర్మాణ, అభివృద్ధి బ్యాంకు
**international city** అంతర్జాతీయ నగరం
**international civil aviation organisation** అంతర్జాతీయ పౌరవిమానయాన సంస్థ
**international committee of the red cross** అంతర్జాతీయ రెడ్‌క్రాస్ సంస్థ సమితి
**international court of justice** అంతర్జాతీయ న్యాయస్థానం
**international geophysical year (IGY)** అంతర్జాతీయ భూభౌతిక సంవత్సరం
**international labour organisation** అంతర్జాతీయ కార్మికసంస్థ
**international law commission** అంతర్జాతీయ న్యాయ సంఘం
**international monetary fund** అంతర్జాతీయ ద్రవ్యనిధి
**international telecommunication union** అంతర్జాతీయ టెలీకమ్యూనికేషన్ సంస్థ
**international union of official travel organisations** అంతర్జాతీయ అధికారిక యాత్రాసంఘసమాఖ్య
**international waterways** అంతర్జాతీయ జలమార్గాలు
**international zone** అంతర్జాతీయ మండలం
**internationalise** అంతర్జాతీయం చేయు
**internecine** పరస్పర విధ్వంసక/వినాశకారి
**internet** అంతర్జాలకం
**internet technology** అంతర్జాలక సాంకేతికత
**internment** (గృహ) నిర్బంధం; స్థానబద్ధత
**internode** కణుపులమధ్యనున్న

**internship** శిక్షణ దశ/స్థితి
**interparliamentary** వివిధ పార్లమెంటులకు/ చట్టసభలకు చెందిన
**interpellate** (పార్లమెంటులో మంత్రిని) ప్రశ్నించు/సంజాయిషీ అడుగు, సమాధాన మడుగు, అవాంతరంగా ప్రశ్నించు
**interpellation** అదనపు సమాచారంకోసం (చట్ట సభలో) వేసే (అనుబంధ) ప్రశ్న
**interpersonal relations** మానవ సహ సంబంధాలు
**interpetiolar** అంతరపత్రరంధ్రం
**interplanetary** గ్రహాంతర, భిన్నగ్రహమధ్య
**interplead** (హక్కుదార్ల) నిర్ధారణకోసం దావా వేయు
**interpleader** నిర్ధారణ దావా/వ్యాజ్యం వేసిన వ్యక్తి
**interpolate** మధ్యలో చేర్చు, ప్రక్షిప్తం చేయు
**interpolation** ప్రక్షిప్తం, ప్రక్షిప్తాంశం; చేర్పు
**interpose** కలగజేసుకొను, అడ్డుపడు, విఘ్నం కలిగించు, (వాదం మధ్య) జోక్యం చేసుకొను
**interpret** వివరించు, వ్యాఖ్యానించు, అర్థం చెప్పు, అర్థ నిర్ణయం చేయు, బోధపరచు, అనువదించు
**interpretation** నిరూపణ(ం), వ్యాఖ్యానం, వివరణ, గూఢార్థం చెప్పటం; భాషానువాదం; ప్రతిక్షేపణ
**interpretor** దుబాసీ; వ్యాఖ్యాత, వివరణకర్త, భాష్యకారుడు
**interprovincial** అంతర్రాష్ట్రీయ (అంతారాష్ట్రీయ)
***interregnum*** అరాజకసమయం, రాజులేని కాలం, రాజ్యాధికార విరామకాలం
**interrelation** పరస్పర/అన్యోన్య సంబంధం
**interrogate** ప్రశ్నించు, (ప్రశ్నలద్వారా) పరీక్షించు/ విచారించు, సమాచారం సేకరించు
**interrogation** ప్రశ్న, విచారణ, సమాచార సేకరణ
**interrogative** ప్రశ్నవాచకం
**interrogatory** ప్రశ్నార్థక(ధ్వని); (న్యాయ విచారణ సందర్భంలో వేసే) ప్రశ్న
**interrupt** భంగం చేయు, అడ్డుపడు, అడ్డగించు, అభ్యంతరం చెప్పు, ఆటంకపరచు, విఘ్నం కల్గించు, విచ్ఛేదం చేయు
**interruption** విఘ్నం, విఘాతం, అవరోధం, అడ్డంకి, ఆటంకం, విచ్ఛేదం
**intersect** విభజించు, ఛేదించు, కోయు; అడ్డగీత గీయు
**intersection** కూడలి; విభజన, ఖండం
**interspace** అంతరవకాశం
**intersperse** కలిపివేయు, వెదజల్లు, విరజిమ్ము
**interstetial space** అల్పాంతరాళ స్థలం
**interval** ఎడం, విరామం, అంతరం, అవకాశం, ఎడబాటు, వ్యవధానం, మధ్యకాలం, వ్యవధి
**interval and ratio variables** వ్యవధినిష్పత్తి చలరాశులు
**interval, lucid** నిరున్మాద స్థితి; సంధివిరామ స్థితి
**intervene** కలిగించుకొను; మధ్యలో జోక్యం వచ్చు
**intervene in the discussion** చర్చలో కల్పించుకొను
**intervention** ప్రమేయం, మధ్యవర్తిత్వం; అంతరాయం, అడ్డంకి, జోక్యం
**interventionist** అంతరాయవాది; జోక్యం కల్పించుకొనే వ్యక్తి
**intervertebral** ఉపాస్థి
**interview** *n* భేటీ, సమావేశం, పరిపృచ్ఛ, సందర్శన *v* భేటీ చేయు, సమావేశమగు, సందర్శించు
**interviewee** (subject, informant) వ్యవహర్త
**interweave** కలిపివేయు, కలుపు, జోడించు, కూర్చు; లోనేత నేయు
**interzonal movement** అంతర్మండల ప్రయాణం/వ్యాపారం/గమనం/చలనం
**intestable** వీలునామాలేని
**intestate** వీలునామా రాయని; వీలునామా రాయకుండా మరణించిన (వ్యక్తి)
**intestate succession** వీలునామాలేని వారసత్వం/పారంపర్యం
**intestinal** ఆంత్ర సంబంధి
**intestine** పేగు, ఆంత్రం
**intestine, large** పెద్ద పేగు
**intestine, small** చిన్న పేగు
**intestines** పేగులు, ఆంత్రం
**intimacy** సాన్నిహిత్యం, ఆత్మీయత, దగ్గరి పరిచయం, స్నేహం, మైత్రి; అన్యోన్యత, ఒద్దిక
**intimate** *adj* సన్నిహిత, సుపరిచిత, ఆంతరంగిక *n* ఆప్తుడు, ఆంతరంగికుడు, ఆత్మీయుడు
**intimation** జాడ, ఎరుక; సూచన, సంకేతం; సమాచారం; ప్రకటన
**intimation slip** సమాచార పత్రం/ప్రకటన
**intimidate** జడిపించు, దడిపించు, బెదిరించు, భయపెట్టు



**intimidation** దడుపు, జడుపు, బెదురు, భయం, బెదిరింపు
**intolerable** సహించరాని, అసహనీయ, దుర్భర, ఓర్వలేని
**intolerance** అసహనం, అసహిష్ణుత, ఓర్వలేనితనం
**intonation** తానకల్పన; (ఉదాత్త)స్వరం, ఉచ్చారణ, తానం
***in toto*** సంపూర్తిగా, సాకల్యంగా
**intoxicant** *adj* మాదక, మత్తు పుట్టించే *n* మద్యం, మాదకపదార్థం, మత్తు పదార్థం
**intoxicate** మత్తెక్కించు, సొక్కించు, సోలించు, మైమరిపించు
**intoxication** మత్తు, సొక్కు, సోలుడు, మైమరపు
**intra** స్థ, అంతర్గత, అంతః, లోని, లోపలి
**intra-abdominal** కడుపులోని, గర్భస్థ
**intra-cardiac** గుండెలో, హృదయస్థ
**intra-cellulor** అంతఃకణ, కణాంతర్గత
**intra-cranial** కపాలాంతర్గత
**intra-nasal** ముక్కులోని, నాసికాంతర్గత
**intractable** తేలని, లొంగని, దోవకురాని, స్వాధీనం కాని, అవిధేయ, కఠిన, మూర్ఖ
**intracutaneous** చర్మంలోపలి(కి)
**intradermally** చర్మాంతర్గతంగా
**intramolecular** అణ్వంతర్గత
**intramuscular** కండరంలోనికి (ఇచ్చే)
**intransigence** రాజీలేమి, సయోధ్యలేమి; బద్ధ వ్యతిరేకత/శత్రుత్వం
**intransitive** అకర్మక
**intraocular** కంటిలోని
**intrasentential** వాక్యగత
**intrastate** రాష్ట్రంలోపలి
**intrauterine** గర్భాశయంలోని
**intravascular** రక్తనాళంలోని
**intravenous** సిరలోని(కి)
***intra vires*** న్యాయవిహిత, శాసనబద్ధ, చట్టసమ్మతమైన; నియమిత
**intrepid** నిర్భయ, నిర్భీక, శౌర్యవంత, సాహసంగల
**intricacy** చిక్కు, జటిలత, సంకటం, క్లిష్ట పరిస్థితి
**intrigue** *n* కుట్ర, కుతంత్రం, ఎత్తుగడ; కృత్రిమత; (రచన విషయంలో)సరణి, చమత్కారం
**intrinsic** సహజ, స్వాభావిక, నిజ, స్వతస్సిద్ధ, ముఖ్య, అంతర్గత; నికరమైన
**intrinsic value** వాస్తవిక/స్వతస్సిద్ధ మూల్యం, నిజమైన/సహజమైన విలువ
**intro**(=lead) పరిచయం
**introduce** ప్రవేశపెట్టు, చొప్పించు; పరిచయం చేయు, వాడుకలో పెట్టు, ప్రారంభించు
**introduction** పరిచయం, ఉపోద్ఘాతం, ఆముఖం, ప్రవేశిక, అవతారిక, ప్రస్తావన, ప్రతిపాదన; మున్నుడి, తొలి పలుకు, ముందుమాట; పీఠిక
**introductory** ప్రాస్తావిక; పరిచయపూర్వక, ప్రవేశపెట్టే
**introitus** యోనిద్వారం
**introspection** అంతర్ముఖత్వం, అంతర్దర్శనం, అంతర్దృష్టి, ఆత్మనిరీక్షణ
**introspective** అంతర్ముఖ
**introversion** అంతర్ముఖత
**introvert** అంతర్ముఖుడు, క్రియాశూన్యుడు
**intrude** చొరబడు, బలవంతంగా/అధికారం లేకుండా ప్రవేశించు, ఆహ్వానం లేకుండా వచ్చు, చొచ్చుకొనిపోవు
**intruder** చొరబడే వ్యక్తి, అనాహూతుడు, అనధికారవిష్టుడు, చొరబాటుదారు
**intrusion** చొరబాటు, అనధికార ప్రవేశం, అనుచిత ప్రవేశం, అనాహూత ప్రవేశం
**intrusive** ఆగంతుక, అనాహూత, అనుచిత
**intubation** గొట్టం వేయటం
**intubation, endotracheal** శ్వాసనాళంలో గొట్టం వేయటం
**intuition** సహజ జ్ఞానం, అంతర్దృష్టి; దివ్యజ్ఞానం; అంతర్బుద్ధి
**intuitionism** సహజజ్ఞానవాదం
**intuitive** సహజజ్ఞానం ద్వారా/సులభంగా తెలుసుకొనే
**intuitive stage** అంతర్బుద్ధిదశ
**intumescence** ఉబ్బు
**intussuception** అంతరాంతర ప్రవేశం
**inunction** మర్దన
**inundate** ముంచు, ముంచివేయు, ముంచెత్తు, జలమయం చేయు
**inundation** (నీటి) ముంపు, వరద, వెల్లువ, పొర్లు; జలప్రళయం
**invade** ముట్టడించు, దండెత్తు, దాడిచేయు, ఆక్రమించు
**invader** ముట్టడిదారు, దండెత్తిన/దాడిచేసిన వ్యక్తి, ఆక్రమయిత
**invagination** అంతర్వర్తనం

**invalid** *adj* చెల్లని; దుర్బల, సారహీన; నిరుపయోగ(కర), రద్దయిన *n* బలహీనుడు, దుర్బలుడు, రోగి; చెల్లమి, సారహీనం, చెల్లుబాటు లేమి
**invalidate** చెల్లకుండా చేయు, రద్దుచేయు; అశక్తుని చేయు, దుర్బలీకరించు
**invalidism** అశక్తత, దౌర్బల్యం
**invaluable** అమూల్య, వెలకట్ట లేని/రాని; గొప్ప, ఘనమైన, శ్రేష్ఠ
**invariable** అచల, అవికారి, స్థిర
**invariant** స్థిరరాశి
**invasion** ప్రసారం; దండయాత్ర, దురాక్రమణ, ముట్టడి, దాడి
**invective** పరుషోక్తి, నింద, దూషణ
**inveigle** వంచించు, మోసగించు, ప్రలోభపెట్టు; దారి మళ్లించు, (బుజ్జగించి) మోసపుచ్చు
**invent** కనుగొను, కల్పించు, సృష్టించు, ఆవిష్కరించు
**invention** నవకల్పన, సృష్టి, ఆవిష్కరణ
**inventory** జాబితా, పట్టిక, లిస్టు, శోధిక
**inventory, phonemic** వర్ణసమామ్నాయ పరిగణన
**inverse** విలోమ, తలకిందులు, విపరీత
**inverse ratio** విలోమానుపాతం
**inverse spelling** విలోమాక్షరక్రమం
**inversely** విలోమంగా, తలకిందులుగా, విపరీతంగా
**inversely proportional** విలోమానుపాతంలో
**inversion** విలోమత, తలకిందులుగా ఉండటం/ఉంచటం
**invert** బోర్లించు, తలకిందులు చేయు, వెనుక ముందులు చేయు, విలోమీకరించు
**inverted pyramid** గరాటా/మిఠాయి పొట్లం (రూపం)
**inverted sentence** తలకిందులు వాక్యం
**inverted speech** విపరీత భాషణం
**invertebrate** అకశేరుక(ం)
**invertebrator** అకశేరుకం
**inveryendo** విలోమానుపాతక్రియ
**invest** (పెట్టుబడి) పెట్టు; అధికారమిచ్చు; పట్టం కట్టు; ఆవరించు, చుట్టుముట్టు
**investigate** దర్యాప్తు చేయు, ఆరా/ఆచూకీ తీయు; విచారించు, విమర్శించు, పరిశీలించు, పరిశోధించు
**investigation** దర్యాప్తు, ఆరా/ఆచూకీ తీయటం, విచారణ
**investment** పెట్టుబడి
**investor** పెట్టుబడిదారు
**inveterate** మొండి (బారిన), ముదిరిన, సుదృఢ, స్థిరపడ్డ; దీర్ఘ (కాలిక), అనాదిసిద్ధ
**invidious** ఇమడని, ఈర్ష్య/ద్వేషం పుట్టించే, విరోధించే, అసూయాజనక
**invigilate** పర్యవేక్షించు, నిఘా ఉంచు/పెట్టు
**invigorate** సత్తువనిచ్చు, ప్రాణం పోయు, పుష్టినిచ్చు; త్రాణ/బలం ఇచ్చు
**invincible** అజేయ, అసాధ్య, జయించరాని
**inviolable** దాటరాని, మీరరాని, అలంఘ్య, అనుల్లంఘనీయ; చెరచరాని, విడవగూడని
**invisible** కానరాని, కనిపించని, మాయమైన, అదృశ్య, అగోచర
**invisible export** కానరాని ఎగుమతి
**invisible import** కానరాని దిగుమతి
**invisible trade** అదృశ్యవ్యాపారం
**invitation** ఆహ్వానం, ఆమంత్రణం, పిలుపు
**invite** పిలుచు, ఆహ్వానించు, ఆమంత్రించు, ఆశపుట్టించు, ఆకర్షించు
**invocation** ఆవాహన, ఆమంత్రణం, ప్రార్థన, ఆహ్వానం; ధ్యాన/మంగళ శ్లోకం, నాందీ శ్లోకం; యాచన
**invoice** చెలానా, ధరలపట్టీ, సరుకులజాబితా; బీజ్జ
**invoke** వేడుకొను; ప్రార్థించు, విన్నవించు, ఆమంత్రించు
**involuntary** అసంకల్పిత, అనైచ్ఛిక, అనిచ్ఛుక, అప్రయత్న, బుద్ధిపూర్వకం/ఇచ్ఛాపూర్వకం కాని; మనసులేని, అసమ్మత
**involution** మెలి తిరగటం; అవయవం సహజ పరిమాణానికి రావటం; ఘాతక్రియ
**involve** చిక్కుకొను, చిక్కించుకొను; కలుపు, లోబరచు
**involvement** సంబద్ధత, సంలగ్నత
**inward** లోపలివైపు
**inwardness** అంతర్ముఖత్వం, అంతర్దృష్టి
**ionisation** అయనీకరణం
**ionize** అయనీకరించు
**ionosphere** అయాన్ ఆవరణం
**ions-ionisation** అయాన్ల అయనీకరణం
***ipso facto*** స్వతహాగా, వాస్తవాన్నిబట్టి, వ్యవహార స్వభావాన్నిబట్టి; స్వయంగా, ఆ విషయం/చర్య వల్లనే



**iridectomy** కృష్ణపటల విచ్ఛేదనం
**iridescence** బహువర్ణ ప్రకాశం
**iridiscent** బహువర్ణయుక్త, ఇంద్రధనురాకారి
**iridotomy** కృష్ణపటలచ్ఛేదనం
**iris** కనీనికా (పటలం), కృష్ణ (పటలం), నల్లకనుగుడ్డు
**iritis** కృష్ణపటల శోథ
**irksome** విసిగించే, ఏహ్య, అసహ్యకర, చీదరపెట్టే, పీకులాటమారి, కష్టదాయక
**iron** లోహం, ఇనుము; ఇస్త్రీపెట్టె
**iron age** లోహయుగం, అయోయుగం
**iron, cast** పోత ఇనుము
**iron curtain** ఇనపతెర (రష్యా, తదితర కమ్యూనిస్టు రాజ్యాలు)
**too many irons in the fire** పని ఒత్తిడి, ఊపిరాడని పని
**irony** వక్రోక్తి, నిందాస్తుతి
**irony of fate** విధివిపాకం, దురదృష్టం, హతవిధి
**irradiated** కిరణీకృత
**irradiation** కిరణీకరణం, ఉద్యోతనం; ప్రభ, దీప్తి, కాంతిప్రసారం; (ఆత్మ) జ్ఞానం; రోగ నివారణకు ఎక్స్‌రే వాడుక
**irrational** అవివేక, హేతురహిత, నిర్హేతుక, అసంబద్ధ
**irreconcilable** పొసగని, విరుద్ధ, వ్యతిరేక, సమాధాన పరచటం సాధ్యంకాని
**irreducible** తక్కువలో తక్కువ, తగ్గించ వీలుగాని, మార్చరాని, సూక్ష్మ
**irregular** అ(ప)క్రమ, క్రమరహిత, నియమ విరుద్ధ, అవ్యవస్థిత, అస్తవ్యస్త; అదుపులేని, వేళ తప్పిన
**irregular point sampling** క్రమరహిత బిందు సంచయనం
**irregularity** అ(ప)క్రమం, నియమరాహిత్యం, అవ్యవస్థ, అస్తవ్యస్తత
**inrrelevant** అసందర్భ, అసంబద్ధ, అసంగత; విరుద్ధ, అనవసర, పొసగని
**irreligious** మత/ధర్మ విరుద్ధ, అధార్మిక, అనాచారమైన, నియమనిష్ఠలు లేని, అవినీత, భక్తిరహిత
**irreparable** మరమ్మత్తు సాధ్యంకాని, లోటు తీర్చ వీలుపడని, కుదరని, తీరని, చక్కబడని, పూరించ శక్యంగాని
**irrepressible** అణగని, అణచటం వీలుపడని, అదమ్య
**irreproachable** అనింద్య, అదూష్య, నిర్దుష్ట, నిష్కళంక; దూషణలేని
**irresistible** అనివార్య, ఎదురులేని, ఎదిరించరాని, తిరుగులేని, వ్యతిరేకించలేని, నిరోధించటం కుదరని; ప్రబల
**irresolvable** అవిభజనీయ
**irrespective (of)** నిరపేక్ష; సంబంధం లేకుండా, మాత్రమే కాకుండా
**irresponsible** బాధ్యతారహిత, పూచీలేని; నిరంకుశ, స్వతంత్ర
**irretrievable** తిరిగిపొందలేని, చక్కబెట్టరాని, దారికి రాని, దిద్దకూడని, కుదరని
**irreversible** అనుత్క్రమణీయ; తిప్పివేయటానికి వీలుగాని
**irrevocable** తిరుగులేని, తిరగని, తిప్పరాని, మార్చరాని, ఉపసంహరించరాని, రద్దుచేయరాని; ఖండితమైన
**irrigate** తడుపు; నీరు పట్టు/పారించు, నీరు కట్టు
**irrigation** నీటిపారుదల, సేచన; కడగటం, ధావన(ం), నీరుకట్టు
**irritability** క్షోభ్యత, ప్రకోపన శక్తి
**irritable** రేగే, కోపం తెప్పించే, ప్రకోపింప జేసే, క్షోభపెట్టే; చిటచిటలాడే, చిర్రుబుర్రుమనే, చిరచిరలాడే, మండిపడే
**irritant** ప్రకోపకం
**irritating** కోపం తెప్పించే, రేగే, రెచ్చగొట్టే, ప్రకోపింప జేసే
**irritation** ఆగ్రహం, క్రోధం, రోషం; ఉద్వేగం, ఉద్విగ్నత; క్షోభ; మంట, కందటం, కమలటం
**irruption** పగలటం, పేలటం, విరిగిపడటం; దౌడు, దండెత్తటం
**ischaemia** రక్తప్రసరణహీనత, రక్తక్షయం
**island** లంక, దీవి, ద్వీపం
**island arc** ద్వీపచాపం
**island fortress** ద్వీపదుర్గం
**islet** ద్వీపిక, చిన్న దీవి/లంక
**isobar** సమభారరేఖ
**isobaric** సమభారరేఖా(సంబంధి)
**isochore** పీడనోష్ణోగ్రతారేఖ
**isochronic** సమకాలిక, సమకాలీన
**isochronism** సమకాలీనత, సమకాలికత

**isoclinic** సమదిక్పాత, సమాయస్కాంతనతిక
**isoelectric** సమవిద్యుత్
**isogamete** సమరూప బీజకణం
**isogloss** వ్యవహారభేదక రేఖ
**isogon** సమకోణాత్మక
**isohyets** సమవర్షపాత రేఖలు
**isolable** పృథక్కరణీయ
**isolate** వేరుపరచు, ప్రత్యేకించు, పృథక్కరించు, ఒంటరిగా ఉంచు, ఏకాకిని చేయు, ఇతర సంబంధాలు లేకుండా చేయు
**isolates** ఒంటరులు, ఏకాకులు
**isolation** పార్థక్యం, పృథక్కరణ(ం), ఒంటరితనం, ఏకాంతత్వం, ఒంటరిపాటు, వేరుపరచటం
**isolation hospital** అంటురోగాల వైద్యశాల, (రోగులను) దూరంగా/విడిగా ఉంచే ఆసుపత్రి
**isoline** సమభారరేఖ
**isologous** సమజాతీయ
**isomerism** సమావయవత్వం
**isomerous** సమసంఖ్యా
**isometric** సమపరిమాణ
**isomorph** సజాతీయ సపదాంశం
**isomorphism** సమరూపత
**isomorphous** సమరూప
**isopach** సమమందరేఖ
**isoperimetrical** సమపరిరేఖావృత
**isophone** సజాతీయధ్వని
**isopleth** సమమానరేఖ
**isosceles** సమద్విభుజ
**isoseismal** సమభూకంప(న) రేఖ
**isotherm** సమోష్ణరేఖ, సమోష్ణోగ్రతారేఖ
**isothermal** సమోష్ణ, సమోష్ణోగ్రతా
**isotone** సజాతీయతానం
**isotonic** సమగాఢ
**isotope** సమస్థానీయ(ం)
**isotype** సజాతి
**issue** *n* అంశం, విషయం; సమస్య, ప్రశ్న; సంచిక, ప్రచురణ; పరిణామం, ఫలితం; సంతానం; వాదాంశం, ఫలితాంశం, తీర్పు; ముగింపు, అవసానం, తుద, తేరుగడ *v* జారీచేయు, వెలువడు, ప్రచురించు, ఇచ్చు, బయటికి పంపు; ద్రవించు
**issued capital** జారీ చేసిన మూలధనం, (విడుదల చేసిన) పెట్టుబడి సొమ్ము
**issue department** జారీ విభాగం
**issue price** విడుదల ధర
**isthmus** భూసంధి, కంఠభూమి; గ్రీవం
**itch** దురద
**item** ప్రత్యేకపద్దు; విషయం, వస్తువు; వార్త, సమాచారం; ఎరుక
**item analysis** విషయవిశ్లేషణ
**item by item** అంశతః, అంశాలవారీగా, ఒక్కొక్కటిగా
**item wise** అంశం అంశంగా
**iterate** పునరుక్తి చేయు; తిరిగి చెప్పు, పునరావృతం చేయు
**iteration** పునరుక్తి, పునరావృత్తి, చర్వితచర్వణం
**interative** ఆమ్రేడితం
**itinerary** యాత్ర, యాత్రా కార్యక్రమం/మార్గం/పథకం
**itinerant school** సంచారపాఠశాల
**ivory** దంతం
**ivory tower** ఒంటరితనం, ఏకాకిత్వం, ఏకాంతం; రహస్యస్థలం, ఏకాంతప్రదేశం, ఒంటరిచోటు
**ixora** రాంబాణం

# j

**jack** ఆభాస నామం; కొన్ని యంత్రాలకూ వస్తువులకూ ఆభాస నామం; (పేకాటలో) జాకీ; బరువులెత్తే సాధనం
**jack of all trades** అన్నింటిలో ప్రవేశంగల వ్యక్తి, ఏదీ సరిగా తెలియని వ్యక్తి
**jack-a-lantern/-o-lantern** కొరివిదయ్యం
**jacket** రవికె; పై అట్ట; కంచుకం; పొట్టి కోటు
**jackey** గుర్రపురౌతు
**jackpot** (అనేక క్రీడల్లో) కలుపుకుంటూ పోయి చివరకిచ్చే/చివరకువచ్చే పందెపు సొమ్ము/బహుమానం
**jacktree** పనస చెట్టు
**jade** పనికిమాలిన గుర్రపు తట్టు; మొండికట్టె; తొత్తు; పచ్చరాయి
**jaded** అలిసిపోయిన, ప్రాణం విసిగిన
**jagged** మొర్రిగా ఉన్న, కక్కులున్న, వంకరటింకర
**jaggery** గచ్చు, గార; బెల్లం
**jail** చెరసాల, బందిఖానా, కారాగారం, జైలు
**jail bird** జైలుపక్షి, నిత్య బందీ, ఖైదీ; మాటిమాటికీ నేరంచేసే వ్యక్తి



**jail manual** కారాగార నియమావళి/నిబంధనావళి
**jailor** చెరసాల అధికారి
**jam** *n* తాండ్ర, పాకం, హల్వా, మురబ్బా *v* ఒత్తు, నొక్కు, నిలిపివేయు, ఇరికించు, అణచు; కొట్టి బిగించు; (రేడియో కార్యక్రమాలు) వినిపించకుండా చేయు
**jamboree** కోలాహలం; (స్కౌట్ల) సమారోహం, ర్యాలీ, పెద్ద సభ
**jamun** నేరేడు/గిన్ని (పండ్లు)
**jangle** *n* గలగల, అల్లరి, వాగ్వాదం *v* గలగలలాడించు, అల్లరిపెట్టు; వాదించు
**janitor** కాపలాదారు, రక్షకుడు
**jar** *n* జాడీ, పాత్ర; జలదరింపు; వివాదం, ఘర్షణ; అపస్వరం *v* విరోధించు, గాయపరచు; పోట్లాడు, వాదించు; వణకునట్లు చేయు, వణికించు
**jargon** వృత్తి మాండలికం; అప్రామాణిక భాష
***jasminum grandiflonom*** జాజి
**jaundice** (పచ్చ) కామెర్లు, కామాలరోగం, పసిరికలు; అసహ్యం, వికారం, విరసం; గిట్టనిది
**jaundice, haemolytic** నెత్తురువిరిగి వచ్చే కామెర్లు
**jaundice, hepatic** కాలేయవ్యాధివల్ల వచ్చే కామెర్లు
**jaundice, infective** అంటువ్యాధివల్ల వచ్చే కామెర్లు
**jaundice, obstructive** పైత్యనాళావరోధం వల్ల వచ్చే కామెర్లు
**jaunt** *n* విహారం, సంచారం *v* విహరించు, సంచరించు
**jaunty** మోయగల, ఉల్లాసపూరిత, నీటయిన
**jaw** దవడ, హనువు
**jaw, lower** అధోహనువు, కింది దవడ
**jaw, upper** ఊర్ధ్వహనువు, పై దవడ
**jay walking** నిర్లక్ష్యంగా నడవటం/దాటడం
**jealous** ఈర్ష్య/అసూయ పడే, అనుమానపడే; జారశంకగల, సంశయగ్రస్త; జాగ్రతగల
**jealousy** ఈర్ష్య, అసూయ, సంశయం
**jeer** *n* ఎగతాళి, గేలి, అపహాస్యం *v* గేలిచేయు, పరిహసించు, ఎగతాళిచేయు, అపహాస్యం చేయు
**jejune** నిస్సార, నీరస, అర్థరహిత
**jejunum** మధ్యాంతరం
**jelly** ముంజ, చిక్కని ద్రవ (పదార్థ)ం
**jeopardise** ఇబ్బందిపెట్టు, ఇరుకులో పెట్టు, సంకటపెట్టు, అపాయంలో పడవేయు, హానిచేయు; మోసగించు
**jeopardy** అపాయం, భయం, సంకటం, ఆపద, విపత్తు, తెగింపు, మోసం
**jerk** *n* కుదుపు, ఊపు, ఈడ్పు, లాగుడు, గుంజుడు *v* లాగు, గుంజు, ఈడ్చు, కుదుపు
**jest** *n* ఎకసక్కెం, ఎగతాళి, అపహాస్యం, నవ్వులాట, పరిహాసం *v* ఎకసక్కెమాడు, ఎగతాళిచేయు, అపహసించు, పరిహసించు
**jester** విదూషకుడు
**jet** *n* కారు/కాటుక/కటిక నలుపు; నీటిధార, ఊర్ధ్వజలధార *v* విరజిమ్ము, పైకి చిమ్ము, ధారగా ప్రవహించు
**jet aircraft** జెట్ విమానం
**jet black** కారునలుపు
**jet fighter** జెట్ యుద్ధవిమానం
**jet propelled** జెట్‌తో నడిచే/ఎగిరే
**jetsam** క్షిప్త వస్తువు(లు)
**jettison** *n* క్షేపణం, విసురు *v* బయటికి విసరివేయు; (బరువులు) తగ్గించు/తొలగించు
**jetty** రేవు కట్ట, చిన్నవారధి; కారు/కటిక నలుపు
**jew** యూదు (మతస్థు)డు; పిసినారి
**jewel** నగ, రత్నం, మణి, అలంకారం, సొమ్ము, ఆభరణం, విలువైన వస్తువు
**jeweller** నగల/రత్నాల వ్యాపారి, నగలుచేసే వ్యక్తి/స్వర్ణకారుడు
**jewellery, jewels** నగలు, సొమ్ములు, విలువైన వస్తువులు
**jigsaw puzzle** క్రమరహిత చిత్రప్రహేళిక
**jingle** *n* ఘలఘల, ఘల్లుమనే శబ్దం *v* గలగలలాడు, ఘల్లుమను
**jingo** యుద్ధోన్మాది
**jingoism** ఆర్భాటం; యుద్ధోన్మాదం
**jinxed** అప్రశస్త, నష్టకారి
**jitter(s)** భయం, వణుకు, గాభరా
**job** చిన్న/చిల్లర పని/ఉద్యోగం
**job work** చాలా చిన్న పని
**jobber** టోకు వ్యాపారి; కాంట్రాక్టు కూలీ; దొంగ ఉద్యోగాల దళారీ; విశ్వాసద్రోహి, నమక్‌హరాం
**jobbery** దుర్వర్తనం, దుర్వినియోగం; విశ్వాస ద్రోహం; నమక్‌హరామీ
**jocose, jocular, jocund** సరస, పరిహాసప్రియ, రసిక, హాస్యప్రియ; ఎగతాళిచేసే

**jog** *n* ఊగులాట, తోపులాట; కుదిలింపు; తోపుడు; ఊగులాడే నడక

***joic de vivre*** సంతృప్తి, జీవితానందం

**join** జతకూర్చు, జోడించు, కలుపు, అంటించు; చేరు, చేర్చు, జతచేయు, ఏకంచేయు, సంయోజించు

**joint** *adj* ఉమ్మడి, సమష్టి, సంయుక్త *n* కణుపు, కీలు, సంధానం, అతుకు, సంధి; పొత్తు; (అమెరికాలో) కొంప; మారుమూల అంగడి *v* ముక్కలు ముక్కలుగా నరుకు, తెగనరకు

**joint and several responsibility** సమష్టి-వ్యక్తి ఉత్తరదాయిత్వం, ఉమ్మడి-విడి బాధ్యత

**joint, ankle** చీలమండ కీలు

**joint demand** సంయుక్త డిమాండ్

**joint electorate(s)** సంయుక్త నియోజకవర్గం, సంయుక్త ఎన్నికల విభాగం/విధానం

**joint family** ఉమ్మడి కుటుంబం, సమష్టి/అవిభక్త కుటుంబం

**joint farming** ఉమ్మడి సేద్యం/వ్యవసాయం

**joint, hinge** మడతబందు కీలు

**joint, immovable** కదలని కీలు

**joint, knee** మోకాలు

**joint, movable** కదిలే కీలు

**joint resolution** ఉమ్మడి తీర్మానం/ప్రకటన

**joint secretary** సంయుక్త కార్యదర్శి

**joint, shoulder** భుజంకీలు

**joint stock company** జాయింట్ స్టాక్ కంపెనీ

**joint supply** సంయుక్త సప్లై

**jointly** ఉమ్మడిగా, కలిసికట్టుగా, సమష్టిగా, సంయుక్తంగా

**jointure** స్త్రీధనం; భార్యకిచ్చే ధనం, మరణానంతరం భార్యకు వదిలిన ఆస్తి

**joke** *n* ఎగతాళి, ఎకసక్కెం, పరిహాసం *v* ఎగతాళిచేయు, పరిహాసమాడు, హాస్యాలాడు

**jolt** *n* ఊపు, కుదుపు *v* కుదిలించు, కుదిపివేయు, నెట్టు, తోయు

**j-tube** జె-నాళిక

**jostle** పైనబడు, నెట్టు, పెనగులాడు

**jot** *n* రవ్వంత, ఆవగింజంత, కొంచెం, లవం, లవలేశం *v* సంక్షేపంగా/టూకీగా రాయు

**journal** పత్రిక, సమాచార పత్రం, వార్తాపత్రిక; చిట్టా, తీర్పులెక్క; దినచర్య

**journalese** పత్రికాభాష

**journalising** చిట్టాపద్దురాయటం

**journalism** పత్రికారచన, పాత్రికేయవిద్య

**journalist** పత్రికారచయిత, పాత్రికేయుడు

**journey** ప్రయాణం, యాత్ర

**journey man** (అమెరికాలో) రోజుకూలీ; చే(తి)కూలీ, పనివాడు, కూలివాడు

**journey-work** కూలిపని, కోతపని, చే(తి)కూలి

**jovial** సరస, రసిక, ఉల్లాసం/ఉత్సాహం గల

**joy** సంతోషం, ఆనందం, ఉత్సాహం, హర్షం, ప్రసన్నత

**joy-ride** వినోద యాత్ర/పర్యటన; (అమెరికాలో) నిర్లక్ష్య ప్రయాణం, దొంగకారులో తిరగటం

**jubilant** ఉత్సాహకర, ఉల్లాసప్రద, ప్రఫుల్ల

**jubilate** ఆనందించు, సంతుష్టపడు, పండగ చేసుకొను; అనుభవించు; జేజేలు కొట్టు, జయపెట్టు

**jubilation** ఉత్సవం, పండగ; ఆనందం; ఖుషీ, సంతుష్టి

**jubilee** పండగ, ఉత్సవం; జయంతి

**jubilee, diamond** వజ్రోత్సవం (60/75 ఏళ్లకు)

**jubilee, golden** స్వర్ణోత్సవం (50 ఏళ్లకు)

**jubilee, silver** రజతోత్సవం (25 ఏళ్లకు)

**judge** *n* న్యాయాధిపతి, న్యాయమూర్తి, న్యాయ నిర్ణేత; తగవరి, తీర్పరి; పరీక్షకుడు, మధ్యవర్తి *v* విచారించు, (న్యాయాన్యాయాలు) నిర్ణయించు, ఆలోచించు, విమర్శించు, తీర్పు చెప్పు

**puisne judge** (హైకోర్టు, సుప్రీంకోర్టుల్లో - హోదాలో) ప్రధాన న్యాయమూర్తి కన్న చిన్నన్యాయమూర్తి

**judgement** తీర్పు, నిర్ణయం; సలహా, సమాలోచన; అభిరుచి, తెలివి, వివేకం, వివేచన; శిక్ష

**judicature** న్యాయ స్థానం/విధానం/వ్యవస్థ/విచారణ; అధికారం

**judicial** న్యాయబద్ధ

**judicial enquiry** న్యాయవిచారణ

**judicial murder** న్యాయశాస్త్రప్రకారం చేసిన హత్య

**judicially** న్యాయబద్ధంగా, జాగ్రతగా, సమానంగా

**judiciary** న్యాయసభ, ధర్మాసనం, న్యాయమూర్తులవర్గం; న్యాయ వ్యవస్థ/యంత్రాంగం

**judicious** న్యాయసమ్మత, న్యాయమైన; వివేక వంతమైన, ఆలోచనాపూర్వక/తెలివిగల, తగిన



**juggle** *n* కనికట్టు, మోసం, టక్కు (టమారాలు), మాయ, ఇంద్రజాలం, గారడీ *v* మోసం/గారడీ చేయు, మాయచేయు, చమత్కరించు

**juggler** మోసగాడు, మాంత్రికుడు; గారడీవాడు, ఇంద్రజాలికుడు; చమత్కారి

**jugglery** ఇంద్రజాలం, మాయ, గారడీ; కపటం, మోసం; చమత్కారం

**jugglery of words** మాటలగారడీ, శబ్దాడంబరం

**juice** రసం, సారం, పసరు, గుజ్జు, పాలు, ద్రవం

**juice, digestive** జీర్ణరసం

**juice, gastric** జఠరరసం

**juice, intestinal** ఆంత్రరసం

**juice, salivary** లాలాజలం

**jumble** *n* కలగూరగంప, సాంకర్యం; గడబిడ, గజిబిజి, గగ్గోలు, గందరగోళం, రసాభాస *v* కలిపివేయు, సంకరం చేయు, గజిబిజి చేయు, గాభరాపెట్టు, రసాభాసచేయు

**jumbo** చాలా పెద్ద, బృహత్

**jump** *n* గంతు, గెంతు, దాటు, దూకు, ఎగురు; గడిమార్పు *v* గంతు, గెంతు, ఎగురు, దూకు, దాటు

**jump at** తొందరపడు; (నిర్ణయానికి) వచ్చు

**junction** కూడలి, సంగమం; సంధి; ఉద్దేశ్య సంబంధం

**juncture** సంహిత; పరిస్థితి, అవస్థ, తరుణం; సందిగ్ధ సమయం, సంకటస్థితి

**junggramatiker** నవ్యవ్యాకర్త

**junior** చిన్న, తరవాతి (వ్యక్తి)

**junk** తాటిపీచు, పాతతాళ్ళు, చీనా ఓడ; ఉప్పు వేసిన మాంసం

**junk food** చెత్త తిండి

**junkie** మందుభాయి, తాగుబోతు

***junta/junto*** కుట్రదారులు, కక్షిదళం; సంస్థానం, బందుకట్టు

**Jupiter** గురుడు, గురుగ్రహం

**juridicial** న్యాయవిచారణ/న్యాయస్థాన సంబంధి, ధర్మశాస్త్ర/చట్ట సంబంధి

**jurisdiction** అధికారపరిధి, అధికారం; ఇలాకా

**jurisprudence** ధర్మశాస్త్ర/న్యాయశాస్త్ర మీమాంస, న్యాయ/ధర్మ శాస్త్రం

**jurist** న్యాయ(శాస్త్ర)వేత్త, ధర్మశాస్త్రజ్ఞుడు, న్యాయశాస్త్ర పరిజ్ఞానంగల వ్యక్తి

**juror** జూరీ సభ్యుడు, జూరీల్లో ఒకరు

**jury** న్యాయ సహాయకబృందం; (న్యాయ సభలో) పంచాయతీదారు; ధర్మకర్త; జూరీ (సభ్యుడు)

**juryman** (న్యాయసభలో) పంచాయతీదారు, ధర్మకర్త

***jus commune*** సార్వజనికన్యాయం

**just** *adj* న్యాయమైన, ధర్మమైన, సముచిత, నిష్పాక్షిక, సరైన *adv* సరిగా, ఇప్పుడే, బొటాబొటిగా, పరిష్కారంగా, శుద్ధంగా, కొద్దిగా, రవ్వంతగా

***justa causa*** న్యాయసంగత కారణం

**justice** న్యాయమూర్తి; న్యాయం, ధర్మం, నీతి

**chief justice** ప్రధాన న్యాయమూర్తి

**justiciable** న్యాయ (ప్రక్రియా) సాధ్య, ధర్మసాధ్య, పరిష్కారయోగ్య

**justifiable** సమర్థనీయ, న్యాయసమ్మత, యోగ్య, ఉచిత

**justification** సమర్థన; న్యాయోచితత్వం; ఔచిత్యం/(తగిన) కారణం; నిరూపణ, సమాధానం; విముక్తి, విమోచన; పంక్తి నిర్ధారణ

**justified** సమర్థనీయ, న్యాయసమ్మత, యోగ్య, ఉచిత; నిజ, నిర్దుష్ట, పునీత

**justify** సమర్థించు (కొను), కారణం చూపు, నిరూపించు; నిర్దోషిని చేయు

**justly** ధర్మంగా, న్యాయంగా; ఉచితంగా, తగినట్లు

**justness** న్యాయ/ధర్మ పరాయణత

**jut** *n* మొన, కొన, పొడుచుకొని వచ్చిన వస్తువు *v* కొనదేలు, మొనదేలు, పొడుచుకొనివచ్చు

**jute** జనపనార

**jutting** మొనదేలిన, పొడుచుకొని వచ్చే

**juvenile** బాల, బాల్య, బాలక; బాల్యచేష్ట; కొత్త; కిశోరం

**juvenile court** బాలన్యాయస్థానం

**juxtapose** దగ్గరకు చేర్చు, దగ్గర దగ్గరగా కూర్చోను

**juxtaposition** సన్నిధానం, ఆసక్తి/సంస్థితి; సామీప్యం, చేరువ, సమీపవర్తిత్వం

# k

**k-orbit** కె-కక్ష్య

**kala azar** కాలజ్వరం

**kaleidoscope** చిత్రదర్శిని

**kaleidoscopic** రంగురంగుల, చిత్రవిచిత్రమైన, చక్కని, సుందర

**kaleidoscopic morph** బహురూప సపదాంశం

**kamikage** ఆత్మాహుతిదళం
**kangaroo** ఆస్ట్రేలియా పౌరుడు; ఒక క్షీరద జంతువు
**kanjolojuple** జీవాణుద్రవం
**kankar** కంకర, గులక
**kanyoplasm** జీవాణుద్రవ్యం
**kapok** బూరుగుదూది
**katabolism** విచ్ఛిన్న క్రియ
**kathode** రుణధ్రువం
**kation** (cation) ధనాయానం; ధన-అయాన్
**keel** (ఓడ) వెన్ను పలక
**keel (petals)** ద్రోణీదళం
**keelage** (ఓడను నిలిపినందుకు చెల్లించే) రేవు రుసుము
**keen** చురుకైన, వాడియైన, తీవ్ర, తీక్ష్ణ; చతుర
**keen competition** తీవ్రమైన పోటీ
**keenly** చురుగ్గా, వాడిగా, తీవ్రంగా, ఉత్సుకతతో
**keenness** ఉత్సుకత, తీవ్రత, తీక్ష్ణత, వాడి, కుశాగ్రత
**keep** *n* కోట, దుర్గం; సంరక్షణ, కావలి, పహరా; బత్తెం, మేత; (కొండమీది) చెరసాల; ఉంపుడుగత్తె *v* దాచు, అట్టిపెట్టు, పెట్టు, నడుపు, పూర్తిచేయు, పెంచు, పోషించు, ఉంచుకొను; రక్షించు, ఆచరించు, నిలుపు, ఉండు
**keep away** దూరంగా ఉంచు
**keep back** అట్టిపెట్టుకొను; వెనుజిక్కు; ఒత్తిగిలు
**keep command** అధికారం/నాయకత్వం నిలుపుకొను
**keep in touch** తెలివిడిలో ఉండు, తెలుసుకొను
**keep off** దూరంగా ఉండు/ఉంచు; తొలగు, తొలగించు
**keep pace** పోటీలో ఉండు, పోటీపడు
**keep to** భరించు, బద్ధపడు, కట్టుబడి ఉండు; అంటిపెట్టుకొని ఉండు
**keep track of** జాడగుర్తించు; నిలుపుకొను, నిర్వహించు
**keeper** కావలివాడు, (సం)రక్షకుడు
**keeper, magnet** అయస్కాంత రక్షకం
**keeping** స్వాధీనం; పాలన, అధికారం; సంరక్షణ, కావలి; అనుగుణ్యత
**in keeping with** తగినట్లు, సరిపడేటట్లు
**keepsake** స్మృతి/జ్ఞాపక చిహ్నం
**ken** చూపు, దృష్టి, జ్ఞానం, పరిచయం
**kenesion revolution** కీన్స్ ప్రేరిత విప్లవం
**kennel** కుక్కలదొడ్డి; మురికికాలవ
**keratitis** శుక్లపటలశోథ
**keratomalacia** శుక్లపటల మృదుత్వం, శుక్ల పటలం మెత్తబడటం
**keratoplasty** శుక్లపటలం అంటుపెట్టడం
**keratotomy** శుక్లపటలచ్ఛేదనం
**kerb** బాటపక్క కాలిబాట
**kernel** ఆధారం; గింజ, గుజ్జు, పప్పు; తత్వం, సారం, సారాంశం, అసలు విషయం; గర్భం; కొబ్బరి; మొలక; గవద
**kerophthalmia** కంటి మసక
**ket fuffle** వాగ్యుద్ధం; పోట్లాట
**kettle** నీళ్లుకాచే పాత్ర
**key** *n* కీలకం, తాళంచెవి; చిక్కుతీసే సాధనం; మర చుట్ట/మీట; బిరడా, (సంగీతంలో) స్వరం; ఆయువుపట్టు *v* సరిపెట్టు, (సరైన) స్థితికి తెచ్చు, సరిచేయు; (సంగీతంలో) శ్రుతి సవరించు/సరిదిద్దు, తాళం వేయు
**keyboard** కీలక ఫలకం
**keyboard entry** కీలక ఫలక ప్రవేశనం
**key industry** ముఖ్య/మౌలిక/కీలక పరిశ్రమ
**key minimum set** కీలక కనిష్ఠ సమితి
**key note** ప్రధానసూత్రం, మూలభావం; (సంగీతంలో) ముఖ్యస్వరం
**key note address** కీలకోపన్యాసం
**key projects** కీలక/ప్రధాన పథకాలు
**key stone** మూలరాయి; మూల విషయం; అసలు విషయం, మౌలిక సిద్ధాంతం/సూత్రం
**key village** కీలక గ్రామం
**key word** కీలక/సంకేత శబ్దం, కీలకాంశం
**keynesian economics** కీన్స్ ప్రేరిత అర్థశాస్త్రం
**kharif crop** ఖరీఫ్ పంట
**khondalite** కట్టుడురాయి
**kick** *n* తన్ను, తాపు *v* తన్ను; అడ్డం చెప్పు
**kicker** విక్షేపకం
**kick off** ప్రారంభించు; (ఆర్భాటంగా)/ మొదలుపెట్టు
**kick the bean** ఓడిపోవు, వీగిపోవు
**kidnap** అపహరణ, దొంగిలింత; (వ్యక్తులను) అపహరించు, దొంగిలించు
**kidnapping** అపహరణ
**kidney** మూత్రపిండం



**kill** చంపు, ప్రాణంతీయు, వధించు, సంహరించు, నష్టపరచు, చెరచు, విరచు
**killjoy** సంతోషధ్వంసకుడు, పుల్లవిరుపు మాటల వాడు; సుఖనిరాసకం
**kiln** ఆవం, బట్టీ, సూల, కాళవాయి
**kin** దాయాది, జ్ఞాతి, సగోత్రుడు, బంధువు, సంబంధి; పరిచితులు, సజాతీయులు
**kind** *adj* దయగల, దయాళు *n* తరగతి, జాతి, భేదం, రకం, విధం, ప్రకారం, తీరు, రీతి
**kindergarten** శిశుపాఠశాల, బాలశిక్షణాలయం
**kindle** రగిలించు, వెలిగించు; ప్రేరేపించు
**kindred** సజాతి, సంబంధి
**kinematics** శుద్ధగతిశాస్త్రం
**kinesics** భాషేతరభావప్రకటన
**kinetic** గతిజ, గతి సంబంధి
**kinetics** గతి శాస్త్రం/విజ్ఞానం
**kinetic theory** వస్తుగతి సిద్ధాంతం
**king-cobra** నాగరాజు
**kingdom** రాజ్యం; జాతి, ప్రపంచం
**animal kingdom** జంతుప్రపంచం
**king emperor** రాజరాజు, రాజాధిరాజు, చక్రవర్తి, సమ్రాట్టు, సార్వభౌముడు
**kingfisher** లకుముకి (పిట్ట)
**kingpin** ప్రముఖవ్యక్తి, ప్రధాన విషయం/వస్తువు
**kingship** రాజత్వం, రాచరికం, దొరతనం
**kinking** వంకర తిరగటం
**kinsfolk** చుట్టాలు, బంధువులు
**kinship** బంధుత్వం, సంబంధం, సగోత్రులు, స్వజనం
**kinship term** బంధుత్వబోధకపదం
**kiosk** బడ్డీ (కొట్టు/దుకాణం)
**kit** మూటాముల్లె, సామాను, సామగ్రి
**kitchen** వంట ఇల్లు
**kitchen cabinet** ఆంతరంగిక మంత్రివర్గం
**kitchen garden** పెరటితోట
**kite** గాలిపటం, పతంగి; గద్ద, గరుడపక్షి
**fly a kite** ధనం (తప్పుదారిలో/సులభంగా) సంపాదించు
**kith and kin** చుట్టపక్కాలు, ఆత్మీయులు
**kleptomania** చౌర్యోన్మాదం; అకారణంగా దొంగిలించే ప్రవృత్తి
**knack** ఉపాయం, యుక్తి, కౌశలం, నేర్పు, చతురత, చాతుర్యం
**knave** మాయలమారి, కపటి, దొంగ, వంచకుడు, విశ్వాసద్రోహి, నీచుడు; (పేకాటలో) జాకీ
**knavery** వంచన, ధూర్తత్వం, కాపట్యం, మోసం, దగా, పితలాటకం, టక్కు
**kneading** మెదపటం, మర్దించటం
**knee** మోకాలు
**bring one to one's knees** ఓడించు, పడగొట్టు, తలవంపులు తెచ్చు
**kneel** మోకరిల్లు
**knell** గంట; గంటవాయించు
**knick-knack** చిల్లర/చిన్న వస్తువులు/సామాను, గుల్లాగుట్ర
**knife** కత్తి
**knife, cataract** కంటి శుక్లం/పొర తొలగించే కత్తి
**knight** యోధుడు
**knit** అల్లు, నేయు; కట్టు, జోడించు కలుపు, చేర్చు
**kniting** ఉన్ని అల్లకం
**knob** పిడి, ముడి; గుబురు, గుబ్బ, గుబక, కాయ
**knock** తట్టు, కొట్టు, పడగొట్టు, రాలగొట్టు, దెబ్బ; (తలుపు) తట్టడం
**knock against** ఒక వస్తువును మరో వస్తువుతో కొట్టు
**knock down** కొట్టి కిందపడవేయు; (వేలం పాటలో) పాట కొట్టివేయు; హఠాత్తుగా ధర తగ్గించు
**knock-knee** గాడిద కాళ్ళు
**knock out** ఓడించు, కొట్టిపంపించు; (వేలం పాటలో) పోటీ లేకుండా చేసుకొను; పడగొట్టు
**knock the bottom out of** ఆధారం తొలగించు
**knot** చిక్కు, ముడి, కణుపు, గుబురు, గుంపు; (సముద్రమార్గంలో) ఒక మైలు (సుమారు 6080 అడుగులు)
**knotty** చిక్కుపడ్డ, ముళ్ళుపడ్డ, కఠిన; ముళ్ళున్న, బుడిపెలున్న
**know** *n* ఎరుక, తెలివిడి; వార్త, జ్ఞానం *v* తెలుసుకొను, గుర్తించు
**know-all** సర్వజ్ఞ, అన్నీ తెలిసిన, అన్నీ తెలుసని చెప్పుకునే
**know-how** ప్రత్యేక నైపుణ్యం; పరిజ్ఞానం
**knowingly** తెలిసి తెలిసి, తెలిసి కూడా, బుద్ధి/ జ్ఞాన పూర్వకంగా
**knowledge** ఎరుక, తెలివి, జ్ఞానం, విద్య; పరిచయం, ప్రావీణ్యం

**knowledge acquistion** జ్ఞానసాధన
**knowledge base** విజ్ఞతాధారం
**knowledge society** విజ్ఞసమాజం
**knuckle** మెటిక, వేలికణుపు
**kodex millet** ఆరికలు
**koilon cyhia** చంచావంటి గోళ్ళు
**kondo** (బౌద్ధాలయంలో) ఆరాధన స్థలం
**krait** కట్లపాము
**krayrosis, vulvae** స్త్రీమర్మావయవపు క్రోరోసిస్
**kryoscopy** హిమాంకమాపనం
***kudos*** ప్రఖ్యాతి, కీర్తి, ప్రతిష్ఠ, గౌరవం, యశస్సు
**kyphosis** గూని(తనం)

# l

**label** *n* గుర్తు, చీటీ *v* గుర్తుపెట్టు, పేరుపెట్టు; చీటీ అతికించు
**labelled** గుర్తించిన
**labels** అంకపత్రాలు
***labia majora*** బాహ్య ఓష్ఠాలు
***labia minora*** అంతరోష్ఠాలు
**labial** ఓష్ఠ్య
**labialization** ఓష్ఠీకరణం
**labiate** ఓష్ఠాకార
**labile** అస్థిర
**lability** అస్థిరత
**labio-dental** దంతోష్ఠ్య
**labio-velar** కంఠోష్ఠ్య
**labium** పెదవి, అధరోష్ఠం
**laboratory** ప్రయోగశాల
**laboratory method** ప్రయోగశాలాపద్ధతి
**laboratory phonetics** ప్రాయోగిక ధ్వనిశాస్త్రం
**laboriously** (బహు)ప్రయాసతో/శ్రమతో, పెద్ద ప్రయత్నంతో
**labour** *n* శ్రామికుడు, కార్మికుడు, కూలి(వాడు); కార్మికవర్గం; శ్రమ, వేదన *v* కష్టించు, శ్రమించు, చెమటోడ్చు; నొప్పులుపడు; ప్రయత్నించు
**labour appellate tribunal** శ్రామికోన్నత న్యాయస్థానం
**labour court** శ్రామిక న్యాయస్థానం
**labour, delayed** ఆలస్యమైన కాన్పు
**labour, difficult** కష్టమైన కాన్పు
**labour, induced** ప్రేరిత ప్రసవం
**labour market** శ్రామిక విపణి
**labour, obstructed** అవరుద్ధమైన/అవరోధం కలిగిన కాన్పు
**labour saving devices** శ్రమతగ్గించే యంత్రాలు/పరికరాలు/పద్ధతులు
**labour with** శ్రమించు, ప్రయాసపడు, బాధపడు
**skilled labour** నిపుణ కార్మికులు
**unskilled labour** అనిపుణ కార్మికులు
**labourer** శ్రామికుడు, కార్మికుడు, కూలిమనిషి
**labourite** కార్మిక(వర్గ) ప్రతినిధి
**labyrinth** చిక్కు (దారి); గహన ప్రదేశం; వ్యూహం, (పద్మవ్యూహం)
**lacerate** చీరు, చీల్చు, నొప్పించు, గాయపరచు
**laceration** చీలిన గాయం
**lacerta** దేవపారిజాతం
**laches** ఉపేక్షలు
**lack** *n* లోటు, లోపం, లేమి, కొరత *v* లేకుండు, కొరతపడు, అవసరమగు
**lackadaisical** అలస, ఉదాసీన, ఉపేక్షిత; నిరపేక్ష; రాగయుక్త
**laconic** సూత్రప్రాయ, సంక్షిప్త, సంగ్రహ
**lacquer** *n* బంగారురంగుగల వార్నీషు, పైపూత, లాక్షామయం *v* వార్నీషు/పైపూత పూయు
**lacquer ware** లక్కవస్తువులు
**lacquered** లక్కపూసిన, పైపూతగల
**lacrimal** కన్నీటి
**lacrimation** కన్నీరు కారటం, బాష్పాధిక్యం
**lactagogue** క్షీరవర్ధిని
**lactation** పాలుచేపటం, చనుబాలివ్వటం, పాలిచ్చేకాలం
**lactation period** చనుగుడుపువేళ, పాలిచ్చే సమయం
**lacteals** పాలగొట్టం
**lacto-meter** క్షీర మాని/మాపకం
**lactogen** క్షీరజని
**lactogenic** క్షీరవర్ధక
**lactose** పాలచక్కెర
**lacuna** సందు, లోపం, ఖాళీ స్థానం/సమయం, అంతరం; లిక్విణి
**ladder** నిచ్చెన, నిఃశ్రేణి
**lag** వెనకబడు, మెలమెల్లగ నడుచు
**laggard** వెనకబడ్డ, అలస, మంద
**lagoon** కయ్య, మడుగు, లోతులేని చెరువు
**lagophthalmos** కన్ను మూయలేకపోవటం



***laissez-faire*** స్వేచ్ఛా వాణిజ్యం/వ్యాపారం; స్వేచ్ఛావిధానం
**laity** లౌకికప్రజ
**lake** సరస్సు, సరోవరం, పెద్దచెరువు
**lame** కుంటి, పంగు
**lame-duck-session** కుంఠిత సమావేశం, కుంటి సమావేశం
**lament** *n* శోకం, విలాపం, ఏడ్పు, దుఃఖం *v* శోకించు, దుఃఖించు, ఏడ్చు, కుమిలిపోవు
**lamentable** శోచనీయ, విచారకర, దుఃఖప్రద
**lamina** పొర, పత్రదళం, రేకు
**laminal** జిహ్వోపాగ్ర
**laminate** పొరపొరలుగానున్న
**laminated** పొరలుగల
**lamp** దీపం, దివ్వె
**lampoon** నిందాపూర్వక/అధిక్షేప(క) రచన; అధిక్షేపించు
**lance** బల్లెం, ఈటె, కుంతం
**free lance** స్వతంత్ర (రచయిత), అనుద్యోగి రచయిత; (మధ్య యుగాల్లో) స్వతంత్ర యోధుడు, ఏకాంగవీరుడు
**lanceolate** బల్లెంలాగుండే
**lancer** ఈటెకాడు, ఈటెరౌతు
**lancet** చిన్న ఈటెలాంటి శస్త్రం
**land** *n* భూమి, నేల, స్థలం, మట్టి, దేశం, రాజ్యం *v* భూమిపై దిగు, తీరాన దించు, ఒడ్డుపట్టు; పట్టుకొను, ముట్టడించు; సంపాదించు; పరిస్థితికి తెచ్చు
**barren land** ఊసరక్షేత్రం, పండనిభూమి
**fallow land** బీడు
**land alienation act** భూమి అన్యాక్రాంత చట్టం
**land cover cadestral** భూమ్యాచ్ఛాదిత స్థిరాస్తి పరిమితి
**land cover management** భూమ్యాచ్ఛాదన యాజమాన్యం
**landed estate** భూస్థితి, భూసంపద, స్థిరాస్తి
**landed property** భూస్థితి
**land fill** భూపూరణం
**land-force** పదాతిదళం, స్థలసేన
**land grant** భూదానం
**landholder** భూస్వామి; జమీన్‌దారు; గృహ యజమాని
**land-locked** భూపరివేష్టిత, చుట్టూ భూమి ఉన్న
**land mark** సరిహద్దు గుర్తు, గుర్తు/హద్దు రాయి, సీమాచిహ్నం; మహత్తర సంఘటన, ప్రసిద్ధ విషయం
**land parcel** భూభాగం
**land reform** భూసంస్కరణ
**land revenue** భూమిశిస్తు
**land route** భూమార్గం, స్థలమార్గం
**landsat** భూమ్యుపగ్రహం
**landscape** ప్రకృతి దృశ్యం/చిత్రం
**land settlement** భూవ్యవస్థ; (తెలంగాణలో) బందోబస్తు
**landslide** భూపాతం
**land subsidence** భూమ్యవతరణ, భూనిమజ్జనం
**land tenure** భూమి కౌలు; భూస్వామ్య పద్ధతి
**land use planning** భూమ్యుపయోగ వ్యూహనం/ప్రణాళిక
**waste land** బంజరుభూమి
**landing** దింపుడు, అవతరణం, దింపు, మెట్టు; మెట్లమధ్య సమస్థలం; పడవరేవు గట్టు
**landlady** (గృహ) యజమానురాలు
**landlord** (గృహ) యజమాని; భూస్వామి, జమీన్‌దారు
**landmine** మందుగని
**landscape** ప్రకృతి/భూ దృశ్యం, రమ్యదృశ్యం, ప్రకృతి చిత్రం; ఏకస్థల చిత్రపటం
**landslide** భూపాతం, కొండచరియలు విరిగి పడటం; ఒక పక్షానికి ఆధిక్యం లభించటం
**landslip** జారిపడే భూఖండం
**lane** సందు, గొంది, వీధి, మార్గం, దోవ, దారి
**language** భాష; మాండలికం; మాటతీరు
**language, common** సామాన్య/సాధారణ భాష
**language, cultural** సాంస్కృతిక భాష
**language, dead** మృతభాష
**language family** భాషాకుటుంబం
**language, formal** ఔపచారిక భాష
**language, hybrid** సంకరభాష
**language laboratory** భాషాప్రయోగశాల
**language, link** సంపర్క భాష, అనుసంధాన భాష
**language, literary** సాహిత్యభాష
**language, living** జీవద్భాష
**language, mixed** మిశ్రభాష
**language, official** అధికారభాష
**language shift** భాషాపరివృత్తి
**language, standard** ప్రామాణిక/ప్రమాణ భాష

**language, tone** తానభాష
**language, universal** విశ్వజనీన భాష
**lank** సన్నని, బక్కపలచని, పలచబడిన; పొడుగాటి; సగం నిండిన
**lantern** లాంతరు
**lanugo** శిశురోమం
**lap** *n* ఒడి, అంకం; (చొక్కా)వేలాడే భాగం; కొండకొన *v* నాకు, నాకి తిను, తొణుకు, చుట్టు, చుట్టబెట్టు; లాలించు, బుజ్జగించు; పేర్చు, సర్దు
**laparotomy** ఉదరచ్ఛేదనం
**lapidolane** ప్రస్తరశిల
**lapilli** జ్వాలాముఖీ శిలాఖండం
**lapse** *n* తప్పు, లోపం, అపరాధం; అతిక్రమణ *v* అతిక్రమించు, గడచిపోవు, గతించు, తప్పిపోవు; రద్దగు, లుప్తమగు
**larceny** దొంగతనం, చౌర్యం
**lard** జంతువుల కొవ్వు
**lardaceous** కొవ్వుపట్టిన
**large** మహా, పెద్ద, దొడ్డ, విశాల, దీర్ఘ; ప్రచుర, విస్తారమైన
**at large** విచ్చలవిడిగా, నిర్నిబంధంగా
**large scale industry** భారీ పరిశ్రమ
**largesse** వితరణ, బహూకృతి, బహుమానం, కానుక, నజరానా, దానం
**larva** డింభకం
**larval** డింభక
**larvicide** డింభక నాశి/నాశని
**larvivorous** డింభకాహారి
**laryng(e)al** కృకాగ్రీయ, కాకలకీయ
**laryngitis** స్వరపేటిక శోథ
**laryngoscope** స్వరపేటికాదర్శిని
**larynx** కృకాగ్రం, కాకలకం, స్వరపేటిక
**lash** *n* ఫలకం; దెబ్బ, కొరడా (వారు/దెబ్బ) *v* హఠాత్తుగా ఎగురు, విరుచుకపడు; కొరడాతో కొట్టు, (తాడుతో)కట్టు
**lassitude** అలుపు, బడలిక, గ్లాని, శిథిలత; నీరసం
**last** *adj* చివరి, తుది, కడపటి, అంతిమ, గడిచిన, చాలిన
**at last** తుట్టతుదకు, చిట్టచివరకు; గడిచిన, చాలిన, చివరి
**breathe one's last** మరణించు, కన్నుమూయు, అంతిమశ్వాస వదలు
**last word on the matter** చివరిమాట
**to the last** చివరిదాకా; మరణించేదాకా
**lasting** మన్నికైన, కలకాలం నిలిచే, శాశ్వత, అనశ్వర, స్థిరమైన, చిరస్థాయి
**late** *adj, adv* భూతపూర్వ, మునపటి, వెనకటి; స్వర్గీయ; ఆలస్యమైన; వేళతప్పిన
**late fee** అదనపు రుసుము, జరిమానా
**late news** తాజా వార్త(లు)
**of late** కొంతకాలంగా, కొన్నిరోజులుగా; ఇటీవల
**lately** ఈమధ్య, ఇటీవల, కొద్దికాలం కిందట
**latent** ప్రచ్ఛన్న, గుప్త, అంతర్గత, నిగూఢ, రహస్య, దాగిన
**latent stage** గుప్తదశ
**lateral** పార్శ్వికం; పార్శ్వ, పక్ష, పక్క
**laterite** ఎర్రమట్టి
**latest** అతినూతన, అధునాతన, చివరి, తాజా
**lathe** తరిమెణ
**lather** నురుగు
**lathi charge** లాఠీఛార్జి
**latitude** అక్షాంశం, అక్షాంశరేఖ; ఉదారత, స్వాతంత్ర్యం
**latitude, high** ఉన్నతాక్షాంశం
**latitude, low** నిమ్నాక్షాంశం
**latrine** మరుగుదొడ్డి, కక్కసు, పాయిఖానా
**latrine, sanitary** పరిశుభ్రమైన మరుగుదొడ్డి
**latter** వెనుకటి, రెండో, తరవాతి, ఉత్తరోత్తర
**lattice** అల్లిక, తడిక, జాలీ (పని)
**laud** స్తోత్రం, శ్లాఘ(నం); స్తుతించు, పొగడు, ప్రశంసించు
**laudable** ప్రశస్య, స్తవనీయ, మెచ్చదగిన, స్తోత్ర/శ్లాఘా పాత్ర, శ్లాఘనీయ
**laugh(away)** నవ్వుల్లో తేల్చివేయు, నవ్వి ఉపేక్షించు, నిర్లక్ష్యంగా చూచు
**laughing gas** గిలిగింతలు పెట్టే రసాయనిక వాయువు (నైట్రస్ ఆక్సైడ్)
**launch** *n* పెద్దపడవ, లాంచీ *v* నడుపు, ప్రారంభించు; (ఓడను) జలప్రవేశం చేయించు; ప్రయోగించు
**launch a movement** ఉద్యమం మొదలుపెట్టు/ప్రారంభించు
**launch a ship** ఓడను జలప్రవేశం చేయించు
**launching** ప్రారంభక ప్రయోగం
**launch pad** ప్రయోగ స్థలం/స్థావరం
**lauch range** ప్రయోగపరిధి



**launch vehicle** ప్రయోగ వాహనం/శకటం
**laundry** చాకలికొట్టు, రజకాలయం
**laureate** పూజితుడు, అలంకృతుడు
**poet laureate** ఆస్థానకవి
**laurel(s)** గౌరవం, కీర్తి, విజయం, సఫలత
**lava** లావా, (అగ్నిపర్వతంనుంచి ప్రవహించే) ఉష్ణద్రవం, శిలాద్రవం
**lavage** ధావనం
**lavage, gastric** జఠరధావనం
**lavish** దుబారా, అధిక/అమిత వ్యయం చేయు, వెచ్చించు; (విపరీతంగా) పొగడు
**law** చట్టం, శాసనం, నియమం, వ్యవస్థ, న్యాయ(శాస్త్ర)ం, ధర్మశాస్త్రం, శిక్షాస్మృతి; సూత్రం
**civil law** పౌర/వ్యవహార న్యాయం
**commercial law** వాణిజ్య న్యాయం/చట్టం
**criminal law** శిక్షాస్మృతి
**law-abiding** న్యాయానువర్తి, న్యాయబద్ధ, శాంతికాముక
**law-abiding people** న్యాయానువర్తులు/ధర్మబద్ధులు అయిన ప్రజలు, శాంతప్రజలు
**law-breaker** న్యాయ విరోధి/భంజకుడు, చట్టాన్ని అతిక్రమించే వ్యక్తి; నేరగాడు
**law-court** న్యాయస్థానం
**law-giver** శాసనకర్త; స్మృతికర్త, ధర్మ/న్యాయ నిర్ణేత
**law maker** శాసనకర్త, న్యాయనిర్ణేత
**law of dominance** బహిర్గతత్వ నియమం
**law of gravitation** గురుత్వాకర్షణ సూత్రం
**law of independent assortment** స్వతంత్ర వ్యూహన నియమం
**law of segregation** పృథక్కరణ నియమం
**law of the land** దేశన్యాయం, దేశాచారం
**law-piety** ధర్మపరాయణత
**law suit** దావా, వ్యాజ్యం
**penal law** దండనీతి, శిక్షాస్మృతి
**to take law into one's own hands** స్వయంగా న్యాయనిర్ణయం చేయు; న్యాయస్థానాలను ఖాతరు చేయకపోవు
**lawful** న్యాయ సమ్మత/బద్ధ, శాసనబద్ధ; ఉచిత, క్రమ; ఔరస
**lawlessness** న్యాయరాహిత్యం; అశాంతి; అవ్యవస్థ
**lawn-mower** దోకుడుపార; గడ్డికోసే యంత్ర (సాధన)ం
**lawyer** వకీలు, ప్లీడరు, న్యాయవాది, లాయరు
**lax (lenis)** శిథిల
**laxative** మృదు విరేచనకారి
**laxity** మెత్తదనం, మాంద్యం, సుస్తీ; సడలుబాటు; విశృంఖలత
**lay** *adj* సాధారణ, లౌకిక *n* పదం, గానం, జానపద, గీతం; పొర, ఒక విధమైన వరస *v* ఉంచు,కిందపెట్టు, (కోడి) గుడ్లు పెట్టు; పరచు, పందెంవేయు; అశక్తుని చేయు, శాంతపరచు
**lay aside** జరుపు, పక్కన పెట్టు, విడిచిపెట్టు
**lay bare** నగ్నంచేయు, స్పష్టపరచు
**lay down** త్యజించు, త్యాగం చేయు, వదులుకొను, అస్త్రసన్యాసం చేయు; నిర్ధరించు, స్థాపించు, నిరూపించు, విధించు, తెలియజేయు
**lay down arms** లొంగిపోవు, ఆయుధ విసర్జన చేయు
**lay down the law** చట్టం/శాసనం చేయు, న్యాయవిధి నిర్ణయించు
**lay fast** పట్టుకొని/అంటుకొని ఉండు
**lay great store upon** చాలా గౌరవించు
**lay hands on** కొట్టు, చేయి చేసుకొను; ఆక్రమించు, స్వాధీనం చేసుకొను
**lay heads together** కలిసికట్టుగా/సమష్టిగా ఆలోచించు/పనిచేయు; సంప్రదించు, సలహాపడు
**lay hold of** పట్టుకొను
**lay-off** (తాత్కాలికమైన) మూసివేత; నిర్బంధ నిరుద్యోగకాలం
**lay-off pay** నిరుద్యోగకాలవేతనం, మూసివేత కాలపు జీతం
**lay on the table** సభకు సమర్పించు, సభ దృష్టికితెచ్చు/ఎదుటపెట్టు; తెలియబరచు
**lay open** స్పష్టం చేయు, ప్రకటించు, తెలియబరచు; తెలియు, బహిరంగమగు
**lay-out** *n* రూపరేఖ, ఆకారరేఖ; నక్షా; ప్రదర్శన *v* పొడిగించు, ప్రదర్శించు, క్రమబద్ధంగా పరుచు; వెచ్చించు, క్రమించు
**lay waste** వ్యర్థమగు; పెరికివేయు; నష్టంచేయు
**layer** పొర, స్తరం, పటలం
**layered** స్తరిత
**layering** స్తరణం; అంటుగట్టడం
**layman** సామాన్యుడు; లౌక్యుడు, లౌకికుడు, అవైదికుడు

**layout** విన్యాసం
**lead** *n* (=intro) పరిచయం, ప్రస్తావన; నాయకత్వం, ప్రథమస్థానం, మార్గదర్శనం; వాహకం; సీసం, సీసపురేకు *v* నాయకత్వం వహించు, దారిచూపు, ముందు నడుచు, నడిపించు, సలహా చెప్పు; ప్రారంభించు
**lead astray** తప్పుదోవ పట్టించు
**lead story** ప్రధాన వార్త/కథనం
**lead the way** దారిచూపు
**take the lead** అందరికన్నా ముందునడుచు, నాయకత్వం వహించు, అగ్రేసరుడగు
**leader** (=lead writer) పరిచయ రచయిత; నాయకుడు, దళవాయి, సంపాదకీయం
**leader of the opposition** ప్రతిపక్షనేత
**ring leader** ముఠానాయకుడు
**leadership** నాయకత్వం
**leading** అగ్ర, ప్రముఖ, ప్రధాన, ముఖ; సూచక, మార్గదర్శి, నాయకత్వం వహించే/వహిస్తున్న
**leading article** (ప్రధాన) సంపాదకీయవ్యాసం
**leading question** ప్రత్యుత్తరసూచక ప్రశ్న
**leaf** ఆకు, పత్రం; పుట, పేజీ
**take the leaf out of one's book** అనుసరించు, అనుకరించు
**turn a new leaf** (జీవితంలో) కొత్త అధ్యాయం ప్రారంభించు
**leaflet** చిన్న ఆకు/పత్రం; కరపత్రం
**league** కూటమి, సమితి, సంఘం, సమాఖ్య, సంఘటన
**leak** బెజ్జం; క్షరణం,కారటం; కారు
**leak out** బయటికి పొక్కు, రహస్యం బయటపడు
**leaking** కారుతున్న
**leap** గెంతు, దూకు, దాటు, లంఘించు
**leap in the dark** చీకట్లోకి/కళ్ళుమూసుకొని దూకు
**leap year** అధిక సంవత్సరం
**learn** నేర్చుకొను, చదువు, (వార్త) తెలుసుకొను, జ్ఞానం సంపాదించు
**learned** విద్యావంతుడైన, పండితుడైన, శిష్ట
**learned word** శిష్టశబ్దం
**learner** బోధితుడు, శిక్షితుడు, జ్ఞానార్థి, విద్యార్థి
**learning** విద్య, జ్ఞానం, పాండిత్యం
**learning asset** అభ్యసనశక్తి
**learning by doing** చేస్తూ నేర్చుకోవటం
**learning experience** అవగాహనానుభవం
**learning guarantee** అభ్యసన హామీ
**learning process** అవగాహన ప్రక్రియ
**learning society** అభ్యసన/అభ్యాసక సమాజం
**lease** *n* కౌలు, బాడుగ *v* అద్దెకిచ్చు, కౌలుకిచ్చు, కౌలుకు పుచ్చుకొను
**lease hold** కౌలుభూమి, కౌలుద్వారా హక్కు
**least** కనిష్ఠ, తక్కువలో తక్కువ, చాలా కొంచెం, అల్పాల్ప, లేశమాత్ర
**leather** చర్మం, తోలు
**leave** *n* సెలవు, అవకాశం, అనుమతి, ఆజ్ఞ *v* వెళ్ళిపోవు, వదిలివేయు, త్యాగం చేయు
**casual leave** అవసర/యాదృచ్ఛిక సెలవు
**compensatory leave** పరిహారరూపకమైన సెలవు
**earned leave** ఆర్జిత/ఉపార్జిత సెలవు
**french leave** గైర్‌హాజరీ, అనుమతిలేని సెలవు
**leave behind** వదలివెళ్ళిపోవు
**leave hold of** పట్టువదలు
**leave, medical** అనారోగ్యానికి సెలవు
**leave off** వదిలివేయు
**leave out** వదలు, మరచిపోవు, తీసివేయు
**maternity leave** ప్రసూతి సెలవు
**take one's leave (of)** సెలవు తీసుకొను, అనుమతి పొందు
**leaven** *n* రొట్టె పొంగటానికి ఉపయోగించే పదార్థం *v* కలుపు, కల్తీచేయు
**leaves** ఆకులు
***lebensraum*** (వాణిజ్యాభివృద్ధి/కాంక్షించే) అన్యస్థలం
**lechate** నిక్షళితం
**lecture** *n* ఉపన్యాసం, ఉపదేశం, వ్యాఖ్యానం *v* ఉపన్యసించు, వ్యాఖ్యానించు
**lecture method** ఉపన్యాస పద్ధతి
**ledge** ఒడ్డు, కట్ట, ముందుకు (పొడుచుక) వచ్చిన భాగం
**ledger** ఆవర్జా, ఖాతా
**lee** గాలినుంచి రక్షణ కల్పించే స్థలం
**leech** జలగ
**leeward** గాలివాలు
**left** ఎడమ, వామ
**left-wing** వామపక్షం
**leg** కాలు, పాదం, చరణం
**legacy** వీలునామా ఆస్తి, అనురిక్థం, ఉత్తర దాయిత్వం, వంశపారంపర్యంగా వచ్చిన ఆస్తి



**legal** న్యాయ/శాసన సంబంధి, న్యాయాత్మక, ధర్మబద్ధ
**legal action** చట్టబద్ధ/న్యాయాత్మక చర్య
**legal advisor** న్యాయసలహాదారు
**legal aid** న్యాయసహాయం
**legal depository** న్యాయవిహిత నిక్షేపస్థానం
**legal duty** న్యాయోక్త కర్తవ్యం
**legal notice** న్యాయపూర్వకమైన నోటీసు
**legal right** చట్టబద్ధమైన/న్యాయబద్ధమైన హక్కు
**legal tender** న్యాయసమ్మత ద్రవ్యం/చెలామణి
**legalisation** న్యాయబద్ధీకరణ(ం), న్యాయ సమ్మతీకరణ(ం)
**legality** న్యాయత్వం, నాయబద్ధత, చట్టబద్ధత
**legalize** న్యాయీకరించు, న్యాయబద్ధంచేయు
**legally** న్యాయతః
**legatee** దాయాది, అనురిక్థగ్రాహి, వీలునామా హక్కుదారు
**legation** రాయబారి బస, (విదేశంలో) ప్రభుత్వ ప్రతినిధి ఆవాసం
**legend** ఆఖ్య, ప్రాచీనకథ, ఇతిహాసం; పురాణ/నీతి వాక్యం; (చిత్రపట) వ్యాఖ్యానం/వివరణ
**legendary** పురావృత్త సంబంధి
***legerdemain*** హస్తకౌశలం, దొంగతనం
**legible** సువ్యక్త, సుస్పష్ట
**legion** దళం, సైనికదళం, సైన్యం; సమూహం; లెక్కలేని, చాలా ఎక్కువ
**legislation** చట్టం/శాసనం (చేయటం/ ఆమోదించటం)
**legislative** చట్టసభకు సంబంధించిన
**legislative assembly** శాసనసభ, విధానసభ
**legislative competence of parliament** శాసనసభ/పార్లమెంటుకున్న శాసనంచేసే అధికారం
**legislative council** శాసన/విధాన మండలి
**legislative power** శాసనాధికారం, శాసనం చేసే అధికారం
**legislator** శాసనసభ్యుడు, పార్లమెంటు సభ్యుడు
**legislature** విధాన/శాసన సభ, విధాన/శాసన మండలి
**legitamacy** చట్టసమ్మతి, సక్రమత
**legitimate** న్యాయ/శాసన బద్ధ; ఉచిత, సహేతుక, ఔరస
**legitimate grievances** న్యాయమైన కోరికలు
**legitimate trade union activity** కార్మిక సంఘాల చట్టబద్ధమైన కార్యకలాపాలు
**legume** ద్వివిదారకఫలం; పప్పుధాన్యం
**leisure** తీరిక, విరామం, విశ్రాంతి, ఖాళీసమయం
**leisure period** విశ్రాంతి సమయం
**lend** ఋణమిచ్చు, అరువిచ్చు, అద్దెకిచ్చు
**lend lease** కౌలుకిచ్చు
**lend one's ears** (చెవి ఒగ్గి) విను
**length** పొడవు, దీర్ఘత, విస్తృతి; గడువు, సమయం
**at length** సవిస్తరంగా, పూర్తిగా, చివరకు
**lengthening** దీర్ఘీకరణం
**lengthening, compensatory** లోపదీర్ఘత
**lengthy** పొడవైన, విస్తృత
**lenient** సాధు, సౌమ్య, దయార్ద్ర, దయగల
**lenis** శిథిల
**lenition** శిథిలనం
**lens** కటకం
**lens, cataractous** అపారదర్శక నేత్రకటకం
**lens, contact** సంపర్కకటకం
**lensometer** కటకమాపకం
**lenticular** కుంభద్వయాకార
**lentil** ఒక రకం బీన్సు మొక్క
**Leo** సింహం
**leper** కుష్ఠురోగి
**leprosarium** కుష్ఠురోగ వైద్యశాల
**leprosy** కుష్ఠురోగం
**Lepus** చెవులపిల్లి
**lesbianism** (స్త్రీలలో) స్వలింగసంపర్కం
***lese-majesty (leze-majesty)*** రాజద్రోహం
**lesion** గాయం
**less** న్యూన, తక్కువ, కొంచెం, చిన్న
**lessee** కౌలుదారు
**lesser** లఘు, అల్పీయ, లఘుతర, అల్పతర
**lesson** (గుణ)పాఠం; అనుభవం
**lesson plan** పాఠ్యపథకం
**lessor** కౌలుదాత
**lest** కానట్లు; అవుతుందనే భయం/సందేహం తో
**let** *n* లఘుసరోవరం; వీలు, సౌకర్యం *v* కౌలుకిచ్చు, అద్దెకిచ్చు; ఆజ్ఞ ఇచ్చు; వదిలివేయు; అనుమతించు
**let down** ముంచు, సమయానికి తోడ్పడకుండు
**let loose** బంధవిముక్తం చేయు
**let off** వదిలివేయు, విడిచిపెట్టు

**lethal** మారక, ప్రాణహానికర, ఘాతుక, చంపే, ప్రాణాంతక
**lethal weapon** మారణాయుధం
**lethargy** అలసత్వం, ఉదాసీనత, సుస్తీ, మాంద్యం, మందకొడితనం, నిశ్చేష్టత, ఆలస్యం
**letter** జాబు, లేఖ, ఉత్తరం; అక్షరం, వర్ణం
**letter grade system** అక్షరాంకన వ్యవస్థ
**letter of authority** అధికారపత్రం
**letter of credence** అధికార పరిచయపత్రం
**letter of introduction** పరిచయపత్రం
**letters patent** ఉన్నత న్యాయస్థానంవారి అధికారపత్రాలు
**man of letters** సాహిత్యకారుడు, విద్యావంతుడు, పండితుడు
**leucocyte** తెల్లరక్తకణం
**leucocytosis** (రక్తంలో) తెల్లరక్తకణాల పెరుగుదల
**leucoderma** బొల్లిమచ్చలు, తెల్లమచ్చలు
**leucoma** కంటిలో తెల్లపువ్వు
**leucoplast** శ్వేతరేణువు
**leucorrhoea** (స్త్రీలకువచ్చే) తెల్లబట్ట
**leukemia** (ఒకవిధం) పాండురోగం
**leukopenia** (రక్తంలో) తెల్లరక్తకణాల తరుగుదల
**leukopoiesis** శ్వేతకణోత్పత్తి
**levant** (మధ్యధరా సముద్రానికి) తూర్పున ఉన్న దేశాలు (సిరియా మొ.)
**level** *adj* సమతల, ఒకేవిధమైన *n* మట్టం, (సమ)తలం; స్థాయి; ప్రమాణం, సమప్రదేశం, సమత్వం *v* చదును చేయు, సమానంచేయు
**level crossing** రైలు భూమార్గాలు కలిసే చోటు, రైలుగేటు, రైలుపట్టాల అడ్డుదారి
**level-headed** నెమ్మదైన, శాంత, ఆలోచన గల
**lever** తులాదండం
**levity** తేలికదనం, చులకన, బరువులేమి; చాపల్యం
**levy** *n* పన్ను, శిస్తు; సైన్యంలో చేరిక *v* పన్ను/శిస్తు విధించు/వసూలుచేయు, భర్తీచేయు
**lewd** అశ్లీల, కాముక, కామాతురతగల
**lex** న్యాయం
**lexeme** కోశాంశం
**lexical** నిఘంటు సంబంధి, నైఘంటుక
**lexico-statistics** పదగణాంక శాస్త్రం
**lexicographer** కోశకారుడు, నిఘంటుకారుడు
**lexicography** నిఘంటునిర్మాణ శాస్త్రం
**lexicon** నిఘంటువు, శబ్దకోశం
**liability** బాధ్యత, ఉత్తరదాయిత్వం, పాత్ర; నష్టం, రుణం, భారం
**limited liability** పరిమిత బాధ్యత/నష్టం
**unlimited liability** పూర్తి నష్టం/బాధ్యత
**liable** బాధ్య, ఉత్తరదాయి
**liasion** సంధి; అనుసంధానం, (అనుచిత ప్రేమ) సంబంధం, అనుసంధాయకత
**liasion officer** అనుసంధాయకాధికారి
**libel** *n* నిందాలేఖనం, అవమానం; అభియోగ పత్రం, పరువునష్టం *v* అవమానించు, దూషణలతో/నిందాలేఖ రాయు
***libel per quod*** సూచ్య నింద
***libel per se*** వాచ్య నింద
**liberal** ఉదార, ధారాళ
**liberal arts** స్వతంత్ర కళలు
**liberal education** స్వతంత్రవిద్య, స్వేచ్ఛా(పూరిత)విద్య
**liberalisation** సరళీకరణ
**liberalism** ఉదారవాదం
**liberate** స్వేచ్ఛ, స్వతంత్రత, ముక్తి
**liberation** విడుదల, విముక్తి, స్వాతంత్ర్యం
**liberty** స్వేచ్ఛ; స్వతంత్రత, ముక్తి
**at liberty** స్వతంత్రంగా
**civil liberty** పౌరస్వేచ్ఛ, వ్యావహారిక స్వేచ్ఛ, పౌరహక్కులు
**liberty of the press** పత్రికా స్వేచ్ఛ/స్వాతంత్ర్యం
**take liberties** అనుచితలాభాలు పొందు, ఇష్టం వచ్చినట్లు వ్యవహరించు
**libido** (అమిత) కామాతురత/లైంగికవాంఛ, మూలశక్తి
**Libra** తుల, తులారాశి
**library** గ్రంథాలయం, గ్రంథభాండాగారం
**circulating library** సంచార/పుస్తకాలద్దెకిచ్చే గ్రంథాలయం
**library information service (LRS)** గ్రంథాలయ సమాచార సేవ
**library legislation** గ్రంథాలయచట్టం
**reference library** పరామర్శ గ్రంథాలయం
**lice** పేలు
**licence** *n* అనుమతి (పత్రం), ఆజ్ఞాపత్రం *v* అనుమతించు, అధికారమిచ్చు, ఆజ్ఞాపత్రమిచ్చు
**licence fees** అనుమతి రుసుము
**licencing agency** అనుమతిదాత, ముక్తియారీ
**licencing procedure** అనుమతి విధానం/పద్ధతి



**licensee** అనుమిత వ్యక్తి, అనుమతిపొందిన వ్యక్తి
**licentiate** అనుజ్ఞప్తుడు
**licentious** స్వేచ్ఛా/స్వైర విహారం చేసే, విచ్చలవిడి
**licentiousness** స్వేచ్ఛావిహారం, విచ్చలవిడితనం, స్వైరవర్తనం, వ్యభిచారం
**licitum** న్యాయమైన
**lick** నాకు, గతుకు
**lick the dust** మట్టికరచు, ఓడిపోవు
**lid** మూత
**lid, eye** కనురెప్ప
**lidido** కామాతురత
**lie** *n* అసత్యం, అబద్ధం, మోసం *v* అబద్ధం ఆడు/చెప్పు, మోసపుచ్చు; పడుకొను, పొంచి ఉండు
**lie in state** అధికార గౌరవాలతో పడి ఉండు
**lie obstetrical** గర్భంలో శిశువులాగా ఉండు
**liege** *adj* విశ్వసనీయ *n* ప్రభువు, స్వామి
**liege-lord** సామంత ప్రభువు
**liege-man** సామంత సేవకుడు
**lien** ధారణాధికారం
**lieu** అధికారం, హక్కు, ధారాళాధికారం
**in lieu of** బదులుగా, ఆ స్థానంలో
**lieutenant** లెఫ్టనెంట్, సహాయకుడు
**life** ప్రాణం, జీవితం, ఆయువు; జీవితచరిత్ర
**expectation of life** ఆయుష్కాలం
**life belt** రక్షకపటకా
**life blood** జీవనసారం, జీవనాధారం, బతుకుతెరువు
**life-expectation** జీవిత పరిమాణం
**life history** జీవిత చరిత్ర/వృత్తాంతం
**life insurance** జీవిత బీమా
**life-line** ప్రాణరక్షక (రజ్జువు)/ప్రాణం కాపాడే గొట్టం
**life long** జీవిత పర్యంతం, జీవితాంతం
**life sciences** జీవశాస్త్రాలు
**life sentence** యావజ్జీవ కారాగార శిక్ష
**lift** *n* అభివృద్ధి, మద్దతు; పైకీ కిందికీ కదిలే గది *v* ఎత్తు, పైకెత్తు, పైకి తెచ్చు, ఉద్ధరించు, అభివృద్ధిపరచు, మద్దతిచ్చు
**lift irrigation** ఎత్తిపోత సేద్యం
**lift the control** నియంత్రణ తొలగింపు
**weight lifting** బరువులెత్తటం
**ligament** స్నాయువు; పట్టా
**ligaments** అస్థిబంధకాలు
**ligation** బంధనం, ముడివేయటం
**ligature** ముడివేయటానికి వాడే దారం, బంధకసూత్రం
**light** *adj* లఘు, తేలికైన *n* దీపం, వెలుగు, ప్రకాశం, జ్యోతి, కాంతి *v* వెలిగించు, వెలుతురిచ్చు, కాంతి పుట్టించు
**according to one’s own lights** స్వబుద్ధితో, తన ఇష్టానుసారం
**bring to light** ప్రకటించు, చూపించు, వెలికితీయు, ప్రకాశింపజేయు
**light anti-aircraft** తేలిక విమాన విధ్వంసక (సాధన)ం
**light artillery** ఫిరంగిదళం
**light image formation** కాంతి ప్రతిబింబ కల్పన/రచన
**light industries** చిన్న/లఘు పరిశ్రమలు
**light infantry** తేలికపాటి ఆయుధాలు ధరించే పదాతిదళం
**light music** లలితసంగీతం
**light railway** ట్రాం దారి, లైట్ రైలుదారి
**light refreshment** ఉపాహారం
**lightening** మెరుపు, పిడుగు
**lighter** బోటు, దోనె, పడవ; వెలిగించే సాధనం
**lighterage** ఓడ సరుకు దింపే ఖర్చు; చిన్న ఓడల ద్వారా పెద్ద ఓడల్లోకి సామానెక్కించటం
**lighthouse** దీపగృహం, దీపస్తంభం
**lighting** కాంతి ప్రసారం/కల్పన
**like** సజాతి, పోలిన, సదృశ
**likelihood** సంభావ్యత
**likely** సంభావ్యంగా, బహుశా
**limb** అంగం, అవయవం, భాగం, శాఖ
**limb, lower** కాలు, పాదం
**limb, upper** బాహువు, చేయి
**limbus** కినారి
**lime** నిమ్మపండు; సున్నం
**lime light** ప్రసిద్ధి, ప్రఖ్యాతి, విఖ్యాతి
**limekiln** సున్నంబట్టీ
**limestone** సున్నపురాయి
**limit** *n* (సరి) హద్దు, అవధి, సీమ, పరిమితి
**limitation** (పరి)మితి, ప్రతిబంధకం, గడువు; నియంత్రణ
**limited** పరిమిత
**limited company** పరిమిత సంస్థ
**limited liability** పరిమిత బాధ్యత

**limited quantity** పరిమిత పరిమాణం/సంఖ్య
**limiting** పరిమితం చేసే
**limousine** లిమోజీన్ (కారు)
**limpid** స్వచ్ఛ, నిర్మల, స్పష్ట, తేట
**line** *n* గీత, రేఖ, శ్రేణి, పంక్తి; దారం, తాడు; గొట్టం; వంశం, వంశానుక్రమణిక *v* గీతగీయు, గురుతుపెట్టు, అస్తరువేయు
**line attribute** రేఖారోపితం
**line buffer** రేఖాతాటస్థ్యం
**line, midsternal** రొమ్ముటెముక, రొమ్ముమధ్యరేఖ
**line of communication** సంచార/సమాచార మార్గం, రాకపోకలదారి
**line of supply** సరఫరామార్గం
**line printer** రేఖాముద్రాపకం
**linea-alba** పొట్టమధ్యలో శ్వేతరేఖ
**lineage** వంశపరంపర, వంశావళి, వంశక్రమం, సంతతి
**lineal** వంశక్రమానుగత, పారంపర్యక్రమానుగత
**lineal descendant** వంశపరంపరాగతుడు, వంశ్యుడు; సంతానం, సంతతి; వారసుడు
**lineal heir** దాయాది, వారసు, వంశపరంపర వల్ల వారసుడైనవాడు
**lineament** ఆకృతి, ఆకారం, రేఖ; విలక్షణత, ప్రత్యేక లక్షణం
**linear** దీర్ఘ, ఒకే వరసలోనున్న
**linear array** దీర్ఘ విన్యాసం
**linear charge** దీర్ఘ భారం
**linear charge coupled device (LCD)** దీర్ఘభారసంయోజితోపకరణం
**linear equations** ఏకపంక్తి/దీర్ఘ సమీకరణం
**linear programming** రేఖీయ కార్యక్రమం
**linen** నార; బట్టలు/వస్త్రాలు
**liner** ప్రయాణికుల విమానం/ఓడ; వాణిజ్య నౌక/విమానం
**linesman** (రైలు, తంతి, విద్యుత్తు మొ. విభాగాల్లో) దారి/తీగలను సరిచూసే వ్యక్తి
**linger** ఆలపించు, జాలం చేయు, మెల్లగా నడచు, నిలుచు, వదిలిపోలేకపోవు
**lingua** జిహ్వ, నాలుక
***lingua franca*** ప్రజాభాష, సంపర్కభాష
**lingual** జిహ్వీయ; భాషాసంబంధి
**bi-lingual** ద్విభాషాభాషి, రెండు భాషలు మాట్లాడే వ్యక్తి
**multi-lingual** బహుభాషలు మాట్లాడే వ్యక్తి
**linguist** భాషాశాస్త్రవేత్త; బహుభాషాకోవిదుడు
**linguistic** భాషా(సంబంధి)
**linguistic geography** భాషామాండలిక శాస్త్రం
**linguistic medium** భాషామాధ్యమం
**linguistic minority** అల్పసంఖ్యాకభాషావర్గం
**linguistic ontogeny** వైయక్తిక భాషాచరిత్ర
**linguistic provinces** భాషాప్రయుక్త రాష్ట్రాలు/ప్రాంతాలు
**linguistic typology** భాషాజాతిశాస్త్రం
**linguistics** భాషాశాస్త్రం, భాషావిజ్ఞానం
**liniment** లేపనం, తైలం
**lining** పూత, అస్తరు
**link** *n* సంబంధం, మెలిక, గొలుసులోని కొక్కెం; దివిటీ; 7.92 అంగుళాల పొడవు *v* కలుపు, జోడించు
**link canals** పిల్లకాలవలు
**linkage** సహలగ్నత, తగిలింపు
**linseed** అవిసె/ఎల్లసెగె విత్తులు, అవిసెలు
**linseed oil** అవిసెనూనె
**lint** (శస్త్రచికిత్సలో వాడే) మెత్తటి గుడ్డ
**lip** పెదవి, అధరోష్ఠం
**lip, lower** అధరం, కింది పెదవి
**lip, upper** ఓష్ఠం, పై పెదవి
**lipaemia** వాసరక్తత, రక్తంలో కొవ్వుపదార్థాలు పెరగటం/ఎక్కువ కావటం
**lipid** కొవ్వుపదార్థం
**lipodystrophy** వాసనష్టి
**lipoid** కొవ్వు సంబంధి
**lipoma** కొవ్వు కంతి
**lipotropic** కాలేయంనుంచి కొవ్వు తగ్గించే
**lip reading** ఓష్ఠ పఠనం
**lipuria** మూత్రంలో కొవ్వు పోవటం
**liquefaction** ద్రవీకరణ(ం)
**liquify** ద్రవీకరించు; కరిగించు, కరగబెట్టు
**liquid** ద్రవం, ద్రవరూపి; పార్శ్వికం
**liquid manometer** ద్రవపీడన మాపకం
**liquidate** దివాలాతీయు; సమాప్తిచేయు; నిర్ధరించు
**liquidation** దివాలా; వ్యాపారం నిలిచిపోవటం; అంతం, పరిసమాప్తి
**go into liquidation** దివాలాతీయు, సమాపనం పొందు, సమాప్తిచెందు, మూసివేయు



**liquidity** ద్రవ్యత్వం
**liquifaction** ద్రవీకరణం
**liquifier** ద్రవీకరణి
**liquify** ద్రవీకరించు
**liquor** మద్యం, సారాకలిపిన ద్రవం, సారా(యి)
**lisping** అస్పష్టంగా మాట్లాడటం
**list** పట్టీ, పట్టిక, జాబితా
**listen** విను, ఆలకించు; శ్రద్ధాళువగు, లక్ష్యపెట్టు
**literacy** అక్షరజ్ఞానం, అక్షరాస్యత
**literal** శాబ్దిక; ఉన్నదున్నట్లు, అక్షరాక్షరం
**literary** సాహిత్య సంబంధి
**literate** అక్షరాస్య
**literature** సాహిత్యం, సారసత్వం, వాఙ్మయం
**lithiasis** ఆవయవిక పదార్థ ఘనీభవనం
**lithograph** శిలాముద్ర
**lithography** శిలాముద్రణ
**lithological constituent** శిలాశాస్త్రీయ ఘటకం
**lithological discrimination** శిలాశాస్త్రీయ విచక్షణ
**lithology** శిలాశాస్త్రం
**lithosphere** శిలావరణం
**lithotomy** మూత్రమార్గంలోని రాళ్ళ తొలగింపు
**litigate** వ్యాజ్యమాడు, దావా వేయు/నడుపు
**litigation** వ్యాజ్యం, దావా
**litigious** వ్యాజ్యగ్రస్త, దావాకోరు, పేచీకోరు, వాదపూరిత
**litter** *n* చెత్త, గడ్డిమెత్త; మేనా, పల్లకి; ఒక ఈత పంది పిల్లలు; తృణశయ్య *v* పారవేయు, వెదజల్లు, చెత్తతో నింపు; ఈను
***litterateur*** సాహితీప్రియుడు, సాహిత్యకారుడు
**little** కొంచెం, కొద్ది, అల్పం, స్వల్పం; చిన్న, పసి; శూన్యం
**littoral** *adj* (సముద్ర) తీరగత/తీరం దగ్గరి *n* తీరప్రాంతం, కోస్తా
**live** *adj* సజీవ; ప్రజ్వలిత *v* జీవించు, సజీవంగా ఉండు, బతికి ఉండు; నివసించు
**live down** చెరిపివేయు, మనసునుంచి తొలగించు, దూరంచేయు; (కళంకం) కడిగివేయు
**live link** సజీవ సంబంధం
**live upto** అందుకొను; అమలు చేయు
**live wire** కరెంటున్న తీగ; కష్టించి పనిచేసే వ్యక్తి
**livelihood** వృత్తి; జీవనాధారం
**lively** చురుకైన, ఉల్లాసంగల, తేజశ్శాలి
**liver** కాలేయం, కార్జం
**livery** దవాలీ; దుస్తులు
**livestock** పశుగణం, జీవధనం, పశుధనం
**livid** నీలిరంగు; కమలిన రంగుగల; గాయంతో కమలిన
**living** *adj* సజీవ(ం), సచేతన(ం); జీవత్/బతికి ఉన్న; వర్తమాన (కాలిక) *n* జీవిక, వృత్తి
**living layer** జీవస్తరం
**living system** జీవవ్యవస్థ
**living wage** జీవనభృతి
**lizards** బల్లులు, తొండలు
**load** *n* బరువు, భారవం; సామాను *v* సరుకెక్కించు, సామానునింపు, బరువులు వేయు
**loaded** సామానుతో నిండిన, బరువెత్తుతున్న
**loaded displacement** నిండుగా సామానులున్న పడవ బరువు
**loam** గడువు, అవధి
**loan** అప్పు, రుణం; ఎరువుమాట
**loathe** అనిష్ట, ఇష్టంలేని
**loathesome** అసహ్యకర
**lobar** ఖండ సంబంధి
**lobby** *n* ఉపవర్గం; నడవ; (చట్టసభల్లోని) సంప్రదింపు గృహం; తమ పక్షానికి తిప్పుకొనే గోష్ఠి/ప్రయత్నం *v* నచ్చజెప్పు, తన వైపు తిప్పుకొనేందుకు యత్నించు
**lobby circles** లాబీవర్గాలు
**lobe** (చెవి)తమ్మె; ఖండం
**lobe, ear** చెవితమ్మె
**lobe, frontal** లలాట ఖండం (మెదడులో)
**lobe, middle** మధ్యఖండం
**lobe, occipital** (మెదడులోని) పృష్ఠఖండం
**lobe, parietal** పార్శ్వఖండం, పార్శ్వికఖండం
**lobe, temporal** శంఖ ఖండం
**lobectomy** ఖండోచ్ఛేదన
**lobotomy** మెదడులోని భాగం
**lobule** లఘుఖండం, చిన్నతమ్మె
**local** స్థానిక, ఒకే ప్రాంతానికి చెందిన
**local administration** స్థానిక పరిపాలన, నగర పాలన
**local body** స్థానిక సంస్థ
**local colour** స్థానిక ప్రాముఖ్యం, ప్రాంతీయతా దృష్టి
**local government** స్థానిక ప్రభుత్వం, స్థానిక పాలకసంస్థ

**local rain** స్థానిక వర్షం
**local self-government** స్థానిక ప్రభుత్వం, స్థానిక పాలకసంస్థ
**locality** స్థానం, ప్రాంతం, వాడ, బస్తీ
**localization** స్థాన నిర్ణయం/నిర్ధారణం, స్థానీకరణ
**locate** కనుగొను, సరిహద్దు నిర్ధరించు, స్థాన నిర్దేశం చేసి అద్దెకిచ్చు
**location** స్థితి, (నిర్దిష్ట)స్థానం; నిర్ధారణ
**locative** సప్తమీ విభక్తి, అధికరణ కారకం
**lochia** ప్రసవానంతర స్రావం
**lock** తాళం
**lock, jaw** దవడ కదలకపోవటం
**lock stock and barrel** సంపూర్ణంగా, పూర్తిగా, మొత్తంగా
**lock-up** నిర్బంధించు, చెరసాలలో ఉంచు
**locked harbour** భూపరివేష్టిత నౌకాశ్రయం, లోరేవు
**lockout** మూసివేత, తాళాబందీ
**locomotion** గమనశక్తి, చలనశక్తి; చలనం; కదలిక
**locomotive** ఆవిరియంత్రం, రైలుబండి; చలనశక్తి నిచ్చే
**locomotive engine** రైలు ఇంజను
**locomotive yard** రైలింజనులుండే స్థలం
**locomotor disability** చాలన వైకల్యం
**loco-shed** రైలింజన్లుండే శాల
**locoworkshop** రైలింజన్లు మరమ్మతుచేసే శాల
**locus** బిందుపథం; స్థానం
***locus standi*** తాహతు, అధికారస్థానం, జోక్యం చేసుకొనే అధికారం/అర్హత
**locust** మిడతలదండు
**lodge** *n* మకాం, వసతి(గృహం) *v* ఉండు, మకాంచేయు; నిరసించు, ఫిర్యాదుచేయు
**lodge a complaint** (ఫిర్యాదు) దాఖలు చేయు
**lodge a protest** నిరసన తెలుపు, నిరసనపత్రం సమర్పించు
**lodging** వసతి (గృహం), నివాస (గృహ)ం; దాఖలు చేయటం, సమర్పణ
**loess** ఒండ్రునేల
**lofty** ఉన్నత, ఉత్కృష్ట, విశిష్ట, శ్రేష్ఠ, గర్వించే
**logarithm** సంవర్గమానం
**logbook** (కర్మాగారాదుల) దినచర్యాపుస్తకం, నౌకాగమన వివరణ పుస్తకం, గమనాగమన సూచక గ్రంథం

**logger head** మూర్ఖుడు, జడుడు
**at logger heads (with)** వివాదంలో, విభేదంతో
**logic** తర్క(శాస్త్ర)ం; న్యాయ(శాస్త్ర)ం
**logical** తర్కబద్ధ, (స)తార్కిక, సరైన
**logical grammar** తార్కిక వ్యాకరణం
**logician** తార్కికుడు, నైయాయికుడు
**logicism** తార్కికవాదం
**logistics** వ్యూహరచన; సైనిక నివాస/వసతి తంత్రం
**logograph** శబ్దలేఖనం
**logography** శబ్దలేఖన శాస్త్రం
**loin** నడుము, కటి(స్థానం)
**loin cloth** గోచీ గుడ్డ, కౌపీనం
**loiter** తచ్చాడు, తారట్లాడు
**long** *adj* దీర్ఘ, బహుకాలిక *adv* చాలాకాలంగా/దూరంగా *v* కోరు, ఆకాంక్షించు, ఆశించు
**in the long run** కాలక్రమాన, దీర్ఘకాలంలో
**long and short** కొద్దిమాటల్లో, సారాంశంగా/సంక్షేపంగా
**long consonant** ద్విరుక్త హల్లు
**long range** దూరప్రాంత, దీర్ఘకాలిక
**long range policy** దీర్ఘకాలిక విధానం
**long range rocket** దూరగామి క్షిపణి
**long-staple cotton** పొడుగుపింజె పత్తి
**long-term credit** దీర్ఘకాలిక రుణం/పరపతి
**long vowel** దీర్ఘాచ్చు
**longevity** దీర్ఘాయుర్దాయం
**longitude** రేఖాంశం
**longitudinal** నిలువు, దీర్ఘ, రేఖాంశ సంబంధి
**longitudinal depression** అనుదైర్ఘ్యగర్తం
**look** *n* దృష్టి, రూపం, ముఖం, చూపు, దర్శనం *v* చూచు, కనిపించు, తెలియు
**look askance at** సందేహపూర్వకంగా చూచు
**look down upon** నీచ/తక్కువ దృష్టితో చూచు, తక్కువని భావించు
**look out for** వేచిచూచు; సిద్ధంగా ఉండు
**look to** చూచు
**look upto** ఆశించు, ఆకాంక్షించు
**loom** మగ్గం; అస్పష్టంగా కనిపించు
**loop** *n* ఉచ్చు, ముడుపు, పల్టీ; గర్భనిరోధక సాధనం *v* ఉచ్చు వేయు, పల్టీకొట్టు
**loophole** లొసుగు, కంత, గోడలోని కన్నం
**loose** *adj* వదులు, విడి, కదిలే, విముక్త, అసంబద్ధ, స్వతంత్ర, భ్రష్ట, అవినీతికర *v* వదులు, వదిలిపెట్టు, విప్పు, విడదీయు, విడిచిపెట్టు



**let loose** విడిచిపెట్టు, బంధవిముక్తుని చేయు
**loose character** చెడునడవడిగల, శీలభ్రష్ట, చరిత్రహీన
**loose ground** నష్టపోవు, ఓడిపోవు, వెనక్కుతగ్గు; ఆధారం పోగొట్టుకొను
**loose heart** ధైర్యం కోల్పోవు, మనసు విరుగు
**loose one's balance** క్రమం తప్పు, గాభరాపడు; విరుచుకపడు
**loose sight of** మరచిపోవు
**loot** *n* దోపిడీ, కొల్ల *v* దోచుకొను, లూటీచేయు, కొల్లగొట్టు
**lop** ఛేదించు, తెంచివేయు
**lopsided** అసమగ్ర, తలకిందులు, క్రమరహిత
**loquacious** వాచాల
**lord** ప్రభువు; యజమాని
**house of lords** (బ్రిటన్లో) ఎగువసభ
**lordosis** వెన్ను వెనక్కు వంగటం
**lore** విద్య, విజ్ఞానం, పాండిత్యం
**lose** కోల్పోవు, పోగొట్టుకొను, నష్టపడు, దారితప్పు, ఓడిపోవు
**loss** నష్టం, లోపం, చ్యుతి, హాని, ఓటమి
**be at loss** ఏదీ అర్థంకాకుండు; నష్టపడు, హైరానాపడు
**lot** మొత్తం; భాగ్యం, అదృష్టం; భాగం, ముక్క
**drawing of lots** లాటరీతీయటం
**the lot** మొత్తం, పూర్తి
**lotion** మందునీరు, ఔషధజలం
**lottery** లాటరీ
**lotus** తామర
**loud** బిగ్గర, పెద్ద, తీవ్రం
**loud reading** శాబ్దిక పఠనం
**loud speaker** ధ్వని విస్తారకం
**loudness** శబ్దాధిక్యం, ధ్వనితీవ్రత
**lounge** విశ్రాంతి మందిరం; విశ్రమించు
**loupe** (నేత్రవైద్యుల) దుర్భిణీ (యంత్రం)
**louse** పేను
**louse, head** తలపేను
**low** తక్కువ, తగ్గిన, తేలిక, చవక, సామాన్య; వంగిన, పల్లంగా/గుంటగా ఉన్న; మెల్లని, క్షుద్ర
**low brow** సంస్కారహీనుడు
**low land** పల్లపుభూమి, నిమ్న స్థలం/ప్రాంతం/భూమి
**low tone** హీనస్వరం

**low vowel** నిమ్నాచ్చు
**lower** కింది, నిమ్న(తర), అవర, అధః
**lower court** దిగువ/కింది కోర్టు/న్యాయస్థానం
**lower house** దిగువసభ
**lower house of legislation** శాసనసభ
**lower pridsim** అధోంతశ్చర్మం
**lowest price** కనిష్ఠధర
**loyal** విశ్వాసంగల/(రాజ) భక్తిగల
**loyalty** (రాజ)భక్తి, విశ్వాసం, నమ్మకం
**lozenge** (చప్పరించే) మందుబిళ్ళ
**lubricant** కందెన; రాపిడి తగ్గించటం
**lubricate** కందెనవేయు, చమురుపెట్టు; మెత్తబరచు, స్నేహించేయు
**lubricating oil** స్నిగ్ధకారితైలం, రాపిడి తగ్గించే నూనె
**lubrication** స్నేహనం, మెత్తబరచటం; కందెన
**lucid** స్వచ్ఛ, నిర్మల, స్పష్ట, సరళ, ఉజ్వల, సులువైన
**lucid interval** నిరున్మాద స్థితి, సంధి విరామస్థితి
**lucidity** తేట(దనం), తెలివిలో ఉండటం
**luck** అదృష్టం, భాగ్యం
**lucky** అదృష్టం/భాగ్యం గల
**lucoderma** బొల్లి
**lucrative** లాభసాటి, లాభదాయక, లాభప్రద
**ludicrous** పరిహాసాస్పద, నవ్వుపుట్టించే
**luggage** సామాను
**luggage van** సామాను బండి/రైలుడబ్బీ
**lugubrious** ఉదాసీన, మలిన, శోకతప్త
**lukewarm** గోరువెచ్చని; సాహసంలేని, ఉపేక్షతో కూడిన
**lull** *n* స్తబ్ధత, క్షణికశాంతి *v* జోకొట్టు, శాంతపరచు, శాంతింపజేయు
**lumbago** నడుము నొప్పి
**lumbar** కటిసంబంధి, నడుముకు సంబంధించిన
**lumbar, vertebral** వెన్నుపూస
**lumber** *n* భారీ సామగ్రి; కోసిన కలప, కోత కలప
**lumen** నాళం
**luminary** ప్రకాశమాన; జ్ఞాని
**luminescence** దీప్తి, ప్రకాశం, వెలుగు, ప్రకాశకత్వం
**luminescent** ప్రకాశవంతమైన, దీప్తిమంతమైన, మెరిసే, వెలిగే
**luminiferars** కాంతి వాహి/వాహకం
**luminiferous** మెరిసే
**luminosity** దీప్తి, మెరుపు, ప్రకాశం, వెలుగు
**luminous** స్వయంప్రకాశంగల, ప్రదీప్త, దేదీప్యమాన, కాంతిమంతమైన

**be on the move** ప్రయాణాల్లో ఉండు
**make a move** కదలు, అడుగువేయు
**move a resolution** తీర్మానం ప్రవేశపెట్టు
**moveable** చర, అస్థిర
**moveable property** చరాస్తి
**movement** గమనం, కదలిక, చలనం, గతి, రవాణా; ఆందోళన, ఉద్యమం
**movement instruction** చలనసూచన
**mover** ప్రతిపాదకుడు
**moving corpse** నడపీనుగు
**mucilage** జిగురు
**muck** పేడ, ఎరువు
**mucus** శ్లేష్మం
**mud** బురద, అడుసు, బాడి, అసలు, పంకం, జంబాలం
**fling mud** బురదచల్లు
**mud flow** పంకప్రవాహం
**muddle** *n* అలజడి, గడబిడ *v* గడబిడ చేయు, అలజడిచేయు
**muddy** బురదగా ఉన్న; అస్పష్ట
**muffle** మూయు, ముసుగుపెట్టు
**mulatto** మిశ్రజాతి
**mulberry** పూతికమొక్క, పట్టుపురుగు చెట్టు
**mule** కంచరగాడిద, అశ్వతరం; మూర్ఖుడు
**multi-** బహు(ముఖ)
**multicarpellary** బహుఫలదళయుత అండకోశిక
**multicellular** బహుకణ
**multi dimensional** బహు మితీయ
**multi disciplinary** బహుశాస్త్రమిశ్రిత/సంబంధి
**multi faceted** బహుముఖ, బహుముఖీన
**multifarious** బహుముఖ, వివిధ, అనేక (ప్రకారక)
**multiform** అనేకరూపి, నానావిధ
**multigrade teaching** బహుళ తరగతి బోధన
**multigravida** బహుప్రసూతి
**multilateral** బహువిధ, బహుముఖ
**multilateral convertability** అనేకదేశాల నాణేలతో వ్యాపారసాధ్యత
**multilateral trade arrangement** అనేక దేశాల వ్యాపార సంబంధాలు, బహుపక్షీయ వ్యాపార ఏర్పాట్లు
**multilevel** బహుస్థాయి(క)
**multilineal** బహురేఖలుగల
**multilingual** బహుభాషాభాషి
**multiloquent** బహువాచాల
**multimedia** బహుమాధ్యమిక
**multi-millionaire** కోటీశ్వరుడు
**multinational** బహు(ళ) జాతీయ
**multinomial** బహుపద
**multipara** బహుప్రసూతి
**multi period** బహుకాలిక, బహుసామయిక
**multiplexor** బహుగుణకం
**multi processor** బహుప్రవర్తకం
**multi sector** బహురంగ (సంబంధి)
**multi-sensory approach** బహుశేంద్రియ పద్ధతి
**multi spectral** బహువర్ణపటయుక్త
**multi spectral scanner** బహువర్ణపటశోధకం
**multivariate** బహుపరివర్తనశీల/చరాంశయుక్త
**multivarious brightness** బహువిధకాంతి
**multiple** *adj* చాలా, అనేక, బహువిధ *v* గుణిజం, గుణకం
**multiple choice questions** బహుళైచ్ఛిక ప్రశ్నలు
**multiplicand** గుణ్యం
**multiplication** గుణకారం
**multiplicity** అనేకత్వం, బహుళత్వం, బాహుళ్యం
**multiplier** గుణకం
**multiply** హెచ్చవేయు, గుణించు; అధికమగు; సంతానోత్పత్తి చేయు
**multipronged attack** బహుముఖ దాడి
**multipurpose** బహుళార్థ(సాధ)క
**multistage rocket** అంచెలంచెల క్షిపణి
**multitude** జనసమూహం, జనసాధారణం; బాహుళ్యం, సమూహం; బహుసంఖ్య
**multitudinous** అసంఖ్యాక, లెక్కలేని
**multi-valence** బహుసంయోగ సామర్థ్యం
**multi-valent** బహుసంయోగ సమర్థ
**mummify** శవాన్ని పదిలపరచు
**mumps** గవదబిళ్లలు
**mundane** లౌకిక, సాంసారిక, ఐహిక
**municipal** నగరపాలక/పురపాలక(సంబంధి), దేశీయ
**municipal commisioner** పురపాలక కమీషనర్
**municipality** పురపాలక సంఘం
**munificence** దానశీలత, ఉదారత, ధారాళత
**munificent** ఉదార, దానశీల
**munition** యుద్ధసామగ్రి
**munsif** మునసబు



**mural** *adj* గోడలాంటి *n* కుడ్యచిత్రం
**murder** *n* హత్య, వధ *v* వధించు, హత్యచేయు, అంతమొందించు
**murky** మసకగా ఉన్న, అంధకారమయ; గాఢ; మురికి
**murmur** మర్మరధ్వని, సణుగుడు, గొణుగుడు, మందస్వరం
**murmured vowel** మర్మరితాచ్చు
**muscle** కండ(రం)
**Muscovite** అభ్రకం రాయి
**muscular** కండరాలకు సంబంధించిన; మాంసల, శక్తిశాలి
**muse** *n* సరస్వతి, విద్యాధిదేవత; కవితాశక్తి; గాఢాలోచన, పరధ్యానం *v* గాఢాలోచన చేయు, పరధ్యానంగా ఉండు
**museum** (వస్తు) ప్రదర్శనశాల, సంగ్రహాలయం
**mushroom** *adj* సాధారణ, తాత్కాలిక *n* కుక్కగొడుగు; కొత్తగా ధనవంతుడైన వ్యక్తి
**music** సంగీతం, గాన కళ/విద్య
**music record** సంగీత లేఖ్యం
**musical** శ్రావ్య, సంగీతమయ, గానసంబంధి
**musician** గాయకుడు, గాయని, సంగీత వేత్త/శాస్త్రజ్ఞుడు
**musk** కస్తూరి
**musk-ox** కస్తూరి ఎద్దు
**musket** చిన్న తుపాకి
**musketeer** తుపాకీ పట్టిన వ్యక్తి, సైనికుడు
**mustard** ఆవాలు
**mustard oil** ఆవనూనె
**muster** *n* గుంపు *v* హాజరు తీసుకొను; ఒకచోట చేరు, ఐక్యమగు; పోగుచేయు, జోడించు
**muster-roll** హాజరు/మస్తరు పట్టిక/జాబితా
**musty** మురిగిన, దుర్గంధపూరిత
**mutation** పరివర్తనం, మార్పు; ఉత్పరివర్తన; విక్రియ
***mutatis mutandis*** అవసరమైన మార్పులతో
**mutative** విక్రియాత్మక
**mute** *adj* మూక, మూగ, మౌన *n* మూకవ్యక్తి, మూగమనిషి; పలకని అక్షరం; స్పర్శధ్వని
**mutilate** వికృతీకరించు, ముక్కలు ముక్కలు చేయు, ఖండించు, ఛిన్నాభిన్నం చేయు
**mutilated** ఖండిత, విరూపిత
**mutilation** విరూపణం, వికృతీకరణం, ఖండనం
**mutineer** విద్రోహి, తిరుగుబాటుదారు
**mutinous** విద్రోహపూరిత
**mutiny** *n* తిరుగుబాటు, విద్రోహం; ఉపద్రవం *v* తిరుగుబాటు చేయు, విద్రోహచర్యలకు దిగు
**mutter** గొణుగు, సణుగు
**mutton** మేకమాంసం
**mutual** అన్యోన్య, పరస్పర
**mutual aid** పరస్పర సహాయం
**mutual pairs** జంటలు
**muzzle** *n* తుపాకి చివరిభాగం; (గొడ్లకు వేసే) ముక్కుతాడు *v* నోరునొక్కు
**myasthenia** కండరాల దుర్బలత్వం
**myelitis** వెన్నుపాము శోథ
**myiasis** (శరీరంలో) కీటకాల చేరిక
**myocarditis** గుండెకండరాల శోథ
**myocardium** గుండె కండరం
**myomectomy** గర్భాశయంనుంచి కణితి తొలగింపు
**myopathy** కండరాల జబ్బు
**myopia** హ్రస్వదృష్టి
**myosotis** కండరాల శోథ
**myriad** పదివేల సంఖ్య, అనేక
**Myrmidon** పరమవిధేయ సేవకుడు
**myrrh** ఒక రకం బంక
**mysterious** నిగూఢ, రహస్యపూరిత; అద్భుత, అర్థంకాని
**mystery** అద్భుతం, మర్మం, రహస్యం/నిగూఢత
**mystic** రహస్యవాది; మార్మిక, గుప్త
**mysticism** అనుభూతివాదం
**mystify** గుప్తం చేయు, గూఢపరచు
**myth** కల్పితం, కాల్పనికం, పౌరాణికం
**mythical** పౌరాణిక, ప్రాచీన, కల్పిత, అసత్య
**mythological** పురాణ సంబంధి
**mythology** పురాణం, పౌరాణికకథ/పురాణగాథ

# n

**nab** పట్టుకొను, చుట్టుముట్టు
**nadir** పాతాళం; అధోగతి; పాదబిందువు
**naevus** పుట్టుమచ్చ
**naevus, capillary** ఎర్రని పుట్టుమచ్చ
**nag** చిన్న గుర్రం; తప్పులు పట్టు, వేధించు
**naiad** జలదేవత; ఈతకత్తె
**nail** *n* గోరు; మేకు *v* పట్టుకొను, ఆచూకీ తెలుసుకొను; మేకులుకొట్టి బిగించు
**drive a nail into one's coffin** అంత మొందించు

**hit the nail on the head** సరైన మాటచెప్పు/పనిచేయు
**nail bed** గోరుకింది మెత్త(టి భాగం)
**nail colours to mast** సొంత జెండా ఎగురవేయు
**nail-ingrowing** వక్రనఖం, వంకర గోరు
**on the nail** వెంటనే, ఇప్పుడే
**nailing** మేకు కొట్టడం
**naive** సహజ, సరళ, కాపట్యరహిత
***naivete*** సరళత, బోళాతనం
**naked** నగ్న, దిగంబర, అనావృత
**naked eye** మామూలు దృష్టి
**naked truth** నగ్నసత్యం
**name** *n* పేరు, కీర్తి, ప్రతిష్ఠ *v* పేరు పెట్టు, పేరెత్తు, పేర్కొను, గుర్తించు
**call person names** తిట్టు, నిరాదరించు, అవమానించు
**in the name of** పేరిట, పేరుకోసం
**nameless** అనామక, అజ్ఞాత
**namely** అనగా, అంటే
**namesake** పేరిటివ్యక్తి, సనామ్ని, సమాన నామధేయుడు
**nannadria** పుంవామనవృక్షాలు
**nano** వామన
**nano plankton** వామనప్లవకం
**nanocytes** వామన సిద్ధబీజాలు
**nap** కునుకు, కోడికునుకు; బట్ట/బొంత మీది రేగిన అంచు
**napiform** మూపురాకారం
**napkin** రుమాలు, తువాలు, చేతిగుడ్డ
**napthalene balls** కలరా ఉండలు
**narcissism** స్వానురక్తి, స్వరూప కాముకత
**narcoanalysis** నిద్రావస్థలో మానసికచికిత్స చేయటం
**narcosis** నిద్ర, సుషుప్తి
**narcotic** *adj* నిద్రపుచ్చే *n* నిద్రమందు, మత్తుమందు, స్వాపకం
**nares** నాసారంధ్రాలు, ముక్కుపుటాలు
**narration** కథనం; పద్దు వివరణ
**narrative** *adj* కథనాత్మక, వివరణాత్మక *n* కథ, వృత్తాంతం, వివరణ
**narrow** *adj* ఇరుకైన, చిన్న, సన్నని, సంకుచిత, పరిమిత, సంకీర్ణ *v* ఇరుకగు, తగ్గించు, తక్కువ చేయు, చిన్న పరిధిలోకి తెచ్చు
**have a narrow escape** కొద్దిలో తప్పు, మృత్యుముఖంనుంచి తప్పించుకొను
**narrow guage** చిన్న (రైల్వే) లైను
**narrow majority** స్వల్ప/నామమాత్ర ఆధిక్యం
**narrow-minded** సంకుచిత స్వభావం/బుద్ధి గల
**narrow-mindedness** సంకుచిత స్వభావం/బుద్ధి
**narrow outlook** సంకుచిత దృష్టి
**narrow target** పరిమిత లక్ష్యం; లక్షిత ప్రదేశం
**narrowing** సంకోచనం
**narrowness** సంకుచితత్వం; సంకీర్ణత
**nasal** అనునాసిక(ం); ముక్కుకు సంబంధించిన
**nasal bone** ముక్కు ఎముక, నాసికాస్థి
**nasal passages** నాసికాద్వారాలు, ముక్కు పుటాలు
**nasal septum** నాసికావిభాజకం
**nasalization** ఆనునాసిక్యం
**nascent** అతినవీన, కొత్త, తాజా; నవజనిత
**nasolabial** ముక్కుకూ పైపెదవికీ సంబంధించిన, నాసోష్ఠ సంబంధి
**nasolacrimal** నాసాశ్రు
**nasolacrimal-duct** నాసాశ్రునాళం
**nasopharynx** నాసాగ్రసని
**nasty** చెడ్డ, అసహ్యకర, అప్రియ, అశ్లీల, దుష్ట, నీచ, కఠోర
**natal** ప్రసవ/జన్మ సంబంధి
**peri-natal** జననసమయ
**post-natal** జననానంతర
**pre-natal** జననపూర్వ
**natality** జనన సూచి, జన్మ (సంఖ్య), జన్మనిష్పత్తి, జననసంఖ్యా ప్రమాణం, పుట్టుక రేటు
**nates** పిర్రలు
**nation** జాతి, దేశం, ఒక దేశప్రజ
**national** *adj* జాతీయ, దేశీయ *n* దేశస్థుడు, పౌరుడు
**national anthem** జాతీయగీతం
**national assembly** జాతీయసభ; ఫ్రెంచి పార్లమెంటు
**national bibliography** జాతీయగ్రంథపట్టిక
**national cadet corps** జాతీయ యువ సేనాదళం
**national consciousness** జాతీయచైతన్యం
**national debt** జాతీయ రుణం



**national defence academy** జాతీయ రక్షణ సంస్థ
**national extension service** జాతీయ విస్తరణసేవ
**national gallery of art** జాతీయ (చిత్ర) కళాభవనం
**national highway** జాతీయ రహదారి
**national income** జాతీయాదాయం
**national insurance** జాతీయ బీమా
**national plan savings certificate** జాతీయ ప్రణాళికా పొదుపు పత్రం
**national salute** జాతీయ వందనం
**national savings certificate** జాతీయ పొదుపు పత్రం
**national security** జాతీయభద్రత
**national song** జాతీయగీతం
**national transport policy** జాతీయ రవాణా విధానం
**national waterways** జాతీయ జలమార్గాలు
**nationalise** జాతీయం చేయు, జాతిపరం చేయు, జాతీయీకరించు
**nationalism** జాతీయత
**nationalist** జాతీయ(తా)వాది
**nationality** జాతీయత
**nationalization** జాతీయకరణ, జాతీయీకరణ, జాతిపరం చేయటం, జాతీయం చేయటం
**native** దేశీయ, వాస్తవ్య; దేశవాళీ, నాటు; దేశీయుడు, దేశపౌరుడు, వాస్తవ్యుడు
**nativity** జన్మ, జననం, వాస్తవ్యత, దేశీయత
**N A T O** ఉత్తర అట్లాంటిక్ ఒప్పందంలోని సైనికకూటమి
**natural** సహజ, స్వాభావిక, నైసర్గిక, నిజ; ప్రాకృతిక, ప్రకృతి సంబంధి
**natural calamity** ప్రకృతి వైపరీత్యాలు/విపత్తులు
**natural death** సహజమరణం
**natural history** ప్రకృతి చరిత్ర/శాస్త్రం
**natural justice** సహజ ధర్మం/న్యాయం
**natural law** ప్రకృతి సూత్రాలు
**natural phenomena** ప్రాకృతిక దృగ్విషయాలు
**natural resources** ప్రకృతి వనరులు, సహజ వనరులు
**natural science** ప్రకృతి విజ్ఞానం
**natural selection** ప్రకృతి/ప్రాకృతిక వరణం
**natural toll** సహజమరణం
**naturalism** ప్రాకృతికవాదం, సహజత్వవాదం, ప్రకృతివాదం
**naturalist** ప్రకృతిధర్మవాది, ప్రకృతి ప్రియుడు
**naturalization** సహజీకరణం, దేశీయీకరణం; పౌర(స)త్వ ప్రదానం
**naturalize** సహజీకరించు, దేశీయం చేయు, నాగరకం చేయు; (విదేశీ నాగరకతను) అలవరచుకొను
**naturalized citizen** పౌర(స)త్వం లభించిన విదేశీయుడు, దేశీయీకృతపౌరుడు
**naturally** సహజంగా, స్వాభావికంగా
**nature** ప్రకృతి; స్వభావం; స్వరూపం
**in the nature of things** ఈ పరిస్థితిలో, ఈ దశలో/తరుణంలో
**pay the debt of nature** మరణించు, ప్రకృతి రుణం తీర్చు/చెల్లించు
**second nature** అలవాటు, స్వభావం
**naught/nought** శూన్యం, సున్న, అభావం, వ్యర్థం
**set at naught** లెక్కచేయకుండు, అంగీకరించక పోవు
**nausea** వికారం, రోత, జుగుప్స, డోకు, వాంతి, వమనం
**nauseant** వికారకారకం, వికారం పుట్టించే
**nauseating** వికారం కలిగించే, అసహ్యకర, చాలాచెడ్డ, రోతపుట్టించే
**nautical** సముద్ర/నౌకా సంబంధి
**naval** నౌకా(దళ) సంబంధి, నావిక
**naval attache** నావిక సహచారి
**naval base** నౌకాస్థావరం
**naval berth** నౌకా విశ్రాంతిస్థలం
**naval dockyard** నౌకాంగణం
**naval headquarters** నౌకాదళ ప్రధాన కేంద్రం/కార్యాలయం
**naval ship** సాయుధనౌక
**nave** నాభి, మధ్యభాగం; చక్రం ఇరుసు
**navel** బొడ్డు, నాభి; మధ్యభాగం
**navicular** నౌకాకార, పడవలాగుండే
**navigable** నౌకాయానయోగ్య, ఓడలు నడవగలిగే
**navigate** పడవ/ఓడ నడుపు, సముద్రయానం చేయు; దాటు
**navigation** నౌకాయానం, సముద్రయాన నిర్వహణ; చోదనం

**navigational radar** మార్గనిర్దేశక రాడార్
**navigational system** చోదనవ్యవస్థ
**navigator** నావికుడు; మార్గనిర్దేశకుడు
**navy** నౌకా సేన/దళం, నావికదళం
**nazism** నాజీవాదం
**neap** *adj* తక్కువ *n* తక్కువపోటు; నిమ్మ
**near** సమీప, దగ్గరి; దాదాపు, సన్నిహిత
**be a near thing** కొద్దిలో తప్పిపోవు
**near perfect** పూర్ణ(తా)ప్రాయ
**near polar** ధ్రువప్రాంతీయ
**near upon** దాదాపు, దగ్గరదగ్గర; కొద్ది రోజులలో/ రోజుల తరువాత
**nearly** దాదాపుగా, అందాజుగా, దగ్గరదగ్గరగా
**nearness** సామీప్యం, దగ్గరతనం
**neat** స్వచ్ఛ, శుభ్ర, శుద్ధ; సువ్యవస్థిత
**neat-handed** చతుర, ప్రవీణ
**neatness** శుచి, శుభ్రత, స్వచ్ఛత
**nebula** నీహారిక, ఆకాశగంగ, నక్షత్ర సముచ్చయం; నేత్రపటలంలోని నల్లమచ్చ
**nebular** అస్పష్ట, మబ్బుగా నున్న
**nebulous** అస్పష్ట, ఆకారరహిత; నీహారికలాంటి
**necessaries** అవసరవస్తువులు, ఆవశ్యకాలు
**necessary** అవసరమైన, ఆవశ్యక, అనివార్య, తప్పనిసరి
**necessitate** ఆవశ్యకమగు; నిర్బంధపెట్టు
**necessitous** పేద, బీద, నిర్ధన, దీన, దరిద్ర
**necessity** అవసరం, ఆవశ్యకం
**neck** మెడ, కంఠం, గ్రీవ
**neck and crop** పూర్తిగా, సర్వదా
**neck and neck** సరిసమానంగా, వెనువెంట
**neck or nothing** అటో ఇటో
**stiff neck** బిర్రబిగిసిన, మొండిబారిన
**necklace** కంఠహారం, కంఠమాల
**necromancy** భూతవిద్య, ప్రేతవిద్య
**necrophilia** శవమైథునం
**necropsy (autopsy)** శవపరీక్ష
**necrosis** ధాతు విచ్ఛిన్నత/నిర్జీవత
**necrospermia** శుక్రంలోని జీవకణాల నిర్జీవత
**necrotic** నిర్జీవ
**nectar** అమృత, సుధ; తేనె
**need** *n* అవసరం, ఆవశ్యకం; చెడు సమయం *v* అవసరమగు, కొరవడు
**needful** ఆవశ్యక, తప్పనిసరి
**needle** సూది, ముల్లు, సూచి
**needle, hypodermic** మందుసూది
**needle's eye** సూదిబెజ్జం
**needle work** కుట్టుపని, కుట్రం; కుట్టడం
**sharp as a needle** సూదిమొనలాంటి, పదునైన
**needless** వ్యర్థ, అనావశ్యక, అనవసర
**needling** (కంటిశుక్లానికి చేసే) సూచీ వైద్య (విధాన)ం
**needs** అవసరాలు
**needy** లేమిలో ఉన్న, పేద, బీద
**nefarious** ఘోర, క్రూర, పాపపంకిల, దుర్మార్గ, అధమ
**negate** ఖండించు, తిరస్కరించు, నిరాకరించు, నిషేధించు
**negation** తిరస్కారం, నిరాకరణ, అభావం
**negative** *adj* వ్యతిరేకార్థక, నిషేధాత్మక, రుణాత్మక, ప్రతికూల; లేదనే *n* వ్యతిరేకార్థకం *v* వ్యతిరేకించు, సమ్మతించకుండు, నిరసించు, రద్దుచేయు
**negative news** ప్రతికూల/వ్యతిరేక వార్త
**negative particle** వ్యతిరేక క్వార్థకం
**negative vote** వ్యతిరేక వోటు
**negativism** అభావవాదం, వ్యతిరేక వాదం/తత్వం
**negativity** వ్యతిరేకత; రుణాత్మకత
**neglect** *n* ఉపేక్ష, అనాదరం, అజాగ్రత *v* ఉపేక్షించు, అనాదరించు
**neglect of duty** కర్తవ్యోపేక్ష
**negligee** (స్త్రీల) ఉల్లిపొరగుడ్డ
**negligence** నిర్లక్ష్యం, ఉదాసీనత, అజాగ్రత, ఉపేక్ష
**negiligent** అజాగరూక, ప్రమత్త, ఉదాసీన
**negiligible** ఉపేక్షణీయ, కొద్దిపాటి
**negotiability** వినిమయసాధ్యత; అన్యాక్రమ్యత; చర్యాయోగ్యత
**negotiable** చర్చించదగ్గ, అధిగమించదగ్గ, సంప్రతించదగ్గ, బదలాయించదగ్గ, అన్యాక్రమణలోని
**negotiable instrument** అన్యాక్రమణపత్రం, అన్యాక్రాంత యోగ్యపత్రం
**negotiate** సంప్రతించు, చర్చించు; అమ్ము; బదిలీచేయు, అన్యాక్రాంతం చేయు
**negotiating committee** సంప్రతింపు సంఘం
**negotiation** సంప్రతింపు, వ్యాపారం, వ్యవహారం, సంధానం; అన్యాక్రాంతత్వం



**negotiator** సంధానకర్త
**neighbour** పొరుగు (వ్యక్తి), హసాయి
**neighbourhood** ఇరుగుపొరుగు, చుట్టుపక్కలు
**neighbourhood school** సమీప పాఠశాల
**neither** అదీ ఇదీ కాదు/లేదు
**nematoda** గోళక్రిమి
**nemesis** కర్మఫలం
**neo** నవ, నవీన, నవ్య, కొత్త
**neo-classicism** నవ్యశిష్టార్థవాదం
**neogrammarian** నవ్యవ్యాకర్త
**neolithic** కొత్తరాతియుగపు
**neolithic age** కొత్తరాతియుగం (పాత రాతి/శిలా యుగం తరువాతికాలం)
**neolithic culture** కొత్తరాతియుగంనాటి సంస్కృతి
**neo-positivism** నవీన ప్రత్యక్షైకాత్మక దర్శనవాదం
**neologism** నవ్యశబ్దం, నూతన పద సృష్టి/కల్పన
**neonatal** (పుట్టిన నెలలోపలి) నెత్తురుకందు (కు సంబంధించిన)
**neonate** నెలనిండని శిశువు, నెత్తురుకందు
**neon light** నియాన్ కాంతి/దీపం
**neontology** నవీన జీవశాస్త్రం
**neophyte** కొత్తశిష్యుడు
**neoplasm** కంతి
**nephew** మేనల్లుడు
**nephology** మేఘవిజ్ఞానం
**nephritis** మూత్రపిండశోథ
**nephrogenic** మూత్రపిండజ(న్య)
**nephrolithiasis** మూత్రపిండంలో రాళ్లుండటం
**neprolithotomy** మూత్రపిండాలనుంచి రాళ్ళ తొలగింపు/తొలగించే శస్త్రచికిత్స
**nephron** మూత్రనాళిక
**nephrosis** మూత్రపిండవ్యాధి
**nephrostomy** మూత్రపిండ ఛిద్రీకరణ
**nepotism** బంధుప్రీతి, ఆశ్రితపక్షపాతం
**Neptune** ఇంద్రగ్రహం
**nerium** గన్నేరు
**nerve** *n* నరం, నాడి, తంత్రి, మజ్జాతంతువు; ధైర్యం, శక్తి, ఆత్మవిశ్వాసం *v* బలమిచ్చు
**nerve, afferent** అభివాహితంత్రి
**nerve, autonomic** స్వయంచోదిత నాడి
**nerve centre** మజ్జాతంతు కేంద్రం, కేంద్ర(క)ం, నరాల కూడలి
**nerve, cranial** కపాలతంత్రీనాడి
**nerve, efferent** అపవాహితంత్రీనాడి
**nerve impulse** నాడీప్రచోదనం
**nerve, motor** ప్రేరకతంత్రీనాడి
**nerve, parasympathetic** ప్రతితంత్రీనాడి
**nerve, peripheral** పరిధీయతంత్రీనాడి
**war of nerves** ప్రచ్ఛన్నయుద్ధం
**nerveless** దుర్బల, బలహీన
**nervous** నాడీసంబంధి; ధైర్యంలేని
**nervous system** నాడీ మండలం/వ్యవస్థ
**nervousness** నరాలబలహీనత; అధైర్యం
**nervy** ఓజస్వి, ధైర్యవంతుడు, ఆత్మవిశ్వాసంగల వ్యక్తి
**nescience** అజ్ఞానం, అజ్ఞేయవాదం
**nest** *n* గూడు, గుంపు; సమూహం; పుట్ట, కన్నం; అల్లిక *v* గూడు కట్టు, గూట్లో ఉండు, స్థావరం ఏర్పరచుకొను
**feather one's nest** పనిగడుపుకొను; డబ్బు సంపాదించు
**nest cell** కణసమూహం
**nestle** గూటిలో హాయిగా ఉండు, వెచ్చగా పడుకొను
**net** *n* వల, జాలం, పంజరం; మోసం, నికరం; నగదు *v* వల పన్ను, వలలోచిక్కుకొను; సంపాదించు
**net income** నికరాదాయం
**net price** నికరధర
**net profit** నికరలాభం
**net result** అంతిమ ఫలితం/పరిణామం
**net tonnage** నికర భారం/టన్నేజి
**net wealth** నికర సంపద
**net work** జాలం, వల, అల్లిక; సంసక్తి, సమాహారం
**net-work** వలలా ఉండేది
**net working** జాలకీకరణం
**netting** వల
**neugrowth** కంతి
**neural** నాడీసంబంధి
**neuralgia** నాడీసంబంధి వేదన
**neurasthenia** నరాల బలహీనత
**neurectomy** నాడీచ్ఛేదన
**neuritis** నాడీశోథ
**neuritis, alcoholic** మద్యపానంవల్ల కలిగే నాడీశోథ
**neuritis, diabetic** మధుమేహంవల్ల వచ్చే నాడీశోథ

**neuro** నాడీ సంబంధి
**neurochemical disfunction** నాడీ రసాయన అపవ్యవస్థ
**neurohumoral** నాడీ ధాతుమండలం
**neuro-physician** నాడీ వైద్యుడు
**neuro-praxia** నరం చితకటం
**neuro-surgeon** నాడీ శస్త్రచికిత్సకుడు
**neuro-surgery** నాడీ శస్త్రచికిత్స
**neuro syphilis** నరాల సవాయి (రోగం)
**neurologist** నాడీశాస్త్ర నిపుణుడు
**neuron** నరాణం; నాడీకణం
**neuropathy** నరాల వ్యాధి
**neurosis** చిత్త వికృతి; వాతరోగం; మనోదౌర్బల్యం
**neurotic** మానసికరోగి
**neuter** నపుంసక(లింగ)ం
**neutral** తటస్థ, నిష్పాక్షిక, ఉదాసీన
**neutral verb** భావ (వాచక)క్రియ
**neutrality** తాటస్థ్యం, నిష్పాక్షికత, ఉదాసీనత
**armed neutrality** సాయుధతాటస్థ్యం
**neutralization** తటస్థీకరణ(ం)
**neutralize** తటస్థీకరించు, నిష్ప్రభావం చేయు
**neutron** పరమాణుసంబంధి; న్యూట్రాన్
**neutrophil-leucocyte** ఒకరకం తెల్లరక్తకణం
**never** ఎన్నడూ లేని/కాని
**new** కొత్త, నవ్య, నవీన, ఆధునిక, అపరిచిత
**new born** అప్పుడే పుట్టిన
**new fangled** కొత్త ఫ్యాషనుకు సంబంధించిన
**new order** నూతన క్రమం
**new orientation** కొత్త రూపం/లక్షణం
**news** వార్త, వృత్తాంతం, సమాచారం, సందేశం, సంవాదం
**news agency** వార్తాసంస్థ
**news agent** పత్రికా ప్రతినిధి/విక్రేత
**news blackout** వార్తానుపలబ్ధి, వార్తలపై నిషేధం
**news boy** పత్రికలమ్మే కుర్రవాడు
**news bureaux** వార్తాసంస్థలు
**news correspondent** పత్రికావిలేకరి
**news desk** (వార్తా)లేఖనపీఠం
**news editor** వార్తాసంపాదకుడు
**news feature** ప్రత్యేక వార్తాశీర్షిక
**news item** వార్తాంశం, వార్త
**news letter** వార్తాలేఖ
**news monger** వార్తాకల్పయుత; కబుర్ల రాయుడు
**news nose** వార్తలను పసిగట్టగలగటం
**news paper** వార్తాపత్రిక
**news peg** వార్తాకీలం
**news print** పత్రికలు అచ్చువేసే (చౌకరకం) కాగితం
**news reader** వార్తా పాఠకుడు/వాచకుడు
**newsreel** సమాచార దర్శనం
**news review** వార్తా/సమాచార సమీక్ష
**news-room** వార్తలు రాసే/సేకరించే గది, వార్తాసంకలనస్థలం
**news source** వార్తాధారం
**news stand** (పత్రికా)విక్రయ స్థలం/స్థానం
**newsy** వార్తాభరిత
**new type** (=objective type) విషయతంత్రం
**next** తరువాతి, మరుసటి, ఆగామి, రెండో; పొరుగున ఉన్న; మళ్ళీ, ఇప్పటినుంచీ
**nexus** సంపర్కం, సంబంధం; విధేయ సంబంధం; సంబంధి విషయం
**nice** రమ్య, సుందర, కోమల, సూక్ష్మ, సరైన
**nicety** సుందరత, నాజూకుతనం, మంచితనం
**to a nicety** అతిసూక్ష్మంగా
**niche** గూడు; (జీవితంలో) సముచిత స్థానం
**niche market** సముచిత విపణి
**nick** గుర్తు, అదను, గంటు
**nickle** ఒక తెల్లని లోహం/ధాతువు; చిల్లర
**nickname** మారుపేరు, పరిహాసనామం
**nicotine** పొగాకు విషం
**nidus** నివాసం, ఉనికిపట్టు
**nigger** (దూషణలో) నీగ్రో; నల్లమనిషి
**night** రాత్రి, రేయి; చీకటి
**night bird** గుడ్లగూబ; రాత్రిళ్లు పనిచేసే వ్యక్తి
**night blindness** రేచీకటి
**night cap** రాత్రిళ్లు పెట్టుకొనే టోపీ
**night fall** సంధ్య, సందెవేళ
**night long** రాత్రి అంతా
**night man** పాకీవాడు
**night mare** పీడకల
**night-school** రాత్రిపాఠశాల
**night-soil** మలం
**nightingale** కోకిలవంటి ఒక పిట్ట
**nighty** *adj, adv* రాత్రివేళ; ప్రతిరాత్రీ
**nihilism** శూన్యవాదం
**nihilist** శూన్యవాది



**nihility** శూన్యత్వం
**nil** శూన్యం
**nimble** చతుర, కుశల, చురుకైన
**nimbus** వర్షాకాల మేఘం; ప్రభామండలం
**nincompoop** బుద్ధిహీనుడు, సామాన్యుడు, బలహీనుడు
**nine** తొమ్మిది, నవ(ం)
**nine day's wonder** మూన్నాళ్ళ ముచ్చట
**to the nines** పూర్తిగా
**ninny** మూర్ఖుడు, బుద్ధిహీనుడు
**nip** గిల్లు, తెంచు, తుంచు, కోయు, వేధించు
**nip in the bud** మొగ్గలోనే తుంచు
**nipple** చనుమొన
**nit** ఈపి, పేనుగుడ్డు
**nitre** పెట్లుప్పు, సూరేకారం
**nitrification** నత్రీకరణం
**nitrogen** నత్రజని, నైట్రోజెన్
**nitrogenous** నత్రజని సంబంధి; సారజనకమైన
**nobb** భూస్వామి
**nobility** కులీనత, ఘనత; ఉన్నత వంశ్యులు, గొప్పవాళ్ళు; సౌజన్యం
**noble** *adj* కులీన, అభిజాత, ఉత్తమ, ఘన, వైభవశాలి *n* మహానుభావుడు, కులీనుడు, అభిజాతుడు, ఘనుడు, గొప్పవాడు
**noble woman** కులీన/ఉత్తమ స్త్రీ
**nobles** అభిజాతులు
**no-confidence** అవిశ్వాసం
**nocturnal** రాత్రి సంబంధి
**nod** తల ఊపు
**node** కణుపు, గ్రంథి; నిష్పందన స్థానం
**nodule** బుడిపె; గుళిక
**noes** కాదనేవాళ్ళు, ప్రతిపక్షులు
**noise** *n* రవం, కరకరధ్వని, శబ్దం, ధ్వని, గొడవ, అల్లరి, కోలాహలం, చప్పుడు *v* వ్యాప్తిచేయు, ప్రఖ్యాతం చేయు
**noise-pollution** శబ్ద/ధ్వని కాలుష్యం
**noiseless** నిశ్శబ్దమైన, చప్పుడు కాని/లేని
**noisome** అనారోగ్యకర, అసహ్యకర, హానికర, చెడు
**noisy** సద్దుగా/సందడిగా ఉన్న
**nomad** దేశదిమ్మరి; పర్యటనశీల
**nomadic** సంచార (శీల)
**no man's land** వివాదగ్రస్త భూమి, అధికార రహిత భూమి/ప్రాంతం
***nom de plume*** (pen name) కల్పితనామం, మారుపేరు, కలంపేరు
**nomenclature** నామ(కరణ)పద్ధతి; పరిభాష; శబ్దావళి, నామావళి
**nominal** నామమాత్ర; అవాస్తవిక
**nominal cost** నామమాత్రపు వెల
**nominal noun** తద్ధిత (రూప)ం
**nominal price** నామమాత్రపు ధర
**nominal rent** నామమాత్రపు అద్దె, తక్కువ బాడుగ
**nominal value/face value** నామమాత్ర మూల్యం
**nominal variable** నామమాత్ర/అవాస్తవిక చలరాశి
**nominal wage/money wage** నామమాత్ర వేతనం; నగదుకూలీ
**nominalism** మిథ్యావాదం
**nominalization** నామీకరణం
**nominate** నియమించు, నియోగించు, నామనిర్దేశం చేయు
**nominated** నియమిత, నియోజిత, నామనిర్దిష్ట
**nominated member** నియుక్తసభ్యులు
**nomination** నియామకం, నియోగం, నామనిర్దేశనం
**nomination paper** నియామక/నామనిర్దిష్ట పత్రం
**nominative** ప్రథమావిభక్తి, కర్తృకారకం
**nominee** నియుక్తుడు, నియోజితుడు, నామనిర్దిష్ట వ్యక్తి; ప్రతినిధి
**nomology** నియమనశాస్త్రం
**non-** కాని, లేని; విరుద్ధ, రహిత, లుప్త
**non-acid** నిరామ్లం
**non-age** అవయస్క(త)
**non-aggression** అనాక్రమణ, దాడిచేయమి
**non-aligned** అలీన, తటస్థ
**non-alignment** అలీనత
**non-antecodent** ప్రాగభావం
**non-antinedo** అస్పందనస్థానం
**non-appearance** గైరుహాజరీ
**non-bailable** జామీ నివ్వ(రా)ని
**non-being** అనాత్మ
**non-cognizable** విజ్ఞేయానర్హ, అగ్రాహ్య
**non-cognizable offence** అగ్రాహ్యాదోషం
**non-combatant** పోరాటంలో పాల్గొనని (సైనికుడు)

**non-commissioned** కమీషను స్థాయిలేని
**non-commital** అనిబద్ధ
**non-communist** కమ్యూనిస్టేతర
**non-compliance** అననువర్తనం
**non-conductor** అవాహకం
**non-contiguous** అవ్యవహిత
**non-contrastive** అభేదక
**non-conventional** సంప్రదాయేతర
**non-cooperation** సహాయనిరాకరణం
**non-coordinate** అసజాతీయ
**non-delivery** అందజేయమి
**non-distinctive** అవ్యావర్తక
**non-dualism** ద్వైతేతరవాదం
**non-essential staff** అముఖ్యసిబ్బంది
**non eternal** అనిత్య
**non existence** అనస్తిత్వం, అభావం, ఏమీలేనిస్థితి
**non-feasance** కార్యాకరణం
**non-gazetted staff** గెజటెడ్‌కాని సిబ్బంది, నాన్గెజటెడ్ సిబ్బంది
**non-Hindi speaking areas** హిందీతర ప్రాంతాలు
**non-inafective** సంక్రమించని
**non-interference** జోక్యం చేసుకోకపోవటం
**non-intervention** తాటస్థ్యం
**non-intoxicating** మత్తుపుట్టించని
**non-judicial** న్యాయేతర
**non-masculine** అమహద్వాచక(ం)
**non-metal** అలోహం
**non-motile** కదలికలేని, నిశ్చల
**non-negotiable security** అన్యాక్రామ్య భద్రత
**non-observance** పాటించమి
**non-occupancy right** శాశ్వతజిరాయితీకాని/వంశపారంపర్యంకాని హక్కు/అధికారం
**non-official** అనధికారిక
**nonpareil** అద్వితీయ, అనుపమ, సాటిలేని, విశిష్ట, ప్రత్యేక
**non-past** తద్ధర్మార్థకం
**non-performance** అనిర్వర్తన, అనిర్వాహం
**non-print** ముద్రణేతర
**non-production** దాఖలు చేయమి
**non-productive expenditure** లాభదాయకం గాని ఖర్చు
**non-protein** మాంసకృత్తులుకాని
**non-receipt** అందకపోవటం
**non-recovery** వసూలుకాని
**non-recurring expenditure** అనావృతవ్యయం
**non-religious** విమత, మతేతర
**non-resident** అస్థానిక, అవాస్తవ్య; ప్రవాసి(త)
**non-resistance** వ్యతిరేకించకపోవటం
**non-routine sample** క్రమరహిత సంచయం
**non-satisfaction** అసంతృప్తి, నెరవేరమి
**non-scheduled flight** షెడ్యూల్లోలేని/ప్రత్యేక విమాన ప్రయాణం
**non-self governing territories** స్వయం పాలనాధికారంలేని/పరాధీన ప్రాంతాలు
***non sequitur*** నిరాధార నిగమనం
**non-tribals** గిరిజనేతరులు
**non-verbal** వస్తురూపక
**non-violence** అహింస
**nonagon** నవభుజి
**nonchalance** ఉదాసీనత, అవిచలితత్వం
**nonconformist** మతవిరోధి, సంప్రదాయ వ్యతిరేకి
**nondescript** ఇదమిత్థంకాని; సంకర
**nondifferentiable** అవకలనీయం కాని
**nonentity** గణనకురాని వ్యక్తి/వస్తువు; అభావం; తుచ్ఛం
**nonfinite** అసమాపక(ం)
**nonfulfilment** నెరవేరమి
**nonliable** బాధ్యతారహిత
**nonplus** నిరుత్తరం చేయు, గందరగోళపెట్టు
**nonsense** అర్థరాహిత్యం, మూర్ఖత
**nonsuit** (వ్యాజ్యం నడపని వాదికి) వ్యతిరేకంగా ఇచ్చిన తీర్పు
**nook** చివర, మారుమూల, నిర్జన ప్రదేశం
**noon/noonday/noontide** మిట్టమధ్యాహ్నం
**noose** ఉచ్చు, వాగుర; జారుముడి; ఉచ్చుబిగించు
**norm** నమూనా, ఆదర్శం, నియమం, మర్యాద, ప్రమాణం
**normal** మామూలు, సాధారణ, యథాప్రకార, క్రమ; రోజువారీ; నియమబద్ధ; లంబం
**normal demand** మామూలు/సామాన్య గిరాకీ
**normal distribution** సామాన్య పంపిణీ
**normal probability** సామాన్య సంభావ్యత
**normally** సాధారణంగా, సామాన్యంగా, రోజూ
**normative** నిర్ణాయక, నిర్దేశక
**north** ఉత్తరదిక్కు



**north atlantic treaty organisation (nato)** నాటో సైనికకూటమి
**north east frontier agency (nefa)** నీఫా, ఈశాన్య (సరిహద్దు) ప్రాంతం
**north east** *adj, n* ఈశాన్య(ం)
**northern** ఉత్తర
**north-west** వాయవ్య(ం)
**northwester** వాయవ్యపవనం
**nose** *n* ముక్కు, నాస, నాసిక; మొన, ములికి, అగ్రభాగం *v* వాసనచూచు, పసికట్టు; అడ్డకాలు పెట్టు/వేయు
**lead by nose** బలాత్కారంగా నడుపు
**nose about** వెతుకు
**nose, blood** ముక్కునుంచి నెత్తురుకారటం
**pay through the nose** శ్రమించి చెల్లించు
**put one's nose out of joint** పొగరుతగ్గించు
**thrust one's nose into** తలదూర్చు, జోక్యం కలిగించుకొను
**turn one's nose at** హీనంగా భావించు
**nosology** వ్యాధివర్గీకరణ శాస్త్రం
**nostalgia** ఇంటిపై ఆలోచన/చింత
**nostril** ముక్కు రంధ్రం, నాసాపుటం
**nostrils** ముక్కుపుటాలు
**nostrum** గుప్తౌషధం
**notability** ప్రసిద్ధి, ప్రఖ్యాతి
**notable** లెక్కింపదగిన, మహత్వపూర్ణ, ప్రఖ్యాత, ప్రసిద్ధ, విశిష్ట, ప్రముఖ
**notary (public)** లేఖ్య ప్రమాణీకర్త, నోటరీ
**notation** అంకనం, సంకేతనం, చిహ్నం; స్వరకల్పనం, స్వరలిపి; సంకేతం, గుర్తు
**notch** *n* గంటు, నరుకు; లోయ, వాలు *v* గంటుపెట్టు, గంట్లు లెక్కించు
**note** *n* స్వరం, లేఖ, పత్రం, చిహ్నం, ధ్వని, టీక, టిప్పణి, వివరణ, నివేదిక *v* రాసుకొను, గుర్తుంచుకొను, గమనించు, పరీక్షించు
**note of exclamation** ఆశ్చర్య/విస్మయ చిహ్నం
**noteworthy** గమనార్హ, రాసుకోదగిన, గుర్తుంచుకోదగ్గ
**nothingness** అభావం, శూన్యత
**notice** *n* ప్రకటన, గమనిక, సూచన (పత్రం) *v* గమనించు, గుర్తించు
**notice board** ప్రకటన ఫలకం
**short notice** స్వల్పవ్యవధి
**noticeable** గమనార్హ
**notifiable** సూచనీయ, ప్రకటనార్హ
**notification** అధికార ప్రకటన, (అధి)సూచన; విజ్ఞాపన, సూచన ప్రకటన
**notify** తెలియజేయు, సూచించు, ప్రకటించు, అధిసూచన చేయు, వార్తతెలుపు
**notion** తలపు, భావం, భావన, సంకల్పం, ఉద్దేశం
**notorious** అపఖ్యాతిపాలైన, అప్రతిష్ఠాపూర్వక
**notwithstanding** అయినప్పటికీ, అందుకు భిన్నంగా
**noun** విశేష్యం, నామవాచకం
**nourish** పెంచు, పోషించు, మనసులో ఉంచుకొను
**nourishment** ఆహారం, పోషణ, పుష్టి, పౌష్టికాహారం
**novae** నవ్యతార
**novation** కొత్త ఒప్పందం
**novel** *adj* కొత్త, నవీన, విచిత్ర *n* నవల
**novelist** నవలారచయిత
**novelty** (వి)నూతనత్వం, వైచిత్రి, కొత్తదనం
**novice** అనుభవంలేని (వ్యక్తి)
**now** ఇప్పుడు, ఈ సమయంలో/కాలంలో
**now and again, now and then** అప్పుడప్పుడు
**now or never** ఇప్పుడే, మరింకెప్పుడూ కాదు
**noxious** హానికర, దూషిత, నష్టపరిచే
**nozzle** మొన, సూచీముఖం
**n-th sample** నిర్దిష్టసంచయం
**nuance** సూక్ష్మభేదం
**nuclear** కేంద్రక; కేంద్రీయ, పరమాణుసంబంధి
**nuclear device** పరమాణు పరికరం
**nuclear fission** పరమాణు విచ్ఛిత్తి/విచ్ఛేదనం
**nuclear irradiation** పరమాణుదీప్తి
**nuclear plane** పరమాణుశక్తితో నడిచే విమానం
**nuclear propulsion** పరమాణుశక్తిచాలనం
**nuclear radical** పరమాణుధాత్వంశం
**nuclear reaction** పరమాణు ప్రతిచర్య
**nuclear rocket** పరమాణు రాకెట్
**nuclear submarine** పరమాణు జలాంతర్గామి
**nuclei** (పరమాణు)కేంద్రకాలు
**nucleonics** (పరమాణు)కేంద్రకశాస్త్రం
**nucleus** (పరమాణు)కేంద్రకం; మూలకేంద్రం, బీజం; ఉద్దేశం
**nude** నగ్న, దిగంబర
**nudge** మోచేతి పొడుపు; మోచేత్తో పొడుచు
**nugatory** వ్యర్థ, నిరర్థక, నిష్ఫల

**nugget** (బంగారు)ముద్ద
**nuisance** పీడ, బాధ
**nuisance value** గడబిడ చేసే శక్తి, విలువ తక్కువ, గందరగోళం
**nulead** (NL, newtop) నూతన పరిచయం
**null** శూన్యం; వ్యర్థ, విఫల, నిష్ఫల
**null and void** పూర్తినిష్ఫలం; రద్దు; శూన్యం
**nullify** శూన్యీకరించు, నిరర్థకంచేయు, రద్దుచేయు
**nullipara** పిల్లలతల్లి
**numb** *adj* తిమ్మిరెక్కిన, మొద్దుబారిన, స్తబ్ధ *v* తిమ్మిరెక్కించు
**number** *n* సంఖ్య, అంకె; ఎక్కువ, చాలా; వచనం *v* లెక్కించు, కలుపు, చేర్చు
**number system** సంఖ్యావ్యవస్థ
**numberless** అసంఖ్య, లెక్కకెక్కని
**numbness** తిమ్మిరి
**numeral** *adj* సంఖ్యాసంబంధి *n* సంఖ్య; లెక్క; సంఖ్యావాచకం
**numeration** లెక్కింపు, సంఖ్యాలేఖనం, అంకెలు వేయటం
**numerative compound** ద్విగుసమాసం
**numerator** లవం
**numerical** సంఖ్యాత్మక, సంఖ్యావాచక, అంకాత్మక
**numerical model** అంకాత్మక ప్రతికృతి
**numerical strength** సంఖ్యాబలం
**numerically** సంఖ్యలో, లెక్కలో
**numerous** అసంఖ్యాక, అనేక, లెక్కలేనన్ని
**numismatics** ముద్రాశాస్త్రం
**numskull** మూర్ఖుడు, బుద్ధిశూన్యుడు
**nun** (క్రైస్తవ)సన్యాసిని, మఠవాసిని, భిక్షుకి
***nuncio*** పోప్‌మాత
**nuptial** *adj* వివాహసంబంధి, వైవాహిక *n* వివాహం; పునస్సంధానం
**nurse** *n* ఉపచారిక, దాది *v* ఉపచరించు, సేవచేయు, పాలు కుడుపు, పెంచు; (భావం) మనసులో ఉండు/ఉంచుకొను
**dry nurse** పోషించే దాది
**male nurse** ఉపచారకుడు
**wet nurse** పాలిచ్చేదాది
**nurseries** సంరక్షణాలయాలు
**nursery** పిల్లలగది, బాలగృహం, శిశుసంరక్షణాలయం; వృక్షసంవర్ధిని
**nursery school** శిశువిద్యాలయం
**nursing** ఉపచారం, పరిచర్య, సేవ
**nursing home** ఆసుపత్రి, వైద్యశాల
**nurture** *n* పోషణ, ఆహారం *v* పెంచు, పోషించు, నిర్మించు
**nut** కఠినఫలం, పెంకున్నకాయ; తల, మర; కఠిన ప్రశ్న
**a hard nut to crack** కఠిన సమస్య, చిక్కుప్రశ్న
**in a nut (shell)** సంక్షిప్తంగా, టూకీగా, సారాంశరూపంలో
**nut grass** తుంగగడ్డి
**nutmeg** జాపత్రి, జాజికాయ
**nutrient** పుష్టినిచ్చే; పోషక(పదార్థ)ం
**nutrient base** పౌష్టికాధారం
**nutriment** పోషకాహారం, భోజనం, శక్తిపెంచే తిండి
**nutrition** పోషణ (విజ్ఞానం)
**nutritionist** పోషణవిజ్ఞాన నిపుణుడు
**nutritious** పౌష్టిక, బలవర్ధక
**nutritive** పోషక
**nyctalopia** రేజీకటి
**nymph** అప్సరస
**nymphomania** లైంగికేచ్ఛ; (స్త్రీలలో) అధిక కాముకత్వం
**nystagmus** కనుగుడ్డు అటూ ఇటూ ఆడటం

## O

**O.E.C.C.** యూరప్ ఆర్థిక సహకార సంస్థ
**oak tree** సిందూర వృక్షం
**oar** పడవనడిపే తెడ్డు
**put in one's oars** అడగని సలహానిచ్చు, కాస్సేపు పని ఆపు, కాళ్ళుదూర్చు
**rest on one's oars** అనారోగ్యంగా ఉండు, అలసట చెందు, సెలవలు గడుపు; ప్రయత్నం ఆపివేయు
**oasis** ఎడారిలో నీరుండే చోటు, పచ్చగడ్డి బీడు
**oat** రాగులు, ఓట్‌ధాన్యం, యవలు
**oath** ఒట్టు, శపథం, ప్రమాణం
**oath of allegiance** శ్రద్ధాభక్తి శపథం
**oath of office** అధికారస్వీకార ప్రమాణం
**oath of secrecy** రహస్యపాలన ప్రమాణం
**obdurate** పట్టువదలని, దృఢ, కఠోర, నిర్లజ్జ
**obedience** అణకువ, విధేయత, ఆజ్ఞాపాలన
**obedient** విధేయ, అధీన, ఆజ్ఞానువర్తి, అణకువగల



**obeisance** ప్రణామం, వందనం, నమస్కారం
**obese** స్థూల, లావెక్కిన, బలిసిన
**obesity** లావెక్కటం, స్థౌల్యం, స్థూలకాయం
**obey** చెప్పినట్లు విను, వశమగు, ఆజ్ఞపాటించు, అనువర్తించు
***obiter dictum*** ప్రాసంగిక కథనం, ప్రాస్తావికోక్తి, నిర్ణయానికి అవసరంకాని అభిప్రాయం
**obituary** *adj, n* మరణ సంబంధి, మృత్యు విషయక; మరణవార్త; మరణించినవ్యక్తి సంక్షిప్తచరిత్ర; సంస్మరణ
**object** *n* కర్మ, విషయం, వస్తువు, లక్ష్యం, అభిప్రాయం, పదార్థం *v* అడ్డుకొను, ఆక్షేపణ తెలుపు, అభ్యంతరపెట్టు, తప్పు ఆరోపించు
**object-centred** వస్తుకేంద్రక
**object, direct** ప్రత్యక్షకర్మ, ఉక్తకర్మ
**object, indirect** పరోక్షకర్మ, అనుక్తకర్మ
**object-lesson** ప్రత్యక్ష దృష్టాంతం, పదార్థబోధన
**object program** లక్షిత కార్యక్రమం
**objection** అభ్యంతరం, ఆక్షేపణ, ఆపత్తి, విరోధం
**objectionable** అనుచిత, ఆక్షేపణీయ, విరోధించదగ్గ
**objective** *adj* వస్తుగత, విషయైక, వస్తునిష్ఠ; తటస్థ, బాహ్య, అభివ్యక్త *n* కర్మ (పదం), లక్ష్యం, ఉద్దేశం
**objective test** లక్ష్యాత్మక నికష/పరీక్ష
**objective type** (new type) విషయతంత్రం
**objectively** నిష్పాక్షికంగా, తటస్థంగా
**objectives** లక్ష్యాలు
**objectivity** వస్తుగత దృక్పథం, వస్తు/విషయ నిష్ఠత, యథార్థత
**objector** ఆక్షేపకుడు, వ్యతిరేకి
**conscientious objector** సైద్ధాంతిక విరోధి, అంతఃకరణ/అంతరాత్మ కారణంగా ఆక్షేపించే వ్యక్తి
**objuration** ఒట్టుపెట్టడం, శపథం/ప్రమాణం చేయించడం
**objurgate** శపించు, ధిక్కరించు
**objurgation** శాపం, ధిక్కారం
**oblation** ఆహుతి, సమర్పణ, బలిపిండదానం, హవ్యకవ్యాలు
**obligate** న్యాయ/ధర్మ బద్ధం చేయు
**obligation** విధి, బాధ్యత, కర్తవ్యం, భారం, ఉత్తరదాయిత్వం
**obligative** నిశ్చయార్థక(ం)
**obligatory** తప్పనిసరి, అనివార్య, ఆవశ్యక, బద్ధ; అవశ్యార్థక(ం)
**oblige** అనుగ్రహించు, కృతజ్ఞతాబద్ధునిచేయు, కట్టివేయు/ఉపకారం చేయు
**obliging** అనుగ్రహించే, దయ/కనికరం చూపే, ఉపకారబుద్ధిగల
**oblique** వక్ర, కుటిల, వంకర, వికార; ఐమూల; ద్వితీయాది విభక్తి/విభక్త్యంగం
**obliquity** వంకర, వంపు
**obliterate** చెరిపివేయు, తుడిచివేయు, రూపుమాపు
**obliteration** తుడిచివేత, చెరిపివేత
**oblivion** మరుపు, విస్మృతి, ఉపేక్ష
**oblivious** విస్మృతికారక, మరచే, మరిచిపోయే
**oblong** దీర్ఘచతురస్రాకార, ఆయత, నిడుపుగా/వాలుగా ఉన్న
**obloquy** నింద, అపకీర్తి, (ప్రజా) దూషణ
**obnoxious** గర్హ్య, అసహ్యకర
**obscene** అసభ్య, అశ్లీల, బూతయిన
**obscenity** అసభ్యత, అశ్లీలత, బూతు
**obscurantist** అభివృద్ధి నిరోధకుడు, జ్ఞానవిరోధి
**obscure** అప్రసిద్ధ, అస్పష్ట; గూఢ; చీకటి
**obscurity** అప్రసిద్ధి, అస్పష్టత, గూఢత
**obsequies** అపరకర్మ, దహనకర్మ, అంత్యక్రియ, ఉత్తరక్రియ
**obsequious** అతివినయశీల
**observance** ఆచరణ, పాలన, అవలోకన(ం), పరీక్ష; రీతి, చూడటం
**observation** పరిశీలన, నిరీక్షణ, ఆలోచన, ఉక్తి, మాట
**observation well** పరిశీలనార్థకకూపం
**observatory** వేధశాల, పరిశీలనాలయం, నక్షత్రావలోకనశాల
**observe** పరీక్షించు, అవలోకించు, శ్రద్ధతో చూచు; పాటించు
**observer** పరిశీలకుడు, నిరీక్షకుడు, పర్యవేక్షకుడు
**obsess** కష్టం కలిగించు, (దయ్యం లా) పట్టిపీడించు, తగిలిపోవు
**obsession** స్వీయ భావావరోధం; స్థిర భావం/మనస్థితి; ఆలోచనానిమగ్నత
**obsolescence** వ్యవహారదూరత, పురాతనత్వం
**obsolescent** అప్రచలిత, వ్యవహారదూర, పురాతన, విడిచిపెట్టిన

**obsolete** పురాతన, అప్రచలిత, విడిచిపెట్టిన, వ్యవహారదూర
**obstacle** అడ్డంకి, అవరోధం, ఆటంకం, అడ్డు, విఘ్నం
**obstetric** ప్రసవ సంబంధి
**obstetrician** ప్రసూతి వైద్యుడు
**obstetrics** ప్రసూతిశాస్త్రం
**obstinacy** హఠం, మంకుపట్టు, మొండితనం, మూర్ఖత్వం, దురాగ్రహం
**obstinate** మూర్ఖ, దురాగ్రహ, మొండి, హఠ
**obstreperous** జగడాలమారి, అల్లరిపెట్టే
**obstruant/occlusive** స్పర్శం, అఘోష(o)
**obstruct** అడ్డుపెట్టు, ఆటంకపరచు, నిరోధించు, విఘాతం చేయు
**obstruction** ఆటంకం, అడ్డు, ప్రతిబంధకం, నిరోధం, విఘ్నం
**obstructionist** విఘ్నకారి, ఆటంకవాది
**obstructive** విఘ్నకారి, ఆటంకపెట్టే, అభ్యంతరపెట్టే
**obtain** పొందు, తెచ్చు, ప్రాపించు, సంపాదించు
**obtrude** అడ్డుపెట్టు, ఛేదించు, నియమోల్లంఘనం చేయు, బలవంతంగా మార్చు, కుక్కు
**obtuse** పదునులేని, మొద్దు(బారిన), కొనతేలని, బండ; మూఢ
**obverse** ముఖభాగం, తలపక్క; ప్రతిలోమ; నాణెంపైబొమ్మ
**obviate** నివారించు, అనవసర మనిపించు, తొలగించు, దూరంచేయు, తక్కువచేయు
**obvious** వ్యక్త, స్పష్ట, ప్రత్యక్ష
**occasion** *n* సందర్భం, సమయం, అక్కర, కారణం, అవకాశం, అవసరం, ఆవశ్యకం *v* కలిగించు
**rise to the occasion** సమయానికి తగ్గట్లు ఎదుగు/ఉపయోగపడు
**occasional** క్వాచిత్క, అప్పటప్పటి
**occasionally** కదాచిత్తుగా, క్వాచిత్కంగా, అప్పుడప్పుడు, అనిశ్చితంగా, ఎప్పుడో ఒకప్పుడు
**occident** పడమర, పశ్చిమం, పాశ్చాత్య (దేశాలు)
**occidental** పశ్చిమ, పాశ్చాత్య
**occiput** పృష్ఠభాగం
**occlusion** సంవరణం; దారిమూయటం
**occlusive** స్పర్శ (ధ్వని)
**occular** నేత్ర/దృష్టి సంబంధి
**occular demonstration** ప్రత్యక్ష ప్రదర్శన
**occult** గుప్త, గూఢ
**occupancy** స్వాధీనత, ఆక్రమణ; పట్టేదారీ, శాశ్వత జిరాయితీ; ఆనువంశిక
**occupancy right** అనువంశిక/శాశ్వతజిరాయితీ హక్కు
**occupancy tenant** కౌలుదారు, అనుభవంగల రైతు
**occupant** భుక్తిదారు, భోగి, భుక్త (బుగత), యజమాని, కాపురస్తుడు, అధివాసి, పదాధికారి
**occupation** వ్యావృత్తి, అధీనత; ఉపవృత్తి, జీవిక; భుక్తం, అధికారం, నివాసం, వ్యాపారం
**occupational** వృత్తి సంబంధి
**occupational diseases** వృత్తి (సంబంధి) వ్యాధులు
**occupational hazards** వృత్తి సంబంధి బాధలు/సమస్యలు
**occupational immobility** స్థిరవృత్తి జీవిక, చలరహిత వృత్తి
**occupational mobility** వృత్తి మార్పు, వృత్తి గతిశీలత
**occupational representation** వృత్తి ప్రాతినిధ్యం, వ్యవసాయ ప్రాతినిధ్యం
**occupational statistics** వ్యవసాయ/వృత్తి సంబంధి గణాంకాలు
**occupational stratification** వ్యావసాయిక/వృత్తి స్తరీకరణం
**occupational therapy** వృత్తి చికిత్స; పని కల్పించే చికిత్స
**occupied** ఆక్రమిత
**occupier** ఆక్రమయిత, స్వాధీనదారు, కబ్జాదారు
**occupy** ఆక్రమించు, హస్తగతం చేసుకొను, నివాసముండు, పొందు
**occur** జరుగు, సంభవించు, కనబడు, స్మరణకు/గుర్తుకు వచ్చు
**occurrence** సంభవం, సంఘటన, జరగటం, ఉనికి; ఉపస్థితి
**ocean** మహాసముద్రం/సాగరం
**ocean engineering** సాగరయాంత్రిక శాస్త్రం
**oceanaut** (మహా) సముద్రగామి
**oceania** మహాసముద్ర గోళం
**oceanic** సముద్రాంతర
**oceanography** సముద్రవిజ్ఞానం, సాగరశాస్త్రం
**oceanology** సాగరశాస్త్రం



**ochere** గైరికం
**ochere-reddle** ఎర్రసుద్ద
**ochre** రంగు మట్టి; గౌరవర్ణం
**octad** అష్టబంధనం
**octagon** అష్టభుజి, అష్టకోణి
**octagonal** అష్టకోణ, అష్టభుజ
**octahedron** అష్టముఖి
**octal number** అష్టాంశమానసంఖ్య
**octave** ఎనిమిది, అష్టమస్వరం; అష్టస్వర; ఆరోహణావరోహణలు
**octogenerian** అశీతివయస్కుడు, ఎనభై ఏళ్ళు దాటిన వ్యక్తి
**octopus** అష్టదంతి, ఎనిమిదికాళ్ళ సముద్రజంతువు
**octroi** రవాణా సుంకం, నగర సుంకం, టోల్‌గేటు పన్ను, ఘంటీపన్ను, చుంగి
**octroi duty** ఆక్ట్రాయ్ పన్ను
**odd** బేసి; ఒంటరి, అయుగ్మ, విచిత్ర, విషమ, అసాధారణ
**oddity** విలక్షణత, విషమత, వైచిత్రి, అపూర్వత, అసాధారణత
**oddity intro** విలక్షణ పరిచయం
**odds** అసమానత, ఆధిక్యం; కష్టాలు
**at odds** అసమానమగు; కొట్లాటలో ఉండు
**odds and ends** అసమాన/విభిన్న వస్తువులు
**ode** భావగీతం
**choral ode** ధ్రువాగీతం; బృందగీతం
**odious** అప్రియ, అసహ్య, నిందాపూర్వక, నీచ
**odium** అసహ్యత, నింద, ద్వేషభావం, తిరస్కారం
**odour** సువాసన, సుగంధం, పరిమళం
**in bad odour** చులకనగా, చెడ్డపేరుతో
**odourless** వాసనలేని, నిష్పరిమళ
**oedema** నంజు, ఉబ్బురోగం
**oedema, nutritional** పోషకపదార్థలోపంవల్ల నీరుచేరటం
**oedema, pulmonary** ఊపిరితిత్తుల్లో నీరు చేరటం
**oedema, renal** మూత్రపిండవ్యాధివల్ల నీరుచేరటం
**oesophageal** అన్నవాహిక సంబంధి
**oesophagitis** అన్ననాళ శోథ
**oesophagus** అన్నవాహిక
**off** ఆవలకు, ఆవలివైపు, దూరానికి; లేకుండా, నుంచి
**go off** వెళ్ళిపోవు
**off-colour** తగ్గిన, అనుమానాస్పద
**off glide** పరశ్రుతి
**off hand** అనాలోచితంగా; త్వరగా
**off-print** అతిరిక్త ప్రతి/ముద్ర
**off shore** తీరప్రాంత
**off shore oil well** తీరప్రాంత తైలకూపం (చమురు బావి)
**off-take (of goods)** వినియోగం, పట్టుబడి, కొనుబడి, గ్రహింపు
**off the hinges** అస్తవ్యస్త పరిస్థితిలో, విచారకర స్థితిలో
**offence** అపరాధం, నేరం, దోషం, దుష్కర్మ, పాపం; నష్టం, ఉల్లంఘన, ఆక్షేపణం
**offend** అపరాధం/నేరం చేయు, ఉల్లంఘించు, అవినీతికి పాల్పడు, కోపం తెప్పించు
**offender** అపరాధి, దోషి, నేరగాడు
**offensive** హానికర, ప్రమాదకర, న్యాయవిరుద్ధ; పైబడే వైఖరి
**offensive war** దురాక్రమణ/ఆక్రామక యుద్ధం
**offer** *n* యత్నం; అర్పణ; ప్రతిపాదన *v* ప్రతిపాదించు, అర్పించు; యత్నించు, అమ్మజూపు
**offering** నివేదన, ప్రతిపాదన, సమర్పణ, దానం, బలి, ఆహుతి
**office** కార్యాలయం; పదవి
**office of profit** లాభదాయక పదవి/వృత్తి
**officer** అధికారి
**officer-in-charge** తాత్కాలికాధికారి
**officer on special duty** విశేషాధికారి, ప్రత్యేకాధికారి, విశిష్టోద్యోగి
**official** *adj* ఆధికారిక, ప్రభుత్వ/శాసన సంబంధి *n* అధికారి, ప్రభుత్వోద్యోగి
**official benches (treasury benches)** అధికారపక్ష/ప్రభుత్వవర్గ స్థానాలు
**official business** ప్రభుత్వకార్యం, అధికారిక విషయం, అధికారవ్యవహారం
**official duty** ప్రభుత్వవిధి, ఆధికారిక కార్యం
**official language** అధికార భాష
**official organ** అధికార/ప్రభుత్వ పత్రిక/సంస్థ
**official secrecy** అధికార రహస్యం
**official sources** అధికారవర్గాలు, ప్రభుత్వాధారాలు
**official translation** ఆధికారిక/అధికృత అనువాదం

**official version** ఆధికారిక/ప్రభుత్వ కథనం
**official visit** అధికార యాత్ర/పర్యటన; ఉద్యోగ సంబంధి తనిఖీ
**officiate** బదులుగా పనిచేయు; ధార్మిక/పౌరోహిత్య కర్తవ్యం నిర్వహించు
**officiating** పదవి నిర్వహిస్తున్న
**officious** జోక్యం కలిగించుకొనే, అనధికార ఆక్షేపకుడైన, అధిక ప్రసంగి
**offset** *n* చెల్లు, ప్రత్యేకింపు *v* బదులుగా ఇచ్చు, సంపూర్తి చేయు
**offset printing** దూరీకరణ ముద్రణ
**offshoot** పాయ, శాఖ, కొమ్మ; సంతానం; ఫలం, ఫలితం, పరిణామం
**often** తరచుగా; అనేకసార్లు, పదేపదే
**ohmmeter** ఓంమాపకం
**oil** చమురు, నూనె, తైలం
**burn the midnight oil** విపరీతంగా శ్రమించు, అర్ధరాత్రులు పనిచేయు
**essential oils** సుగంధతైలాలు
**mineral oils** ఖనిజతైలాలు
**oil and vinegar** పరస్పరవిరోధి వస్తువులు
**oil cake** తెలికపిండి, గానుగపిండి
**oil, castor** ఆముదం
**oil concessions** పెట్రోలు సరఫరా రాయితీలు
**oil, eucalyptus** యూకలిప్టస్ నూనె, నీలగిరి తైలం
**oil exploration** చమురు/నూనె నిధుల అన్వేషణ/పరిశోధన, నూనెశోధన
**oil field** చమురు/నూనె గని, తైలక్షేత్రం
**oil, gingelli** మంచినూనె, నువ్వుల నూనె
**oil-paint** తైల(వర్ణ) చిత్రం
**oil-press** నూనెగానుగ, తైలసంగ్రహణ యంత్రం
**oil-prospecting work** తైలపరిశోధనకు ప్రారంభతవ్వకాలు
**oil-seed** చమురు/నూనె గింజ(లు)
**oil show map** తైలదర్శక మానచిత్రం
**oil slick** చమురుతెట్టె
**oil spill** చమురుతెట్టె, తైలస్రావం
**oil, sunflower** పొద్దుతిరుగుడుపూనూనె
**oil-tanker** తైలనౌక
**oil-well** చమురుబావి, తైలకూపం
**pour oil on the flame** అగ్నికి అజ్యంపోయు, మంటను ద్విగుణీకరించు
**pour oil on the troubled water** తగాదా తీర్చు/శాంతింపజేయు
**strike oil** నూనె గని/నిక్షేపం బయటపడు
**oily** జారే, జిడ్డుపట్టిన, నున్నని, నూనెలాంటి
**ointment** లేపనం, పైపూతకువాడే పదార్థం, మలాము
**old** పాత, ముసలి, ప్రాచీన
**old age pension** వార్ధక్య(ంలో) ఉపకారవేతనం
**old boy** పాత విద్యార్థి
**old times** గతకాలం, పురాతన కాలం
**the old year** గడచిన సంవత్సరం
**oleograph** తైలముద్ర(ణ)
**oleometer** తైలమాపకం
**olifactory** ఘ్రాణేంద్రియ సంబంధి; వాసనగల
**oligarchy** అల్పజనపాలన
**oligopoly** సాముదాయిక గుత్తవిధానం
**oligospermia** అల్పశుక్రాణుత
**oliguria** అల్పమూత్రత
**olive branch** మైత్రీసందేశం
**olympaid** ఒలింపిక్ క్రీడలు; క్రీడలమధ్య పట్టే నాలుగేళ్ళ సమయం
**olympic** ఒలింపిక్
**olympic games** ఒలింపిక్ క్రీడలు
**olympic meet** ఒలింపిక్ క్రీడాసమారోహం
**olympics** ఒలింపిక్ క్రీడలు/క్రీడోత్సవాలు
**omega** గ్రీక్ వర్ణమాలలోని చివరి అక్షరం; ఉపసంహారం
**alpha and omega** ఆద్యంతాలు
**omen** శకునం
**ill omen** అపశకునం, దుశ్శకునం
**ominous** అశుభ, అమంగళసూచక
**omit** విడిచిపెట్టు, వదిలివేయు; మరిచిపోవు; తీసివేయు, తొలగించు
**ommission** అకరణం, చేయమి, లోపం, తొలగింపు, విడిచిపెట్టడం
**omnibus** *adj* అశుభ, అమంగళసూచక *n* పెద్దబండి, మోటారువాహనం, బస్సు
**omnipotence** సర్వశక్తిమత్వం
**omnipotent** సర్వశక్తిగల, సర్వశక్తిమంతుడు
**omnipresent** సర్వవ్యాపి, సర్వాంతర్యామి
**omniscient** సర్వజ్ఞ; సర్వజ్ఞుడు
**omnivorous** సర్వభక్షక
**omphalitis** నాభిశోథ



**on** మీద, పైన
**on all fours** పాకుతూ, పారకాడుతూ
**on-coming** ఆగామి, రాబోవు, రానున్న
**on-flow** ప్రవాహంలోని, ప్రవహించే
**on-glide** పూర్వశ్రుతి
**on merits** యోగ్యతాధారంగా, గుణదోషాలనుబట్టి
**on one's legs** స్వశక్తిమీద ఆధారపడ్డ/నిలబడ గలిగిన
**on rush** ఆక్రమణ; ఎక్కుడు
**on the contrary** ప్రతికూలంగా, భిన్నంగా, విరుద్ధంగా
**on the face of it** ప్రత్యక్షంగా, చూసినంతనే
**once** ఒకసారి, ఒకప్పుడు
**once and again** తిరిగితిరిగి, మళ్ళీమళ్ళీ, పదేపదే
**once for all** శాశ్వతంగా, ఎల్లప్పటికీ
**once upon a time** ఒకానొకప్పుడు
**one** ఒక, ఒకటి, ఏక(ం)
**at one** ఏకంగా, ఒకటిగా, అంగీకారంతో
**one and all** అందరూ, మొత్తం
**one-eyed** ఏకాక్షి
**one man show** ఏకవ్యక్తి ప్రదర్శన
**one way street** ఏకమార్గం, ఒకే వైపు రాకపోకలను అనుమతించే దారి
**one-way video** ఏకముఖ దర్శనం
**oneness** ఏకత్వం
**onerous** దుర్భర, కఠిన, భార, అసాధ్య
**onion** ఉల్లి (పాయ)
**onomatopoeia** ధ్వన్యనుకరణం
**onset** అక్షరాది; ప్రారంభం
**onslaught** ఆక్రమణ, దండయాత్ర, ఆఘాతం, పైనబడటం, ఎదుర్కొనటం
**onus** బాధ్యత, బరువు, కర్తవ్యం, ఉత్తరదాయిత్వం
***onus probandi*** నిరూపణ/ప్రమాణ భారం, రుజువు చేయవలసిన బాధ్యత
**oogamy** అండసంయోగం
**oopherectomy** అండకోశచ్ఛేదనం
**oosphere** గోళాకారాండం
**ooze** కారు, స్రవించు, వెలువడు, కురియు; పలచని బురద
**opacity** అపారదర్శిత, అపారదర్శకత, అస్వచ్ఛత, మబ్బు
**opal** స్ఫటికం, తెల్లరాయి; రంగులుమారే విమలకం (అనే రాయి)
**opalescent** మెరిసే, స్ఫటికాకృతిగల, తెల్లరాయిలాగున్న
**opaque** కాంతినిరోధక, అపారదర్శక, కిరణాభేద్య, అస్వచ్ఛ, మలిన
**open** *adj* వివృత, తెరిచిన, విడిన; స్పష్ట, బహిరంగ; నిష్కపట, న్యాయబద్ధ, నిజ *n* తెరుచు, తీయు, మొదలుపెట్టు, ప్రారంభించు
**open an account** ఖాతా ప్రారంభించు/తెరుచు
**open book** స్పష్ట, ప్రకట, రహస్యంలేని
**open general licence** నిర్నిరోధసామాన్యానుమతి
**open handed** ఆహ్వానించే, ఉదార, దానశీల
**open-hearted** సహృదయ, నిష్కపటి
**open juncture** విప్రకృష్ట సంహిత
**open learning** విస్పష్టాభ్యసనం
**open letter** బహిరంగ లేఖ
**open market** బహిరంగ విపణి
**open-minded** నిష్కపట, పక్షపాతంలేని
**open-mouthed** స్పష్టవాది; లోభి
**open order** విడివిడి, దూరదూరంగా, అక్రమమైన
**open port** స్వేచ్ఛా నౌకాశ్రయం/రేవు
**open question** వివాద విషయం, శేషనిర్ణయంగల ప్రశ్న, సూటి ప్రశ్న
**open syllable** వివృతాక్షరం
**open the debate** చర్చ/వాదన ఆరంభించు
**open to conviction** శిక్షించదగ్గ
**open transition** వివృత స్థిత్యంతరం
**open vowel** వివృతాచ్చు
**with open eyes** జాగ్రత్తగా
**opening** తెరపి, ద్వారం, రంధ్రం, అవకాశం
**opening ceremony** ప్రారంభోత్సవం
**opening session** ప్రారంభ సమావేశం
**openly** బహిరంగంగా, స్పష్టంగా, ఆగకుండా
**opera** సంగీత నాటకం/రూపకం; భాగవతం వంటి ప్రదర్శన
**operant conditioned learning** ప్రచాలక నిబద్ధాభ్యసనం
**operate** నడిపించు, సాగించు, నిర్వహించు, బాగు చేయు, ప్రయోగించు, శస్త్రచికిత్స చేయు; చెల్లుబడి చేయు
**operation** శస్త్రక్రియ, పరికర్మ, ప్రవృత్తి, వ్యవహారం; కార్యం, గుణం; అమలు, సైనికచర్య
**operational activity** నిర్వహణ కార్యక్రమం

**operational base** నిర్వహణ మూలం/ఆధారం
**operational cost** నిర్వహణ వ్యయం
**operational feasibility** నిర్వహణ సాధ్యత
**operational headquarters** (యుద్ధ) నిర్వహణ కేంద్ర (కార్యాలయ)ం
**operational life** నిర్వహణ కాలం
**operational schedule** నిర్వాహణ సూచిక
**operational use** నిర్వహణోపయోగం
**operations** వ్యాపార వ్యవహారాలు
**operative** *adj* పనిచేసే, ఆచరణాత్మక *n* కార్మికుడు, కర్మచారి
**operator** నిపాతం, కారకం
**operculum** రక్షాకవచం
**operetta** సంగీతిక, చిన్న సంగీత నాటకం/రూపకం
**opiate** *adj* నిద్రబుచ్చే, మత్తిచ్చే, రోగకారి *n* నిద్రమాత్ర, మత్తుమందు, విష(తుల్య)ం
**opine** అభిప్రాయపడు, అనుకొను, తలచు, విచారించు, సలహా ఇచ్చు
**opinion** అభిప్రాయం, ఉద్దేశం, తలంపు, విచారం, ఊహ
**opinionated** మొండి, స్వబుద్ధి పక్షపాతి
**opium** నల్లమందు, అభిని
**oppertune** సమయోచిత, సమయానుకూల, ఉపయుక్త
**opponent** ప్రత్యర్థి, విరోధి, ప్రతిపక్షి, ప్రతిద్వంద్వి, శత్రువు, ప్రతిస్పర్ధి
**opponents** వ్యతిరేకులు
**opportunism** అవకాశవాదం, సమయానుకూలత
**opportunist** అవకాశవాది
**opportunity** అవకాశం, అవసరం, తరుణం, సమయం
**oppose** వ్యతిరేకించు, ఎదిరించు
**opposite** ప్రతియోగి, వ్యతిరేక, విరుద్ధ, విపరీత, అభిముఖ, ప్రతికూల
**opposites** పరస్పరవైరుధ్యాలు
**opposition** ప్రతిపక్షం, ప్రతియోగం, ప్రతికూలత, ప్రతిఘటన
**opposition benches** ప్రతిపక్షస్థానాలు
**opposition** (=rival) **paper** వైరిపత్రిక
**oppress** బాధించు, హింసించు, కష్టపెట్టు, అత్యాచారంచేయు
**oppressed** దళిత, తాడిత, పీడిత, బాధిత
**oppression** జులుం, పీడన, హింస, దమనక్రియ
**oppressive** భరించరాని, క్రూర, హింసాత్మక
**oppressor** పీడకుడు, బాధకుడు
***opprobrium*** అపకీర్తి, నింద
**opt** ఎంపిక చేయు, సమ్మతించు
**opthalmia** నేత్రశోథ
**opthalmic** నేత్రసంబంధి
**opthalmologist** నేత్రవైద్యనిపుణుడు
**opthalmology** నేత్రవైద్య(శాస్త్ర)ం
**opthalmoscope** నేత్రదర్శిని
**opthalmoscopy** నేత్రదర్శనం
**opthalomia-neonatorum** కొత్తగా పుట్టిన శిశువు కంటిశోథ
**optic** నేత్ర (నాడి), దృష్టిసంబంధి
**optical** నేత్ర/దృష్టి సంబంధి, దృగ్విజ్ఞాన సంబంధి
**optical area** దృక్పాతస్థలం
**optical character reader (OCR)** దృశాలిపి పాఠకం
**optical concept** దృక్శాస్త్రభావన
**optical disk** దృక్చక్రం
**optical illusion** దృష్టిభ్రమ, కన్నుచెదురు
**optical scanner** దృక్శోధకం, దృష్టిపరీక్షకం
**optician** నేత్రచికిత్సకుడు, సులోచన విక్రేత; దృక్శాస్త్రజ్ఞుడు
**optics** కాంతిశాస్త్రం, నేత్రజ్ఞానశాస్త్రం, దృగ్విజ్ఞానం, దృశాశాస్త్రం
**optimal** అభిలషణీయ, అనుకూల
**optimising** అనుకూలనం, ఆదర్శీకరణం
**optimism** ఆశావాదం
**optimist** ఆశావాది
**optimistic** ఆశాపూర్ణ
**optimize** ఆదర్శీకరించు, అనుకూలపరచు
**optimum** అత్యంతానుకూల, సర్వోత్తమ, సర్వశ్రేష్ఠ, ఆదర్శ, ప్రశస్త
**optimum temperature** అనుకూలోష్ణోగ్రత
**option** వికల్పం; ఇష్టం, అభిరుచి
**optional** వికల్ప, ఐచ్ఛిక, వైకల్పిక, అభిలషణీయ
**opulent** ధనిక, సంపన్న
**opuntia** బ్రహ్మజెముడు
***opus*** (సంగీత) రచన
***magnum opus*** మహాకావ్యం, సర్వోత్తమ కృతి/ కళాత్మకరచన
**oracle** దేవవాణి, భవ్యవాణి, ఆకాశవాణి, దివ్య వాక్యం; సోది



**oral** వాచిక, మౌఖిక, మూజువాణీ, నోటిమాట అయిన
**oral cavity** ముఖరంధ్రం
**oral evidence** మౌఖికసాక్ష్యం
**oral examination** మౌఖిక/మూజువాణీ పరీక్ష
**oral exercise** మౌఖికాభ్యాసం
**oral reading** మౌఖిక పఠనం
**oral stage** మౌఖికదశ
**oral test (=*viva voce*)** మౌఖిక నికష/పరీక్ష
**orally** నోటిమాటగా, మౌఖికంగా
**orange** నారింజ
**orang-outang** ఒరాంగ్-ఉటాంగ్ (కోతి)
**oration** వక్తృత్వం, గంభీరోపన్యాసం
**orator** వక్త, మహోపన్యాసకుడు
**oratorically** సద్వక్తృరీతిలో, ఆలంకారికంగా
**oratory** వాగ్ధాటి, వాక్పటిమ, వాక్శక్తి, వక్తృత్వం, ఉపన్యాస సామర్థ్యం
**orb** గోళం, మండలం, వృత్తం
**orbit** (భూ)కక్ష్య, గ్రహగతి, అయనం, కర్పరం, ప్రభావక్షేత్రం, కార్యక్షేత్రం, నేత్ర కోటరం/కుహరం
**orbital characteristic** ఆయన/కక్ష్యా లక్షణం
**orchard** పళ్ళతోట, ఫలోద్యానం
**orchestra** వాద్య బృందం/సమ్మేళనం
**orchidectomy** వృషణచ్ఛేదన
**orchitis** వృషణశోథ
**ordain** దీక్ష ఇచ్చు; ఆజ్ఞాపించు, విధించు, నియమించు, క్రమంగా ఉంచు
**ordeal** కఠినపరీక్ష, కత్తిమీద సాము; దివ్యపరీక్ష, అగ్నిపరీక్ష
**order** *n* క్రమం, ప్రకారం, శ్రేణి, వ్యవస్థ, విధానం, దర్జా, వరస; ఉత్తరువులు, ఆజ్ఞ, రివాజు *v* ఆదేశించు, ఆజ్ఞాపించు, చెప్పు, ఉత్తరువు చేయు
**by order** ఆజ్ఞ ద్వారా/మూలంగా
**close order** (సాయుధసేనల్లో) భుజం భుజం కలిపి, దగ్గరదగ్గరగా, సక్రమంగా
**law and order** శాంతి భద్రతలు
**open order** విడివిడి, దూరంగా, అక్రమమైన
**order cheque** అవాలతు వేసిన చెక్కు
**order in council** మంత్రి మండలి/పరిషత్తు ఆదేశం
**order of priority** పూర్వాపరక్రమం
**order of the day** (నిర్దిష్ట) దినకార్యక్రమం; రివాజు
**standing order** స్థాయీ ఉత్తరువు/ఆదేశం
**orderliness** క్రమబద్ధత
**orderly** *adj* క్రమబద్ధ, సువ్యవస్థిత, తిన్నని *n* ఆర్డర్లీ జవాను
**orders** ఉత్తర్వులు
**ordinal** క్రమాంకం; సార్వనామిక విశేషణం
**ordinal number** క్రమ (సూచక) సంఖ్య
**ordinal variable** క్రమాంక చలరాశి
**ordinance** అత్యవసరాదేశం, అధికారశాసనం, ఆజ్ఞ
**ordinarily** సాధారణంగా, మామూలుగా, సామాన్యంగా
**ordinary** సాధారణ, మామూలు, వ్యావహారిక
**ordinate** ద్వితీయ నిరూపకం
**ordnance** యుద్ధసామగ్రి, ఆయుధసంభారం
**ordnance depot** ఆయుధాగారం
**ordnance factory** ఆయుధకర్మాగారం
**ore** ఖనిజం, ముడిలోహం, ధాతువు
**ore pillar** ఖనిజ/ధాతు స్తంభం
**organ** అంగం, భాగం, ఇంద్రియం, (ప్రచార) సాధనం, అవయవం
**organic** సేంద్రియ, అంగారక, కర్బన సంబంధి, అంగ సంబంధి, సావయవ, సజీవ
**organic disorder** అవయవ అపవ్యవస్థ
**organic evolution** జీవపరిణామం
**organic manure** పచ్చి ఎరువు, సేంద్రియ ఎరువు
**organic model** అంగాంగిక ప్రతికృతి/నమూనా
**organic unity** అంగాంగ సంబంధం, అవయవ సమైక్యం
**organic waste** సేంద్రియ వ్యర్థ(పదార్థ)ం
**organic water** సేంద్రియజలం
**organisation** సంఘం, సంస్థ, వ్యవస్థ, నిర్మాణం, వ్యవస్థాపన, నిర్వహణ
**organisational behaviour** నిర్వహణశీల ప్రవర్తన
**organise** వ్యవస్థాపించు, ఏర్పాటుచేయు, సంఘటించు, నిర్వహించు
**organised** సువ్యవస్థిత, సంఘటిత
**organising** నిర్వహిస్తున్న
**organism** జీవి, అంగక్రమ నిర్మాణం, సంఘటిత శరీరం, జీవరాశి
**organogram** పర్యవేక్షణ వ్యవస్థ
**organon** శాస్త్రవిచార సూత్రపద్ధతి

**orgy** భావావేశం, ప్రేలాపన, పిచ్చి ఆనందం; మద్యపానోత్సవం, తాగుబోతుల గలభా, ఉన్మత్త ప్రమోదం
**orient** పూర్వ, ప్రాక్, ప్రాచ్యదేశ(ం)
**oriented** ఆధారిత
**oriental** ప్రాచ్య (దేశీయ)
**orientation** ధోరణి, నేపథ్యం, దృష్టి, ఉపదేశం, నిర్దేశం, పునశ్చరణ
**orientation course** నేపథ్య బోధన (తరగతి), పునశ్చరణ తరగతి
**orifice** రంధ్రం, బెజ్జం, కన్నం, ద్వారం; ముఖ వివరం
**orifice, anal** గుదద్వారం
**origin** ఉత్పత్తి, ఆరంభం, మూలాధారం, మూలం, పుట్టుక, జన్మ, వంశం
**original** ఆద్య, మూల, ప్రాథమిక, మౌలిక, అపూర్వ, మూలభూత, ఆధారభూత
**original sin** ప్రథమ/ఆది/మొదటి పాపం, అసలు పాపం
**originality** మౌలికత, ఉపజ్ఞ, నవీనత, నూతనత్వం
**originate** పుట్టు, కలుగు, ఆరంభించు, సృష్టించు, పునాదివేయు, నడిపించు, కల్పించు
**originated** జనించిన, మొదలైన
**originating** ఆవిర్భవించే
**ornament** *n* నగ, సొమ్ము, భూషణం, అలంకారం, సింగారం *v* అలంకరించు, సింగారించు
**ornamental breaker** ఆలంకారిక భంజకం
**ornamentally** అలంకార (ప్రాయ)ంగా
**ornate** ఆలంకారిక, అలంకృత
**orobanche** పొగాకు మల్లె
**orogential** ముఖ జననేంద్రియ
**orology** పర్వతశాస్త్రం
**orphan** అనాథ
**orphanage** అనాథ శరణాలయం
**orpiment** సిందూరం
**ortho-** రుజు; నిజ, స్పష్ట
**orthocentre** లంబకేంద్రం
**orthodox** పూర్వాచారపరాయణ, పురాతన/సనాతన భావాలున్న; రూఢిసిద్ధ; శాస్త్రీయ, ఛాందస
**orthodox economics** రూఢిగతార్థశాస్త్రం
**orthodoxical** ఛాందస, శాస్త్రీయ
**orthodoxy** పూర్వాచారపరాయణత్వం, శాస్త్ర సమ్మతి, ధర్మైకత, ఛాందసత్వం
**orthogenesis** స్వాభావికజీవోత్పత్తి, పరిణామ(క్రమ)ం
**orthogonal** లంబకోణీయ(ం)
**orthography** లేఖనశాస్త్రం
**orthoimage** నిజప్రతిబింబం
**orthopaedical handicap** శల్యవైకల్యం
**orthopaedics** శల్యవైద్యం, ఎముకలకూ వేళ్ళకూ సంబంధించిన చికిత్స
**orthophotoscape** స్పష్టచ్ఛాయాచిత్రం
**orthopnoea** కూర్చున్నా నిలుచున్నా ఆయాసం లేకపోవటం
**oryctics** జీవశేష శాస్త్రం
***oryza sativa*** వరి
**os** ద్వారం, రంధ్రం; ఎముక
**os-external** గర్భాశయ బాహ్యద్వారం
**os-internal** గర్భాశయాంతర్ద్వారం
**oscillate** ఊగులాడు, అల్లల్లాడు, తిరుగు; డోలాయమానమగు
**oscillation** డోలనం, ఊగులాట
**forced oscillation** ప్రేరిత డోలనం
**oscillator** డోలకం
**oscillogram** డోలన మాపకం
**oscillograph** డోలన లేఖనం
**oscillography** డోలన లేఖిని
**oscilloscope** డోలనదర్శిని
**oscul-infletim** ఆస్కంద సంధి
**osmometer** ఆస్మామాపకం, ద్రవాభిసరణ మాపకం
**osmoscope** ద్రవాభిసరణ దర్శిని
**osmose** జలాభిసరణ
**osmosis** ద్రవాభిసరణ
**osseous** అస్థిసంబంధి
**ossicle** చిన్న ఎముక
**ossiclesera** చెవిలోని చిన్న ఎముకలు
**ossiferous** అస్థిజనక
**ossification** ఎముకలాగా గట్టిపడటం
**ossify** గట్టిపరచు, ఎముకగా మారు/మార్పు
**osteitis** అస్థిశోథ
**ostensible** ప్రకట, విదిత, దృష్ట, ప్రత్యక్ష, బయటికి కనిపించే
**ostentation** ఆడంబరం, డంబం, బడాయి, డాబు
**ostentatious** ఆడంబరపూర్ణ, ప్రదర్శనాత్మక
**osteoarthritis** ఎముకల/కీళ్ళ శోథ
**osteocyte** అస్థికణం



**osteology** శల్యశాస్త్రం
**osteomalacia** అస్థిమృదుత్వం
**osteomyelitis** అస్థిమధ్యశోథ
**osteoporosis** బోలు ఎముకల వ్యాధి
**osteosclerosis** అస్థికాఠిన్యం
**osteotome** అస్థివిచ్ఛేదక సాధనం
**osteotomy** అస్థివిచ్ఛేదన
**ostium** రంధ్రం, ద్వారం
**ostracism** (దేశ) బహిష్కరణ, వెలి
**ostracize** (సమాజంనుంచి/దేశంనుంచి) బహిష్కరించు/వెలివేయు/వెళ్ళగొట్టు
**ostrich** నిప్పుకోడి, ఉష్ట్రపక్షి
**ostrich policy** గుడ్డి/పట్టించుకోని విధానం
**other** ఇతర, భిన్న, అన్య, అతిరిక్త, వేరే
**on the other hand** అదీగాక, కాకపోతే, అన్యథా
**other worldly** ఆధ్యాత్మిక, సంసారవిరక్త, పరలోకపరాయణ
**the other day** ఆ దినం, కొన్ని రోజులక్రితం
**the other world** పరలోకం, స్వర్గం; మరో ప్రపంచం; భవిష్యజ్జీవనం
**otherwise** అన్యథా, ఇతర విధంగా, కాకపోతే
**otic** కర్ణ సంబంధి, చెవికి సంబంధించిన
**otiose** వ్యర్థ, పనికిరాని, సోమరి
**otitis** కర్ణశోథ
**otitis-externa** బాహ్యకర్ణ శోథ
**otitis-interna** కర్ణాభ్యంతర శోథ
**otitis-media** మధ్యకర్ణశోథ
**otologist** కర్ణవైద్యుడు
**otology** కర్ణవైద్య(శాస్త్ర)ం
**otorrhoea** చెవినుంచి ద్రవం కారటం
**oust** తీసివేయు, (పదవినుంచి) తొలగించు/ వెళ్ళగొట్టు
**out** అవతలికి, బయటికి, వెలుపలికి; బాహాటంగా; పూర్తిగా; ఓటమి; మించిన
**not out** ఓడలేదు, ఔటు కాదు
**out and about** లేచి తిరగదగ్గ
**out-and-out** పూర్తిగా, బాహాటంగా
**out-herod** అతిక్రూరుడైన, నిర్దయ
**out-house** ఉపగృహం, ఆవరణలోని చిన్న ఇల్లు
**out of date** పాత, గతించిన, పురాతన, అప్రచలిత
**out of joint** పనికిరానిస్థితిలో, అవ్యవస్థలో, దుర్దశలో
**out of order** నియమ/క్రమ విరుద్ధ(ం)
**out of range** అందుబాటులోలేని
**out of the picture** అసంగత, అసంబంధిత, అప్రాసంగిక
**out of the way** దూరంగా, వేరుగా
**out patient** చికిత్సకోసం వస్తూపోతూండే రోగి
**outbid** వేలంలో పెద్దపాటపాడు, పోటీకి ఎక్కువ ధనమిచ్చు, ముందుకువెళ్ళు
**outbreak** *n* అకస్మాత్తుగా చెలరేగటం/ బద్దలవటం/కలగటం *v* బద్దలగు, వ్యాపించు
**outbuilding** ఉపగృహం, ఇంటిబయటి చిన్న కుటీరం
**outburst** పగలటం, విస్ఫోటం, బద్దలవటం; సోత్సాహోపన్యాసం; పేలుడు
**outcast** కులభ్రష్టుడు, జాతిభ్రష్టుడు; వెలివేసిన వ్యక్తి, బహిష్కృతుడు; చెత్తాచెదారం
**outclass** (పోటీలో) మించు/మీరు
**outcome** ఫలితం, పరిణామం
**outdo** మించిపోవు, ముందుకుసాగు, అధిగమించు
**outdoor** బయటి
**outer** వెలుపలి, బాహ్య
**outer perimeter** బయటి చుట్టుకొలత
**outer space** అంతరిక్షం
**outfield** ఆటస్థలం/వ్యవసాయభూమి అవతలి భాగం
**outfit** పెట్టేబేడా, సరంజామా, యాత్రసామాను
**outflank** పక్కనుంచి ముట్టడించు/బయటికివెళ్ళు
**outflanking movements** పక్కలనుంచి సాగిపోవటం, చుట్టుముట్టే ప్రయత్నం
**outflow** నిర్గమించు, స్రవించు, జారు
**outgoing** పోయే, పదవీవిరమణ చేస్తున్న
**outgrowth** కొమ్మ, శాఖ; హెచ్చు పెరుగుదల, అతివృద్ధి, పరిణామం
**outlandish** అపరిచిత, విచిత్ర, విదేశీ
**outlast** మన్నిక కలిగి ఉండు, ఎక్కువకాలం పనికివచ్చు
**outlaw** *n* న్యాయబహిష్కృతుడు, సమాజ బహిష్కృతుడు; బందిపోటు దొంగ
**outlay** వ్యయం, ఖర్చు
**outlet** బయటికి దారి
**outline** ఆకారరేఖ, రూపరేఖ, చుట్టుగీత, ఆవరణరేఖ, స్థలవిషయం
**outlook** దృష్టి (కోణం), దృక్పథం
**outlying** బయటనున్న, నేరుగా ఉన్న, హద్దుల అవతలి

**outmoded** పాత(కాలపు), పురాతన, పనికిరాని, పనిచేయని
**out-of-date** కాలం తీరిన, పాతబడ్డ
**outpost** గడికావలి, పోలీసు నాకా/ఠాణా, దూరప్రాంత సైనికస్థావరం/పోలీసు ఠాణా
**outpouring** తీవ్రప్రవాహం, భావ పరంపర/ప్రవాహం
**output** ఉత్పత్తి, ఉత్పాదన, పని, క్రియ, నవీనోత్పత్తి, ఉత్పాదకం
**output medium** ఉత్పాదిత మాధ్యమం
**outrage** *n* దౌర్జన్యం, ధర్షణం, మానభంగం, బలాత్కారం, దుర్వ్యవహారం *v* అవమానించు, బలాత్కరించు, దౌర్జన్యం/అత్యాచారం చేయు
**outrageous** దౌర్జన్య/అత్యాచార పూర్ణ, ఘోరాన్యాయమైన, గొప్ప చెరుపు చేసే
**outright** తక్షణ, సంపూర్ణ, మొత్తంగా
**outset** మొదలు, ప్రారంభం, ఆది, ఉపక్రమం
**outside chance** నమ్మరాని (అవకాశం), అపనమ్మకం కలిగే, ఎప్పుడోగాని జరగని
**outsider** పరాయివ్యక్తి, అవతలి/బయటి వ్యక్తి, ఎదుటివాడు
**outskirt** పొలిమేర, సీమ, శివారు, ఊరి వెలుపలి ప్రదేశం
**outspoken** నిష్కపటి, దాపరికంలేని, భోళాభాళీ
**outstanding** విశిష్ట, శ్రేష్ఠ, ముఖ్య; మిగిలిన, చెల్లించ వలసిన, బాకీ, బకాయి, శేషం; అప్రాప్తం
**outstation** శివార్లలోని, ఊరవతలి
**outstep** అతిక్రమించు, ఊరుదాటి వెళ్ళు; ముందుకుపోవు
**outstretched** బయల్వెడలిన, ముందుకు జరిపిన, ఆవరించి ఉన్న; బాగా విప్పారిన
**outstrip** చురుకుగా పరిగెత్తు, పారిపోవు, అతిక్రమించు
**outturn** ఉత్పత్తి, ఉత్పాదన, దిగుబడి, పని
**outward** వెలుపలి, బయటి, బాహ్య, బహిరంగ
**outwardness** బహిరంగత, ఆడంబరం, వస్తునిష్ఠత
**outweigh** ఎక్కువగా తూగు, మించి ఉండు, బరువులో/ప్రాధాన్యంలో అధికమగు
**outwit** యుక్తిలో మించు, ఎత్తుకుపైఎత్తువేయు, మోసగించు
**outworn** చిరిగిన, పనికిరాని, జీర్ణ, జర్జరిత
**ova** గుడ్లు
**oval** అండాకార, గోళాకార
**ovary** అండాశయం
**ovate** అండాకారం
**ovation** శ్లాఘ; గెలుపు, విజయం
**oven** పొయ్యి, ఆవం, పెనం, బట్టీ
**over** *adj, adv* మీద, పై(న), ఎక్కువ, ఎత్తయిన, మొత్తం, పూర్తిగా, ముందుకు, బయటికి; ఈ వైపు *n* ఎక్కువ, మిగులు; (క్రికెట్లో) ఆరుబంతులు విసరటం
**over-active** ఎక్కువ చురుకైన
**over against** ఎదిరించు, వ్యతిరేకించు
**over all** సమగ్ర, సంపూర్ణ
**over-all balance of trade** సమగ్ర సంతులిత వ్యాపారశేషం
**over-all impression** సంపూర్ణప్రభావం/సమగ్రాభిప్రాయం
**over our heads** సలహా లేకుండా
**overaction** అతినటన
**overawe** లొంగదీయు, చకితం చేయు, భయపెట్టు
**overbear** వశపరచుకొను, కిందపడదోయు, తలాయించు
**overbearing** అహంకారపూరిత, గర్వంగల
**overbearingness** అహంకారం, జబర్దస్తీ
**overboard** పడవపైనుంచి
**throw overboard** పారవేయు, విసరివేయు; త్యజించు, విడిచిపెట్టు
**overbridge** పై వంతెన
**overcarry** శక్తికిమించి మోయు/తీసుకొనిపోవు; అతిసహనం చూపు
**overcast** మబ్బులుకమ్ము/చీకటిపడు
**overcharge** *n* అధిక ధర/భారం; అతిశుల్కం *v* ఎక్కువ ధరపెట్టు, ఎక్కువగా ధరపెట్టు, ఎక్కువగా మందు/విద్యుత్తు నింపు
**overcome** ఓడించు, గెలుచు; వశపరచుకొను, లోబరుచుకొను, దూరంచేయు, అతిక్రమించు
**over confidence** అతివిశ్వాసం, అమితమైన ఆత్మవిశ్వాసం
**over correction** అతిశోధనం
**over crowding** అతి జనసమ్మర్దం
**overdose** *n* మితం తప్పిన మోతాదు, పెద్ద మోతాదు *v* ఎక్కువ ధరపెట్టు, ఎక్కువగా మందు/విద్యుత్తు నింపు
**overdraft** అతిగ్రహణం; ఖాతాలో ఉన్నదానికన్నా ఎక్కువ తీసుకోవటం



**overdue** కాలాతీతమైన, అతివిలంబిత; వాయిదా మీరిన బాకీ
**over exploitation** అత్యధికోపయోగం
**overfeeding** అధికంగా తిను/తినిపించు
**overflow** *n* వరద, పొంగు, ముంపు, వెల్లువ *v* ఉప్పొంగు, పొంగిపొరలు
**over-ground** భూమిపైన, ఎత్తుగా
**overhang** వేలాడు, ముందుకువాలు, వంగు, వంచు
**overhaul** పూర్తి మరమ్మత్తు, బాగుచేయు, తిరిగి నిర్మించు, కందెనపెట్టు
**overhead charges** వ్యవస్థావ్యయాలు
**overhear** పొంచి విను, యాదృచ్ఛికంగా విను
**overissue** పరిమితికిమించి జారీచేయు
**overland** *adj, adv* స్థలమార్గాన
**overlap** అతివ్యాప్తమగు
**overlapping** అతివ్యాప్తి
**overlay** ఒకదానిపై మరొకటి పరచు/కప్పు; అణచివేయు; ఆచ్ఛాదన
**over-loading** అతిభారకరణం
**overlook** ఉపేక్షించు, క్షమించు, లెక్కచేయకపోవు, వినీవిననట్లు చూసీచూడనట్లుండు
**overlord** అధిపతి, అధిరాజు, చక్రవర్తి, రాజరాజు
**over-lying map** అతివ్యాప్త మానచిత్రం
**overnight** *adj, adv* నిన్నరాత్రి, రాత్రిపూట, తెల్లవార్లూ
**overpopulation** జనాధిక్యం, అత్యధిక జనసంఖ్య, పెరుగుతున్న జనసంఖ్య
**overpower** లొంగదీయు, వశపరచుకొను, పరాజితుని చేయు, జయించు
**overproduction** అధికోత్పత్తి, అత్యుత్పాదన, అమితోత్పాదన
**overrate** అధికధర కట్టు, ఉన్నదాన్ని పెంచి చెప్పు, ఎక్కువగా అంచనావేయు
**overreach** మించిపోవు, వంచించు
**over ride** నెత్తికెక్కు, అవహేళనచేయు, ఆయాసపడు, తిరస్కరించు
**overripe** మగ్గపండిన, అతిపక్వ
**over run** ఉల్లంఘించు, ఆక్రమించు, దండెత్తు, కొల్లగొట్టు; వరద/ఉప్పెన వచ్చు, వెల్లువెత్తు
**overseas** సముద్రాంతర, దేశాంతర, విదేశంలోని
**overseas territory** అధీన వైదేశికప్రాంతం; సముద్రానికి ఆవలి భూభాగం
**overshadow** నీడ/రక్షణ ఇచ్చు, కప్పివేయు, ఆవరించు, ఇతరులకన్నా ఉత్కృష్టమగు
**oversight** పొరపాటు, మరపు, అనవధానత, ఉపేక్ష, గుర్తులేమి
**overstate** అత్యుక్తిగా/కల్పించి చెప్పు
**overstatement** అతిశయోక్తి, అత్యుక్తి, కల్పన
**overstay** గడువుదాటి నివసించు/ఉండు
**overstrain** *n* అధికశ్రమ, అధికాయాసం *v* అధికంగా శ్రమించు, అధిక పరిశ్రమతో అలసటనొందు
**overstudy** *n* అధికాధ్యయనం *v* శక్తికిమించి చదువు
**overt** బాహాట, బహిరంగ, ప్రత్యక్ష, ప్రచుర, దాపరికంలేని
**overtake** ముందుకు దాటిపోవు, తరిమిపట్టుకొను
**overthrow** *n* ఓటమి, పరాజయం *v* పడగొట్టు, పారదోలు, ఓడించు, తొలగించు, కూలదోయు, నష్టపెట్టు
**overtime** *adj* అతీతకాలిక, వేళమీరిన *n* అతిరిక్త సమయం, మామూలుకన్నా ఎక్కువ సమయం
**pay, overtime** అతిరిక్తసమయ వేతనం
**overtone** ఉన్నతస్వరం
**overtones** పైస్థాయి స్వరాలు; విశేషార్థసూచన
**overture** ప్రస్తావన, ప్రారంభం, ఆలాపన, అభిలాష, సూచన, సందేశం, మైత్రిభాషణ
**overturn** *n* పడదోయటం, విధ్వంసం *v* తిప్పివేయు, పడవేయు, చెడగొట్టు, ధ్వంసం చేయు
**over-value** అధికమూల్యం(కట్టు)
**overview** స్థూలదృష్టి, పైపై పరిశీలన, సమీక్ష
**overweight** అధిక భారం/బాధ్యత
**overwhelm** నిమగ్నం చేయు, అణచివేయు, ముంచివేయు, ఓడించు
**be overwhelmed** మునిగిపోవు, ఓడిపోవు
**overwhelming** అనివార్య, ప్రబల, విశాల, అధికసంఖ్యాక
**overwork** అతిశ్రమ, అధికశ్రమ, మితిమీరిన పని
**overwrite** దిద్దిరాయు
**overwrought** బాగా అలసిన
**oviduct** అండకోశనాళం
**oviparous** అండజ
**ovum** స్థూలబీజం, అండం, గర్భబీజం

**owe** రుణపడు, బాకీపడు, అప్పుపడు; కారణమగు, కర్తవ్యమగు
**owing** బాకీ ఉన్న, మిగిలి ఉన్న, ఇవ్వవలసిన; వల్ల, కారణాన
**owl** గుడ్లగూబ, దివాంధం; మూర్ఖుడు
**fly with the owl** నిశాచర ప్రవృత్తిలో ఉండు, రాత్రిపూట తిరుగుతుండు
**own** సొంత, తనకుచెందిన
**owner** యజమాని, స్వామి, అధిపతి, సొంతదారు
**ownership** యాజమాన్యం, స్వామిత్వం, కర్తృత్వం, స్వత్వం
**owner's interest** యజమాని లాభం/ప్రయోజనం
**oxidation** ఆమ్లజనీకరణం
**oxidisable** ఆక్సీకరణీయ
**oxidisation** ఆక్సీకరణం
**oxidise** ఆక్సీకరించు
**oxidised** ఆక్సీకృత
**oxidising** ఆక్సీకరణం
**oxygen** ప్రాణవాయువు, ఆమ్లజని
**oyster** నత్తగుల్ల
**ozone** ఓజోన్
**ozonisation** ఓజోనీకరణం

# p

**p.e.n.** ఒక సాహితీ సంస్థ
**pace** *n* గమనం, గతి, నడక, అడుగు, తీరు *v* మెల్లగా నడచు
**pacemaker** గతిప్రేరకం
**pacemaker, cardiac** హృదయగతిప్రేరకం
**pachyderm** మోటుచర్మంగల
**pacific** (ప్రశాంత), శాంతికాముక
**pacification** శాంతింపజేయటం, రాజీకుదర్చటం; శాంతి స్థాపన/సంధి
**pacifism** శాంతివాదం, శాంతి కాముకత/నీతి; యుద్ధవ్యతిరేక సిద్ధాంతం, అహింసావాదం
**pacifist** శాంతివాది; యుద్ధవ్యతిరేకి, అహింసావాది
**pacify** శాంతపరచు, అంగీకరింపజేయు
**pack** *n* కట్ట, మూట, బస్తా; దళం, సమూహం, వేటకుక్కల గుంపు, బరువు, భారం *v* కట్టు, చుట్టు, నింపు; రవాణా చేయు, పంపు
**pack animal** బరువులుమోసే జంతువు
**pack horse** సామానులుమోసే గుర్రం
**package** బంగీ, కట్ట, మూట, పొట్లం
**package deal** కలిసికట్టు ఏర్పాటు, టోకుబేరం
**packer** కట్టలుకట్టే వ్యక్తి/యంత్రం
**packet** చిన్నకట్ట, బంగీ, పొట్లం; గణం, వేష్టనం
**packing** సామానుకట్టడం, పొట్లం/మూట కట్టడం, బంగీకట్టడం
**packing paper** చుట్ట/బంగీ కాగితం
**packman** బరువులుమోసే వ్యక్తి
**pact** ఒడంబడిక, ఒప్పందం, సంధి; బంధకం
**pad** *n* మెత్త, కుదురు, దిండు, మెత్తుడు అట్ట *v* మెత్తబరచు, ఒత్తుపెట్టు
**paddle** (పడవనడిపే) చిన్న తెడ్డు *v* పడవ నడుపు, నీళ్ళలో కాళ్ళూచేతులూ ఆడించు
**paddle-wheel** తెడ్లచక్రం
**paddock** వీధి, చిన్న ఆవరణ; గోదురుకప్ప
**paddy** ధాన్యం, వడ్లు
**padlock** *n* కప్పతాళం, బయటినుంచి వేసే తాళం *v* తాళం పెట్టు/వేయు
***paean*** విజయగీతిక; స్తోత్రం, దేవతాస్తవం
**paediatrician** శిశువైద్య ప్రవీణుడు, శిశువ్యాధి చికిత్సకుడు
**paediatrics** శిశువైద్యం, శిశురోగవిద్య
**paediatrics centre** శిశువైద్య (చికిత్సా) కేంద్రం
**pagan** క్రైస్తవమతేతరుడు; ధర్మాన్ని అతిక్రమించే వ్యక్తి, అనాగరకుడు; బహుదేవతారాధకుడు, మత వ్యతిరేకవాది
**page** పుట; కుర్రవాడు
**pageant** సమారోహం, ఊరేగింపు, డాబు
**pageant type aid** ఉత్సవరూపి సాధనం
**pageantry** సమారోహం, ఉత్సవం, ఊరేగింపు
**pain** *n* నొప్పి, బాధ, వేదన, శూల, పీడ; ప్రసవ వేదన, నులి; ఆపద, యాతన *v* బాధపెట్టు, నొప్పించు, దుఃఖం కలిగించు
**pain, cardiac** గుండెనొప్పి
**pain, colicky** శూలనొప్పి
**pain, griping** (కడుపు)నులినొప్పి
**pain, labour** పురిటినొప్పి/ప్రసవవేదన
**pain, lowback** నడుమునొప్పి
**under pain of** శిక్షా/మృత్యు భయంవల్ల
**paint** *n* రంగు, పూత, మెరుగు *v* రంగువేయు, చిత్రించు, రంగు పూయు
**painter** చిత్రకారుడు, రంగులువేసే వ్యక్తి
**painting** చిత్రలేఖనం, చిత్రకళ, రంగులు వేయటం
**pair** *n* జత, జంట, జోడీ, యుగళం/యుగ్మం,



మిథునం, దంపతులు, భార్యాభర్తలు *v* జత కూడు/కూర్చు, జోడించు, జంట కూర్చు
**pairing** జత/జంట కట్టడం
**pal** (ఆంతరంగిక) అనుచరుడు
**palace** ప్రాసాదం, (రాజ) భవనం
**palaeo** పురా(తన), ప్రాచీన
**palaeography** పురాతనలిపిశాస్త్రం, శాసనలిపి శాస్త్రం
**palaeolith** పాతరాతియుగపు
**palaeolithic age** పాతరాతియుగం, ప్రాచీన పూర్వశిలాయుగం
**palatable** (నోటికి) హితవైన, రుచికర
**palatal** తాలవ్య(ం)
**palatalization** తాలవ్యీకరణం
**palate** తాలువు, అంగిలి
**palate, cleft** అంగిట్లో తొర్రి
**palate, hard** కఠిన తాలువు
**palate, soft** మృదు తాలువు
**palatial** రాజసౌధం లాంటి, సౌధ సంబంధి; వైభవంగల
**palatine** తాలు సంబంధి
**palaver** మాటామంతీ, సంభాషణ; పొగడ్త *n* హద్దు
**pale** *adj* పాలిపోయిన, తెల్లబోయిన, వివర్ణ *n* కంచె, సీమ, గుంజ, కొయ్య *v* వివర్ణమగు, వెలవెలబోవు; (గుంజలతో) ఆవరణ ఏర్పరచు
**paleography** పురాలిపి శాస్త్రం
**paleolithic** పాతరాతియుగం నాటి
**paleontology** లుప్తజంతుశాస్త్రం
***palette*** (కళాకారుడు) రంగుకలిపే ఫలకం
**palisade** అవరోధం, రక్షణ ప్రదేశం
**pall** *n* పరదా; శవపేటికమీద కప్పే గుడ్డ *v* కనిపించు; నిస్సారం చేయు, నీరసపడు
**palliate** తగ్గించు, ఉపశమింపజేయు; క్షమించు
**palliative** ఉపశమనకారి
**pallor** పాలిపోవటం
**palm** అరచేయి; తాటిచెట్టు
**palm off** వంచించు, మోసంతో నడుపు
**palm of victory** జయమాల
**palmy days** మంచిరోజులు, అభివృద్ధి చెందుతున్న రోజులు
**palmate** హస్తాకార(ం)
**palmyra** తాటిచెట్టు
**palpable** స్పష్ట, వ్యక్త, ప్రత్యక్ష
**palpation** తాకుతూ పరీక్షించటం
**palpebrum** కంటిరెప్ప
**palpitate** (గుండె/నాడి) అదురు, దడదడలాడు, కంపించు, కొట్టుకొను
**palpitation** (గుండె)దడ/అదురు, హృదయ కంపన తీవ్రత
**palsy** పక్షవాతం
**paltry** అల్ప, క్షుద్ర, నికృష్ట, చాలా కొంచెం
**palynology** సిద్ధబీజశాస్త్రం
**pamper** అధికంగా ప్రేమించు, తలకెక్కించుకొను; ఎక్కువగా తినిపించు/మెక్కబెట్టు
**pamphlet** కరపత్రం, ప్రచారపత్రం, చిన్న పుస్తకం
**pamphleteer** (ప్రచారంకోసం) చిన్న పుస్తకాలు రాసే రచయిత, కరపత్ర రచయిత
**pamphleteering** కరపత్ర రచన/ప్రచారం
**pan** *n* పళ్ళెం, పెనం, మూకుడు, పాత్ర; భూమిలోని గట్టి పొర *prep* సర్వం, అఖిల
**pan-islam** అఖిల ముస్లిం ప్రపంచం
**panacea** సర్వరోగనివారిణి, చింతామణి
**panarteritis** పూర్ణధమనిశోథ
**pancake** అట్టు
**pancarditis** పూర్ణ హృదయశోథ
**panchromatic** సర్వవర్ణగ్రాహి
**panchromatic camera** బహువర్ణచ్ఛాయా గ్రాహకం
**panchronic** సార్వకాలిక
**pancreas** క్లోమ(క)ం
**pancreatectomy** క్లోమ(క) ఛేదనం
**pancreatic-juice** క్లోమరసం
**pancreatitis** క్లోమశోథ
**pancytopenia** అఖిల రక్తకణ హీనత
**pandanus** మొగలి
**pandemic** విశ్వమారి, ప్రపంచవ్యాప్త వ్యాధి
**pandemonium** కోలాహలం, గలభా
**pander** *n* దళారి, తార్పుడుగాడు, తార్పుగత్తె; దుర్మార్గ సహకారి *v* దళారీ పనిచేయు; తార్చు, కోరిక తీర్చుకొను
**panegyric** స్తుతి, స్తోత్రం, స్తవం, కీర్తిగానం, పొగడ్త
**panel** జాబితా, పట్టిక, నామావళి; ఫలకం
**panel discussion** (నిపుణ)బృంద చర్చ
**panel of chairmen** అధ్యక్షమండలి
**panels** కసారులు
**pang** నొప్పి, వేదన, యాతన, దుఃఖం, బాధ, వ్యథ

**panhysterectomy** సంపూర్ణ గర్భాశయచ్ఛేదన
**panic** భయాందోళన, దిగులు, గాభరా
**panic monger** గాభరాపెట్టే వ్యక్తి
**panicle** చిన్నగుత్తి
***panicum miliane*** చేమ
**pannus** కంటి రక్తనాళాల్లో పొర
**panophthalmitis** సంపూర్ణ నేత్రశోథ
**panoply** సర్వాంగ కవచం
**panorama** సర్వదిగ్దర్శనం, విశాలదృశ్యం, విహంగదృశ్యం
**pantheism** అద్వైతం, సర్వేశ్వరవాదం, అనేక దేవతాపూజ
**pantheist** అద్వైతి, ఈశ్వరోపాసకుడు; బహుదేవతా భక్తుడు
**pantheon** దేవగణం; సర్వదేవమందిరం
**pantograph** వటపత్రలేఖిని
**pantomime** మూకాభినయం
**pantry** భండారం, వంటగది
**papacy** పోప్ ఆధిపత్యం
**papal** పోప్ అధికారంలోని, పోప్ సంబంధి
**papaya** బొప్పాయి
**paper** *n* కాగితం, ప్రమాణపత్రం, ప్రశ్నపత్రం, చర్చాపత్రం, పరిశోధనపత్రం, పరీక్షాపత్రం, వార్తాపత్రిక, దస్తావేజు *v* కాగితం అంటించు, కాగితంమీద రాయు
**on paper** లిఖిత రూపంలో/పూర్వకంగా
**paper based data** పత్రాధారిత దత్తాంశాలు
**paper currency** కాగితం చెలామణీ, కరెన్సీనోటు
**paper profits** అయథార్థలాభాలు, కాగితం మీద కనిపించే లాభాలు
**send in one's papers** రాజీనామాచేయు, రాజీనామాపత్రం పంపు
***papier mache*** కాగితం గుజ్జు
**papilipnaceous** సీతాకోకచిలుక లాగాఉండే/ఆకారంలో ఉన్న
**papilitis** నేత్రబింబశోథ
**papilla** చిన్నమొటిమ
**papillary** మొటిమల చర్మం
**papilloedema** నేత్రబింబశోథ
**papilloma** పులిపిరికాయ
**pappus** నూగు
**papule** బుడిపె
**papyrus** పురాతన పత్రం

**par** సమ(త్వ)ం
**above par** పెంచిన, ఉన్నత; అధికధర, అధికమూల్యం
**at par** సరిసమానంగా, సమాన ధరకు, లాభనష్టాలు లేకుండా
**below par** నష్టానికి, అవమూల్యం, సరసమైన ధరకు తక్కువగా
**on par (with)** సరిసమానంగా
**par excellence** ఉత్తమ, శ్రేష్ఠ
**par exchange** సమానమైన మారకం (ధర)
**parable** పిట్టకథ, నీతిబోధ, దృష్టాంతం, ఉదాహరణ
**parabola** పరవలయం, పరావలయం
**parabolical** లాక్షణిక, ఉదాహరణ స్వరూప
**paraboloid** పరవలయాభాస(ం), పరావలయాభాస(ం)
**paracentesis** శరీరకుహరంనుంచి ద్రవం తీయటం
**paracentesis, abdominis** ఉదరకుహరంనుంచి ద్రవం తీయటం
**paracentesis, pleural** శ్వాసకుహరంనుంచి ద్రవం తీయటం
**parachute** గాలిగొడుగు, వాయుచ్ఛత్రం
**parachute training school** వాయుచ్ఛత్ర శిక్షణ పాఠశాల
**parachute troops** గాలిగొడుగు (సేనా)దళాలు
**parade** *n* ప్రదర్శన, కవాతు, సైనిక ప్రదర్శన; ఆడంబరం *v* ప్రదర్శించు, కవాతు చేయు
**paradigm** రూపావళి
**paradigmatic** రూపావళీ సంబంధి
**paradise** స్వర్గం; వైకుంఠపాళీ
**paradox** వైరుధ్యం, విరోధాభాస, స్వవచన వ్యాఘాతం, అన్యోన్య విరుద్ధత
**paradoxical** విరుద్ధ, ప్రతికూల
**paraffin** ఒక రకం మైనం
**paragon** అత్యుత్తమ వస్తువు/వ్యక్తి; ఆదర్శం, మంచి నమూనా; దృష్టాంతం, నిదర్శన
**paragraph** పరిచ్ఛేదం, ఖండం, అనుచ్ఛేదం
**parallactic** దృష్టివిక్షేపక
**parallalogram** సమాంతర చతుర్భుజం
**parallax** దృష్టివిక్షేపం, లంబన
**parallax error** లంబనదోషం
**parallel** తుల్య, సదృశ, సరిపోలే, సమా(నా)ంతర
**parallel development** సమాంతర పరిణామం/అభివృద్ధి



**parallel editionising** సమాంతర సంచికా ప్రచురణ
**parallel government** సమాంతర ప్రభుత్వం
**parallelism** సమాంతరత; అనురూపత, సాదృశ్యం, సంవాదిత్వం
**parallelopiped** సమాంతరఖాతం
**paralyse** స్తంభింపజేయు, అశక్తం చేయు, పక్షవాతం తగులు
**paralysed** శక్తిహీన
**paralysis** పక్షవాతం, స్తంభనం
**paralysis, infantile** శిశుపక్షవాతం, పోలియో
**paralytic** పక్షవాతగ్రస్త; పక్షవాతరోగి
**paramagnetic** పరాయస్కాంత
**paramagnetism** పరాయస్కాంతతత్వం
**parameter** పరామితి, అభీష్టపరిమాణం
**paramnesia** అపస్మృతి
**paramount** పరమ, సర్వోచ్చ, శ్రేష్ఠ, ప్రముఖ, ప్రధాన; సార్వభౌమ
**paramount power** సార్వభౌమాధికారం, ఏకచ్ఛత్రాధిపత్యం, సర్వోన్నతాధికారం
**paramountcy** సార్వభౌమత్వం, సర్వసమున్నతత్వం, సార్వభౌమాధిపత్యం
**paramour** మిండడు, మిండగత్తె
**paranasal** ముక్కుకు రెండువైపులా
**parapet** పిట్టగోడ
**paraphernalia** సామగ్రి, సరంజామా
**paraphionosis** వెనక్కువచ్చిన ముందోలు తిరిగి ముందుకు పోవటం
**paraphrase** *n* అన్వయాంతరం, భావానువాదం, దండాన్వయం, వ్యాఖ్య, వివరణ, క్రమంగా చెప్పే అర్థం *v* వ్యాఖ్యానించు, దండాన్వయం చెప్పు, భాష్యం చెప్పు
**paraplegia** చరమాంగ వాతం
**para profession** అసమగ్ర నైపుణ్యం
**parasitaemia** రక్తంలో పరాన్నజీవులుండటం
**parasite** పరాన్నజీవి, పరాన్నభుక్కు, పరాశ్రయజీవి
**parasiticide** పరాన్నిజీవినాశని, (పరజీవి)కీటక నాశకం
**parasitism** పరాన్న జీవనం/భోజనం
**parasitology** పరాన్నజీవ శాస్త్రం
***parasol*** (ఆడవారి) గొడుగు
**parasympathetic** పరాసహానుభూత
**parasynthetic** పరాసంశ్లేషణాత్మక

**parataxis** పరాసమన్వయం
**paratroops** వాయుసేన, గాలిగొడుగుసేన
**parboiled** సగం ఉడికిన
**parboiled rice** ఉప్పుడు బియ్యం
**parcel** *n* బంగీ, భాగం, ముక్క, తునక, అంశం *v* పంచు, అంశాలుగా విభజించు, బంగీలుగా కట్టు
**parcel post** పార్సిల్ పోస్టు
**parcener, coparcener** సహదాయాది, సమానాధికారి, సమష్టివారసు
**parcenary, co-parcenary** సమష్టి కుటుంబ సమానాధికారిత్వం; సహదాయాదిత్వం; సమష్టి వారసత్వపు హక్కు
**parch** ఎండిపోవు, ఎండబెట్టు, వేయించు, కాల్చు, పేల్చు
**parchment** తోలు కాగితం
**pardon** *n* క్షమా దానం/భిక్ష, క్షమాపణ *v* క్షమించు, వదిలిపెట్టు
**pardonable** క్షమాయోగ్య, క్షమించదగ్గ
**parenchyma** మృదుకణజాలం
**parent** జనని, జనకుడు, జన్మకారకులు; వేరు, మూలం, పునాది, హేతువు
**parent material** మూలద్రవ్యం
**parentage** తల్లిదండ్రులు, పుట్టుక, వంశం, కులం
**parental** జనక
**parenteral** ఆంత్రేతర
**parenthesis** నిక్షేపం, కుండలీకరణం, చిన్నబ్రాకెట్టు
**parenthetical** నిక్షిప్త, కుండలీకృత; వైకల్పిక
**parents** తలిదండ్రులు, జననీజనకులు
**paresis** అసంపూర్ణ పక్షవాతం
**parietal** పార్శ్వ, పార్శ్విక‌
***pari passu*** సమానవేగంతో, సమగతితో
**parity** సమత, సమానత, సామ్యం, సాదృశ్యం
**parity of price(s)** ధరల సమానత్వం, మూల్యసామ్యం
**park** *n* తోట, ఉద్యాన(వన)ం, పచ్చిక మైదానం *v* నిలుపు, ఉంచు
**parking place** (వాహనాలు) నిలిపే చోటు
**parlance** సంభాషణ, (వాడుక)భాష, వాగ్వ్యవహారం
**parley** *n* (సంధి) చర్చ, ఒండంబడిక, సంధి సంభాషణ *v* చర్చించు, వాదించు, మాట్లాడు
**parliament** పార్లమెంటు, చట్టసభ

**dissolve parliament** పార్లమెంటును రద్దుచేయు
**prorogue parliament** పార్లమెంటు సమావేశాలు ముగిసినట్లు ప్రకటించు
**parliamentarian** పార్లమెంటు సభ్యుడు/వ్యవహారజ్ఞుడు
**parliamentary** పార్లమెంటుకు సంబంధించిన
**parliamentary correspondent** పార్లమెంటు విలేఖరి
**parliamentary government** పార్లమెంటరీ ప్రభుత్వం
**parliamentary secretary** పార్లమెంటరీ కార్యదర్శి
**parlour** కచేరి, సావడి; సమావేశం
**parochial** సంకుచిత, ప్రాంతీయ
**parody** *n* అధిక్షేప (గీత/కావ్య)ం, వ్యంగ్యానుకరణం *v* గేలిచేయు, అధిక్షేపించు
**parole** నోటి మాట/హామీ/పూచీ; బంధవిముక్తి, తాత్కాలిక విమోచనం
**on parole** పెరోల్ మీద, తాత్కాలికవిమోచనంలో
**parosmia** ఘ్రాణవికృతి
**parotid** లాలాజల గ్రంథి
**paroxysm** ప్రకోపం, ఆవేశం, ఆవేగం, ఉద్వేగం, ఈడ్పు (బాధ)
***parricide*** పితృ/మాతృ హత్య; పితృ/మాతృ ఘాతకుడు
**parrot** (రామ)చిలుక
**parry** నిలిపివేయు, దాటవేయు, తప్పించుకొను; దూరం చేయు
**parsimonious** పిసినారి, పీనాసి, లుబ్ధ, పిసినిగొట్టు
**parsimony** లోభం, మితవ్యయం, పిసినారితనం
**parsing** పదనిరూపణ(ం)
**part** *n* భాగం, అంగం, ముక్క, ఖండం, వంతు, అంశం, వాటా; పని, ప్రదేశం; అభినయం *v* విభజించు, వేరు చేయు, ఎడబాపు
**for my part** నా వైపున, నావల్ల, నాకు సంబంధమున్నంతవరకు
**for the most part** చాలావరకు, సాధారణంగా
**in bad or ill part** చెడుగా భావించి
**part and parcel** అభిన్నభాగం, ప్రతిభాగం
**part-time** కొంతసేపటికోసం, పాక్షికసమయం
**part-time labour** పార్ట్‌టైం కూలీ, పాక్షికకాల సేవ
**partake** పాల్గొను, తీసుకొను, వంతు తీసుకొను
**partial** పాక్షిక, కొంత, ఆంశిక, అసంపూర్ణ
**partial agreement** పాక్షిక ఒప్పందం
**partial treaty** పాక్షిక సంధి
**partiality** పాక్షికత్వం, పక్షపాతం
**participal** కృదంతపరక
**participate** పాల్గొను, వంతు పుచ్చుకొను
**participation** భాగస్వామ్యం; పాల్గొనటం
**participative learning** భాగస్వామ్యావగాహన
**participatory approach** భాగగ్రహణ విధానం/పద్ధతి
**participle** అసమాపక క్రియ
**participle, past** క్త్వార్థకం
**participle, present** శత్రర్థకం
**particle** రేణువు, కణం, చిన్నభాగం, ముక్క
**particle accelator** కణత్వరణ యంత్రం
**particle, contingency** అనిశ్చయార్థకం
**particle physics** కణభౌతికశాస్త్రం
**particle theory** కణ/రేణు సిద్ధాంతం
**particular** విశేష, ప్రత్యేక, అసామాన్య
**go into particulars** వివరాల్లోకి వెళ్ళు, వివరంగా తెలుసుకొను
**in particular** ప్రత్యేకంగా
**particular(s)** వివరాలు, విశేషాలు
**particularise** ప్రత్యేకించి చెప్పు/పేర్కొను, వివరించు, వివరంగా చెప్పు
**particularist** ప్రత్యేకవాది, భిన్నవాది
**particulate matter** కణరూపద్రవ్యం
**parties** వర్గాలు, పక్షాలు
**parting** వీడ్కోలు, సెలవు; వియోగం; విభజన
**partisan** పక్షపాతి, పక్షవాది, సమర్థకుడు
**partisans** పక్షీయులు; ప్రజాసైనికదళాలు
**partisanship** పక్షపాతం, పక్షవాదిత్వం
**partition** *n* పంపకం, విభజన; మధ్యగోడ, విభాగం *v* విభజించు, విభాగించు
**partly** పాక్షికంగా, పరిమితంగా, కొద్దిగా, కొంతవరకు
**partner** భాగస్వామి, భాగస్థుడు
**sleeping partner** పెట్టుబడి పెట్టిన భాగస్వామి, నిర్వహణబాధ్యతలు తీసుకోని భాగస్వామి
**partnership** భాగస్వామ్యం; పొత్తు
**parts** భాగాలు
**spare parts** విడిభాగాలు
**parturition** ప్రసవం, ప్రసూతి
**party** (రాజకీయ)పక్షం, దళం, విందు
**party in power** అధికారపక్షం



**party politics** పార్టీ రాజకీయాలు, ముఠాతత్వం
**party spirit** పార్టీతత్వం, పక్షతత్వం
**party system of government** పార్టీ విధాన ప్రభుత్వం
***parvenu*** ఆకస్మిక ధనికుడు, భోగి, నడమంత్రపు సిరి పట్టినవాడు
**pasigraphy** సర్వగ్రాహ్యలిపి
**pasimology** అంగవిక్షేప భాష, సైగల భాష
**pass** *n* దారి, సందు; ప్రవేశపత్రం, అనుజ్ఞాపత్రం, గంభీరస్థితి *v* వెళ్ళు, జరుగు, దాటు, ముందుకు నడుచు, సఫలమగు, ఉత్తీర్ణుడగు; ఆమోదించు, అంగీకరించు, కలిపివేయు; శాసనం చేయు
**bring to pass** (పూర్తి)చేయు
**come to pass** ఆగు
**pass an order** ఆదేశించు, ఉత్తరువు జారీచేయు
**pass away** మరణించు
**pass book** లెక్కల/ఖాతా పుస్తకం
**pass by** గడచు, (పక్కగా) పోవు, దాటిపోవు
**pass for** చెల్లు, అంగీకృతమగు, సమ్మతమగు
**pass muster** (నిర్దిష్టప్రమాణాలకు) సరిపడు
**pass off** గతించు, అంతమగు; మోసంతో ఇచ్చు
**pass over** విడిచిపెట్టు, ఉపేక్షించు, లెక్కచేయకుండు
**passable** దాటవీలయిన, పనిగడిపే, ఆమోదయోగ్య
**passage** దారి (పన్ను); గమనం, నిర్గమనం; నిష్క్రమణం; అవతరణ, ఉద్ధరణ; ఓడ రేవు
**passage and storage** నిర్గమన సంరక్షణలు
**passage of arms** జగడం, వాగ్యుద్ధం
**passenger** ప్రయాణికుడు, యాత్రికుడు; విటుడు
**passenger coach** ప్రయాణికుల రైలుపెట్టె
**passenger train** ప్రయాణికుల రైలు
**passer-by** బాటసారి, దారినబోయే దానయ్య
**passing** క్షణిక, క్షణభంగుర
**passion** మోహం, కామం, ఉద్రేకం, ఉద్వేగం, ఆవేశం, క్రోధం
**passionate** ఆవేశపూరిత, క్రోధంగల
**passive** నిష్క్రియ, నిశ్చేష్ట, సాత్విక
**passive resistance** సాత్విక నిరోధం, సత్యాగ్రహం
**passive system** నిష్క్రియ వ్యవస్థ
**passive voice** కర్మణ్యర్థకం
**passively** తలవంచి, వ్యతిరేకించకుండా
**passport** ప్రయాణపత్రం
**password** సంకేత(శబ్ద)ం
**past** *adj* భూత, గడచిన, వెనకటి, పూర్వకాలపు *n* భూతకాలం, పూర్వం
**past adjective** క్తవదర్థకం
**past-master** అతికుశలుడు, గురువు, నేర్పరి, సమర్థుడు
**past participle** క్త్వార్థకం
**past perfect** పూర్ణభూతం
**paste** *n* లేహ్యం, ముద్ద, పూత, జిగురు; నకిలీ *v* అతికించు, అంటించు, అంటుపెట్టు
**pastel** లేతరంగు, లేచాయ; లేపనం
**pasteurization** క్రిమిదూరీకరణం, శుద్ధి
**pasteurize** శుద్ధి చేయు/పరచు; పులియనీకుండు, క్రిములను సంహరించు
**pasteurized milk** క్రిమిరహితక్షీరం
**pastime** వినోదం, క్రీడ; మనోవికాసం; మనోరంజనం
**pastoral** గ్రామీణజీవన/పశుపాలన సంబంధి, మతాధికారికి సంబంధించిన
**pastoral letter** మతాధికారి లేఖ
**pasturage** పశుచారణ(ం); గొడ్లుమేపటం; పశువులు మేసే భూమి
**pastural** పశుపాలన సంబంధి
**pasture** మేత, పచ్చిక, పశుగ్రాసం
**pasture land** శాద్వలభూమి
**pasturisation** శుద్ధి, క్రిమిదూరీకరణం
**pat** *adj, adv* తగిన, యోగ్య; ఉచిత రీతిలో/సమయంలో *v* వెన్నుచరచు, వీపు తట్టు
**patalous** వివృత, తెరచుకొని ఉన్న
**patch** *n* అతుకు, మాసిక, మచ్చ *v* అతికించు, మూసివేయు, అసమగ్రంగా మరమ్మతు చేయు
**patch up** ఒడంబడిక కుదుర్చుకొను, సరిపెట్టుకొను, కలహం మాను
**strike a bad patch** దురదృష్టకరదినాలు గడుపు
**patchwork** అతుకులమారి పని
**patella** మోకాలి చిప్ప
**patent** *adj* లోపలికి పోవటానికి వీలైన, ఏకస్వ; వ్యక్త, స్పష్ట, ప్రత్యక్ష, ప్రసిద్ధ *n* ఏకస్వం, అధికారపత్రం, ప్రత్యేకహక్కు *v* సర్వహక్కులూ ప్రత్యేకించుకొను/స్వాయత్తం చేసుకొను
**patently wrong** స్పష్టంగా/పూర్తిగా అనుచితం/తప్పు
**patentee** విశిష్టాధికారి, పూర్తి అధికారి

**paternal** పైతృక, తండ్రికి సంబంధించిన; పరంపరాగత, వంశపారంపర్య
**paternity** పితృత్వం, జనకత్వం
**path** (కాలి)బాట, దోవ, దారి, పథం; రీతి, విధానం
**pathetic** దయనీయ, జాలిగొలిపే
**pathogen** వ్యాధికారకం
**pathogenesis** రోగవికాసం
**pathogenic** హానికర, వ్యాధిజనక
**pathological report** శవపరీక్షానివేదిక
**pathologist** వ్యాధివిజ్ఞాన శాస్త్రజ్ఞుడు, రోగలక్షణ శాస్త్రజ్ఞుడు
**pathology** వ్యాధివిజ్ఞాన/రోగలక్షణ శాస్త్రం
**pathos** కరుణ (రసం)
**pathway** మార్గం, దారి, పథం
**pathway, conduction** చాలనమార్గం
**pathway, sensory** సంవేదన మార్గం
**patience** ఓర్పు, ఓర్మి, ఓపిక; శాంతి, ధైర్యం, సహనం
**be out of patience with** సహించలేకపోవు
**have no patience with** సహించకుండు, ఓర్వలేకపోవు
**patient** *adj* ఓర్పుగల, సహనశీల, శాంత *n* రోగి
**patient-ambulant** నడవగలిగిన రోగి
**patois** అపభాష
**patriarch** కులపతి, తెగపెద్ద, కుటుంబ పెద్ద; వృద్ధుడు
**patriarchal** పూర్వకాలిక; పితృక్రమానుగత
**patrician** ఉత్తమవర్గం
**patricide** పితృహత్య/పితృహంత(కుడు)
**patrimony** పిత్రార్జితం, పైతృక(ధన)ం
**patriot** దేశభక్తుడు
**patriotism** దేశభక్తి
**patrol** *n* గస్తు, కాపలా, కావలి, పహరా *v* గస్తీ తిరుగు, కాపలాకాయు
**patrolling** గస్తీ తిరగటం
**patron** పోషకుడు, రక్షకుడు
**patronage** ప్రాపకం, పోషణ, రక్షణ
**patronymic** పైతృకనామ(ం)
**pattern** ఆకృతి, నమూనా, నిర్మాణక్రమం, విన్యాసం, ప్రతిరూపం, మాదిరి, ఉదాహరణ, తరహా, ఆదర్శం
**pattern recognition** విన్యాస జ్ఞానం/పరిగణన
**pattern, speech** మాటతీరు, మాట్లాడేతీరు
**paucity** కొరత, స్వల్పత, న్యూనత
**pauper** బికారి, పేద, నిర్ధనుడు, పకీరు, సన్యాసి
**pauperism** పేదరికం, బికారితనం
**pause** *n* వ్యవధానం, విరామం, విశ్రాంతి, నిలుపు, విరతి; విరామచిహ్నం *v* ఆగు, నిలుచు, సంకోచించు, ఊపిరి తీసుకొను
**give pause to** ఆలోచనలో/సంకోచంలో పడవేయు
**pave** దారితీయు, మార్గం సరిచేయు
**pavement** రాళ్ళుపరిచిన కాలిదారి, బాటపక్క కాలిదారి
**pavement artist** రోడ్డు మీద/పక్కన చిత్రాలుగీసే కళాకారుడు
**pavillion** మండపం, డేరా
**pavus** నెమలి
**pawn** *n* పావు, పాచిక, (చదరంగంలో)బంటు; తమలపాకు; కుదువ, తాకట్టు *v* తాకట్టు పెట్టు
**pawn broker** తాకట్టు పెట్టుకొని రుణమిచ్చే వ్యక్తి
**pawnee** తాకట్టు పెట్టుకునే వ్యక్తి
**pawner** కుదువ పెట్టే వ్యక్తి
**pay** *n* వేతనం, జీతం *v* ఇచ్చు, చెల్లించు, వేతన మిచ్చు
**in the pay of** సేవలో, కొలువులో
**pay commision** వేతన సంఘం
**pay for** మూల్యం చెల్లించు; శిక్ష అనుభవించు
**pay grade** వేతన స్థాయి
**payload** (వెలగల) బరువు, (అమూల్య)భారం
**pay off** చెల్లించు, తీర్చు, ఇచ్చివేయు
**pay structure** వేతననిర్మాణ క్రమం/వ్యవస్థ
**pay up** చెల్లించు
**payee** (సొమ్ము)పుచ్చుకునే వ్యక్తి
**payer** (సొమ్ము)చెల్లించే వ్యక్తి
**payment** చెల్లింపు
**peace** శాంతి; సంధి
**hold one's peace** ఊరకుండు, పలకకుండు
**peaceful** శాంత, శాంతియుత
**peacemaker** శాంతిసంధాత, ఒప్పందం కుదిర్చే వ్యక్తి
**peace offering** (శాంతి నిమిత్త)నైవేద్యం, శాంతి ప్రతిపాదన
**peacock** నెమలి, మయూరం; మిథ్యాభిమాని
**peak** పర్వతశిఖరం; అత్యున్నతి; ఆధిక్యం; కొన, అగ్రం



**peal** *n* కేక, గర్జన, ఘంటాస్వరం *v* గంట కొట్టు/మోగు
**peanut** (groundnut) వేరుసెనగ
**peanuts** చిల్లర వ్యవహారం
**pear** బేరీ పండు/కాయ
**pearl** ముత్యం; ముత్యపు చిప్ప
**cast pearls before swine** అనవసర ప్రయాస పడు; అపాత్రదానం చేయు
**pearl-diver** (ముత్యాల సేకరించే) లోయీత గాడు
**peasant** రైతు, కర్షకుడు; గ్రామీణుడు
**peasantry** రైతాంగం, వ్యవసాయదారులు
**peat** కుళ్ళిన చెట్టు/మొక్క
**pebble** గులకరాయి; స్ఫటికం
**peccant** దోషపూరిత; దోషి, దూషితుడు
**pecksniff** దానగుణ ప్రదర్శకుడు
**pectoral** వక్షస్థ, భుజపుటెముక
**peculate** ప్రజాధనం/ప్రభుత్వసొమ్ము దొంగిలించు/స్వాహాచేయు
**peculation** (ప్రజా)ధనాపహరణ
**peculiar** విచిత్ర, విపరీత, అసాధారణ, విశేష, ప్రత్యేక
**pecuniary** ఆర్థిక, ధన సంబంధి
**pedagogics** విద్యాబోధన శాస్త్రం
**pedagogue** అధ్యాపకుడు, బోధకుడు, శిక్షకుడు
**pedagogy** శిక్షణ/బోధన శాస్త్రం, అధ్యాపన కళ
**pedal** పాదం
**pedant** పాండిత్య/విద్యాడంబర ప్రదర్శకుడు
**pedantic** పాండిత్య సంబంధి
**pedantry** విద్యాదర్పం, పాండిత్య ప్రదర్శన/ప్రకర్ష
**peddlar** వీధిబేరగాడు
**pedestal** వేదిక, పీఠం, ఉన్నత స్థానం/పదవి; స్తంభం/ప్రతిమ అడుగుభాగం
**pedestrian** పాదచారి, పథికుడు; సాధారణ వ్యక్తి
**pedestrian crossing** పాదచారులు రోడ్డుదాటే చోటు
**pediatrics** శిశుచికిత్స
**pedicle** తొడిమ, పుష్పవృంతం
**pediculosis** పేలు పట్టడం/పడటం
**pediculus** పేను
***pediculus, capitis*** తలపేను
***pediculus, corporis*** ఒంటిపేను
**pedigree/pedigry** వంశవృక్షం, వంశావళి, ఆభిజాత్యం; ఉత్తమజాతి
**pediment** పర్వతపాదం
**pediplain** పర్వతసానువు
**pedology** (=soil science) మృత్తికాశాస్త్రం
**peduncle** తొడిమ, పుష్పకాండం
**peep** *n* తొంగిచూడటం, చూపు; కోడిపిల్ల అరుపు *v* తొంగిచూచు; (కోడిపిల్ల) అరుచు
**peer** *n* ధనవంతుడు, ప్రభుపట్టంగలవ్యక్తి; ఈడైన/సమాన వ్యక్తి *v* కనిపించు, తొంగిచూచు
**peerage** బ్రిటిష్ సామంతవర్గం, ప్రభుపదవి
**peerless** అసమాన, అద్వితీయ, సాటిలేని
**peers** ప్రభువులు, సామంతులు
**peevish** చిరచిరలాడే, పోట్లాడే, అసంతృప్త, కర్కశ
**peg** *n* మద్యపాత్ర, సోడా కలిపిన మద్యం; (కొయ్య)మేకు, గసిక *v* కట్టివేయు, ధరలను అదుపుచేయు
**a peg to hang (discussion)** వివాద విషయం/సందర్భం
**peg away** నిరంతర ప్రయత్నంలో ఉండు
**pegasus** ఉచ్చైశ్రవం
**pegging** నిలుపుదల; (కొయ్య/గూటం మొ.) పాతటం/బిగించి కట్టడం
**pegging of exchange** మారకపు రేటు స్థిరీకరణ
**pejoration** అపకర్ష
**pelicans** కొంగలు
**pellagra** వ్యాధి
**pellet** గోలీ, చిన్న ఉండ
**pellicle** పొర
**pell-mell** చిందరవందర, గజిబిజి, క్రమరహిత
**pellucid** నిర్మల, విమల, శుద్ధ, స్వచ్ఛ
**pelt** *n* పచ్చిచర్మం, పదునుచేయని తోలు *v* విసరు, విసరి కొట్టు
**pelvic** కటి సంబంధి, తొడ ఎముక
**pelvis** కటి (వలయం)
**pen** కలం, లేఖిని; పశువుల/కోళ్ళ దొడ్డి
**pen down strike** కలం కట్టు సమ్మె, పనిమానివేత సమ్మె
**pen-name** కలంపేరు, ఉపనామం
**pen plotter** లేఖినీ నిర్దేశకం
**penal** దండనార్హం, శిక్షా సంబంధి
**indian penal code** భారతీయ శిక్షాస్మృతి
**penal clauses (of a bill)** (చిత్తుచట్టంలోని) శిక్షా సంబంధి విభాగాలు/ఉపవాక్యాలు
**penal colony** ఖైదీల నివాసస్థలం

**penal law** దండవిధి, దండన/శిక్షా శాస్త్రం
**penal servitude** కఠిన/కఠోర శిక్ష
**penalise** దండించు, శిక్షించు
**penalty** శాస్తి, శిక్ష; జరిమానా
**under penalty** భయపెట్టి, శిక్షాభయం కల్పించి
**penance** తపస్సు, ప్రాయశ్చిత్తం
**penchant** అభిరుచి, ప్రవృత్తి
**pencil** లేఖిని, శలాక
**pencillin** పెన్సిలిన్
**pend** వేలాడు, మధ్యలో ఉండు; నిర్ణయం కాని
**pendant/pendent** *adj* ఆలంబి; వేలాడుతున్న *n* కంఠహారం
**pending** అనిశ్చిత/అనిర్ణీత(స్థితి), జరుగుతున్న, నడుస్తున్న, నిలిచి ఉన్న, మిగిలి ఉన్న
**pendulous** వేలాడే
**pendulum** లోలకం
**swing of the pendulum** రాజ్యాధికార పరివర్తన
**peneplain** సమప్రాయభూమి, సమస్థలాభం
**penetrate** చొరు, ప్రవేశించు, గ్రహించు
**penetrating** చొచ్చుకొని ఉన్న, చొరబడ్డ, ప్రవేశక, భేది
**penetration** చొరబాటు, ప్రవేశనం, భేదనం, వ్యాప్తి
**penetration map** ప్రవేశన మానచిత్రం
**penile** శిశ్న (సంబంధి)
**peninsula** ద్వీపకల్పం
**peninsular** ద్వీపకల్ప సంబంధి
**penis** శిశ్నం, లింగం
**penitence** పశ్చాత్తాపం, ప్రాయశ్చిత్తం, దుఃఖం, శోకం
**penitent** అనుతాపంపొందే/పశ్చాత్తాపంచెందే (వ్యక్తి)
**penitentiary** ప్రాయశ్చిత్త గృహం/శాల; నేరగాళ్ళకు నీతులు చెప్పే జైలు, (వ్యభిచారిణుల) శరణాలయం
**penmanship** లేఖన/రచనా శక్తి/నైపుణ్యం
**pen name** *(=nom de plume)* కలంపేరు, మారుపేరు
**pennant** పతాకం, జెండా
**penniless** నిరుపేద, నిర్ధనుడు
**pennon** పతాకం, జెండా, రెక్క
**penny** పెన్నీ, చిల్లరడబ్బు
**a pretty penny** బహుధనం
**penny-a-liner** చౌకబారు రచయిత
**pension** పింఛను, నివృత్తి వేతనం, ఉపకార వేతనం, వజీఫా
**pensionable** పింఛనివ్వదగిన
**pensioner** పింఛనుదారు
**pensive** ఆలోచనాధీన, ఉదాసీన
**pentagon** పంచభుజి; (అమెరికాలో) సైనిక ప్రధాన కార్యాలయం
**pentandrous** పంచకేసరయుత
**pentangular** పంచకోణ; అయిదు జట్టుల పోటీ
**pentarch** పంచప్రథమదారుకం
**penthouse** పంచపాళి, వసారా
**pentode** పంచధ్రువి
**pentrap** గూడు, బోను
**penultimate** ఉపధ
**penumbra** ఉపచ్ఛాయ
**penurious** నిర్ధన, పిసినారి, అల్ప; అపర్యాప్త
**penury** లేమి, దారిద్ర్యం, పేదరికం
**people** ప్రజలు, జనం, నివాసితులు, బంధువులు, ప్రజానీకం, జనత
**people's democracy** జనతాప్రజాస్వామ్యం
**people's republic** లోకగణరాజ్యం
**peoples** జాతులు
**pep** ఉత్సాహం, ఉత్తేజం
**peppery** చిటపటలాడే, కోపిష్ఠి; తీక్ష్ణ
**per** ద్వారా, ఒక్కోదానికి
**per adventure** బహుశా
**per annum** సాలుకు, సంవత్సరానికి
**per capita** తలసరి, తలొక్కంటికి
**per capita income** తలసరి ఆదాయం
**per cent** శాతం, నూటికి, ప్రతిశతి
***per contra*** ప్రతి(వాది)గా, ఎదురుగా, విరుద్ధంగా
**per mensum** నెలకు, మాసానికి
***per saltum*** ఒకేసారి, ఏకమొత్తంగా
***per se*** స్వయంగా, స్వతహాగా, స్వభావతః
**perambulate** పరిభ్రమించు, విహరించు, గస్తీతిరుగు
**perambulator** పిల్లలబండి
**perceivable** గోచరించే
**perceive** గ్రహించు, తెలుసుకొను, చూచు, అనుభవించు
**percentage** శాతం
**percept** గోచరించు
**perceptibility** స్పర్శశక్తి
**perceptible** గ్రహింపదగ్గ, ఇంద్రియగోచర, చూడదగ్గ, కనిపించే; ప్రత్యక్ష (జ్ఞానాత్మక)



**perceptibly** స్పష్టంగా, ప్రత్యక్షంగా
**perception** తెలివి, ఎరుక, జ్ఞానం, గ్రహణశక్తి; గోచరత, సంవేదనం, ప్రత్యక్షజ్ఞానం
**perceptual** ఇంద్రియగోచర
**perceptual motor impairment** ప్రత్యక్ష చలనలోపం
**perchance** దైవవశాత్తూ; బహుశా, అనుకోకుండా; ఒకవేళ
**percolate** ఊరు, చెమ్మగిల్లు; జలగ్రాహి
**percolating** అంతస్స్రావి, ఊరే, చెమర్చే
**percolation** వడగట్టడం, చెమర్చటం; జలగ్రహణం
**percolation tank** జలగ్రహణ తటాకం
**percussion** గాయం, ప్రమాదం; ఆఘాతం, దెబ్బ, సంఘట్టన(ం)
**perdition** నిషా; వినాశం, అధోగతి
**peremptory** అనుల్లంఘనీయ, అవివాద్య, ఆజ్ఞాపక; ఆవశ్యక, ఖండిత, నిశ్చిత; ఎదిరించరాని, కఠిన
**perennial** నిత్య, బహువార్షిక; ఏడాదిపొడుగునా/అన్ని రుతువుల్లో ఉండే; జీవ (నది)
**perfect** పరిపూర్ణ, సంపూర్ణ, పారంగత, నిర్దుష్ట, ఉత్తమ
**perfection** పరిపూర్ణత, దోషరాహిత్యం, నిపుణత, సమగ్రత
**perfectionist** పరిపూర్ణతావాది, సమగ్రతావాది
**perfective** సమాపక(ం)
**perfidious** మోసం చేసే, కపటి
**perforated** సరంధ్ర
**perforation** రంధ్రం, ఆంత్రచ్ఛేదనం, బొక్కలు పొడవటం
**perform** పాటించు, చేయు, ఆచరించు, ప్రతిపాదించు, నిలుపుకొను, ప్రదర్శించు
**performa** ప్రతిపాదన, ప్రదర్శన
**performance** ఆచరణ, ప్రదర్శన, అభినయం, నటన; పాలన, నిర్వహణ, నిష్పాదన; పని; చేత; ప్రవర్తన
**perfume** *n* సుగంధద్రవ్యం, అత్తరు *v* సుగంధిలం చేయు, పరిమళితం చేయు
**perfumer** సుగంధద్రవ్య విక్రేత
**perfumery** సుగంధద్రవ్య పరిశ్రమ; అత్తరు పరిశ్రమ
**perfunctory** యాంత్రిక, అజాగరూక, అలక్షిత/శ్రద్ధలేని, మొక్కుబడి; దైనిక
**perfusion** చిలకరించటం
**peri** చుట్టి ఉండే, పరి
**perianth** పరిపత్రం
**pericardium** గుండెమీది పొర
**pericarp** ఫలకవచం
**peril** హాని, అపాయం, సంకటం, ఆపద, భయం
**at one's peril** బాధ్యతతో; సంకటం కొనితెచ్చుకొని
**perilous** ఆపత్కర, అపాయకర, భయానక
**perimeter** చుట్టుకొలత, పరిధి, హద్దు
**perinatal** ప్రసవకాలిక, జననసమయ
**perineum** మూలాధారం
**period** కాలం, యుగం, సమయం, గడువు, అవధి; ఆవర్తనకాలం; పూర్ణవిరామం
**put a period to** ముగించు, సమాప్తం చేయు
**periodic** నియమితకాలిక, ఆవర్త
**periodical** నియతకాలిక (సంచిక/పత్రిక); ఆవర్తిత, మళ్ళీమళ్ళీ వచ్చే
**periodically** నిర్ణీతసమయంలో, ఆవృత్తంగా
**periodicity** నియత/నిర్ణీత కాలికత, ఆవర్తనం
**periosteum** ఎముక పైపొర
**peripatetic** పర్యటనశీల, దేశదిమ్మరి
**peripheral** సీమాంత, పరిధీయ; పరిచర్య
**periphery** పరిధి, హద్దు, కైవారం, చుట్టుకొలత
**periphrasis** విస్తారం
**periphrastic** విస్తరిత, డొంకతిరుగుడు
**periscope** వర్ధచిత్ర దర్శిని
**perish** నాశమగు, మరణించు, పాడైపోవు, ఎండిపోవు, ముఱిగిపోవు
**perishable** (త్వరలో)చెడిపోయే, నశించే, నశ్వర
**perissad** అయుగ్మం
**peristalsis** తరంగ చలనరీతి
**perjure** అసత్య ప్రమాణం చేయు, తప్పుడు సాక్ష్యం చెప్పు
**perjury** కూటసాక్ష్యం, అసత్య ప్రమాణం
**permanent** శాశ్వత, స్థిర
**permanent court of international justice** అంతర్జాతీయ శాశ్వత న్యాయస్థానం
**permeability** ప్రవేశత, వ్యాప్తి, పారగమ్యత
**permeable** వ్యాపక, వ్యాప్య, ప్రవేశయోగ్య, పారగమ్య
**permeameter** ప్రవేశ్యశీలతామాపకం
**premeate** వ్యాపించు, రంధ్రాలద్వారా ప్రవేశించు
**permeation** ప్రవేశం, పరాగమం

**primary treatment** ప్రాథమిక శుద్ధి
**primates** వానరులు
**prime** ప్రధాన
**prime number** ప్రధానసంఖ్య
**prime property** విలువైన ఆస్తి
**primer** మౌలిక, ప్రాథమిక
**primeval** ప్రాచీన, పురాతన
**primigravida** ప్రథమగర్భం, తొలిచూలు
**primipara** తొలికాన్పు
**primitive** ఆదిమ, ప్రాచీన
**primitives** ఆది(మ)వాసులు
**primogeniture** జ్యేష్ఠస్వామ్యం, పెద్దకొడుకు పెత్తనం
**primordial** ప్రథమకాలిక
**principal** ప్రధాన, ముఖ్య; ప్రధానుడు, కళాశాల ప్రధానాధ్యాపకుడు
**principality** ఆధిపత్యం
**principle** నియమం, సూత్రం
**principle, haematinic** రక్తజనకత్వం
**principle of integration** సమైక్యసూత్రం
**principled** నియమబద్ధ, సైద్ధాంతిక
**print** *n* ముద్రణ, అద్దకం *v* ముద్రించు, అద్దు, అచ్చువేయు
**out of print** ప్రతులులేని
**print material** ముద్రణ(/ముద్రిత)సామగ్రి
**print medium** ముద్రణమాధ్యం
**rush into print** తొందరపడి ప్రచురించు
**printer** ముద్రాపకుడు, అచ్చువేసేవ్యక్తి; ముద్రాపకం
**printing** అద్దకం, ముద్రణ, అచ్చు
**printing house** ముద్రణసంస్థ
**printing press** ముద్రణయంత్రం
**prior** పూర్వ, వెనుకటి
**priority** ప్రాథమ్యం, ప్రాధాన్యం, ముఖ్యత, పూర్వత్వం
**priority order** ప్రాధాన్యక్రమం
**prism** పట్టకం
**prison** చెరసాల, కారాగారం, జైలు, ఖైదు, బందిఖానా
**prisoner** బందీ, ఖైదీ, బంధితుడు
**prisoner of state** ప్రభుత్వఖైదీ
**prisoner of war** యుద్ధఖైదీ
**pristine** ఆదిమ, మౌలిక, ప్రాచీన, పురాతన
**privacy** ఏకాంతం, రహస్యం, చాటు, గోప్యం, రహస్యస్థలం
**private** *adj, n* వ్యక్తిగత(ం), ఏకాంత(ం), సొంత(ం); వైయక్తిక(ం), ఆంతరంగిక(ం)
**private company** సొంత/వైయక్తిక సంస్థ
**private discussion** రహస్య సమాలోచన/చర్చ
**private enterprise** ప్రభుత్వేతర కృషి/సంస్థ
**private property** సొంత ఆస్తి
**private school** సొంత పాఠశాల
**private secretary** ఆంతరంగిక కార్యదర్శి
**private sector** ప్రభుత్వేతర రంగం
**private study** ఒంటరి చదువు
**privateer** స్వచ్ఛంద యుద్ధనౌక, దాని అధిపతి
**privation** లేమి, అభావం, దీనదశ, దుస్థితి, కష్టం, అన్నవస్త్రలోపం
**privilege** అదనపు హక్కు, ప్రత్యేకాధికారం, విశేషాధికారం
**privilege motion** హక్కుల తీర్మానం
**privilege ticket order** ప్రత్యేక టిక్కెట్టుకు సంబంధించిన ఆదేశం
**privileged** అదనపు హక్కు(లు)గల
**privy** *n* సొంత, గుప్త, రహస్య, ప్రచ్ఛన్న, వ్యక్తిగత *v* ప్రత్యేకతగల వ్యక్తి; మరుగుదొడ్డి
**privy council** (బ్రిటన్లో)సర్వోచ్చన్యాయస్థానం, ప్రీవీ కౌన్సిల్
**privy purse** రాజభృతి, రాజభరణం
**prize** *n* బహుమతి, బహుమానం, పారితోషికం *v* గొప్పచేయు; ధరకట్టు; మీటతో ఎత్తు
**probability** సంభావ్యత, సంభవనీయత
**probability method** సంభావ్యపద్ధతి
**probable** సంభావ్య(ం)
**probate** వీలునామా ధ్రువపత్రం/అధికార పూర్వకమైన నకలు
**probation** అర్హతానిర్ణయకాలం, అర్హతాపరీక్ష
**probationary period** అర్హతాపరీక్షాకాలం
**probationer** అర్హతాపరీక్షలో ఉన్న వ్యక్తి
**probe** లోతుగా పరిశీలించు, సమగ్రంగా పరిశోధించు
**probing question** అన్వేషక ప్రశ్న
**probity** సత్యవర్తనం, నిజాయితీ
**problem** సమస్య, (చిక్కు)ప్రశ్న
**problem solving method** సమస్యాపరిష్కార పద్ధతి



**problematic** సమస్యాత్మక, వివాదాస్పద
**proboscis** తుండం
**procedural** కార్యక్రమ (విధాన) సంబంధి
**procedural committees** కార్యనిర్వాహక సంఘాలు
**procedural language** వ్యవస్థీకృత భాష
**procedural law** ప్రక్రియాశాసనం
**procedure** విధానం, ప్రక్రియ, కార్యసరళి, రీతి, పద్ధతి, ఆచారం, కార్యనిర్వహణ
**proceed** కొనసాగించు, చర్యతీసుకొను, ముందుకు వెళ్ళు
**proceedings** వ్యవహార క్రమం/చర్యలు, కార్యకలాపాలు
**proceeds** విక్రయధనం, అమ్మగా వచ్చిన సొమ్ము; పంట, ఫలసాయం, దిగుబడి
**process** ప్రక్రియ, ప్రక్రమం, (కోర్టు)వ్యవహారం, పద్ధతి, ప్రణాళిక, విధి, క్రియ; కోర్టు పిలుపు/సమను; విశ్లేషణం
**process method** ప్రక్రియాపద్ధతి
**processed** విధానం ప్రకారం తయారైన, విధాయిత
**processed food stuffs** విధాయితాహార సామగ్రి
**processing** ప్రవర్తనం, విశ్లేషణ(ం)
**processing device** విశ్లేషక పరికరం
**processing of goods** సరుకుతయారీ
**procession** ఊరేగింపు
**processor** ప్రవర్తకం, విశ్లేషకం
**proclaim** ఘోషించు, చాటు, ప్రకటించు
**proclaimed offender** ఘోషితాపరాధి
**proclamation** ఘోషణ, సాధికార/బహిరంగ ప్రకటన, చాటింపు, వెల్లడి
**proclamatory** ప్రకటిత, వెల్లడి అయిన
**proclitic** పరాశ్రయి
**proclitis** గుదశోథ
**proclivity** రుచి, ప్రవృత్తి, సహజలక్షణం
**proconsul** సామంతపాలకుడు
**procrastinate** సాగదీయు, మొండికిపడు, తలాయించు, ఆలస్యం చేయు
**procreate** పుట్టించు, జన్మనిచ్చు, కను, ఉత్పాదించు
**procreation** ప్రజననం
**proctor** శాసకుడు, వ్యవహర్త; విశ్వవిద్యాలయ క్రమశిక్షణాధికారి
**proctoscpe** మలాశయదర్శిని
**proctoscopy** మలాశయదర్శకం
**procuration** సంపాదించటం; వ్యవహర్తృత్వం
**procure** తెచ్చు, ప్రాప్తించు, సంపాదించు, సేకరించు
**procurement** సేకరణ, సంపాదన; తార్పుడు (పని)
**prod** *n* సూది, ముల్లు, అంకుశం *v* గీరు, గిచ్చు, పొడుచు
**prodigal** దుర్వ్యయం చేసే, దుబారాచేసే; వ్యర్థుడైన
**prodigious** అసాధారణ, మహనీయ, విచిత్ర, అద్భుత
**prodigy** అద్భుతవ్యక్తి, విచిత్రపురుషుడు
**produce** *n* ఉత్పత్తి, సామగ్రి *n* హాజరుపరచు; ప్రదర్శించు; ఉత్పన్నంచేయు, నిర్మించు
**producer** ఉత్పాదకుడు; నిర్మాత
**product** ఉత్పత్తి, ఫలం, ఫలితం; పంట; (గుణకార)లబ్ధం; ఉత్పాదితం
**product generation** వస్తూత్పాదన
**production** ఉత్పాదన, ప్రజననం; నిర్మాణం, ఉత్పత్తి
**productive** ఉత్పాదక, పండే
**productive capacity** ఉత్పాదన సామర్థ్యం
**productive work** ఉత్పాదకకృత్యం
**productivity** ఉత్పాదకత
**products** ఉత్పాదితాలు
**profane** *adj* అపవిత్ర, భ్రష్ట, చెడిపోయిన *v* చెడుచేయు, దూషించు, పాడుచేయు, అపవిత్రంచేయు
**profess** చెప్పు, బాహాటంగా తెలియజేయు, ప్రకటించు; (వృత్తి)అవలంబించు, ఆచరించు, అంగీకరించు
**profession** (నిపుణ)వృత్తి, వృత్తినైపుణ్యం; వ్యాపారం; అంగీకారం, ఒప్పుదల
**profession, medical** వైద్యవృత్తి
**professional** *adj* వృత్తి సంబంధి; వ్యావసాయిక *n* వృత్తినిపుణుడు
**professional commitment** వృత్తినిబద్ధత
**professional forum** వృత్తినిపుణ సంఘం/సమావేశం
**professional growth** వృత్తివికాసం
**professional improvement** వృత్తిలో అభివృద్ధి
**professional knowledge** ప్రకటితజ్ఞానం

**professional journal** వృత్తిపత్రిక
**professional organizations** వృత్తి సంస్థలు
**professional tax** వృత్తిపన్ను
**professor** ఆచార్యుడు, ప్రధానాధ్యాపకుడు
**proffer** *n* ప్రతిపాదన, సమర్పణ *v* ప్రతిపాదించు
**proficiency** కౌశలం, దక్షత, నైపుణ్యం, యోగ్యత, పాండిత్యం, ప్రావీణ్యం, జ్ఞానం
**profile** *n* ఆకృతి (చిత్రణ), వ్యక్తిత్వవర్ణన; పరిచ్ఛేదిక; రూపం, పార్శ్వచిత్రణ *v* ఆకృతి కల్పించు, పార్శ్వచిత్రణచేయు
**profit** లాభం, ఫలం, ఆదాయం; ప్రయోజనం
**profitable** లాభసాటి, ప్రయోజనకారి
**profiteer** *n* అక్రమ సంపాదనపరుడు/లాభార్జన పరుడు *v* అక్రమంగా లాభించు/ఆర్జించు
**profiteering** అక్రమ సంపాదన/లాభార్జన
**profligate** నీతిబాహ్యుడు, పరిత్యక్తుడు
**proforma** ఉదాహరణపూర్వక, లాంఛనప్రాయ; నమూనా(పత్రం)
**proforma invoice** నమూనా ధరలపట్టీ
**profound** గంభీర, విస్తార, గహర, తీవ్ర
**profuse** విస్తార, ధారాళ, అమిత
**progenies** సంతతులు
**progenitor** మూలపురుషుడు
**progeny** సంతతి, సంతానం, వంశం
**prognosis** రోగనిరూపణ, రోగరీతి నిర్ణయం, రోగ భావిసూచన
**prognosticate** (రాబోయేదాన్ని)ముందుగా సూచించు, జోస్యం చెప్పు
**program(me)** కార్యక్రమం; ప్రణాళిక
**programme centre** కార్యక్రమ కేంద్రం
**programmed learning method** నియోజితాధ్యయనపద్ధతి
**programme guide** కార్యక్రమ నిర్దేశకుడు/ నిర్దేశకం
**programme in-charge** కార్యక్రమ నిర్వాహకుడు/బాధ్యుడు
**programme of action** కార్యాచరణ పథకం
**programming language** నిర్దేశకభాష, నివిష్టిభాష
**progress** *n* ప్రగతి, ఉన్నతి, అభివృద్ధి, వికాసం, పురోగమనం *v* పురోగమించు, అభివృద్ధిచెందు, ముందుకుబోవు
**progress report** ప్రగతినివేదిక, క్రమాభివృద్ధి పత్రం/నివేదిక
**progression** పురోగతి; అనుపాతం, పరంపర; ప్రగతి, అభివృద్ధి
**arithmetic progression** అంకగణిత శ్రేణి/ పురోగతి, సమాంతర పురోగతి/అనుపాతం
**geometric progression** రేఖాగణిత శ్రేణి/ పురోగతి/అనుపాతం
**harmonic progression** హరాత్మక పురోగతి/ శ్రేణి/అనుపాతం
**progressive** ప్రగతిశీల, పురోగామి, వర్తమానార్థక, వర్ధమాన, అభివృద్ధికర, ఉత్తరోత్తర
**progressive parties** ప్రగతిశీల/అభివృద్ధికర పక్షాలు
**progressivism** ప్రగతివాదం
**prohibit** నిషేధించు, కాదను, ఆపు
**prohibited area** నిషిద్ధప్రాంతం; రహదారి కానిది
**prohibition** (మద్యపాన)నిషేధం; ఆటంకం, అడ్డగింత, నిరోధం
**prohibitive** నిషేధార్థక(ం); నిషేధించే, అడ్డుపరిచే, నిరోధించే
**prohibitory** ప్రతిబంధక, నిషేధనీయ
**prohibitory order** నిషేధాజ్ఞ
**project** *n* యోజన, పథకం, యుక్తి, ప్రకల్పన, పూర్వకల్పన, పరికల్పన; ప్రదర్శన; వ్యవస్థ *v* సంకల్పించు, తయారు చేయు, ముందుకు పొడుచుకొని వచ్చు, ఉబికివచ్చు; విసరివేయు, యుక్తిపన్ను
**projected aid** ప్రక్షేపిత సాధనం
**projected depth** సంకల్పిత గభీరత
**project method** ప్రదర్శన/పరికల్పన పద్ధతి
**projectile** ప్రక్షేపక(ం), విక్షేపక(ం); రువ్వదగ్గ, విసిరివేయదగ్గ
**projecting** విక్షేపించే, విసరివేసే
**projection** విక్షేపం, ఆరోపణం; ముందుకు పొడుచుకొని రావటం; తెరమీద చూపటం, ప్రదర్శన; ప్రక్షేపణ
**projection support** విక్షేపాధారం, విక్షేప సమర్థన
**projective** విక్షిప్త(ం)
**projector** విక్షేపకం, ప్రదర్శకం
**prolagomena** ముందుమాట, ఉపోద్ఘాతం
**prolepsis** పురోనిహితం
**proletariat** శ్రామికవర్గం, జనసామాన్యం, నిమ్నవర్గం



**dictatorship of the proletariat** శ్రామికవర్గ నియంతృత్వం
**proliferating** వ్యాపక
**proliferation** వ్యాపనం, వ్యాప్తి
**prolific** బహుళోత్పాదక, బహూత్పాదక, బహుసంతానంగల; అధిక ఫలప్రద/సారవంత
**prolixity** మాటల పెంపు/పొడిగింపు
**prologue** ప్రస్తావన, నాంది, భూమిక; ఆరంభం
**prolong** పెంచు, పొడిగించు, విస్తరించు
**promenade** *n* విలాస/విహార స్థలం; షికారు *v* విహరించు, పచారు చేయు
**prominent** ప్రముఖ, ప్రధాన, ముఖ్య, విశిష్ట, ఉన్నత
**promiscuity** సాంకర్యం, వ్యభిచారం, అనాచారం, స్వైరత; అవ్యవస్థ
**promiscuity, sexual** లైంగికస్వైరత
**promiscuous** స్వైర, సంకర, వ్యభిచారి, అనాచారి
**promise** *n* వాగ్దానం, మాట ఇవ్వటం *v* వాగ్దానం చేయు, మాట ఇచ్చు, ఆశచూపు
**promising** అభివృద్ధికి రాదగ్గ
**promissor** వాగ్దాత
**promissory note** ప్రోనోటు, ప్రామిసరీ నోటు; వాగ్దానపత్రం
**promontory** కళ్ళెం, ఖలీనం
**promote** పెంచు, సమర్థించు, మద్దతిచ్చు, సాయపడు, వృద్ధిపరచు, పైహోదాకు పంపు; ప్రారంభించు
**promoter** ప్రవర్తకుడు, ప్రారంభకుడు
**promotion** అభివృద్ధి, ఉన్నతి, పెరుగుదల, పదోన్నతి; ప్రోత్సాహం, ప్రారంభం
**prompt** *adj* శీఘ్ర, సత్వర, తక్షణ, సంసిద్ధ *v* పురికొల్పు; (నాటకంలో మాటలు) అందించు
**prompting** ప్రేరణ
**promptitude** సత్వరత, శీఘ్రత
**promptly** తక్షణమే, శీఘ్రంగా, సత్వరం
**promulgate** జారీచేయు, ప్రకటించు
**promulgation** జారీ, ఘోషణ, ప్రకటన, దండోరా; అమలు
**pronation** అవతాననం
**prone (position)** అధోముఖత్వం, బోర్లాపడుకో వటం
**prong** మొనదేలిన భాగం
**pronominal** సార్వనామిక
**pronoun** సర్వనామం
**pronoun, demonstrtive** నిర్దేశకసర్వనామం
**pronoun, interrogative** ప్రశ్నవాచక సర్వనామం
**pronoun, personal** పురుషబోధక సర్వనామం
**pronoun, reflexive** ఆత్మార్థక సర్వనామం
**pronoun, relative** సంబంధబోధక సర్వనామం
**pronounce** ఉచ్చరించు, పలుకు, (తీర్మానించి) చెప్పు, ప్రకటించు
**pronounce a judgement** తీర్పుచెప్పు, న్యాయం చెప్పు
**pronounced** ప్రకటిత, నిర్ణయించిన, నిశ్చయించిన, తీర్పు వినిపించిన
**pronouncement** తీర్పు, ప్రవచనం, ప్రకటన
**pronunciation** ఉచ్చారణ; తీర్పు, ప్రకటన
**proof** రుజువు, ప్రమాణం, సాక్ష్యం, నిదర్శనం, పరీక్ష; (అచ్చు)చిత్తుప్రతి; అభేద్య
**burden of proof** ప్రమాణ/నిరూపణ బాధ్యత
**proof-reader** (అచ్చుచిత్తు) దిద్దేవ్యక్తి
**proof-reading** అచ్చుచిత్తు దిద్దటం
**prop** *n* ఆధారం, ఆశ్రయం, అండ, ప్రాపు; ఊత *v* అండగానిలుచు, ఆశ్రయమిచ్చు, ఆనుకొను, ఆధారమగు
**prop-word** అవలంబన శబ్దం
**propaganda** ప్రచారం
**propaganda manoeuvre** ప్రచారవ్యూహం
**propagandist** ప్రచారకుడు
**propagate** ప్రచారంచేయు, పుట్టించు, వ్యాపింపజేయు
**propagation** ప్రవర్ధనం, ప్రచారం, వ్యాపనం, ప్రజననం
**propel** తోయు, నెట్టు, ముందుకు నడిపించు
**propeller** చాలకం
**propensity** ప్రవృత్తి, సహజస్వభావం, ఇష్టం, మొగ్గు; దుష్టప్రభావం
**proper** క్రమ, యథార్థ, యుక్త, ఉచిత, సరైన
**properly** సరిగా, కచ్చితంగా, యుక్తంగా, సముచితంగా
**property** ఆస్తి; సంపత్తి; గుణం, స్వభావం, ధర్మం, లక్షణం
**immovable property** స్థిరాస్తి
**movable property** చరాస్తి
**property tax** ఆస్తిపన్ను

**prophecy** జోస్యం, భవిష్యవాణి, ప్రవచనం
**prophet** ప్రవక్త, దైవజ్ఞుడు, జోస్యుడు, సోదిచెప్పే వ్యక్తి
 **weather-prophet** వాతావరణ సూచకుడు
**prophetic** భవిష్యసూచక
**prophylactic** రోగనిరోధక
 **porphylactic measures** రోగనిరోధక చర్యలు, రోగనివారణోపాయాలు
**prophylaxis** రోగనిరోధకత
**propinquity** సామీప్యం, సన్నిహితత్వం
**propitiate** ప్రసన్నునిచేయు, సంతుష్టిపరచు, శాంతింపజేయు
**propitious** అనుకూల, శుభప్రద, మంగళకర, హితమైన, దయగల
**proponent** ప్రతిపాదకుడు, ప్రవర్తకుడు, ప్రస్తావించిన వ్యక్తి
**proportion** *n* అనుపాతం, సంబంధసామ్యం; భాగం, పాలు, దామాషా, అంశం; నిష్పత్తి, యుక్తభాగం *v* నిష్పత్తిప్రకారం విభజించు
**proportional** నైష్పత్తిక, అనుపాత
 **proportional representation** దామాషా ప్రాతినిధ్యం
 **proportional sequence** నైష్పత్తిక చతురస్ర పద్ధతి
**proportionality** అనుపాతకత్వం, వంతుప్రకారం
**proportionate** యథోచిత, దామాషా/పాలు/వంతు/నిష్పత్తికి అనుగుణం
**proposal** ఉపపాదన, ప్రతిపాదన, ప్రస్తావన
**propose** ఉపపాదించు, ప్రతిపాదించు, ప్రస్తావించు, ఆలోచన చేయు
**proposed** ఉపపాదిత, ప్రతిపాదిత, ప్రస్తావిత
**proposer** ప్రతిపాదకుడు, ఉపపాదకుడు, ప్రస్తావయిత
**proposition** అభ్యుపగమం, ప్రతిపాదనం, ప్రశ్న, అంశం, సాధ్యం
**propound** ఆలోచనకు తెచ్చు, ఎదుటపెట్టు, ప్రతిపాదించు
**proprietary** స్వామిత్వం, యాజమాన్యం
**proprietor** ఖామందు, యజమాని, స్వామి, కబ్జాదారు
**proprietorship** యాజమాన్యం, స్వామిత్వం, స్వామ్యం
**proprietory** వ్యక్తియాజమాన్యం
**propriety** ఔచిత్యం, యుక్తత్వం, మర్యాద, యథార్థత
**proprium** వ్యావర్తన ధర్మం
**pro-rata** దామాషా; అనుసరణం
**prorogation** సమాపనం; (చర్చపూర్తికాకముందే) సభను వాయిదావేయటం; దీర్ఘకాలికమైన వాయిదా
**prorogue** నిలిపివేయు, వాయిదావేయు, సమాప్తిచేయు
**prosaic** నీరస, ఉద్రేకం లేని; వచనంవంటి
**pros and cons** ముందువెనకలు, లాభనష్టాలు, మంచిచెడ్డలు
**proscribe** నిషేధించు, జప్తుచేయు, చెలామణి కాకుండా నిలిపివేయు
**prose** వచనం, గద్యం
**prosecute** అభియోగం నడుపు, ఫిర్యాదుచేయు; విచారణ జరుపు; కొనసాగించు
**prosecution** ఫిర్యాదు, అభియోగం, దోషారోపణ, వివాదం
 **prosecution case** స్థిరపక్షవకాల్తా, వ్యాజ్యాన్ని అభియోగించటం
 **prosecution of war** యుద్ధం కొనసాగింపు
**prosecutor** ఫిర్యాది; విచారణకర్త; అభియోక్త
**proselyte** ధర్మపరివర్తకుడు, మతం మార్చుకున్న వ్యక్తి
**proselytize** మతం/ధర్మం మార్పించు/పరివర్తన చేయించు
**prosiopesis** కర్తృలోపం
**prosodeme** ఛందోంశం
**prospect** *n* అవకాశం, భరోసా, ఆశ, ఊహ, ప్రత్యాశంస, అపేక్ష; దృశ్యం *v* అన్వేషించు, వెతుకు, జాడతీయు
 **prospecting for minerals** ఖనిజాన్వేషణ
 **prospect map** అవకాశ(సూచక)మానచిత్రం, అన్వేషక/దృశ్యాత్మక మానచిత్రం
**prospective** భావి, రాబోవు, కాబోవు
 **prospective heir** భావి వారసు, ఉత్తరాధికారి
 **prospective owner** ఉత్తరాధికారి
**prospectus** పరిచయపత్రం, వివరణపత్రం
**prosper** బాగుపడు, వర్ధిల్లు, సుఖపడు, ముందుకువచ్చు, ఫలించు
**prosperity** సౌభాగ్యం, సమృద్ధి, అభ్యుదయం
**prosperous** వర్ధిల్లుతున్న, వర్ధమాన, సఫలమవుతున్న, వృద్ధిఅయిన



**prostate** ఎదుటనిలిచిన
**prostitute** వ్యభిచారిణి, జారిణి, భోగిని, వేశ్య
**prostitution** వ్యభిచారత్వం, జారత్వం, పడుపు వృత్తి
**prostrate** *adj* కుంగిన, సాగిలపడ్డ, సాష్టాంగపడ్డ, దీనస్థితిలోని *v* సాగిలపడు, సాష్టాంగపడు/నమస్కారం చేయు
**protagonist** ప్రవక్త, ప్రచారకుడు, సమర్థకుడు; నేత, నాయకుడు
***pro tanto*** అంతమటుకు
**protect** రక్షించు, కాపాడు, పోషించు, ఆశ్రయమిచ్చు, శరణిచ్చు
**protected** (సం)రక్షిత, పోషిత
 **protected animal** రక్షితజంతువు
 **protected area** రక్షితప్రాంతం
**protective** (సం)రక్షక
 **protective colouration** రక్షకవర్ణనం
 **protective custody** రక్షణ ఇచ్చే ఖైదు
 **protective duty** సంరక్షణశుల్కం
 **protective tariff** సంరక్షణశుల్క పట్టిక
**protection** (సం)రక్షణ
**protectionist** సంరక్షణవాది
**protector** రక్షకుడు, పాలకుడు
**protectorate** సంరక్షిత రాజ్యం/దేశం
***protege*** శరణాగతుడు, ఆశ్రితుడు, రక్షితుడు
**protein** మాంసకృత్తు
**protest** ఆక్షేపణ, అభ్యంతరం
**prothesis** ఆద్యాగమం, టిత్తు
**proto-** మూల, మౌలిక, పురా(తన), ప్రాచీన
**protocol** ఒడంబడికల ప్రాథమికపత్రం; గౌరవస్థానభేదసూచనం
**protoplasm** జీవ ద్రవం/పదార్థం
**prototype** మూలరూపం
**prototypical relation** మూలరూప సంబంధం
**protractor** కోణమాని, కోణమాపని
**protruberances** బుడిపెలు
**protrusion** బహిస్సరణం
**proven** నిరూపిత
**provide** సమకూర్చు
**providence** విధి, కర్మ, పురాకృతం
**province** రాష్ట్రం, పరిధి; ప్రాంతం
**provincial** రాష్ట్రీయ, ప్రాంతీయ
**provincialism** ప్రాంతీయత, ప్రాంతాభిమానం, ప్రాంతీయాభిమానం
**provision** ఏర్పాటు
**provisional** తాత్కాలిక, తత్కాలీన
 **provisional programme** తాత్కాలిక కార్యక్రమం
**provisionally** తాత్కాలికంగా
**provisions** అంశాలు, ఏర్పాట్లు, వ్యవస్థలు; ఆహారపదార్థాలు, భోజనసామగ్రి, కిరాణా సరకులు
***proviso*** షరతు(లతో కూడిన ఒడంబడిక)/మినహాయింపు, ప్రతిబంధం; నిబంధన
**provocation** రెచ్చగొట్టడం, ప్రకోపనం, ఉత్తేజనం
**provocative** ఉత్తేజక, రెచ్చగొట్టే, ప్రకోపక, కోపకారక
**provoke** రెచ్చగొట్టు, కోపం పుట్టించు, ఉద్రేకపరచు, ఉత్తేజపరచు
**provost** అధికారి, అధిపతి
 **provost marshal** సైనికదళాధిపతి
**prowess** పరాక్రమం, వీరత్వం, శౌర్యం, సాహసం
**proximal** సమీప, సన్నిహిత
**proximate** దగ్గరి, సమీప(వర్తి)
**proximity** సామీప్యం, సన్నిహితత్వం
**proximo-distal direction** సమీప-దూరస్థ దిశ
**proxy** ప్రతినిధి, ప్రాతినిధ్యాధికార(పత్ర)ం
**prudence** దూరదృష్టి, ప్రాజ్ఞత, వివేకం, చతురత
**prudent** ముందువెనుకలాలోచించే, దూరాలోచనగల, ప్రాజ్ఞ, వివేకి
**prudential** దూరదృష్టిగల, ప్రాజ్ఞ, చతుర
**prune** కత్తిరించు, నరుకు
**pruning** నరకటం, కత్తిరింపు
**pruritus** దురద
**pry** తొంగిచూచు; పరిశీలించు
**psalm** స్తోత్రం, స్తుతి, భక్తిగీతం, కీర్తన, ప్రార్థన, స్తవం
**pseudo** మిథ్యా, కృత్రిమ, అబద్ధ, కల్పిత, నకిలీ, ఆభాస, అనృత
 **pseudometal** నకిలీలోహం
 **pseudonym** మారుపేరు, కల్పితనామం
 **pseudoperianth** అనృత పరిపత్రం
 **pseudopodia** మిథ్యాపాదాలు
 **pseudo-word** శబ్దాభాసం
**psittacosis** శుకరోగం, చిలకవల్ల వచ్చే జాడ్యం
**psyche** మనస్సు, మానసం
**psychiatric** మనోరోగ సంబంధి

**psychiatrics** మనోరోగచికిత్సాశాస్త్రం, మనోవ్యాధి విజ్ఞానం
**psychiatrist** మనోవ్యాధివిజ్ఞాని, మనోరోగ చికిత్సకుడు
**psychiatry** మనోరోగచికిత్సాశాస్త్రం
**psychic** మానసిక, మనస్సంబంధి
**psychic being** అంతరాత్మ, చిత్పురుషుడు
**psychic education** పురుషవిద్య
**psychic unity** మానసికతత్వం
**psychical** మనస్సంబంధమైన, మానసిక
**psychicisation** మానసీకరణం
**psycho-** మనస్సంబంధి
**psycho-analysis** మనోవిశ్లేషణ
**psychoanalyst** మనోవిశ్లేషకుడు
**psychodynamics** మనోగతిశాస్త్రం
**psychogenic** మనోవ్యాధిజనిత
**psycholinguistics** మనస్తత్వసంబంధి భాషాశాస్త్రం
**psychomotor behaviour** మానసికచలన ప్రవర్తన
**psychoneurosis** మనోవికృతి
**psycho-theraphy** మానసిక చికిత్స
**psychoid** మనఃకల్ప
**psychological** మానసిక, మనస్సంబంధి
**psychological climate** మనోభావన, మనస్స్థితి
**psychological dislocation** మనస్సంచలనం, మానసికాందోళన, అస్థిరత
**psychological factors** మానసిక కారణాలు/ లక్షణాలు
**psychological movement** మానసిక ప్రవర్తన
**psychologism** మనస్స్వాతంత్ర్యవాదం
**psychologist** ఆత్మతత్వజ్ఞుడు; మనశ్శాస్త్రజ్ఞుడు, మనస్తత్వవేత్త
**psychology** మనస్తత్వం, మనఃప్రవృత్తి, మనస్తత్వశాస్త్రం
**psychology of development** అభివృద్ధితత్వం
**psychology type question** మనోవైజ్ఞానిక పద్ధతి ప్రశ్న
**psychometry** మనోమాపనశాస్త్రం
**psychopath** వికలోద్వేగరోగి
**psychosis** చిత్తవృత్తి; మతిభ్రమ, మనోవిభ్రమం, ఉన్మాదం, పిచ్చి
**psychosis of war** యుద్ధోన్మాదం, యుద్ధప్రవృత్తి
**psychosomatic** మనశ్చర్మ సంబంధి, మనోవికృతి హేతుక శరీరజాడ్యం
**psycotherapeutic approach** మానసికచికిత్సా విధానం
**psychotism** మనోవిక్షిప్తి
**psychue** మనస్సంబంధి
**pthisis** క్షయరోగం
**ptosis** పైరెప్ప వాల్పు
**puberty** తరుణత్వం, యౌవనారంభం, యుక్తవయస్సు, రజస్వలకావటం
**age of puberty** తొలిసమర్త, యౌవనారంభదశ
**public** *adj* సార్వజనీన, సార్వజనిక, లోకవిదిత, జనసాధారణ, బహిరంగ *n* లోకులు, ప్రజలు, జనత
**at the bar of public opinion** ప్రజాభిప్రాయంపై, ప్రజల సమక్షంలో, లోకరీతిపై
**in public** బహిరంగంగా, అందరి ఎదటా
**public accounts committee** ప్రభుత్వ లెక్కల పరిశీలక సంఘం
**public body** ప్రజాసంస్థ, సార్వజనిక సంస్థ
**public building** ప్రభుత్వ భవనం
**public distribution** పౌరసరఫరా
**public debt** ప్రజారుణం
**public domain** ప్రజాధికారపరిధి, పౌరప్రదేశం
**public duty** ప్రజాసేవ
**public education** పౌర/ప్రజా విద్య
**public enemy** ప్రజా/ప్రభుత్వ శత్రువు
**public enterprise** ప్రభుత్వ సంస్థ/ఉద్యమం, ప్రజోద్యమం
**public function** బహిరంగోత్సవం, ప్రజోత్సవం, పురజనోత్సవం
**public fund** పౌరనిధి
**public interest** ప్రజా హితం/ప్రయోజనం
**public library** పౌర/ప్రజా/సార్వజనిక గ్రంథాలయం
**public life** ప్రజా/సామూహిక జీవనం
**public literacy** ప్రజా/పౌర సాక్షరత
**publicman** ప్రజలమనిషి, ప్రజా ప్రతినిధి/ సేవకుడు
**public-opinion** ప్రజాభిప్రాయం
**public policy** పౌర/బహిరంగ విధానం
**public property** ప్రభుత్వాస్తి



**public relations** ప్రజా/పౌర సంబంధాలు
**public sector** ప్రభుత్వరంగం
**public service** ప్రజాసేవ, జనసేవ, ప్రభుత్వసేవ
**public trial** బహిరంగ విచారణ
**public undertaking** ప్రభుత్వాధీనసంస్థ, ప్రజా/పౌర సంస్థ
**public utility services** ప్రజోపయోగసేవలు/ సార్వజనిక ప్రయోజన సేవాకార్యాలు
**public works** ప్రభుత్వ నిర్మాణశాఖ
**publication** ప్రచురణ, ముద్రణ
**publicist** పౌర వ్యవహార/న్యాయ నిపుణుడు
**publicity** ప్రచారం
**publicity bureau** ప్రచారవిభాగం, ప్రచారక సంస్థ
**publicity campaign** ప్రచారోద్యమం
**publish** ముద్రించు, ప్రకటించు, ప్రచురించు
**published a/c** ప్రకటితఖాతా
**publisher** ప్రకాశకుడు, ప్రచురణకర్త
**puddling** లోహశుద్ధి
**puerile** చిలిపి, చిన్నతనపు, కుర్రతనపు
**puerperium** ప్రసూతి/ప్రసవ కాలం/సమయం
**pugnacious** తంటాలు పెట్టే, జగడాలమారి, కలహప్రియ
**puisne judge** జూనియర్ న్యాయమూర్తి
**puissant** శక్తిగల, సామర్థ్యంగల, బలవంతుడైన, ప్రతిభాశాలి
**pull** *n* ఈడ్పు *v* దాగు, ఈడ్చు, చించు, గుంజు
**pull down** కిందకులాగు, పడదోయు
**pull off** ఈడ్చివేయు, పూర్తిచేయు
**pull out of the fire** కష్టాలనుంచి బయటపడ వేయు/రక్షించు
**pull through** తీసుకొని పోవు, తీసివేయు
**pull up** పైకిలాగు, బయటకు లాగు; మందలించు, చీవాట్లుపెట్టు
**pulley** కప్పీ, గిలక, చక్రం, రాట్నం
**pulmonary** పుపుస, ఊపిరితిత్తులకు సంబంధించిన
**pulmonary tuberculosis** ఊపిరితిత్తులకు సంబంధించిన క్షయవ్యాధి
**pulp** *n* గుజ్జు, గురుజు *v* గుజ్జు/సారం తీయు
**pulp, tooth** దంతపుగుజ్జు
**pulpit** చర్చి (బోధకుడి)వేదిక
**pulsate** నాడి ఆడు/కొట్టుకొను; స్పందించు, చలించు, కంపించు, వణుకు
**pulsation** రక్తనాళస్పందన
**pulse** నాడి; పప్పు/కాయ ధాన్యం
**pulse, arterial** ధమనినాడి
**pulse, capillary** కేశనాళిస్పందనం
**pulse, venous** సిరనాడి
**pulseness** నాడీహీన
**pulveriser** కుట్టకం
**pulverization** చూర్ణీకరణ(ం); పిండిగొట్టడం, చూర్ణనం
**pulverize** పిండికొట్టు, పొడి/చూర్ణం చేయు
**pulverous** చూర్ణమయం
**pump** *n* (నీటి)గొట్టం, కుళాయి, నీళ్ళుతోడే యంత్రం *v* (పంపుతో) తోడు/నింపు, పైకి లేవదీయు; రెచ్చగొట్టు
**pun** *n* శ్లేష, రెండర్థాలమాట *v* శ్లేషించు, భిన్నార్థాలు వచ్చేటట్లు మాట్లాడు
**punch** *n* పిడిగుద్దు; బరమా; హాస్యగాడు *v* పిడిగుద్దు గుద్దు, చిల్లిపెట్టు
**punched card/paper** సరంధ్రపత్రం
**punching** రంధ్రణం; ప్రహరణం
***punctilio*** సూక్ష్మవిషయం
**punctilious** జాగరూక; సమయానుకూలంగా పనిచేసే
**punctual** వేళతప్పని, సమయం పాటించే
**punctuality** సమయపాలన, వేళపాటించటం
**punctuate** (విరామస్థానాల్లో) క్రమమైన గుర్తులు పెట్టు
**punctuation** విరామ(చిహ్నా)ం
**punctum** రంధ్రకం
**puncture** *n* రంధ్రం, చిల్లి *v* చిల్లిపెట్టు, రంధ్రం చేయు
**puncture, lumber** వెన్నెముకలో రంధ్రంపెట్టి ద్రవం తీయటం
**pungent** ఘాటయిన, కారంగా ఉండే, తీవ్ర, తీక్ష్ణ
**punish** శిక్షించు, దండించు
**punishable** శిక్షణీయ, దండనీయ, శిక్షించ/ దండించ దగ్గ
**punishment** దండన, శిక్ష
**punitive** దండనాత్మక, శిక్షాత్మక
**punitive tax** సామూహిక జరిమానా
**puny** చిన్న, పొట్టి, అల్ప, దుర్బల
**pupalia** కొక్కొపుకాయ
**puparian** కోశస్థదశ

**pupil** కనుపాప; విద్యార్థి, శిష్యుడు
**pupil-teacher** ఛాత్రోపాధ్యాయుడు
**pupilage** శిష్యత్వం
**puppet** కీలుబొమ్మ
**puppet government** కీలుబొమ్మ ప్రభుత్వం
**puppet show** బొమ్మలాట, బొమ్మల తమాషా, తోలుబొమ్మలాట
**purblind** జడ; చత్వారం/దృష్టిమాంద్యం గల
**purchase** *n* కొనుగోలు, క్రయం *v* కొను, ఖరీదు చేయు
**purchase tax** క్రయం పన్ను; కొనుగోలు పన్ను
**purchasing power** కొనుగోలుశక్తి
**purchaser** కొనేవ్యక్తి, కొనుగోలుదారు, ఖరీదుదారు, గ్రాహకుడు, క్రేత
**pure** పవిత్ర, నిర్మల, స్వచ్ఛ, పరిశుద్ధ, కల్తీలేని
**pure mathematics** శుద్ధగణితశాస్త్రం
**pure-science** తత్వశాస్త్రం
**pure-sociology** సైద్ధాంతిక సమాజశాస్త్రం
**purgative** విరేచనకారి; భేదిమందు; పరిశుద్ధం చేసే
**purgatory** (పాప) ప్రాయశ్చిత్త స్థలం
**purge** *n* భేది, విరేచనం *v* శుద్ధిచేయు, కల్మషం తొలగించు
**purification** శుద్ధి, శుభ్రంచేయటం; పవిత్రీకరణ(ం)
**purifidation** శుద్ధీకరణం
**purified** శుభ్రపరచిన
**purifier** శుద్ధీకరణి
**purify** శుభ్రపరచు, శుద్ధిచేయు; పవిత్రీకరించు
**purism** (పరి)శుద్ధతావాదం
**puritanism** కఠోరనైతికతావాదం
**purity** స్వచ్ఛత, పవిత్రత
***purlieu*** పొలిమేర, పొరుగు ప్రాంతం
**purloin** దొంగిలించు, అపహరించు
**purple** వంగ వన్నె, నీలరక్త మిశ్రవర్ణం, ఊదారంగు
**purport** *n* సారాంశం, తాత్పర్యం, భావం, అభిప్రాయం, అర్థం, ఆశయం *v* అభిప్రాయ పడు, తాత్పర్యం చెప్పు
**purpose** *adj* ఉద్దేశపూర్వక, సాభిప్రాయ, ప్రయోజనాత్మక *n* లక్ష్యం, ఉద్దేశం, ప్రయోజనం
**purse** సంచి, బొక్కసం, ముల్లె; మూట, ఖజానా; బహూకరణధనం
**a common purse** సార్వజనికనిధి
**hold the purse strings** జాగ్రతగా ఖర్చు చేయు, అదుపులో ఉంచు
**pursuance** అనుసరణ
**pursue** అనుసరించు, వెంబడించు, అనుకరించు, అన్వేషించు
**pursuit** అన్వేషణ, అనుసరణ, తరమటం, వెంటబడటం; పని, వృత్తి
**purulentus** చీము
**purvey** అమర్చు, (భోజనసామగ్రి)సమకూర్చు
**purview** అవకాశం, వ్యాప్తి, (దృష్టి)పరిధి, హద్దు
**pus** చీము
**push** *n* తోపు, పోటు, నెట్టు *v* తోయు, నెట్టు, పొడుచు; పురికొల్పు
**push-broom scanning technique** మార్జనీ నిరీక్షణ విధానం
**pusillanimous** పిరికి, భీరువైన, భయస్వభావం గల
**pustul** చీముపొక్కు
**pustule** పొక్కు
**put** ఉంచు, పెట్టు, వేయు, నియమించు, ప్రదర్శించు, ఉపపాదించు
**be hard put** కష్టాల్లో పడు
**put about** కష్టపెట్టు, మార్గం మార్చు
**put across** తెలియజెప్పు; నెరవేర్చు
**put back** యథాస్థానంలో ఉంచు
**put by** వేరు చేయు, వేరుగా ఉంచు
**put down** నిలుపు, ఆపు, అణచివేయు
**put forth** ప్రస్తావించు, ప్రకటించు, ప్రదర్శించు, కార్యరూపానికి తెచ్చు
**put forward** ఎదుటకు తెచ్చు, ప్రతిపాదించు
**put in cold store** స్తంభింపజేయు
**put off** వాయిదావేయు; ఆర్పు
**put through** పంపు; పూర్తిచేయు
**put up** ముందుంచు; గ్రహించు
**put-up job** (దొడ్డిదారిన) సంపాదించిన ఉద్యోగం
**put up with** సహించు, భరించు
**putrefaction** కుళ్ళటం, మురిగిపోవటం
**putrefy** చెడిపోవు, కుళ్ళిపోవు, మురిగిపోవు
**putrid** కుళ్ళిన, మురిగిన
**puzzle** *n* చిక్కు, కలవరపాటు, విభ్రమస్థితి; ప్రహేళిక *v* చిక్కుపెట్టు, కలవర పెట్టు/పడు
**pygmy** మరుగుజ్జు, వామనుడు, చాలా పొట్టిమనిషి
**pylon** ఆధారం, స్తంభం, దర్వాజా
**pyloric** ఆంత్రముఖ కవాటం



**pylorus** ఆంత్రముఖం
**pyorrhoea** దంతస్రావం
**pyramid** సూచ్యగ్రభవనం, గోపురం
**pyre** చితి
**pyrexia** జ్వరం
**pyroheliometer** సూర్యతాపమాపకం
**pyromania** దహనోన్మాదం
**pyrometer** ఉష్ణమాపకం, ఉష్ణతాపమాపకం
**pyroscope** ఉష్ణ(తాప)దర్శకం
**pyrotechnic** బాణాసంచా తయారుచేసే విద్య
**pyrrhic victory** అపజయానంతర విజయం, అంతిమ విజయం
**python** కొండచిలువ

# q

**Q fever** క్యూ జ్వరం
**quack** బాతు అరుపు; బూటకపు/నకిలీ వైద్యుడు
**quadra** నాలుగు
**quadrangle** చతుర్భుజం, చతుష్కోణం, చతురస్రం
**quadrant** వృత్త చతుర్భాగం
**quadratic** వర్గం
**quadratic equation** వర్గ సమీకరణం
**quadratic expression** వర్గ సమాసం
**quadratix** వర్గీయం
**quadrature** క్షేత్రకలనం
**quadrennial** నాలుగేళ్ళకోసారి వచ్చే, నాలుగేళ్ళుండే
**quadrilateral** చతుర్భుజం
**quadriplegia** అంగచతుష్టయ (పక్ష)వాతం
**quadrivalent** చతుస్సంయోగసామర్థ్యం
**quadrivium** చతుష్టయం
**quadruped** చతుష్పాత్తు
**quadruple** నాలుగింతలు
**quadruple alliance** నాలుగు పక్షాల సంఘటన
**quadruplets** చతుష్కం
**quaff** తొందరగా, వేగంగా
**quagmire** ఊబి, చిత్తడినేల, రొంపి
**quail** *n* పూరేడు పిట్ట, కోలంకి పిట్ట *v* ధైర్యం కోల్పోవు
**quaint** ఆశ్చర్యకర, వింతైన
**quake** కంపం, వణుకు, ప్రకంపనం
**qualification** అర్హత, యోగ్యత, పరిమితి; అసంపూర్ణత, అసమగ్రత, సిద్ధహస్తత
**qualified priviliege** సమర్థాధికారం, యోగ్యహక్కు
**qualifier** గుణవాచకం
**qualify** అర్హత పొందు/సంపాదించు
**qualitative** గుణాత్మక, గుణప్రధాన
**qualitatively** గుణాత్మకంగా
**quality** స్వభావం, గుణం, ధర్మం, లక్షణం, తత్వం; రకం, తరగతి, శ్రేణి
**quality control** గుణ నియంత్రణ
**qualm** భయం, శంక, సంకోచం
**quandary** సందిగ్ధస్థితి
**quanternion** చతుష్క సంఖ్య
**quantification** పరిమాణీకరణం
**quantifier** పరిమాణవాచకం
**quantify** పరిమాణీకరించు
**quantisation** పరిమాణీకరణం
**quantitative** పరిమాణాత్మక
**quantity** రాశి, పరిమాణం
**quantivalence** పరిమాణ సామర్థ్యం
**quantum** పరిమాణం
**quarantine** సంసర్గ నిషేధం, సంఘావరోధం
**quark** విద్యుదావిష్టమూలకణం
**quarrel** *n* కలహం, తగాదా, కొట్లాట, తగవు, జగడం *v* జగడమాడు, కొట్లాడు, కలహించు
**pick a quarrel** పోట్లాటపెట్టుకొను
**quarry** *n* రాళ్ళగని, పాషాణఖని, వేటాడే/వేటలో చంపే జంతువు *v* వెదకు, వేటాడు, జాడ కనిపెట్టు; శోధించి వెలికితీయు
**quarrying** గని తవ్వకం, ఖననం
**quarter** *n* పాదం; నాలుగోభాగం; దిశ, తరపు; పావు; విడిది, బస; త్రైమాసికం *v* బస ఇచ్చు; నాలుగు భాగాలు చేయు
**give quarter** క్షమించు, దయచూపు, శరణిచ్చు
**quarter master general** శిబిర మహా నాయకుడు
**quartering** ఆగటం, నిల్పటం, తేటపడటం
**quarterly** త్రైమాసిక(ం)
**quartet** నాలుగువాద్యాల/నలుగురుగాయకుల సమ్మేళనం
**quartile** చతుర్థాంశం, నాలుగో భాగం
**quartz** స్ఫటికశిల
**quash** రద్దుచేయు, చితకగొట్టు, కొట్టివేయు, పరి సమాప్తిచేయు

**quasi** సదృశ, ప్రాయ, కల్పం; వంటి
**quasi-linguistic** భాషాకల్ప(ం)
**quasimoney** మార్పిడి సులభమైన ద్రవ్యం/నోటు/చెక్కు
**quasi permanent** స్థిరప్రాయం
**quatrain** నాలుగుపాదాల పద్యం
**quay** (ఓడ) రేవు, ఘట్టం
**queasy** అసహ్యకర, అసంతృప్తికర
**queen** రాణి, మహారాణి
**queen-bee** రాణీ ఈగ
**queen's pawn** (చదరంగంలో) మంత్రి ముందున్న పావు/బంటు
**queer** విచిత్ర, విపరీత, వికృత
**queer fish** వింతమనిషి, విచిత్రవ్యక్తి, అద్భుత వ్యక్తి
**quell** అణచు, అణిచివేయు
**quench** శమింపజేయు, శాంతింపజేయు, తీర్చు, పోగొట్టు
**querulous** పేచీకోరు, పితూరీలు చెప్పే
**query** *n* ప్రశ్న, సవాలు *v* అడుగు, ప్రశ్నించు, సవాలు చేయు; శంకించు, సందేహించు
**quest** *n* అన్వేషణ, పరిశోధన, వెతకటం *v* అన్వేషించు, పరిశోధించు, వెతుకు
**question** *n* ప్రశ్న, సవాలు; శంక; సమస్య *v* ప్రశ్నించు, శంకించు, సవాలు చేయు
**analogy type question** సాదృశ్య ప్రశ్న
**call in question** శంకించు, మన్నించకుండు
**in question** వివాదాస్పద, అనుమానాస్పద; చర్చలో ఉన్న
**out of the question** వ్యర్థ, అసంభవ, ప్రసక్తి (లో) లేని
**question-answer method** ప్రశ్నోత్తర పద్ధతి
**question bank** ప్రశ్నభండారం
**question hour** ప్రశ్నోత్తర సమయం
**question intro** ప్రశ్నరూపక పరిచయం
**questionable** ప్రశ్ననీయ, సందిగ్ధ, సంశయాస్పద
***questionnaire*** ప్రశ్నావళి, ప్రశ్నపత్రం
***queue*** *n* పంక్తి, వరస, శ్రేణి *v* వరసలో నిలబడు
**quibble** *adj* ద్వ్యర్థి, శ్లేష, వాక్ఛలం; డొంకతిరుగుడు/చమత్కార మాట/ప్రసంగం *v* చమత్కరించు, డొంకతిరుగుడుగా మాట్లాడు
**quick** *adj* త్వర, తొందర, చురుకైన, వాడిగల, చేతన, జీవంగల, వేగవంతమైన *v* త్వరపడు, తొందరపడు, వేగిరపడు
**quicklime** కాల్చిన సున్నం, పొడి సున్నం
**quicksand** ఊబి, అడుసు
**quick-tempered** శీఘ్రకోపి, ముక్కోపి; చిటచిటలాడే
**quick-witted** వెంటనే బదులిచ్చే
**quicken** త్వరపెట్టు, చురుకు పుట్టించు
***quid pro quo*** ప్రతిఫల సిద్ధాంతం, ఒకదానికి మరొకటి ప్రతిఫలంగా ఉండటం
**quiescence** నిశ్శబ్దం, నిశ్చలత, శాంతం, మౌనం
**quiescent** నివృత్తి, సన్యాసమార్గం, బైరాగితనం
**quiet** నెమ్మది, శాంత, విశ్రాంత
**in the quiet** చాటున, మాటున, ప్రశాంతతలో
**quietism** నివృత్తి, సన్యాసిమార్గం, బైరాగితనం
**quietus** ముక్తి, విమోచన, చావు
**quill feather** బొంతకుట్టు
**quindecagon** పంచదశభుజి
**quinine** క్వినా, మలేరియామందు
**quinquennial** పంచవర్షీయ
**quinquivalent** పంచ సంయోగ సామర్థ్యం
**quintessence** సారం, తత్వం
**quintiles** పంచమాంశాలు
**quisling** దేశద్రోహి, పంచమాంగదళ సభ్యుడు
**quit** వదలి/విడిచి పెట్టు, త్యజించు, వెళ్ళిపోవు, తొలగు, ఖాళీచేయు
**be quits** బాకీ పూర్తిగా చెల్లించు, సంబంధాలు లేకుండు
**quite** బొత్తిగా, పూర్తిగా
**quittance** (రుణ) విముక్తి
**quiver** అమ్ముల పొది; గడగడలాడు, వణుకు, కంపించు
**quixotic** విపరీతభావాలున్న, అపూర్వకల్పనలున్న; ఆచరణశూన్య
**quiz** *n* కఠినప్రశ్న; పరిహాసం *v* తెలుసుకొను, ఊహించు, సమస్యలో పడవేయు
***quondam*** మాజీ, భూతకాలిక; పురాతన, ప్రాచీన
***quorum*** సమావేశపూరక సంఖ్య, ఆవశ్యక సంఖ్య, కావలసిన సభ్యులసంఖ్య, (నిర్దిష్ట) పూరక సంఖ్య
**quota** నిర్దిష్ట భాగం/అంశం
**quotation** సంవాదం/ఉద్ధరణ, ఉదాహరణ, పేర్కొన్నధర
**quotation intro** ఉద్ధరణ పరిచయం
**quotation mark** ఉద్ధరణచిహ్నం
**quote** ఉదాహరించు, (మూలగ్రంథంనుంచి) ఉద్ధరించు, ఉట్టంకించు; ధరచెప్పు



**quote-worthy** ఉదాహరణయోగ్య
**quotidian** దైనిక
**quotient** విభక్తం, భాగఫలం, భాగలబ్ధం
***quo warranto writ*** అధికారాన్ని ప్రశ్నించే ఉత్తరువు/పృచ్ఛ

# r

**rabbit** (సీమ) కుందేలు
**rabble** గుంపు, అల్లరిమూక, దళం
**rabi crop** రెండో మెట్టపంట
**rabid** పిచ్చి, వెర్రి; ఉగ్ర, తీవ్ర
**rabies** పిచ్చికుక్క కాటు
**rabies** (hydrophobia) జలభయరోగం
**race** *n* తెగ, జాతి, వంశం, వర్గం; పరుగు పందెం, గుర్రప్పందెం *v* పరిగెత్తు, పారిపోవు
**raceme** గెల
**rachis** పుష్పగుచ్ఛకాండం
**rachitic** రికెట్సుకు సంబంధించిన
**racial** జాతి సంబంధి, వంశీయ, జాతిపరమైన
**racial discrimination** జాతివిచక్షణ
**rack** గడమంచి; చిత్రహింస, చిత్రహింసా స్థలం/యంత్రం
**racket** తంత్రం, కుంభకోణం, కూటవ్యవహారం
***raconteur*** పాతకథలు చెప్పే వ్యక్తి
**racy** ఆవేశంగల, రుచిగల; కారంగా ఉన్న, తీక్ష్ణ
**radial** కేంద్రీకృత
**radiant** వికిరణశీల, ప్రకాశవంత, సంతోషకర
**radiant emmission** వికిరణోద్గారం
**radiant energy** ప్రకాశకిరణశక్తి, వికిరణశక్తి
**radiate** వేడిని/కిరణాలను ప్రసరించే/ప్రసరింపజేసే, ప్రకాశించే; వికిరణం చేయు
**radiation** వికిరణనం, కిరణప్రసారం
**radiation curve** వికిరణనవక్రరేఖ
**radiator** వికిరణకం, కిరణ ప్రసారకం
**radical** జిహ్వామూలీయం, ధాత్వంశం, ధాతుగత(ం); సమూలం, ప్రాతిపదిక; తీవ్ర, సంపూర్ణ
**radicalism** సమూల సంస్కరణవాదం
**radicle** ప్రధాన/ప్రథమ మూలం
**radio** *n* నిస్తంత్రీవార్త, ఆకాశవాణి, రేడియో *v* రేడియోద్వారా (వార్తలు) పంపు
**radio-active** అణుధార్మిక, రేడియో ధార్మిక
**radio-active fallout** రేడియో/అణుధార్మిక కిరణ ప్రసారం/వ్యాప్తి
**radio-activity** రేడియో/అణు ధార్మికత
**radio-adaptation** రేడియో రూపాంతరణం
**radio-circuit** రేడియో వలయం
**radio cobalt** రేడియో కోబాల్ట్
**radio despatch** రేడియో సందేశం
**radio isotope** రేడియో ఐసోటోప్
**radio micrometre** రేడియో మైక్రోమీటర్
**radio newsreel** రేడియో వార్తాప్రసారం
**radio plays** రేడియో నాటకాలు
**radio station** రేడియో కేంద్రం
**radiograph** రేడియో రేఖాచిత్రం; ఎక్స్‌రే పటం
**radiography** రేడియో రేఖాచిత్రణం; ఎక్స్‌రే పటం/చిత్రణం
**radiological** ప్రసారవిజ్ఞాన సంబంధి; వికిరణ చికిత్సాత్మక
**radiologist** ప్రసారవిజ్ఞానవేత్త; వికిరణ చికిత్సకుడు
**radiology** ప్రసారవిజ్ఞాన (శాస్త్ర)ం, వికిరణ చికిత్సావిజ్ఞానం
**radiometer** వికిరణ మాపకం
**radiometry** వికిరణమితి
**radioscope** రేడియో ధార్మిక దర్శిని
**radiotherapy** ఎక్స్‌రే చికిత్స
**radish** ముల్లంగి
**radium** రేడియం
**radius** వ్యాసార్ధం, అర్ధవ్యాసం; రంపం; ముంజేతి ఎముక/రత్ని
**radix** మూలసంఖ్య
**raft** తెప్ప, బల్లకట్టు; పరిమాణం
**rag** *n* గుడ్డపీలిక, పాతగుడ్డ తుంపు *v* చింపి పీలికలు చేయు
**ragamuffin** నిరుపేద, పోకిరి, దేశదిమ్మరి
**rage** *n* కోపం, క్రోధం, ఉద్వేగం, ఉగ్రత *v* ఉద్వేగపడు, తీవ్రకోపం చూపు
**ragi** రాగులు
**raid** *n* దాడి, ముట్టడి, ఆక్రమణ, దోపిడీ *v* దాడిచేయు, ముట్టడించు, ఆక్రమించు, దోచుకొను
**rail** *n* ఇనుపకమ్మీ, అడ్డుకర్ర, రైలు పట్టా/బండి *v* తిట్టు, దూషించు, దుర్భాషలాడు
**off the rails** చిందరవందర, అస్తవ్యస్తం; గతి తప్పిన, పడిపోయిన
**rail-car** రైలు పెట్టె/బండి
**rail road bridge** రైలు వంతెన

**railing** కంచె; కటకటాలు; అడ్డుగోడ, పిట్టగోడ
**raillery** పరిహాసం, వ్యంగ్యం, అపహాస్యం, ఎగతాళి
**railway** రైలు మార్గం
**railway accident** రైలు ప్రమాదం
**railway carriage** రైలు పెట్టె/డబ్బా
**railway crossing** రైలుమార్గం దాటడం
**raiway mail** రైల్వే తపాలా
**railway protection force** రైల్వే రక్షకదళం
**raiment** దుస్తులు, బట్టలు
**rain** *n* వాన, వర్షం *v* వానకురియు, వర్షంపడు, వర్షించు
**rain-guage** వర్షమాని, వర్షమాపకం
**rain water harvesting** వర్షజలసేకరణ
**rainbow** ఇంద్రధనుస్సు
**rainfall** వర్షపాతం, వర్షపరిమితి
**scattered heavy rainfall** చిత్రకుంభవృష్టి
**rainstorm** గాలివాన, తుఫాను
**raise** పెంచు, హెచ్చించు, నిర్మించు, వృద్ధిచేయు, ఉత్పత్తి చేయు, వసూలు చేయు, లేవదీయు, ఎత్తు, ఆరంభించు, స్థాపించు
**raise a dust** దుమారం లేపు, ఉద్యమం తెచ్చు, ఆందోళన చేయు, ఉపద్రవం తెచ్చు
**raise an army** సైన్యం సమకూర్చు/సమీకరించు
**raise blockade** అవరోధం కల్పించు
**raise cain, raise hell, raise the devil** ఆందోళనచేయు, హంగామాచేయు
***raisin*** ఎండిన ద్రాక్ష, కిస్‌మిస్
**raising** ఆరోహి
**ramification** ప్రశాఖనం
**random** యాదృచ్ఛిక(ం), స్వేచ్ఛ, యథేచ్ఛ, ముందువెనక లాలోచించని
**random sampling** యాదృచ్ఛిక నమూనా/సంచయనం
**randomization** యదృచ్ఛాకరణం, యాదృచ్ఛికీకరణం
**range** *n* శ్రేణి, పంక్తి, వరస; అవధి, పరిధి, సీమ *v* వరస తీర్చు, వ్యాపించు; ఒక తరగతిగా ఏర్పరచు
**range finder** దూరమాపకం
**ranger** అటవీశాఖాధికారి; సరిహద్దు రక్షకభటుడు
**rank** *adj* అతిగా పెరిగిన; గొప్పరుచిగల, కంపుగొట్టే *n* శ్రేణి, హోదా, స్థాయి, అంతస్తు, వర్గం, తరగతి, వరస, గీత; సైనికుల బారు *v* శ్రేణీకరించు, హోదా కల్పించు, వరసగా నిలుపు, ఒక తరగతికి తెచ్చు/చేర్చు
**rank and file** సాధారణ సైనికులు/సభ్యులు/జనులు
**ranking** శ్రేణీకరణం
**rankle** (పుండు మొ.) రేగు, మండు, హెచ్చు, తీవ్రమగు
**ransack** మూలమూలలూ వెతుకు, గాలించు, అన్వేషించు; పూర్తిగా దోచుకొను/కొల్లగొట్టు
**ransom** *n* బంధవిమోచన ధనం, విడుదలకోసం ఇచ్చే సొమ్ము *v* జరిమానా చెల్లించు, డబ్బిచ్చి విడుదల కల్పించు, పైకమిచ్చి విడుదల పొందు
**rant** *n* అసంబద్ధ ప్రలాపం/ప్రసంగం, అనర్గళ సంభాషణ, నిరర్థక శబ్దగాంభీర్యం, వట్టి అరపులు *v* వ్యర్థ సంభాషణ చేయు, కేకలు పెట్టు, అనర్గళంగా మాట్లాడు, పెద్దపెద్ద మాటలాడు
**rap** *n* గాయం, దెబ్బ *v* తట్టు, మెల్లగా కొట్టు
**rap out** కఠినంగా చెప్పు, క్రూరస్వరంతో చెప్పు
**rapacious** క్రూర, ఘాతక, హింసించే, అత్యాశగల, తిండిపోతయిన, మాంసాశనం చేసే
**rape** మానభంగం, బలాత్కార సంభోగం
**raphanus** ముల్లంగి
**raphe** ఈనె
**rapid** వడిగల, వేగవంతమైన; (ప్రవాహంలో)వడి గలచోటు
**rapine** కొల్ల, దోపిడి; నదీసంబంధి
**rapport** సౌహార్దత, సాన్నిహిత్యం, బంధుత్వం, సంబంధం
**rapproachment** పునస్సమాధానం, తిరిగి స్నేహం చేయటం; సర్దుబాటు, సరిపెట్టుకోవటం
**rapt** నిమగ్న, పరవశ, లీన, ముగ్ధ
**rapture** ఉల్లాసం, పరమానందం
**rare** అరుదైన, అపురూప, అసాధారణ, దుర్లభ
**rarefaction** విరళీకరణం; పలచన చేయటం
**rarefactive** విరళిత, పలచబరిచే
**rarely** అరుదుగా
**rarification** విరళీకరణం
**rarified** విరళ
**rascal** దుష్టుడు, ధూర్తుడు, శఠుడు, ద్రోహి, నీచుడు
**rash** *adj* దుడుకయిన, మోటైన, పదునైన, అనాలోచితంగా సాహసించే *n* చర్మంమీది బొబ్బ, పొక్కు *v* తొందరపడు



**rash eruption** దద్దురు, పొంగు
**rasp** *n* ఆకురాయి *v* గరగరమని శబ్దంచేయు; బిగ్గరగా చెప్పు
**raster** నిరూకం
**raster analysis** నిరూపకవిశ్లేషణ
**rat** ఎలుక; స్వపక్షవిద్రోహి
**smell a rat** శంకించు, సందేహపడు
**ratable/rateable** వెలకట్టదగ్గ, పన్నువేయదగ్గ, గతినిష్పత్తి నిర్ణయించదగ్గ; దామాషా, యథాను పాతం
**rataplan** వాయించు
**rate** *n* ధర, సూచి, మూల్యం, అంచనా, నిర్ధారణ *v* వెలకట్టు; ధర నిర్ణయించు, అంచనా వేయు, నిర్ధరించు
**rate, birth** జనన సూచి
**rated capacity** నిర్ధారిత శక్తి/సామర్థ్యం
**rate, death** మరణ సూచి
**rate, fertility** ప్రజనన సూచి
**rate, morbidity** వ్యాధి సూచి
**rate, mortality** మరణ సూచి
**rate, pulse** నాడి సూచి
**rate, respiration** శ్వాస సూచి
**rates** స్థానికమైన పన్నులు
**ratification** అనుమోదం, ధ్రువపరచటం, నిశ్చయపరచటం
**ratify** ఆమోదించు, అనుమోదించు, ధ్రువపరచు, ఖాయపరచు, స్థిరపరచు
**rating** స్థానక్రమ నిర్ణయం; స్థానిక పన్నుల నిర్ధారణ; సాధారణ నావికుడు
**rating scale** నిర్ధారణమాపకం
**ratio** నిష్పత్తి, దామాషా, అనుపాతం; రెండు సంఖ్యల సంబంధం
**ratio scale** నిష్పత్తి సూచిక
**ration** *n* దినబత్తెం; నియంత్రణ, పరిమితి *v* పరిమితి విధించు, కొలతప్రకార మిచ్చు
**ration card** పరిమితి నిర్ణాయకపత్రం
**ration shop** నియంత్రిత వస్తువుల దుకాణం, చౌకదుకాణం
**statutory rationing** శాసనబద్ధ పరిమితి నిర్ధారణ
**rational** విచక్షణ/వివేకం గల, బుద్ధిశాలి, యుక్తియుక్త, హేతుబద్ధ
**rationale** విచక్షణజ్ఞానం, కరణీయత
**rationalism** హేతువాదం
**rationalist** హేతువాది
**rationalization** హేతుబద్ధీకరణ, సక్రమ వ్యవస్థీకరణ
**rationalization of industries** పరిశ్రమల సక్రమ వ్యవస్థీకరణ
**rationalize** హేతుబద్ధం చేయు, సక్రమంగా వ్యవస్థీకరించు
**rationalized** సక్రమ వ్యవస్థీకృత, హేతుబద్ధ
**rattle** *n* గిలక; డబడబ, గలగల *v* వాగు, బడబడ మను, గలగలలాడించు, కోలాహలం చేయు
**ravage** *n* నాశనం, విధ్వంసం, దోపిడీ *v* కొల్లగొట్టు, సర్వనాశ(న)ం చేయు
**rave** వదరు, పిచ్చిగా/వెర్రిగా మాట్లాడు
**ravel** *n* చిక్కు, కఠినత, జటిలత *v* చిక్కు తీయు; పురివిప్పు, సులభం చేయు
**raven** *adj* నల్లని, అశుభస్కర *n* బొంతకాకి
**raw** ముడి, పచ్చి, అపక్వ
**raw data** అపక్వ దత్తాంశాలు
**ray** కిరణం
**ray of hope** ఆశాకిరణం
**re-** పునః, మళ్ళీ, తిరుగా
**reabsorption** పునరవశోషణ
**re-education** పునర్విద్యాభ్యాసం, పునర్విద్య
**re-election** తిరిగి ఎన్నిక
**re-employment** పునర్నియామకం, పునరుద్యోగం
**re-entry** పునఃప్రవేశం
**re-examination** పునఃపరీక్ష
**re-export** తిరిగి ఎగుమతి చేయు
**re-insurance** మళ్ళీ చేసే బీమా
**re-issue** తిరిగి జారీ చేయు
**re-marriage** పునర్వివాహం
**re-orientate** కొత్తరూపమిచ్చు, కొత్తరచన చేయు, కొత్తపద్ధతిలో శిక్షణ ఇచ్చు
**re-phasing** తిరిగి క్రమంలో పెట్టడం, మళ్ళీ కలపడం
**re-unification** పునరేకీకరణ
**react** ప్రతిక్రియ చేయు, ప్రతిస్పందించు, ప్రతిచర్య చేయు
**reaction** ప్రతిస్పందన, ప్రతిక్రియ, ప్రతిచర్య
**reactive** ప్రతిస్పందనాత్మక, ప్రతిక్రియాశీల
**readability expert** పఠనీయతానిపుణుడు
**reader** పాఠకుడు, పాఠకం; వాచకం; చదువరి; ఉపాధ్యాయుడు

**readily** తక్షణమే, వెంటనే; సులువుగా, మనస్ఫూర్తిగా
**readiness** సంసిద్ధత, ఒప్పుదల, అంగీకారం, ఉత్సుకత
**reading** గమనిక; పఠనం, వాచనం
**first reading** ప్రథమ పఠనం
**reading efficiency** పఠనసామర్థ్యం
**reading kit** పఠనసామగ్రి
**reading material** పఠన/పఠనీయ సామగ్రి
**reading skill** పఠననైపుణ్యం
**readings** కొలతలు
**readjudication** పునఃపరీక్ష, పునర్న్యాయ నిర్ణయం
**readjustment** తిరిగి సర్దుబాటు
**ready** దగ్గరైన, ఇష్టంగల; సిద్ధ
**ready-made** తయారైన, (కుట్టి) సిద్ధంగా ఉంచిన/ఉన్న
**ready witted** వెంటనే బదులుచెప్పే
**reaffirm** పునరుద్ఘాటించు
**reagent** పరీక్షక(ం), పరీక్షకపదార్థం
**real** అసలైన, నిజ, వాస్తవిక, యథార్థ
**real a/c** ఆస్తిఖాతా
**real estate, real property** స్థిరాస్తి (హక్కు)
**real life experience** వాస్తవిక జీవితానుభవం
**real sense** వాస్తవజ్ఞానం
**real time** అకృత్రిమ సమయం
**realger** మణిశిల
**realia** స్వీయానుభవాలు
**realism** వాస్తవికత, యథార్థ/వాస్తవ వాదం; వస్తు స్వాతంత్ర్యవాదం
**realist** యథార్థవాది, వాస్తవికవాది
**realistic** వాస్తవిక, యథార్థ, నిజ
**reality** వాస్తవం, యథార్థం
**realization** జ్ఞానం, బోధ, వాస్తవం తెలుసుకోవటం; నగదులోకి మార్పు, పరిష్కార ఖాతా
**realize** తెలుసుకొను, రాబట్టు, గుర్తించు, సాధించు, నెరవేర్చు, (ధనం)పొందు
**really** నిజంగా, వాస్తవంగా, యథార్థంగా
**realm** రాజ్యం, (ప్ర)దేశం, ప్రపంచం, రంగం
**ream** 20 దస్తాల/480 తావుల కట్ట
**reanimate** పునర్జీవింపజేయు, కొత్త ఊపిరిపోయు
**reap** (కొడవలితో) కోయు; ఫలితం పొందు, అనుభవించు
**rear** వెనకభాగం, వీపు
**rear guard** దండువెనక రక్షణ
**rear guard action** దండువెనక రక్షణచర్య
**rearrangement** పునర్నిర్మాణం, పునర్విన్యాసం
**reason** *n* కారణం, హేతువు, బుద్ధి, తెలివి, వివేకం *v* తర్కించు, వాదించు
**reasonable** సబబయిన, సహేతుక, సకారణ, సముచిత, సంగత, ఉచిత, యుక్తియుక్త
**reasonble facilities** సముచిత సౌకర్యాలు
**reasonable limit** సముచిత పరిమితి
**reasoning** తర్కం, వాదసరణి, హేతువాదన
**reassemble** తిరిగి సమావేశమగు
**reassortment** పునర్వర్గీకరణ(ం)
**reassure** తిరిగి హామీ ఇచ్చు, పునర్నిర్ధరించు
**rebate** తగ్గింపు (రేటు)
**rebel** *n* తిరుగుబాటుదారు *v* తిరగబడు, తిరుగుబాటు చేయు
**rebellion** విద్రోహం, తిరుగుబాటు
**rebellious** తిరగబడే, అవిధేయ
**reborrowing** పునరాదానం
**rebound** *n* దెబ్బ, ప్రతిఘాతం *v* (బంతిలా) ఎగిరిపడు
**rebroadcast/relay broadcast** పునఃప్రసారం
**rebuff** తోసివేత; తిప్పికొట్టు
**rebuke** చీవాట్లు పెట్టు, గద్దించు, మందలించు, తిట్టు; మందలింపు, చీవాట్లు, గద్దింపు
**rebut** ప్రతిఘటించు, సమాధానించు, ఖండించు
**rebuttal** ప్రతిఘటన, ఖండన (వాదం)
**recalcitrant** మన్నించని, అవిధేయ, అనిష్ట, అసమ్మత
**recall** *n* వాపసు, స్మరణ, జ్ఞప్తి; ఉపసంహరణ *v* (ప్రతినిధులను) వెనక్కుపిలుచు/వాపసు రప్పించు; గుర్తు తెచ్చుకొను
**recant** (అభిప్రాయం) మార్చుకొను; తప్పు బహిరంగంగా ఒప్పుకొను
**recapitulate** సారాంశం చెప్పు, సంగ్రహంగా/సంక్షేపించి చెప్పు, సింహావలోకనం చేయు
**recapitulation** పునర్విమర్శ, పునరావృత్తి
**recapture** పునర్బంధనం; పునర్బంధించు
**recast** *n* కొత్తరూపం, సంశోధనం, సంశోధిత రూపం *v* రెండోసారి మూసలో వేయు, తిరిగి తయారుచేయు, కొత్తరూపమిచ్చు
**recede** వెనక్కు మళ్ళు, తగ్గిపోవు, తిరోగమించు, విరమించు, విడిచిపెట్టు, ఉపసంహరించు



**receipt** రసీదు, ప్రాప్తి, జమ, వసూలు, పుచ్చుకోవటం
**receipt in full** పూర్తి జమ
**receive** తీసుకొను, స్వీకరించు, పొందు, గ్రహించు; వసూలు చేయు/అగు
**receiveing centre** (ప్రతి)శ్రవణ కేంద్రం
**receiveing station** గ్రాహకస్థావరం
**receiver** ప్రతిగ్రాహకం/గ్రాహకుడు, సందేశగ్రహీత
**recension** సంస్కరణ, సంశోధన
**recent** అధునాతన, నూతన, అభినవ, సరికొత్త, ఇటీవలి, నవీన
**receptacle** పాత్ర, గిన్నె; పుష్పవృంతం
**reception** ఆహ్వానం, స్వాగతం, సత్కారం, స్వాగత సమారోహం
**receptionist** స్వాగత కర్త/కర్త్రి
**receptive** గ్రాహ్య, గ్రహణశీల
**receptivity** గ్రహణశీలత, గ్రాహ్యత
**receptor** గ్రాహకం
**recess** *n* విరామం, విశ్రాంతి, అవకాశం; గూడు, మూల *v* స్థగితమగు
**recession** (వ్యాపార)మాంద్యం, తగ్గుదల; వెనక్కుపోవటం
**recessive** అప్రభావ, దుర్బల
**recessive genes** అప్రభావకజన్యువులు
**recharge** పునరావేశం
**recipe** ఔషధయోగం, మందుతయారుచేసే పద్ధతి; చిట్కా
**recipient** గ్రహీత, పొందేవాడు
**reciprocal** పరస్పర, అన్యోన్య, వ్యుత్క్రమ, అనురూప, అనుగుణ, ఇచ్చి పుచ్చుకొనే; వ్యుత్క్రమం, విలోమరాశి
**reciprocal category system** పరస్పర శ్రేణీవిధానం
**reciprocate** బదులుగా ఇచ్చు, ఇచ్చిన దానికి జవాబిచ్చు, పరస్పరం ఇచ్చి పుచ్చుకొను
**reciprocation** వ్యుత్క్రమణం
**reciprocity** ఆదాన ప్రదానం, అన్యోన్యభావం, పరస్పరత్వం, అదలుబదలు
**recital** పఠనం, అప్పగింత, ఒప్పచెప్పటం; ప్రకటన, వక్కణం
**recitation** గానం, వక్కణం, అప్పగింత
**recitation method** కంఠస్థ పద్ధతి
**recite** చదువు, కవితాగానంచేయు, అప్పగించు; (దస్తావేజులో) అంశాలను వక్కాణించు
**reckless** లక్ష్యం/ఆలోచన లేని, తొందరపడే, దుస్సాహసి
**recklessness** నిర్లక్ష్యం, నిరాలోచన, దుస్సాహసం
**reckon** లెక్కించు, పరిగణించు, ఎంచు, అర్థం చేసుకొను, ఒప్పుకొను, విశ్వసించు, అభిప్రాయపడు, అంచనా కట్టు
**reckoner** గణకుడు; జంత్రి
**reckoning** (పరి)గణన, లెక్కించటం, అంచనా
**reclaim** పునరుద్ధరించు, వ్యవసాయ/ఉపయోగ యోగ్యం చేయు, బాగుచేయు, సంస్కరించు, ఉద్ధరించు, పునస్సంపాదించు/వాపసు తీసుకొను
**reclamation** పునరుద్ధరణ, పునస్సంపాదన, పునస్సంస్కరణ
**reclamation of land** భూమి పునస్సంపాదన
**reclassification** పునర్వర్గీకరణ
**recline** ఆనుకొను, ఆనించు, ఒరుగు; విశ్రాంతి తీసుకొను, విశ్రమించు
**recluse** ఏకాంతవాసి, తపస్వి, సన్యాసి
**recognise** గుర్తించు, మాన్యత ఇచ్చు, ఒప్పుకొను, స్వీకరించు, తెలుసుకొను
**recognition** గుర్తింపు, మాన్యత, పరిగణన
**recognizance** స్వీకారం, స్వీకృతి, అభిజ్ఞానం, ముచ్చిలక
**recognized** అంగీకృత, పరిగణిత, గుర్తించిన, స్వీకరించిన, మానిత
**recoil** *n* ప్రతిచలనం; వెనుకంజ *v* వెనుదిరుగు, వెనక్కుపోవు, వెనుకంజ వేయు
**recollect** గుర్తుకు/జ్ఞప్తికి తెచ్చుకొను
**recollecting** స్మరణవిధానం, గుర్తుతెచ్చుకొనే తీరు
**recollection** జ్ఞప్తి, స్మరణ, గుర్తు, స్మృతి, జ్ఞాపకం
**recombination** పునస్సంయోగం
**recommend** సిఫారసు చేయు, సలహా ఇచ్చు
**recommendation** సిఫారసు; సలహా
**recompense** *n* ప్రతిఫలం, పరిహారం *v* ప్రతిఫలమిచ్చు
**reconcile** సమన్వయించు, సమాధానపెట్టు, రాజీపడు, అనుకూలం చేయు, సర్దుబాటు చేయు
**reconciliation** సమన్వయం, సర్దుబాటు, రాజీ, అనుకూలనం
**recondite** దురవగాహ్య, గూఢ, దాచుకున్న, దాగిన, గుప్త
**recondition** మరమ్మతు చేయు, కొత్తదిగా చేయు, సరిచేయు, బాగుచేయు

**reconditioning** కృతకప్రతిక్రియ; మరమ్మత్తు
**reconnaissance/reconnoitring** (సైనిక దృష్టిలో) భూ పరిశీలన/పర్యవేక్షణ
**reconnoitre** పర్యవేక్షించు, (భూమిని) పరిశీలించు
**reconsider** పునఃపరిశీలించు, పునర్విచారణ చేయు
**reconstitute** పునరుద్ధరించు, పునర్నిర్మించు
**reconstitution** పునరుద్ధరణ, పునర్నిర్మాణం
**reconstruct** పునర్నిర్మించు
**reconstruction** పునర్నిర్మాణం
**reconvene** తిరిగి పిలుచు/సమావేశపరచు
**reconvert** పునఃపరివర్తించు
**reconveyance** పునఃపరివర్తన; పునస్సమావేశనం
**record** *n* కవిలె, అభిలేఖ, లేఖ్యం; ప్రమాణం, లక్ష్యం; నమోదు; కార్యపట్టిక
**break/beat/cut the record** కొత్త ప్రమాణం నెలకొల్పు
**official record** ప్రభుత్వాభిలేఖ
**off the record** మాటమాత్రంగా, రాతలోలేని, ఉత్తుత్తి
**recorded** నమోదయిన, నమోదుచేసిన
**recorder** లేకరి, నమోదుచేసే వ్యక్తి
**recording** ధ్వని ముద్రణ; రాసుకోవటం, లిపిబద్ధం చేయటం, నమోదు చేయటం
**recording tape** ధ్వనిముద్రణ పట్టిక
**recount** వివరంగా చెప్పు/చూపు, తిరిగి లెక్కించు, వివరించు; కథ చెప్పు
**recoup** మరలపొందు, భర్తీచేయు; తిరిగి ఆరోగ్యం పొందు; (నష్టం) పూర్తిచేయు
**recover** రాబట్టుకొను, స్వస్థత పొందు
**recoverable** రాబట్టుకొనే వీలున్న; స్వాస్థ్యయోగ్య; పునర్లభనీయ
**recreation** వినోద (కార్యక్రమ)ం
**recrimination** ప్రతిదోషారోపణ(ం)
**recriminatory** ప్రతిదోషారోపక
**recruit** చేర్చుకొను, సమీకరించు
**recruitee** సమీకృతవ్యక్తి
**recruitment** (సిపాయిలను) చేర్చుకోవటం, సమీకరణ
**recrystallization** పునస్స్ఫటికీకరణం
**rectal** పురీషనాళ (సంబంధి)
**rectangle** దీర్ఘచతురస్రం
**rectangular** దీర్ఘచతురస్ర(ం వంటి)
**rectification** సవరణ, ప్రతిశోధనం
**rectifier** ప్రతిశోధకం
**rectify** సవరించు, ప్రతిశోధించు
**rectilineal** సరళరేఖావృత
**rectilinear** సరళరేఖాత్మక
**rectum** పురీషనాళం
**recuperation** పునరారోగ్యప్రాప్తి
**recurrence** పునరావృత్తి
**recurrent** పునరావర్తిత, పునరావృతమయ్యే
**recurring** ప్రత్యావర్తక, ఆవర్త
**recursive** పునరావృత్త
**recyling** పునరావర్తనం
**red** *adj* ఎర్రని *n* ఎరుపు (రంగు); సామ్యవాది
**red-cross** రెడ్‌క్రాస్, సేవాసహాయసంస్థ
**red-handed** తప్పు చేస్తున్నప్పుడే (పట్టుబడే)
**red-letter day** శుభదినం, ఆనందసమయం
**red-light** ఎర్రని కాంతి/దీపం; ప్రమాద సూచకం, సంకట చిహ్నం/సూచన
**red-light area** వ్యభిచారస్థలం
**red-rag** ఉత్తేజకారి
**red-tape** కాలయాపన, (పని) జాప్యం
**red-tapism** ఆలస్య కారణం; ఎర్రపట్టీ విధానం
**redaction** సంపాదన; నూతన సంస్కరణ
**redeem** విడిపించు, విముక్తిచేయు, రక్షించు, ఉద్ధరించు
**redeemable** విమోచనీయ
**redefine** పునర్నిర్వచించు
**redemption** విమోచన(ం), విడుదల, ముక్తి, మోక్షం
**redemption of debt** ఋణ విమోచన/విముక్తి
**redemption of mortgage** కుదవ/తాకట్టు విడిపించటం
**redirect** కొత్త చిరునామాకు పంపు; కొత్త ఆజ్ఞ జారీ చేయు
**rediscount** తిరిగి వట్టం
**rediscounting** తిరిగి వట్టమివ్వటం
**redistribution** తిరిగి పంపిణీ
**redolent** సుగంధిల, సువాసనగల
**redouble** తిరిగి పెంచు/పెరుగు
**redoubtable** పెద్ద, అగ్ర, భీషణ
**redound** పెంచు, వృద్ధిచేయు; లాభం సిద్ధించు
**redress** *n* నివారణ *v* నివారించు, (సరి) దిద్దు; చికిత్స చేయు; నష్టం భర్తీచేయు
**redressal of grievances** క్లేశ/వ్యథా నివారణ, కష్టనివృత్తి



**reduce** తగ్గించు, సూక్ష్మీకరించు, క్షయీకరించు, నిర్బలం చేయు, పడిపోవు
**reduced circumstances** కష్టాలు, పేదరికం, ఆయాసం, చెడు రోజులు/స్థితి
**reduce to writing** లిపి/అక్షర బద్ధం చేయు, రాసుకొను, లిఖిత (పూర్వక)ం చేయు
**reduction** సూక్ష్మీకరణం, న్యూనీకరణం, లఘూకరణం, క్షయకరణం; పరివర్తనం; సరిపుచ్చటం, సరిచేయటం; తగ్గింపు
**redundancy** పునరుక్తి, సమధికత, అనావశ్యకత
**redundant** పునరుక్త, సమధిక, అనావశ్యక, పనికిరాని, పనిలేని, దండగయిన, అక్కర లేని; అధిక, వ్యర్థ
**reduplication** అభ్యాసం
**reed** పీక, కాడ, గొట్టం, మురళి, పిల్లనగ్రోవి; (సంగీతప్పెట్టెలో) ధ్వనించే మీట
**broken reed** నమ్మకంలేని, అవిశ్వసనీయ
**reek** *n* పొగ; దుర్గంధం *n* పొగబెట్టు, దుర్గంధం ప్రసరింపజేయు
**reel** *n* నూలుచుట్టే చక్రం, కండె, దారంబండి, పంటెకోల; ఒకనాట్యపద్ధతి *v* తడబడు, గుండ్రంగా తిరుగు, తూలు; తలతిరుగు; కండె చుట్టు
**off the reel** తొందరగా, ఆగకుండా, అడ్డులేకుండా
**reel off** చుట్టుకొను
**reexport** తిరిగి ఎగుమతిచేయు
**refer** సూచించు, సమాలోచనకు పంపు/అప్పగించు, ఆలోచించు, నిర్దేశించు
**referee** మధ్యస్థుడు, నిర్ణేత
**reference** నిర్దేశం, సూచన, ఉల్లేఖనం, ప్రమాణపత్రం, సంకేతం, సంబంధం
**reference books** సంప్రదింపు/పరామర్శ గ్రంథాలు
**reference library** సంప్రదింపు/పరామర్శ గ్రంథాలయం
**reference system** పరామర్శ/సంప్రదింపు వ్యవస్థ
**referendum** ప్రజాభిప్రాయ/జనవాక్య సేకరణ
**refine** శుద్ధిచేయు, నిర్మలీకరించు, శుభ్రం చేయు, మెరుగుపరచు
**refined oil** శుద్ధిచేసిన నూనె/చమురు
**refinement** శుద్ధి, శుభ్రపరచటం; సంస్కారం, నాజూకుతనం, నాగరకత
**refinery** శుద్ధికర్మాగారం
**refining** శుద్ధిచేయటం, శుద్ధీకరణ
**reflation** పునరుల్బణం
**reflation of currency** ద్రవ్య/కరెన్సీ పునరుల్బణం
**reflationary** పునరుల్బణ
**reflationist** పునరుల్బణవాది
**reflect** పరావర్తించు, ప్రతిబింబించు, విచారించు, పరావర్తనం చెందు
**reflectance** పరావర్తనం, ప్రతిబింబనం
**reflected** పరావర్తిత, ప్రతిబింబిత
**reflected energy** పరావర్తితశక్తి
**reflection** ప్రతిబింబం, పరావర్తన(ం), విచారం; మననం, ఆలోచన, దోషం, దోషారోపం
**angle of reflection** పరావర్తనకోణం
**reflective** మననశీల
**reflectiveness** మననశీలత
**reflectivity** పరావర్తకత
**reflectometer** పరావర్తనమాపకం
**reflector** పరావర్తకం
**reflex** ప్రతిబింబం, ఛాయ, నీడ; ప్రభావం, ప్రతిక్రియ, అసంకల్పం, పరావృత్తి
**reflex action** సహజప్రతిక్రియ, అనియంత్రిత/అసంకల్పిత ప్రతీకారచర్య, పరావృత్తి క్రియ
**reflex of public opinion** లోకాచార/ప్రజాభిప్రాయ ప్రతిబింబం
**reflexive** ప్రతినివర్తక; ఆత్మార్థక(ం)
**reflexive pronoun** ఆత్మార్థక సర్వనామం
**reform** *n* సంస్కరణ, సంస్కారం *v* సంస్కరించు
**reformation** సంస్కరణ, సంస్కరించటం
**reformatory** సంస్కరణాలయం
**reformer** సంస్కర్త
**refraction** వక్రీభవనం; దృష్టిలోప నివారణం
**refractivity** వక్రీభవనత
**refractometer** వక్రీభవన మాపకం
**refractory** గట్టి, మొండి, మంకు; దుర్దాంత; దురాగ్రహి, దుర్గలనీయ; తాపసహ(ం)
**refractory brick** కొలిమి ఇటుక, తాప రోధకమైన/ఉష్ణప్రభావానికిగురికాని ఇటుక
**refractory metal** తాపరోధక/దుర్గలనీయ లోహం, వేడిని తట్టుకొనే లోహం
**refrain** *n* పల్లవి (స్థాయి), మకుటం *v* ఆపు, నిలుపు, నిరోధించు, అడ్డుతగులు
**refrains** పల్లవి పదాలు
**refrangibility** వర్తనశీలత

**refresh** అలసట తీరు/తీర్చు, విశ్రమించు, కొత్త ఊహ చేయు
**refresher** నూతనోత్సాహం, పునశ్చరణ, అదనపు రుసుము
**refresher's course** పునరధ్యయనం, పునశ్చరణ గోష్ఠి/తరగతి
**refreshment** ఉపాహారం, అల్పాహారం; మృష్టాన్నం; విశ్రాంతి
**refreshment room** అల్పాహార/ఉపాహార/ఫలాహార శాల/గృహం
**refrigerant** శీతజనకం
**refrigerate** చల్లబరచు, శీతలీకరించు
**refrigeration** శీతలీకరణం
**refrigerator** శీతలీకరణ యంత్రం, శీతలీకరణి
**refuge** ఆశ్రయం/రక్షణ, అభయస్థానం; ఉపాయం, దారి
**refugee** శరణార్థి, శరణాగతుడు, కాందిశీకుడు
**refugee rehabilitation** శరణార్థి/కాందిశీక సహాయ/పునరావాస కార్యక్రమం
**refulgent** మెరిసే, ప్రకాశించే
**refund** (డబ్బు) వాపసిచ్చు/తిరిగి ఇచ్చు
**refusal** తిరస్కృతి, నిరాకరణ, అనంగీకారం, మంజూరు చేయకపోవటం
**refuse** *n* చెత్తాచెదారం, పెంటకుప్ప, అనవసర వస్తువు, వ్యర్థ/పనికిరాని పదార్థం *v* నిరాకరించు, తిరస్కరించు, ఒప్పుకొనకపోవు
**refutation** ఖండన
**refute** ఖండించు, తప్పని నిరూపించు
**regain** పునఃప్రాప్తి/ఆరోగ్యప్రాప్తి పొందు, తిరిగిపొందు
**regal** రాజసం/రాచఠీవి గల
**regale** వినోదించు, మనసు రంజింపజేయు, అనుభవించు; గొప్పవిందు, మృష్టాన్నభోజనం
**regalia** రాజాధికారం, రాజలాంఛనం
**regard** *n* ఆదరం, గౌరవం, మర్యాద, మాన్యత, స్నేహం, సంబంధం *v* చూచు, ఎంచు, లక్ష్యపెట్టు, గౌరవించు
**give one's regards** నమస్కారాలందజేయు
**with regard to** (దీనికి) సంబంధించి, ఈ సంబంధంలో/విషయంలో
***regatta*** పడవ పందెం, నౌకల పోటీ
**regelation** పునర్ఘనీభవనం, మళ్ళీ గడ్డకట్టడం
**regency** ప్రతినిధి ప్రభుత్వం, పాలకమండలి, కార్యవాహక శాసనం; ప్రభుత్వాధికారం పొందిన ప్రతినిధి, ఆయన పాలనలోని ప్రాంతం
**regenerate** నవజీవన మిచ్చు, పునరుజ్జీవింపజేయు, తిరిగిపుట్టించు, పునరుద్ధరించు
**regenerated** పునరుత్పాదిత(ం)
**regeneration** పునరుత్పత్తి, పునర్జన్మ, పునరుజ్జీవనం, కొత్త జీవితం
**regent** రాజప్రతినిధి, శాసకుడు, కార్యనిర్వాహకుడు, సంరక్షకుడు
**regicide** రాజహత్య; రాజహంత(కుడు)
**regime** హయాం, పాలన (కాలం), రాజ్యం, శాసనం; పరిపాలన విధానం/పద్ధతి/ప్రవృత్తి
**regimen** నియమం, (క్రమ) పరిపాలన, ప్రభుత్వం; పథ్యం, ఆహారనియమం
**regiment** సైనికదళం, పటాలం, మహావాహిని
**regimentation** నియంత్రణ, నియామకం; (భాషా) నియమనం
**region** ప్రాంతం, ప్రదేశం, భూమి (భాగం), స్థలం
**regional** ప్రాంతీయ, ప్రాదేశిక
**regional stations of a.i.r.** ఆకాశవాణి ప్రాంతీయ కేంద్రాలు
**regional trend** ప్రాంతీయ ధోరణి
**register** *n* ఆరోపణం, ఆరోప పట్టిక; సూచి, జాబితా, చిట్టా పుస్తకం *v* నమోదుచేయు, ఖాతాలోకి ఎక్కించు, నియమబద్ధం చేయు, పట్టికాబద్ధం చేయు
**registered book** పట్టికాబద్ధ/నమోదైన పుస్తకం
**registered medical practioner** ఆర్.ఎం.పి., గుర్తింపు పొందిన వైద్యుడు
**registered post** రిజిష్టరుచేసిన/నమోదైన తపాలా
**registrar** రిజిస్ట్రార్
**registration** (ఖాతాలో) నమోదు, నిబంధనల ప్రకారం నమోదు; ఆరోపణ
**automatic registration** స్వయంప్రవర్తితారోపణ
**registry** రిజిస్ట్రార్ కార్యాలయం
**regolith** అదృఢశిలావరణం
**regrate** సేకరించు, జమచేయు, భాండాగారం నింపుకొను; లాభంపై అమ్మటానికి సేకరించు
**regress** ప్రతిగమించు
**regression** తిరోగమనం, వెనకంజ; తగ్గటం, ప్రత్యావర్తనం
**regression analysis** ప్రత్యావర్తన విశ్లేషణ
**regressive** తిరోగామి, వెనకాడే, క్రమంగా తగ్గే, వెనకంజవేసే



**regret** *n* విచారం, క్షోభ, దుఃఖం, బాధ, శోకం *v* దుఃఖించు, శోకించు, విచారించు, బాధపడు, పశ్చాత్తాపపడు
**regular** క్రమ, నియత, సమ, నియమిత; నిత్యం, యథావిధి; నియమవ్రతశీలుడు
**regular session** నియ(మి)త/క్రమమైన సమావేశం
**regularise** క్రమబద్ధంచేయు, నియమానుకూలం చేయు
**regularity** క్రమత్వం, నియతత్వం, నియతి, ఏకరూపత, సమానత
**regulate** క్రమపరచు, వ్యవస్థాబద్ధం చేయు, క్రమబద్ధం చేయు, ఒక పద్ధతికి తెచ్చు
**regulation** నియమ(న)ం, నిబంధన, శాసనం, వ్యవస్థీకరణ(ం)
**regulator** నియామకుడు, ప్రబంధకుడు, క్రమకర్త, వ్యవస్థాపకుడు; క్రమకారకం, ప్రబంధకం
**regulus** మఖ
**regurgitation** ప్రత్యావహనం
**rehabilitate** పునరావాసం కల్పించు, ఆశ్రయమిచ్చు, నిలబెట్టు, తిరిగి చేయు/పొందుపరచు
**rehabilitation** పునరావాసం, ఆశ్రయణం; పునరుద్ధరణ
**rehearsal** అభ్యాసం, పూర్వాభినయం, పూర్వాభ్యాసం
**rehearse** అభ్యసించు, (ప్రదర్శనకుముందు) అభినయించు
**reign** *n* రాజ్యం, హయాం, పరిపాలన(కాలం), ఏలుబడి *v* పరిపాలించు, ఏలు; ఆజ్ఞాపించు
**reimburse** తిరిగి ఇచ్చు, పూర్తిచేయు, ఆదాచేయు, వాపసిచ్చు, చెల్లించి భర్తీచేయు, తిరిగి రాబట్టుకొను
**reimbursement** ప్రతిపూర్తి
**rein** *n* కళ్ళెం, పగ్గం *v* శాసించు, ఆజ్ఞాపించు, వశంలో ఉంచుకొను
**reincarnate** పునర్జనించు, పునరవతరించు
**reincarnation** పునరవతారం, పునర్జన్మ
**reindeer** ధ్రువప్రాంతపు జింక
**reinforce** బలపరచు, దృఢపరచు, గట్టిపరచు, ఆసరా ఇచ్చు, సహాయమిచ్చు
**reinforcement** పునర్బలనం, పరిపుష్టత
**reinforcement(s)** ఉపబలం, సహాయక సైన్యం, అదనపు బలగం
**reinforcer** అదనపు సాధనం; బలవర్ధకం
**reinstate** తిరిగి నియమించు, పూర్వోద్యోగంలో పెట్టు, మళ్ళీ ఉద్యోగమిచ్చు, తిరిగి అదేపనిలో పెట్టు
**reinstatement** పునఃస్థాపన(ం)
**reiterate** తిరిగి చెప్పు, పునరుద్ఘాటించు
**reject** నిరాకరించు, తిరస్కరించు, తోసివేయు
**rejection** నిరాకరణ, తిరస్కారం, తిరస్కరణ
**rejigging** పునారచన, పునర్వ్యూహనం
**rejoice** సంతోషించు, సంతోషపెట్టు
**rejoicing** సంతోషం, ప్రమోదం, ఆనందం, ప్రసన్నత
**rejoinder** ప్రత్యుత్తరం, జవాబు, బదులు
**rejuvenate** కొత్తబలమిచ్చు, తిరిగి శక్తి నిచ్చు; పునర్యౌవనుని చేయు
**rejuvenation** పునర్యౌవనం, కాయకల్పం
**rejuvenescence** పునర్జీవనం, పునశ్శక్తి, పునర్యౌవనం
**relapse** *n* ఆవృత్తి, రోగం తిరగబెట్టడం; వాపసు *v* తిరుగు, వాపసువచ్చు, రోగం తిరగబెట్టు, పూర్వస్థితికి వచ్చు
**relate** సంబంధించు, జోడించు, వివరించు, వర్ణించు
**relation** సంబంధం, చుట్టరికం, జోడింపు, బంధువు
**relational case** సంబంధ కారకం
**relational concept** సంబంధి(త) భావన
**relationship** బాంధవ్యం, చుట్టరికం
**relative** *adj* సాపేక్ష, సంబంధి *n* బంధువు, సంబంధి, స్వజనుడు, చుట్టం
**relative construction** యత్తదర్థక ప్రయోగం
**relative pronoun** సంబంధబోధక సర్వనామం
**relativity** సాపేక్షత
**relax** విశ్రమించు, సేదతీరు; సడలించు
**relaxant** విశ్రామకం, సడలించే (పదార్థం)
**relaxation** సడలింపు, విశ్రాంతి, మనోవినోదం, ఆనందం
**relaxed** విశ్రాంత
**relay** *n* అంచెటపా *v* (పునః) ప్రసారణ చేయు; ముందుకు పోవు
**relay broadcast** పునః ప్రసారం
**release** *n* విడుదల, విముక్తి, మోచనం, విడుపు *v* విడుచు, వదలు, విడుదల చేయు
**relegate** నెట్టివేయు, పడవేయు, (ప్రవాసం)పంపు, దేశబహిష్కారం చేయు, వెనుకకు తోయు
**relent** జాలిపడు, మెత్తబడు, ద్రవించు

**relevance** ఔచిత్యం, సంగతత్వం, ఉపయుక్తత, సందర్భశుద్ధి, ప్రాసంగిత, పొంతన
**relevant** పొంతనగల, సందర్భశుద్ధిగల, యుక్త, ఉచిత, సంగత, ప్రస్తుత, తప్పనిసరి; ప్రకృతార్థానుబంధ
**relevant authority** సముచితాధికారి, సంబంధితాధికారి
**reliability** విశ్వాసపాత్రత, విశ్వసనీయత, నమ్మదగి ఉండటం
**reliable** నమ్మదగ్గ, విశ్వసనీయ
**reliance** విశ్వాసం, నమ్మకం, ఆసరా, సహాయం
**relic** అవశేషం, ప్రతిరూపం, స్మారక/జ్ఞాపక చిహ్నం
**relief** పరిహారం, సాయం, ఉపశమనం
**relief and rehabilitation** సహాయ పునరావాసాలు
**relief map** పర్వతాల, నదుల ఎత్తుపల్లాలను సూచించే చిత్రం/పటం
**relief camp** సహాయ(క) శిబిరం
**relief work** సహాయ కార్యక్రమం
**relieve** వదిలించు, విడుచు, విశ్రమింపజేయు, ఉపశమనం చేయు
**relieving officer** బదులు ఉద్యోగి
**religion** మతం, ధర్మం
**religious** మతసంబంధి, ధార్మిక, నిష్ఠాపర, ధర్మపరాయణ
**religious denomination** మతవర్గం
**relinquish** (పరి)త్యజించు, త్యాగం చేయు, విడిచిపెట్టు
**relinquishment** పరిత్యాగం, (స్వత్వ)త్యాగం, విసర్జన
**relish** *n* ఇష్టం, (అభి) రుచి *v* రుచిచూచు, ఆస్వాదించు; ఆనందించు, ఇష్టపడు
**reluctance** వైముఖ్యం, అసమ్మతి, అనిష్టం
**reluctant** విముఖ, అసమ్మత, ఇష్టంలేని
**rely** నమ్ము, విశ్వసించు; ఆధారపడు
**remain** శేషించు, మిగిలిపోవు, ఉండిపోవు; (బాకీ) ఉండు
**remain in force** అమల్లో ఉండు, నడుచు
**remainder** శేషం, మిగులు ఆస్తి, నిరీక్షితాస్తి, సంక్రమించే ఆస్తి, అవశేషం, బాకీ మిగులు
**remains** అవశేషాలు, భగ్నావశేషాలు, ఎముకలు
**remand** తిప్పి పంపు, నిర్బంధించు, (కోర్టు అనుమతిమీద) పోలీసుల అధీనంలో ఉంచు
**remand to custody** నిర్బంధంలో ఉంచు, నిర్బంధానికి పంపు
**remark** *n* వచనం, కథనం, ఉక్తి, విశేషాంశం *v* విశేషం ఎత్తిచూపు, లక్షించు, ప్రత్యేకంగా చెప్పు
**remarkable** అసాధారణ, విశేష, ప్రశంసాయోగ్య, ప్రసిద్ధ, విచిత్ర, విలక్షణ, ఉత్కృష్ట
**remedial** పరిహారాత్మక, ప్రతిక్రియాత్మక, ఉపచారక, గుణమిచ్చే, చక్కబరిచే; చికిత్సాసంబంధి
**remedial measure** ప్రత్యుపాయచర్య
**remedial teaching** ప్రత్యుపాయ/నివారణ బోధన
**remedy** *n* చికిత్స, మందు; ఉపాయం, ప్రతిక్రియ, ప్రత్యుపాయం, పరిహారం, నివారణ మార్గం *v* మందిచ్చు, శాంతింపజేయు, పరిహరించు, నివారించు, చింత తొలగించు
**remember** గుర్తుంచుకొను, స్మరించు, ధ్యానించు, మరవకుండు
**remembrance** స్మరణ, స్మృతి, జ్ఞాపకం, జ్ఞప్తి; స్మారకం, స్మృతిచిహ్నం
**remind** గుర్తు చేయు, జ్ఞప్తికి తెచ్చు
**reminder** జ్ఞాపిక, స్మరణ పత్రం
**reminiscence** స్మృతి, వాసన, సంస్మరణ
**remise** ఇచ్చివేయు, విడిచిపెట్టు, విసర్జించు, (హక్కు/అధికారం) వదలుకొను
**remiss** అశ్రద్ధ, ఉపేక్ష, అసావధానత; శిథిలత
**remission** ఉపశమనం, పరిహారం; తగ్గింపు, మాఫీ, క్షమాపణ, సడలింపు, ముక్తి
**remit** (సొమ్ము) చెల్లించు, మాఫీచేయు, వెనక్కు పంపు, డబ్బుపంపు
**remit a sentence** శిక్ష తగ్గించు; మాఫీచేయు
**remittance** డబ్బు పంపటం, పంపిన డబ్బు, ప్రేషకధనం
**remitting** ప్రేషించే
**remnant** అవశేషం, బాకీ, మిగిలిన; గుర్తు, చిహ్నం
**remonstrance** సార్వజనిక విజ్ఞాపన; ఆక్షేపణ, ఫిర్యాదు; విరోధం
**remonstrate** విరోధించు, ఆక్షేపించు, ఫిర్యాదు చేయు
**remorse** పశ్చాత్తాపం, శోకం, అనుతాపం, గ్లాని, ఖేదం
**remote** సుదూర, వ్యవహిత, ప్రాచీన; చాలా తక్కువ
**remote camera** దూరనియంత్రిత ఛాయాగ్రాహకం



**remote cause** సుదూర కారణం
**remote characterisation** దూరోన్మీలనం
**remote future** సుదూర భవిష్యత్తు
**remote goal** దూరస్థ/సుదూర గమ్యం
**remote sensing** సుదూర గ్రహణం/గ్రాహకత
**remote sensor** సుదూర సంవేదకం
**remoteness** సుదూరత
**removable** తొలగించదగ్గ
**removal** తొలగింపు, తీసివేత, పదచ్యుతి, నివారణ, వేరుసేత, తుడిచివేత
**remove** *n* (మధ్యగల) దూరం, భేదం, అంతరం *v* తొలగించు, తీసివేయు, నివారించు, స్థలం మార్చు, తీసుకవెళ్ళు
**remunerate** ప్రతిఫలమిచ్చు, జీతమిచ్చు, శ్రమకు డబ్బిచ్చు
**remuneration** ప్రతిఫలం, పారితోషికం
**renaissance/renascence** పునరుజ్జీవనం, పునర్జాగృతి, పునరుద్ధరణ, నవజాగృతి; కొత్త జన్మ/జీవితం
**renal** మూత్రపిండ సంబంధి
**rend** చించు, విరచు, ఛేదించు, ముక్కలు ముక్కలు చేయు
**render** చేయు, చెప్పు, చూపు, సమాధానపరచు, తిరిగి ఇచ్చు; వదలుకొను; అనువదించు, భాషాంతరీకరించు
**rendering** అనువాదం, తర్జుమా; గానపద్ధతి, వర్ణన, వ్యాఖ్య
***rendezvous*** సంకేత/నిర్దిష్ట స్థానం, నిశ్చిత ప్రదేశం, కలిసే చోటు
**rendition** అనువాదం, వ్యాఖ్యానం
**renegade** ధర్మభ్రష్ట, స్వధర్మత్యాగి; విశ్వాస ఘాతుకుడు, విడిచిపారిపోయినవాడు
**renew** పునఃప్రారంభించు, పునరుద్ధరించు, నవీకరించు
**renew an agreement** ఒప్పందం కాలపరిమితి పెంచు/పునరుద్ధరించు
**renewable** పునరుద్ధరణీయ
**renewal** పునరుద్ధరణ, నవీకరణ
**reniform** మూత్రపిండాకార(ంలోని)
**renounce** పరిత్యజించు, విడిచిపెట్టు, వేర్పడిపోవు, సంబంధాలు తెంచుకొను, సన్యసించు; రాజీనామా ఇచ్చు
**renovation** నవీకరణం
**renown** ప్రసిద్ధి, పేరు, ప్రఖ్యాతి
**renowned** ప్రసిద్ధ, పేరుమోసిన, విఖ్యాత
**rent** *n* అద్దె, కిరాయి, బాడుగ; చీలిక, పగులు, ఆదాయం *v* అద్దెకిచ్చు, అద్దెతీసుకొను
**rent a/c** అద్దె (ఖాతా)
**rental** అద్దెసొమ్ము, అద్దెల/కౌలు మొత్తం
**rentiers** వడ్డీమీద బతికేవాళ్ళు
**renunciation** త్యాగం, పరిత్యాగం, సన్యాసం, విసర్జనం
**reorganisation** పునర్వ్యవస్థీకరణం
**reorganise** పునర్వ్యవస్థీకరించు
**reorient** కొత్తరూపమిచ్చు, కొత్త రచన చేయు, కొత్త పద్ధతిలో శిక్షణ ఇచ్చు
**reorientation** నూత్న రచన/శిక్షణ, ఆధునికీకరణ, నవీకరణ
**repair** *n* మరమ్మతు, బాగు *v* బాగుచేయు, మరమ్మతు చేయు, తిరిగిజోడించు; వెళ్ళు
**repalent** నిరోధకం
**reparation(s)** నష్టపరిహారం, పరిరక్షణ; యుద్ధ (నష్ట) పరిహారం
**repartee** చతుర వచనం/ప్రత్యుత్తరం
**repatriation** స్వదేశానికి రావటం/పంపటం
**repeal** *n* రద్దు, కొట్టివేత *v* రద్దుచేయు, కొట్టివేయు
**repeat** పునరుచ్చరించు, అన్నదే అను, తిరిగి చెప్పు/చేయు
**repel** వికర్షించు, నెట్టు, వెనక్కు తరుము, ఎదిరించు, అసహ్యం పుట్టించు
**repellent, insect** కీటక వికర్షకం
**repentance** పశ్చాత్తాపం, పరితాపం, ప్రాయశ్చిత్తం, అనుతాపం, ఖేదం
**repercussion** (అనంతర) పరిణామం/ప్రభావం
***repertoire*** ప్రదర్శన పట్టిక
**repertory** సంగ్రహాలయం, భండారం
**repetition** పునరుక్తి, పునరావృత్తి
**repetitive** పునరుక్త, ద్విరుక్త
**re-phasing** తిరిగి ఒక క్రమంలో ఉంచు, తిరిగి సంధానించు/కలుపు
**repine** చిరాకుపడు, వ్యసనపడు
**replace** భర్తీచేయు, వినిమయించు, పునః స్థాపించు
**replacement** పునఃస్థాపన, స్థానపూర్తి, బదులు, ప్రత్యామ్నాయం; నింపటం, భర్తీ
**replenish** నింపు, సరిచేయు, తిరిగి పూర్తిచేయు

**replete** పూర్ణ, నిండిన
***replica*** ప్రతిరూపం, ప్రతికృతి, నకలు
**replicable** ప్రతిసృజనీయ
**reply** *n* జవాబు, సమాధానం, ప్రత్యుత్తరం *v* జవాబిచ్చు, సమాధానం చెప్పు
**reply-paid telegram** జవాబీతార్, జవాబు తంతి
**report** *n* నివేదిక, వివరణ(పత్రం); సమాచారం, వృత్తాంతం, చర్చ *v* నివేదించు, వివరించు, సమాచారమిచ్చు; ఫిర్యాదుచేయు, సూచించు
**authoritative report** ప్రామాణిక/అధికారిక నివేదిక
**reported decision** నివేదిత నిర్ణయం
**report generation** నివేదికోత్పాదనం
**unconfirmed report** అధ్రువవార్త/అనుమానాస్పద సమాచారం
**reporter** నివేదకుడు, (పత్రికా) విలేఖరి, (వార్తా)సేకర్త
**reporting** నివేదన, సమాచార/వార్తా కథనం
**repose** *n* విశ్రాంతి, శాంతి, నిద్ర *v* విశ్రాంతి/శాంతి ఇచ్చు, పడుకోబెట్టు; సహాయపడు, నమ్మి అధీనంలో ఉంచు
**repository** సురక్షిత స్థానం, నిక్షేప స్థానం, కోశాగారం, భండారం, నిధి; సమాధి
**reprehend** కోపించు, నిందించు, అభిశంసించు, వ్యతిరేకత తెలుపు
**reprehensible** కోపనీయ, నిందనీయ, అభిశంసనీయ, గర్హనీయ
**represent** ప్రాతినిధ్యం వహించు; చూపు, సూచించు; వర్ణించు, నివేదించు; చిత్రించు, బొమ్మ దించు
**representation** ప్రాతినిధ్యం, నిరూపణ, ప్రార్థన, నివేదన (పత్రం); చిత్తరువు
**representative** ప్రాతినిధ్యం గల; ప్రతినిధి
**representative method** ప్రాతినిధ్య విధానం/పద్ధతి
**repress** అణచు, అదుము, ఆపు, అడ్డగించు, నిరోధించు, వశపరచుకొను
**repression** అనైచ్ఛిక నిరోధం, అణచివేత, దమన నీతి/చర్య
**reprieve** *n* శిక్ష వాయిదా/(తాత్కాలికంగా) నిలిపివేత *v* తాత్కాలికంగా శిక్ష తగ్గించు/క్షమించు
**reprimand** *n* వాగ్దండనం, మందలింపు, నింద, ఖండన *v* చీవాట్లుపెట్టు, నిందించు, ఖండించు
**reprint** *n* పునర్ముద్రణ *v* పునర్ముద్రించు
**reprisal** ప్రతీపీడనం, ప్రతీకారం, ప్రత్యపకారం
**reproach** *n* నింద, తిరస్కారం, గర్హణ, అపవాదు, అవమానం, లోపం *v* నిందించు, తిరస్కరించు, గర్హించు, అవమానించు, ధిక్కరించు, లోపమెత్తి చూపు, అపవాదు వేయు
**reprobate** *n* పతితుడు, దుర్మార్గుడు, మొండి(వాడు); *v* నిరాకరించు, నిరసించు, గర్హించు, తోసివేయు
**reproduce** *n* ప్రతికృతి, ప్రతిలిపి, ప్రత్యుత్పత్తి *v* పునరుత్పాదించు
**reproduction** ప్రత్యుత్పత్తి, పునరుత్పత్తి, పునరుత్పాదన, సంతానోత్పత్తి; ప్రతికృతి, ప్రతిలిపి
**reproduction right** పునరుత్పాదనాధికారం
**reprography** ఛాయాచిత్రప్రతికృతి (కల్పన)
**reprographic service** ఛాయాచిత్ర ప్రతికృతి సేవ
**reproof** దూషణ, నింద, చీవాట్లు
**reptile** సరీసృపం, పాకుడు జంతువు
**republic** గణతంత్ర (రాజ్యం), గణరాజ్యం; ప్రజాతంత్ర/ప్రజాసత్తాక రాజ్యం
**republic of letters** సాహితీ జగత్తు, సాహిత్యక్షేత్రం
**republican** గణతంత్రవాది; (అమెరికాలో) రిపబ్లికన్ పార్టీ సభ్యుడు
**repudiate** నిరాకరించు, అసమ్మతి తెలుపు, తనది కాదను, అంగీకరించకుండు
**repudiation** నిరాకరణ, తిరస్కరణ, అసమ్మతి, అస్వీకృతి
**repugnance** ప్రతికూలత, అసహ్యత
**repugnancy** అసహ్యం, ప్రాతికూల్యం
**repugnant** విరుద్ధ, ప్రతికూల, అసహ్య
**repulse** వెనక్కు తరుము, తిప్పికొట్టు, ఓడించు; వికర్షించు
**repulse an attack** దాడిని తిప్పికొట్టు
**repulsion** తరిమికొట్టడం; ఓటమి, వికర్షణ
**repulsive** విసుగు పుట్టించే, నిరోధించే
**reputable** విఖ్యాత, ప్రసిద్ధ, కీర్తిగల, యశస్వి
**reputation** ప్రసిద్ధి, విఖ్యాతి, కీర్తి, యశస్సు, పేరుప్రతిష్ఠలు
**repute** *n* ఖ్యాతి, కీర్తి, ప్రతిష్ఠ, ప్రసిద్ధి *v* తలంచు, పరిశీలించు, ఆలోచించు



**request** *n* ప్రార్థన, మనవి, వినతి, విజ్ఞప్తి, కోరిక, అనునయం, అభ్యర్థన, నివేదన *v* ప్రార్థించు, అనునయించు, అభ్యర్థించు, వినతి చేయు, బతిమాలు
**requiem** శ్రద్ధాంజలి, దైవప్రార్థన
**require** అవసరమగు, కావలసి ఉండు, తప్పనిసరి అగు
**requirement** అవసరం
**requisite** ఆవశ్యక, వాంఛిత, అపేక్షిత, కావలసిన; ఆవశ్యకం, అపేక్షితం
**requisition** అభ్యర్థన
**resampling** పునస్సంచయనం
**rescue** కాపాడు, రక్షించు
**research** పరిశోధన; పరిశీలన
**resection** విచ్ఛేదం
**resent** ఆగ్రహించు, అసహ్యించుకొను
**resentment** ఆగ్రహం, అసహ్యం
**reservation** ప్రత్యేకింపు, ప్రత్యేక రక్షణ
**reserve** నిలవ(సొమ్ము/ధనం), (సం)క్షేమనిధి, సంచితం
**reserved** ప్రత్యేకిత, రక్షిత
**reserves** సురక్షితకోశం, ప్రత్యేక/సంక్షేమ నిధి; నిలవ బలాలు, రిజర్వు పోలీసులు
**reservist** నిలవబలంలోని వ్యక్తి, ప్రత్యేకిత సైనికుడు
**reservoir** ఆశ్రయం, జలాశయం, చెరువు, నీటితొట్టి
**resettlement** పునరావాసం, పునఃపరిష్కారం, తిరిగి బందోబస్తు
**reshaping** పునారచన
**reshipment** తిరిగి ఓడ కెక్కించటం
**reshuffle** పునర్వ్యవస్థీకరించు, శాఖలు మార్చు
**reside** నివసించు, ఉండు, నిలుచు
**residence** నివాసం, ఇల్లు
**residency** (రాజ)ప్రతినిధి నివాసం/కార్యాలయం
**resident** స్థానికుడు, నివాసి; వైస్రాయ్ ప్రతినిధి
**residential** నివాస యోగ్య/సంబంధి, నిలవదగ్గ
**residential school** ఆశ్రమపాఠశాల
**residual** మిగిలిన, అవశిష్ట, శేషించిన, బాకీ; శేషం, అవశిష్టం, అవశేషం
**residuary** బాకీ ఉన్న, అవశిష్ట, అనిరుద్ధ
**residuary powers** అవశిష్టాధికారాలు, మిగిలిన అధికారాలు
**residue** అవశేషం
***residuum*** శేషభాగం, బాకీభాగం, మిగిలినది
**resign** రాజీనామాచేయు, విడిచిపెట్టు, త్యాగపత్రమిచ్చు, పదవీత్యాగం చేయు
**resignation** రాజీనామా, పరిత్యాగం
**resile** వెనుదిరుగు, పూర్వస్థితికి చేరు
**resilent** సాగే, హుషారైన, స్థితిస్థాపక
**resin** లక్క, (రేల) బంక, జిగురు; గుగ్గిలం
**resist** నిరోధించు, ఆపు, అడ్డగించు, ప్రతిఘటించు, ఎదురొడ్డు, విరోధించు
**resistance** నిరోధకశక్తి, ప్రతిఘటన, నిరోధం, అవరోధం, ఆపుదల
**line of least resistance** సుగమ/సులభ మార్గం
**passive resistance** వినయపూర్వకావరోధం, సవినయ నిరోధం; సత్యాగ్రహం
**resistant** నిరోధకం
***res judicata*** పూర్వనిర్ణయబద్ధం, పునర్విచారణ నిషేధం
**resolute** దృఢ (సంకల్పంగల), స్థిర (చిత్త)
**resolution** తీర్మానం, సంకల్పం, దృఢనిశ్చయం, స్థైర్యం; విభజన, విశ్లేషణ; విభాజకత
**resolve** తీర్మానించు, సంకల్పించు, నిశ్చయించు
**resonance** ప్రతిధ్వని, అనురణనం, అనునాదం
**resonant** ప్రతిధ్వనించే
**resorption** శిథిలత
**resort** *n* సమావేశస్థలం, ఆశ్రయం *v* ఆశ్రయించు, పాల్పడు, వెళ్ళు
**health resort** ఆరోగ్య ప్రదేశం/కేంద్రం
**in the last resort** చివరికి, ఆఖరికి
**resound** ప్రతిధ్వనించు
**resource** వనరు, సాధనం, మూలాధారం, గతి, ఉపాయం, మార్గం
**resource management** మూలాధార యాజమాన్యం
**resource person** మార్గదర్శకుడు, బోధకుడు
**resourcefulness** ఉపజ్ఞత, ప్రత్యుత్పన్నత
**resource(s)** వనరులు, నిధులు, నిక్షేపాలు, సాధన సామగ్రి
**respect** *n* గౌరవం, ఆదరణ, సత్కారం, సంబంధం, సందర్భం *v* గౌరవించు, ఆదరించు, సత్కరించు
**respectable** మాననీయ, పూజనీయ, పూజ్య, మాన్య, ఆదరణీయ
**respectful** గౌరవప్రద, మాన్య, పూజనీయ

**respectfully** విధేయతతో, మర్యాదతో, గౌరవ పురస్సరంగా, సాదరంగా
**respective** ఆయా/వారివారి/తమతమ
**respectively** క్రమంగా, వరసగా, యథాక్రమం
**respiration** శ్వాస (క్రియ), శ్వసనం
**respirator** శ్వాసక్రియాసాధనం, శ్వాసయంత్రం
**respiratory ailment** శ్వాసరోగం
**respite** *n* అవధి, విలంబం, విరామం, విశ్రాంతి *v* ఆలసించు, విరామమిచ్చు, అవకాశమిచ్చు, విశ్రాంతి ఇచ్చు/తీసుకొను
**resplendent** ఉజ్వల, జ్వలిత, ప్రకాశించే, వెలుగొందే
**respondent** ప్రతివాది, ప్రతికక్షి
**response** జవాబు, సమాధానం, ప్రత్యుత్తరం; ప్రతి క్రియ/చర్య; ప్రతిస్పందనం, అనుక్రియ, ప్రతీకారం
**responsibility** బాధ్యత
**responsible** బాధ్యతగల, పూచీగల, బాధ్యతాయుత
**responsive** ప్రతిస్పందక
**responsiveness (to public opinion)** జనవాక్యానికి ప్రతిస్పందన
**rest** *n* విశ్రాంతి, విరామం, నిద్ర; అవకాశం, ఆశ్రయం, మిగులు; నిశ్చలస్థితి *v* విశ్రమించు, శాంతించు, నిద్రించు, ఆనుకొను, ఆనించు, విరామం పొందు
**rest-house** విశ్రాంతి గృహం/మందిరం
***restaurant*** ఉపాహారశాల
**restitution** పూర్వస్థితీకరణం, ప్రత్యర్పణం, నివారణ, నష్టపూర్తి, నష్టపరిహారం, తిరిగి ఇచ్చివేయటం
**restive** అశాంత, క్షుబ్ధ, మాట వినని, మూర్ఖ
**restless** అశాంత, వ్యాకుల
**restlessness** అశాంతి, వ్యాకులత
**restoration** పునరుద్ధరణ(ం)
**restorative** శక్తి/ఆరోగ్య దాయక
**restore** పునరుద్ధరించు, బాగుచేయు, పునస్స్థాపనం చేయు, పూర్వస్థితికి తెచ్చు, తిరిగి ఇచ్చు
**restrain** నిరోధించు, నిగ్రహించు, అడ్డగించు, ప్రతిరోధించు; వశంలో ఉంచుకొను, ఖైదుచేయు; కనుకట్టు చేయు
**restraint** నిగ్రహం, సంయమం; ప్రతిబంధకం, నిరోధం, నిర్బంధం, ఖైదు, అడ్డగింపు, కట్టుబాటు; ప్రతిరోధం
**restrict** కట్టుబాటు చేయు, నిర్బంధించు, పరిమితం చేయు, నిబంధనలో ఉంచు, ఆపు
**restricted** విరళిత, పరిమిత
**restriction** నిరోధం, ఆంక్ష, పరిమితి
**restrictive** నిరోధక, పరిమిత, ఆంక్షాపూర్వక
**resubmission** పునస్సమర్పణ
**result** *n* ఫలితం, ఫలం, పరిణామం, పర్యవసానం, ముగింపు *v* ఫలితమిచ్చు, పరిణమించు, ఫలించు, ప్రభావం పడు
**resultant** ఫలితమైన, పరిణామి, ఉపలబ్ధ
**resume** *n* సారం, సారాంశం, సంగ్రహం, సంక్షేపం *v* (పునః) ప్రారంభించు, తిరిగి తీసుకొను
**resumption** పునరారంభం, పునర్గ్రహణం, తిరిగి తీసుకోవటం
**resurgence** పునరుజ్జీవనం, పునరుత్థానం, తిరిగి జన్మించటం
**resurrect** పునరుజ్జీవింపజేయు, వాడుకలోకి తెచ్చు
**resurrection** పునర్జీవితం, పునరుత్థానం, పునర్నిర్మాణం
**resuscitate** ప్రాణంపోయు; కొత్తదనమిచ్చు, తిరిగి బాగుచేయు
**retail** *n* చిల్లర *v* చిల్లరగా అమ్ము
**retail dealer** చిల్లర వ్యాపారి
**retail prices** చిల్లర ధరలు
**retail sale** చిల్లర అమ్మకం
**retain** నిలిపి ఉంచు, ఆపివేయు, ప్రత్యేకించు
**retaining allowance** నిలుపుదల భత్యం
**retainer** ఆశ్రితుడు, రక్షకుడు; నౌకరు; (ఉద్యోగంలో) ఆపిన బత్తా, శుల్కం; పెట్టుకున్న వకీలు
**retaliate** ప్రత్యాక్రమణ చేయు, ప్రతీకారం చేయు, ప్రతిఘటించు, జవాబిచ్చు
**retaliation** ప్రతీకారం, ప్రతిఘటన
**retaliatory duty tariff** పరిహారశుల్కం
**retard** ఆలస్యం చేయు, వేగం తగ్గించు; అడ్డుకాలు పెట్టు, ప్రతిబంధకం చేయు
**retardation** వేగక్షీణత, మాంద్యం; రుణత్వరణం
**retarding** క్షీయమాన
**retartivity** ధారణశక్తి
**retching** ఓకరించటం, కడుపులో తిప్పటం
**retention** నిలుపుదల, నిరోధం, (ప్రతి)ధారణ; నిలకడ



**retention price** ప్రతిధారణ మూల్యం, నిలుపుదల ధర
**retention structure** జలబంధననిర్మాణం
**retentive** ధారణశీల, గుర్తుంచుకొనే
**retentiveness** ధారణశక్తి
**reticence** మౌనం, మితభాషిత
**reticent** మితభాషి
**reticulate** వలవంటి, జాలాకార
***reticuli termes*** చెద (పురుగు)లు
**reticulum** వల, జాల(క)ం
**retina** నేత్రాంతఃపటలం/నాడీపటలం
**retinitis** నేత్రాంతఃపటలశోథ
**retinopathy** నేత్రాంతఃపటల వికృతి
**retinoscope** నేత్రాంతఃపటదర్శిని
**retinue** అనుచరవర్గం, పరిజనం
**retire** విశ్రమించు, పదవీ/ఉద్యోగ విరమణ చేయు, వైదొలగు, వెనక్కు తగ్గు
**retired** ఉద్యోగం విరమించిన
**retirement** (ఉద్యోగ/పదవీ) విరమణ
**retirement of bill** హుండీ విడుపుదల
**retort** *n* ప్రతినింద, ప్రత్యుత్తరం; ప్రయోగపాత్ర *v* త్వరగా జవాబిచ్చు, ప్రతినిందచేయు
**retouch** తప్పు దిద్దు/సవరించు
**retrace** గుర్తు తెచ్చుకొను, వెనక్కుపోవు
**retract** వెనుదీయు, మార్చి చెప్పు, ఖండించు, ఉపసంహరించు, వెనక్కు తీసుకొను
**retraction** వెనక్కు తీసుకోవటం, ఉపసంహరణ
**retransmission** పునఃప్రసారం
**retreat** *n* తిరోగతి, పలాయనం, ఏకాంతవాసం, ఆశ్రయం, రక్షితప్రదేశం *v* తిరోగమించు, వెనుదిరుగు, పలాయనం చిత్తగించు
**retrench** పదవినుంచి తొలగించు, తక్కువ చేయు, కోతకోయు
**retrenched personnel** తొలగించిన/తీసివేసిన ఉద్యోగిబృందం
**retrenchment** తొలగింపు, తగ్గింపు
**retribution** ప్రతీకారం, శిక్ష; పాపఫలం, ప్రతిఫలం
**retrieve** తిరిగి తెచ్చుకొను, పునస్సంపాదించు
**retroact** తిరగబడు, ప్రతికూలించు
**retroactive legislation** గడచిన సమయానికి వర్తించే శాసనం
**retrocede** మరలు, తిరిగి ఇచ్చు, వెనుకంజ వేయు, వదులుకొను
**retroflex** మూర్ధన్య(ం)
**retroflexion** మూర్ధన్యీకరణం
**retrograde** ప్రతిలోమ, తిరోగామి, హానికారక
**retrograde motion** వక్రచలనం
**retrogression** తిరోగమనం, తిరోగతి, ప్రతీపగమనం
**retrospection** సింహావలోకనం; స్మృతి
**retrospective** గతానికి వర్తించే, పూర్వవర్తి
**return** *n* లాభం, ప్రాప్తి, రాబడి, వివరణ పట్టిక *v* తిరిగివచ్చు, వెనక్కు మళ్ళు, తిప్పివేయు, ఎన్నికగు
**returning officer** ఎన్నికల అధికారి
**return of post** తిరుగుటపా
**return ticket** తిరుగు ప్రయాణపు టిక్కెట్టు
**return visit** బదులు సందర్శన/ప్రయాణం
**returnable** వాపసిచ్చే, తిప్పిపంపదగ్గ, తిరిగి ఇవ్వవలసిన
**returns** ఫలితాలు, రాబడి
**re-unification** పునరేకీకరణ(ం)
**reunion** పునస్సమాగమం
**revaluation** పునర్మూల్యాంకనం, పునర్మూల్యీకరణం, తిరిగి విలువకట్టడం
**reveal** బహిరంగపరచు, ప్రకటించు, తెరచు, చూపించు
**revel** *n* వేడుక, పండగ, గొప్పవిందు, సంతోషం *v* అట్టహాసం చేయు, ఉత్సవం చేయు, తాగితుళ్ళు, అరచినట్లు మాట్లాడు, సంతోషించు
**revelation** దివ్యవార్త, ఈశ్వరాదేశం, రహస్యోద్ఘాటన, కొత్త/కళ్ళుతెరిపించే మాట
**revendication** వస్తువులను తిరిగితీసుకొనే హక్కు
**revenge** *n* ప్రతీకారం *v* పగదీర్చుకొను
**revenue** శిస్తు, ఆదాయపు ఖాతా, రాబడి, ఆదాయం, పన్ను, ప్రభుత్వాదాయం, రాజస్వం
**revenue account** ఆదాయపు ఖాతా
**revenue expenditure** ప్రభుత్వ/పన్నులో వ్యయం/ఖర్చు
**reverberate** ప్రతిధ్వనించు, తిరిగి వినవచ్చు
**reverberation** ప్రతిధ్వని
**revere** పూజించు, గౌరవించు, సత్కరించు, మర్యాదచేయు
**reverence** పూజ్యభావం, భక్తి, శ్రద్ధ, మర్యాద, ఆదరణ
***reverend*** పూజ్యుడు, మాన్యుడు

**reverent** భక్తిగౌరవాలున్న
**reverie** మనఃపరిభ్రమణం, పగటికల, ధ్యానం, చింతన, పరధ్యానం
**to be lost in reverie** గాలిమేడలు కట్టు, కల్పనాలోకంలో విహరించు
**revering** పూజ్య
**reversal** విపర్యయం, వ్యతిరేకం
**reverse** *n* వ్యతిరేకం, కష్టం, విపత్తు; ఓటమి పరాజయం *v* వెనక్కు మరలించు, తలకిందులు చేయు, రద్దుచేయు, తగ్గించు
**reverse arms** (సైనిక మర్యాదలో) గౌరవించు
**reversed block** విపర్యస్త ప్రతిరూపం
**reversible** తలకిందులు చేయదగ్గ, తిప్పివేయదగ్గ, పరివర్తనీయ
**reversion** ఉత్తరభోగాధికారం, భవిష్యత్తులో ఆస్తి సంక్రమించే హక్కు; విపర్యయం, పదవి తగ్గింపు, వాపసు
**reversioner** ఉత్తరభోగాధికారి/వారసు
**revert** తిరిగి సంక్రమించు, పూర్వావస్థలోకి వచ్చు, మరలు, మొదటిమార్గంలో పంపు
**review** *n* పునరాలోచన, పునర్విమర్శ, సమీక్ష, పునరవలోకనం, పునస్సమీక్ష; నియతకాలిక పత్రిక *v* అవలోకించు, సమాలోచించు, సమీపించు; ద్విగుణీకృతం చేయు, పునరాలోచించు, సింహావలోకనం చేయు
**court of review** పునర్విచారణ న్యాయాలయం
**revile** తిట్టు, దూషించు, ధిక్కరించు
**revise** సవరించు, సరిదిద్దు, పరిష్కరించు, పునరీక్షించు, మార్చు
**revision** పునర్విమర్శ, పునశ్చరణ; పరిష్కరణ, దిద్దుబాటు, సవరణ
**revisit** పునర్దర్శనం; పునర్దర్శించు
**revitalize** కొత్త శక్తినింపు, నూతన చైతన్య మిచ్చు, తిరిగి ప్రాణం పోయు
**revival** పునరుద్ధరణ, పునరుజ్జీవనం
**revive/revivify** పునరుద్ధరించు, పునఃప్రచారం చేయు, తెలివిలోకి తెచ్చు, పునరుజ్జీవింపజేయు
**revocation** ఉపసంహరణ, ఖండన, రద్దు
**revolt** *n* విద్రోహం, తిరుగుబాటు, రాజద్రోహం *v* తిరగబడు, ఎదిరించు
**revolution** విప్లవం, పెద్దమార్పు; (పరి)భ్రమణం, కక్ష్యాభ్రమణం
**revolutionary** విప్లవాత్మక, విప్లవకారి; తిరిగే, పరిభ్రమించే; విప్లవకారుడు
**revolutionist** విప్లవవాది
**revolve** (గుండ్రంగా) తిరుగు; తర్కించు
**revolver** రివాల్వర్
**revolving** చుట్టూ తిరిగే/తిరుగుతున్న, పరిభ్రమించే
**revolving fund** ఆవృతనిధి
**revulsion** ఘోర ప్రతిక్రియ; ఏహ్యభావం, అసహ్యం
**reward** బహుమతి, పారితోషికం, ప్రతిఫలం
**rewarding** ప్రతిఫలదాయక(ం)
**rewriting** పునారచన
**rhapsody** మహాకావ్యం; వాద్యసంగీతం
**rhetoric** అలంకారశాస్త్రం; వక్తృత్వం, వాక్పటిమ; సాహిత్యమీమాంస
**rhetorical** ఆలంకారిక
**rheumatic** వాతరోగి; తిమురువాతంగల
**rheumatism** కీళ్ళవాతం, వాతరోగం
**rhinocerous** ఖడ్గమృగం
**rhinorrhoea** ముక్కునుంచి నీళ్ళుకారటం
**rhomboid** సమచతుర్భుజాభాసం
**rhombus** సమచతుర్భుజం
**rhyme/rime** పద్యపాదాంత నియమం
**rhyme-word** ఊతపదం
**without rhyme or reason** అకారణంగా, అసందర్భంగా
**rhythm/cadence** లయ
**rythm, gallop** గుర్రపుదౌడులాంటి/వేగవంతమైన లయ
**rib** పక్క ఎముక, పర్శుక
**ribald** అశ్లీల, అహంకారి
**ribbon** నాడా
**rice** బియ్యం, వరి; అన్నం
**rice-husk** చిట్టు
**rich** సంపన్న, విలువైన, ఉత్తమ
**riches** సంపద, సమృద్ధి, ధనధాన్యాలు
**richly** సమృద్ధిగా, సర్వథా, శ్రేష్ఠంగా
***ricinus communis*** ఆముదం
**rickets** రికెట్సువ్యాధి
**rickety** బలహీనమైన
**rid** వదిలించుకొను, తొలగించు, దూరంచేయు, విముక్తం చేయు, తీర్చు
**riddle** సమస్య, గూఢార్థంగల మాట, కఠిన/గూఢ ప్రశ్న, రహస్యం
**ride** *n* సవారి, స్వారి *v* ఎక్కు, సవారి చేయు
**rider** అనుబంధాంశం; ఆరోహి



**ridge** శిఖరం, పర్వతశ్రేణి, గట్టు; వెన్నుపట్టె; మిట్ట, కటకం
**ridicule** *n* అపహాస్యం, గేలి, ఎగతాళి, వెక్కిరింత *v* అపహసించు, గేలిచేయు, వెక్కిరించు, ఎగతాళిచేయు
**ridiculous** హాస్యాస్పద, నవ్వుపుట్టించే
**riffraff** దుర్జనులు, నిమ్నవర్గం
**rifle** తుపాకి
**rift** (వి)భేదం
**rig** *n* ఆవాసం; ఉపకరణాలు, పరికరాలు; గుర్రబ్బండి; మోసం, బట్టలు *v* నిలుపు, తయారుచేయు; మోసగించు
**rig the election** అక్రమంగా ఎన్నిక కావటానికి ప్రయత్నించు
**rig the market** కృత్రిమంగా ధరలు పెంచు/తగ్గించు
**rigging** (ధరల) పెంపకం/తగ్గింపు
**right** *adj* సత్యం, న్యాయం, ధర్మం, హక్కు, స్వత్వం *n* కుడి, ఉచిత, తిన్నని, సరైన, క్రమ, న్యాయ(బద్ధ); తప్పని *v* సరిచేయు, సరిదిద్దు
**right angle** సమకోణం
**right arm** కుడిభుజం, కుడిచేయి
**right-hand man** దగ్గరివ్యక్తి, అతిసన్నిహితుడు, కుడిభుజం(లాంటివాడు)
**right of association** సభ/సంఘం పెట్టుకొనే హక్కు
**right-prism** సక్రమ పట్టకం
**right to secrecy** రహస్య గోపనాధికారం
**right track** సరైన దారి, సన్మార్గం
**right-wing** మితవాదపక్షం
**right wing organisation** మితవాద సంస్థ
**righteous** ధార్మిక, ధర్మపరాయణ, సదాచారి, న్యాయసంగత, నీతిమంతమైన
**righteousness** ధర్మబద్ధత, ధార్మికత
**rightful** ఉచిత, న్యాయసమ్మత (హక్కుగల)
**rigid** కఠిన, దృఢ, గట్టి, వంగని; ఖచ్చితమైన
**rigid dynamics** దృఢగతిశాస్త్రం
**rigidity** దృఢత్వం, గట్టితనం, కఠినత్వం, అనమ్యత
**rigmarole** అవాకులూ చెవాకులూ, అంతూపొంతూ లేని మాట
**rigorous** కఠిన, తీవ్ర; నిర్దుష్ట
**rigorous imprisonment** కఠినకారాగారశిక్ష
**rigour** తీవ్రత, ఉగ్రత, కాఠిన్యం, క్రూరత్వం; వణుకు
**rim** అంచు
**rinderpest/cattle plague** పశుమహమ్మారి
**ring** *n* వలయం, కంకణం, ఉంగరం, చక్రం; కట్ట; (గంట మొ.) ధ్వని *v* మోగు, మోగించు, వాయించు
**ring-finger** ఉంగరపు వేలు
**ring leader** ముఠానాయకుడు, దళనాయకుడు
**ring railway** వలయితమైన రైల్వే లైను
**ring road** చుట్టుబాట
**ring up** ఫోనులో మాట్లాడు
**ring-worm** తామర
**rinse** కడుగు, శుభ్రపరచు
**rinsing** గిలకరించటం
**riot** *n* దొమ్మీ, పోట్లాట, ఉపద్రవం *v* పోట్లాడు, కలహించు
**riotous assembly** దొమ్మీమూక (సమావేశం)
**run riot** విశృంఖలమగు
**rioting** దొమ్మీ
**riparian** నదీతీర సంబంధి; తీరస్థుడు
**ripe** పండిన, (పరి)పక్వ, సిద్ధ; ప్రౌఢ
**ripeness** పరిపక్వత
***riposte*** మెరుపుదాడి, తిరుగుదాడి
**ripple** చిన్న అల, చిరుతరంగం, లహరి
**rise** *n* ఉన్నతి, అభివృద్ధి, అభ్యుదయం; ఎగుడుభూమి, మిట్ట(నేల) *v* తలెత్తు, పెరుగు, ఉదయించు, అభివృద్ధి చెందు; తిరగబడు
**rise and fall** వృద్ధిక్షయాలు, హెచ్చుతగ్గులు
**rise from the ranks** సామాన్యస్థితినుంచి ఉచ్చదశకువచ్చు/అభివృద్ధిచెందు
**rise to the occasion** అవసరమైన స్థాయిని అందుకొను/ఎదుగు
**rising** *adj* పెరుగుతున్న *n* పెరుగుదల, వృద్ధి, తిరుగుబాటు
**rising market** పెరుగుతున్న ధరలు
**risk** *n* సంకటం, అపాయం, ప్రమాదం, హాని, విపత్తు *v* తెగించు, కష్టాల్లోపడు, విపత్తులోపెట్టు
**risky** అపాయకర, విపత్కర
**rista** నారిపురుగు
**rite(s)** విధులు; సంస్కారాలు
**ritual** *adj* శాస్త్ర/ఆచార సంబంధి *n* సంస్కారవిధి, మత నియమం, ఆచారం
**ritualism** కర్మకాండ
**rival** *n* ప్రతిస్పర్థి, ప్రతిద్వంద్వి, ప్రత్యర్థి, విరోధి *v* పోటీపడు, ఎదుర్కొను

**rival(opposition) paper** వైరిపత్రిక

**rivalry** స్పర్ధ, పోటీ

**rive** చించు, ముక్కలు ముక్కలు చేయు

**river** నది

**river basin** నదీ క్షేత్రం/పరివాహప్రాంతం

**river bed** నదీ(భూ)తలం

**river catchment** నదీపరివాహప్రాంతం

**river navigation** నదీనౌకాయానం

**river valley** నదీలోయ

**riverine** నదీతీరంలోని, నదీ (తీర) సంబంధి

**rivet** *n* మొల, మేకు, చీల; అతుకు *v* మొలకొట్టు, మేకుబందీచేయు, అతుకు, గట్టిపరచు

**rivulet** చిన్న నది, కాలువ, ఏరు

**road** రహదారి, బాట, దారి; (అమెరికాలో) రైలుమార్గం

**road-book** మార్గసూచక గ్రంథం

**road-metal** కంకర, గులక

**road-roller** మార్గనిర్మాణ సాధనం/యంత్రం

**road-sense** ప్రయాణనియమ జ్ఞానం

**roadstead** నావకు లంగరుదించే చోటు; బాట

**road transport** రోడ్డు రవాణా

**roadways** రోడ్డు మార్గాలు

**roadworthy** రోడ్డుపై ప్రయాణించదగ్గ

**roam** తిరుగు

**roar** *n* గర్జన, బొబ్బ (రింత) *v* గర్జించు, బొబ్బరించు, పెద్దగా అరుచు

**roast** వేపు, వేయించు, కాల్చు

**roaster** బట్టీ

**rob** లూటీచేయు, దొంగిలించు

**robber** (దోపిడీ) దొంగ

**robbery** వస్త్రం, (గౌరవసూచకమైన) నిడుపాటీ అంగీ/దుస్తు

**robot** స్వయం చలిత/చాలక యంత్రం

**robust** శక్తిపూర్ణ, ఆరోగ్యంగా ఉన్న, దృఢ, బలిష్ఠ

**rock** *n* శిల, పర్వతం, రాయి, బండ, శైలం *v* కదిలించు, ఊగు, ఊపు

**rock-bottom price** కనిష్ఠధర

**rock-crystal** స్ఫటికం

**rocket** *n* తారాజువ్వ, క్షిపణి *v* ఎగురు, విపరీతంగా పెరుగు

**rocketting prices** ఆకాశన్నంటిన/మిన్నంటిన ధరలు

**rod** కణిక, దండం, బెత్తం, కడ్డీ, లాఠీ

**rodent** ఎలుక, మూషికం

**rodomontade** గర్వోక్తి, బూకరింపు

**rogue** వంచకుడు, ధూర్తుడు, దుర్మార్గుడు

**role** పాత్ర, రూపం

**role play** పాత్ర ధారణ/పోషణ

**roll** *n* కట్ట, జాబితా; పట్టిక, చుట్ట; గర్జనధ్వని, హోరు *v* చుట్టు, గుండ్రంగా తిరుగు; దొర్లించు, దొర్లు, పొర్లు; గర్జించు

**roll call** హాజరు పట్టీ, మస్తరు

**roll of honour** మృతవీరుల జాబితా

**rolled** పరివేష్టిత

**rollick** హుషారుగా ఉండు, ప్రసన్నంగా ఉండు

**rolling stock** రైలు పెట్టెలు, ఇంజను వగైరా

**romance** కల్పితగాథ, ప్రణయకథ, అద్భుత కళాసాహిత్యం

**romanization** రోమకీకరణం

**romantic** కాల్పనిక

**romaticism** కాల్పనికత్వం, కాల్పనికవాదం

**roof** పైకప్పు

**room** గది, స్థానం, స్థలం, అవకాశం, అవసరం

**roost** *n* పిట్టలు కూర్చునే అడ్డుకొయ్య *v* విశ్రాంతి తీసుకొను

**rooster** కోడిపుంజు

**root** *n* ధాతువు, మూలం, వేరు, మూలకారణం, మూలపదం *v* నాటు (కొను), లోతుగా దించు

**root-bud** మూలకోరకం

**root cap** వేరు ఒర

**root hair** మూలకేసరం

**root inflection** ధాతువిభక్తి/క్రియావిభక్తి

**root knot** వేరుముడి

**root nodules** వేరు బుడిపెలు

**root, tooth** దంతమూలం

**rootlet** పిల్లవేరు

**rope** *n* తాడు, మోకు *v* కట్టు

**give one a long rope** అత్యధికావకాశమిచ్చు, ప్రతీక్షించు

**rope-ladder** తాటినిచ్చెన

**rope-walker** తాటిమీద నడిచేవ్యక్తి

**ropeways** తాటిదారులు, రజ్జుపథాలు

**rosary** జపమాల; గులాబీమడి

**rose** గులాబీ పువ్వు/మొక్క

**bed of roses** పూలపాన్పు, సుఖప్రదం

**roselle plant** సీమగోగు



**rosin/resin** రెజిన్, సర్జరసం

**roster** కర్తవ్యసూచి (ఉద్యోగ విధులూ పనిసమయాలూ సూచించే పట్టీ)

**rostrum** (ఉపన్యాస) వేదిక; (పక్షి) ముక్కు

**rosy** గులాబీ సంబంధి; ఎర్రని; ఆశాజనక, సుఖమయ

**rot** కుళ్ళు, కుళ్ళిపోవు, కుళ్ళబెట్టు

**rotary** చక్రంలా తిరిగే, పరిభ్రమించే

**rotary furnace** తిరిగే కొలిమి

**rotary machine** పరిభ్రామక యంత్రం

**rotate** చక్రంలా తిరుగు/పరిభ్రమించు

**rotation** భ్రమణం, ఆవర్తనం, పరివర్తనం; మార్పిడి, పరిభ్రమణం

**rotation method** ఆవర్తన/భ్రమణ పద్ధతి

**rotation of crops** పంటల మార్పిడి

**rote method** భట్టీయపద్ధతి

**rotten** మురిగిన, కుళ్ళిన

**rotund** వర్తులాకారం

**rough** *adj* అసమ, విషమ, కఠిన, కఠోర, అసభ్య; ముతక, దొడ్డు, గరుకు, కరుకు, చిత్తు, ఎగుడుదిగుడు *v* చిత్తురాయు; చిత్తుపథకం రూపొందించు; దాడిచేయు

**rough account** చిత్తు లెక్క/ఖాతా, అందాజా లెక్క

**rough and ready** పనిగడిపే

**rough and tumble** అస్తవ్యస్త

**rough calculation** చిత్తు/ఉజ్జాయింపు లెక్క

**rough draft** చిత్తు ముసాయిదా

**rough estimate** చిత్తు/బొటాబొటి అంచనా

**rough sea** కల్లోలసముద్రం, క్షుబ్దసాగరం

**rough weather** కల్లోల/తుఫాను వాతావరణం; ఇబ్బంది, సంకటం

**roughage** వినియోగంలేని పదార్థం

**round** *adj* గుండ్రని, గోళాకార *adv* గోళాకారంగా, గుండ్రంగా *n* వలయం *v* చుట్టుముట్టు, పూర్తిచేయు, గుండ్రబరచు, (గుండ్రంగా) తిరుగు

**rounded vowel** ఓష్ఠ్యాచ్చు

**round numbers** పూర్ణసంఖ్యలు

**round of ammunition** ఒక్కసారి వదిలే మందుగుండు

**round off** సరిచేయు, సువ్యవస్థితం చేయు

**round peg in square hole** అనుపయుక్త వస్తువు/వ్యక్తి

**round table conference** గుండ్రబల్ల సమావేశం

**round the clock** రోజంతా, దివారాత్రం, నిరంతరంగా, నిర్విరామంగా

**round-up** *n* నిర్బంధం *v* నిర్బంధించు

**roundup** (of the rest news) (మిగిలిన వార్త) సారాంశం

**round worm** ఏలికపాము

**rounding** ఓష్ఠీకరణం; వర్తులీకరణం, సరిపెట్టడం

**rouse** పురికొల్పు, ప్రేరేపించు, రెచ్చగొట్టు; కదిలించు, మేలుకొలుపు

**rousing reception** ఘనస్వాగతం

**rout** *n* పెద్ద ఓటమి; గడబిడ; (అల్లరి)మూక, గుంపు *v* పెరికివేయు, సమూలంగా కుళ్ళగించు

**route** మార్గం, దారి, దోవ

***en route*** మార్గంలో, దారిలో, పోతూపోతూ

**route-march** కవాతు

**routine** దినచర్య, నియమిత/క్రమబద్ధ చర్య; వాడుక

**routine matter** దైనందిన కార్యక్రమం, రోజువారీ పని/వ్యవహారం

**roving** తిరిగే, పర్యటక, పరిభ్రమించే, సంచరిస్తున్న

**roving ambassador** సంచార రాయబారి

**row** *n* (అడ్డ)వరస, పంక్తి; అల్లరి, కలకలం, ఉపద్రవం *v* పడవ నడుపు

**rowdy** పోకిరీ, గూండా

***roxburgia buccata*** వెర్రి వేప

**royal** రాజసంబంధి, రాజసంగల, గొప్ప

**royal decree** రాజాజ్ఞ, రాజాదేశం

**royal entourage** రాజపరివారం

**royalties** ప్రత్యేక సుంకం; యాజమాన్య ప్రతిఫలం

**royalty** రాజత్వం; యాజమాన్యహక్కు

**rub** *n* కష్టం, విభేదం *v* తుడిచివేయు, తోము, రాయు, దాచుకొను

**rub shoulder** స్నేహంగా ఉండు, రోజూ కలుసుకొను

**rub the wrong way** వెక్కిరించు, రెచ్చగొట్టు

**rubar** ఎర్రబడటం, కందటం

**rubberneck** కుతూహలి

**rubberneck bus** యాంత్రిక వాహనం

**rubbish** చెత్త, దుమ్మూ దూగరా, రద్దీ; పనికిమాలిన చెత్త; నిరర్థక ప్రసంగం

**rube** ఘర్షణధ్వని, రాపిడిచప్పుడు

**rube facient** చర్మాన్ని కందేట్లుచేసే పదార్థం
**rube plural** పుపుసపటల ధ్వని
**rubric term** శీర్షికాప్రాయ/భిన్నరూపక పదం/పారిభాషికం
**ruby** కెంపు
**rudder** చుక్కాని; నిర్దేశక సిద్ధాంతం
**ruddy** ఎర్రని
**rude** అసభ్య, అనాగరక, మొరటు, మోటు
**rudiment(s)** మూలాంగాలు; ప్రాథమిక విషయాలు
**rudimentary** ప్రాథమిక, మౌలిక
**rue** విచారించు, దుఃఖించు
**ruffian** ఆకతాయి, గూండా, దుష్టుడు
**ruffle** *n* గడబిడ, వ్యాకులత; కుచ్చెల *v* గడబిడ చేయు, వ్యాకుల పెట్టు; ముడతలు పెట్టు, కుచ్చెళ్ళు సవరించు (కొను); అసంతుష్టి కల్పించు
**rugae** మడత, ముడత
**rugged** గరుకైన, మిట్టపల్లాలున్న; విషమ, కఠిన
**ruin** *n* వినాశం, ధ్వంసం; శిథిలం *v* నాశ(న)ం చేయు, ధ్వంసం చేయు
**ruinous** వినాశకం, అనర్థక, నష్టకారి
**ruins** శిథిలాలు
**rule** *n* నియమం, సూత్రం, నిబంధన, సిద్ధాంతం, రీతి, రివాజు; వ్యవస్థ, వ్యవహారవిధి, శాసనం, (న్యాయ) పరిపాలన, అధికారం, ప్రభుత్వం *v* రాజ్యంచేయు, పాలించు; నిర్ణయించు; ప్రభావితంచేయు
**as a rule** సాధారణంగా, నియతంగా
***rule nisi*** ఉత్తరువును ఎందుకు ఖాయం చేయగూడదో చెప్పమనే న్యాయస్థాన నిర్ణయం
**rule of fair play** సదాచరణ నియమం/సూత్రం
**rule of law** (సమ)న్యాయ (పరి)పాలన, న్యాయశాస్త్ర నియమం, న్యాయాధిక్యం
**rule of procedure** విధాననియమం
**rule of thumb** అనుభవ (సిద్ధ)నియమం, మొరటు పద్ధతి
**rule out** కాదను, రద్దుచేయు
**rules and regulations** నియమనిబంధనలు
**rules of the road** రోడ్డు/ప్రయాణ నిబంధనలు
**ruler** పాలకుడు; రూళ్ళకర్ర
**ruling** నిర్ణయం, ఆదేశం, తీర్పు, తీర్మానం
**rum** *adj* విచిత్ర, విలక్షణ *n* రమ్(సారాయం)
**rumble** *n* గర్జన, ఉరుములాంటి ధ్వని *v* ఉరుము, గర్జించు, ఫెళఫెళమను
**rumble-tumble** విషమగతి
**ruminant** నెమరువేసే జంతువు
**ruminate** నెమరువేయు; ఆలోచించు, ధ్యానించు, పర్యాలోచించు
**rummage** *n* గవేషణ, సమగ్ర పరిశోధన *v* వెతుకు, అన్వేషించు, శోధించు
**rumour** *n* పుకారు, వదంతి *v* పుకారు లేపు/పుట్టించు
**rump** దిబ్బ
**rumple** ముడత; ముడతలు పడజేయు; తలకిందులు చేయు
**rumpus** కోలాహలం, గడబిడ, గల్లంతు, ఉపద్రవం
**run** *n* పరుగు *v* పరిగెత్తు, నడిపించు, ప్రవహించు
**run across** హఠాత్తుగా దొరుకు/దొరికించుకొను
**run after** వెంటపడు
**run against** పోటీ చేయు
**run amuck** పిచ్చెత్తిపోవు
**run away (from)** పారిపోవు; విడిచిపెట్టు, పరుగుతీయు
**run away (with)** దొంగిలించుకొని/లేవదీసుకొని పోవు
**run down** *adj* అనారోగ్యకర, బలహీన, దుర్బల *v* నిందించు, అపఖ్యాతిపాలు చేయు; తగ్గిపోవు
**run into** అలవాటుపడు, విస్తరించు
**run into debt** రుణగ్రస్తుడగు, అప్పుల్లో పడు
**run into heavy weather** కష్టాలపాలగు
**run off** బహిస్సరణం, ప్రవాహవేగం
**run over** పార్లిపారు; పరీక్షించు
**run riot** అదుపు తప్పు; దుబారా చేయు
**run the show** కథ నడిపించు
**run through** (ఆస్తిని) త్వరగా హరించు/వ్యయించు
**the daily run** దినచర్య
**runiform** వర్ణసదృశ
**runner** పరిగెత్తే/నడిపే వ్యక్తి; వాటాల దళారీ
**runner-up** రెండోస్థానం పొందినవ్యక్తి, ద్వితీయుడు
**running** పరిగెత్తుతున్న; నిరంతర, చాలూ, నడుస్తున్న
**running account** నడుస్తున్న/చాలూ ఖాతా
**running commentary** ప్రత్యక్షవ్యాఖ్యానం
**running days** (నడిచే)రోజులు
**running staff** (నడిపే) సిబ్బంది



**running story** ప్రవాహివార్త
**runway** ధావన పథం
**rupture** *n* పగులు, వేర్పాటు; విభేదం, కలహం *v* పగులు; కలహించు, విభేదించు, వేరుపడు
**rupture, tubal** వాహికావిదారం
**rupture, uterine** గర్భాశయపు చీలిక
**rural** గ్రామీణ, గ్రామ్య
**rural broadcast** గ్రామీణ ప్రసారం
**rural development** గ్రామాభివృద్ధి, గ్రామీణాభివృద్ధి
**rural uplift** గ్రామోద్ధరణ, గ్రామాభ్యుదయం
**ruse** సాకు, ఎత్తు, తంత్రం, ఉపాయం
**rush** *n* రద్దీ, వేగం, ఆధిక్యం; ప్రవాహం *v* పరిగెత్తు, దాడిచేయు
**rush into print** త్వరపడి ప్రచురించు
**rush work** తొందరపని
**rust** *n* తుప్పు *v* తుప్పుపట్టు
**rust proof** తుప్పుపట్టని
**rust resistant variety** తుప్పులేని రకం
**rust tolerant variety** తుప్పుపట్టని రకం
**rustic** గ్రామీణ; పల్లెటూరి మనిషి; అసభ్య/అనాగరక వ్యక్తి/విషయం
**rusticate** (సంస్థ నుంచి) వెళ్ళగొట్టు/తొలగించు
**rustle** మర్మరధ్వని
**rusty** తుప్పుపట్టిన

## S

**s.e.a.t.o (south east asia treaty organisation)** ఆగ్నేయాసియా ఒప్పందం దేశాలు
**s.o.s.** వెంటనే సహాయమందించమనే సూచన
**sabbath** విశ్రాంతి రోజు; ఆదివారం
**sable** శోకపూరిత; నల్లని
**sabotage** *n* వెన్నుపోటు, విద్రోహం, విధ్వంసక చర్య *v* వెన్నుపోటు పొడుచు, విధ్వంసంచేయు, నష్టపరచు, పనిచెడగొట్టు
***saboteur*** విధ్వంసకుడు, విధ్వంసం
**sabre** పట్టాకత్తి, కరవాలం
**sabre rattling** పోరాటపు బెదిరింపు, యుద్ధ ప్రసంగం
**sac** తిత్తి
**sac, dental** పంటి తిత్తి
**sacculus** సంచిలాగుండే
**sacerdotal** పౌరోహిత్య సంబంధి
**sacerdotalism** పౌరోహిత్యం
***sachharum officinarum*** చెరకు
**sack** *n* గోనె, గోతాం; తొలగింపు; దోపిడీ *v* తీసివేయు, తొలగించు; లూటీచేయు, దోచుకొను
**sackcloth** ముతకగుడ్డ; శోకసూచకవేషం
**sacrament** సంస్కారం, ధార్మికానుష్ఠానం; యజ్ఞం; శపథం, ప్రతిజ్ఞ
**sacramental** సాంస్కారిక, పవిత్ర
**sacramental marriage** సాంస్కారిక వివాహం
**sacred** పవిత్ర, పావన, పుణ్య, ధార్మిక, పూజ్య; అనతిక్రమణీయ
**sacrifice** *n* బలి (హోమం/దానం), యజ్ఞం, త్యాగం; బలి ఇచ్చు, త్యాగం చేయు; నష్టపడు
**sacrilege** *n* దైవదూషణం, పుణ్యదూషణం, ధర్మోల్లంఘన, అపవిత్ర కర్మ/శబ్దం; అవమానం *v* అపవిత్రం చేయు, దేవతలను దూషించు, ధర్మోల్లంఘనం చేయు
**sacrosanct** పవిత్ర, అనుల్లంఘనీయ
**sacrum** త్రికాస్థి, ముడి ఎముక
**sad** దుఃఖదాయక, అశుభ
**saddle** గుర్రపుజీను
**in the saddle** పదవిలో, అధికారంలో
**sadism** హింసాప్రేమ, పరపీడన కాముకత
**safe** *adj* భద్ర, సురక్షిత *n* మందసం, ఇనప్పెట్టె
**safe conduct** మార్గరక్షణ, రక్షణపత్రం; క్షేమకర/రక్షిత ప్రయాణం
**safe-period** సురక్షిత/సురక్షా కాలం
**safeguard** *n* రక్షణ, కాపు(దల) *v* రక్షించు, కాపాడు
**safety** సురక్షత, భద్రత, క్షేమం
**public safety** సమాజ/ప్రజా భద్రత
**safety lamp** భద్రదీపం
**saffron** కాషాయవర్ణం; కేసరి; కుంకుమపువ్వు
**sag** *n* తక్కువ, (ధరల)తగ్గుదల *v* లొంగు, తగ్గు; (ధరలు)పడిపోవు
**sagging the market** అంగడిని/వ్యాపారాన్ని పడగొట్టడం
***saga*** వీరగాథ
**sagacious** వివేకంగల; సూక్ష్మగ్రాహి
**sage** *adj* వివేకంగల, జ్ఞానంగల *n* రుషి, ముని, విజ్ఞాని
**Sagitta** వజ్రాయుధం

**stubborn** మొండిపట్టుగల, హఠంగల, మూర్ఖ
***stucco*** పాలగచ్చు, సున్నం
**stud** గుండీ, బొత్తాము; గుబ్బమేకు; లాయం
**stud bull** ఆబోతు
**stud farm** పశుజనన శాల/క్షేత్రం
**stud horse** దాటించటానికివాడే జాతిగుర్రం
**student** విద్యార్థి, శిష్యుడు
**student teacher** ఛాత్రోపాధ్యాయుడు, శిక్షణార్థి
**studies** చదువు, అధ్యయనం, పరిశీలన
***studio*** చిత్రశాల
**studious** శ్రద్ధాళు, విద్యలో ఆసక్తిగల
**study** *n* చదువు, అధ్యయనం, ఆలోచన, పరిశీలన, ధ్యానం; పఠనగృహం *v* చదువు, అధ్యయనం చేయు, శోధించు, ఆలోచించు, ధ్యానించు
**a study of a head** అంచనా
**study for the ear** న్యాయశాస్త్రం
**study skill** అధ్యయన నైపుణ్యం
**study tour** విజ్ఞానయాత్ర
**stuff** *n* పదార్థం, వస్తువు, సామగ్రి, పనికిరాని ద్రవ్యం *v* నింపు, కూరు, కుక్కు, బొక్కు
**stultify** వ్యర్థం చేయు, నిరర్థకం చేయు, మూర్ఖుని/బుద్ధిహీనుని చేయు
**stumble** తొట్రుపడు, తట్టుకొని నడుచు, తడబాటు పడు; తప్పు/పొరపాటు చేయు
**stumbling block** అడ్డంకి, ఆటంకం, అటకాయింపు
**stump** మొండి, మొద్దు, మోడు
**stump oratory** వ్యాఖ్యానం
**stumpy** మోడైన
**stun** ఆశ్చర్యపడు, చకితమగు, నిర్భ్రాంతపోవు, స్మృతితప్పించు, రిమ్మెత్తించు
**stunt** *n* వింతచర్య, తమాషా, మోసప్పని, ఎత్తు(గడ) *v* అడ్డగించు, ఎదగనీకుండు, గిడసబారు
**stupefy** అచేతనం చేయు, స్తబ్ధుని చేయు, సొమ్మసిల/స్మృతితప్ప జేయు
**stupendous** బ్రహ్మాండమైన, ఆశ్చర్యజనక, విభ్రమకారి, అద్భుత, మహనీయ
**stupid** మూఢుడు, మందబుద్ధి, జడ, తెలివిలేని
**stupidity** మూఢత్వం, మూర్ఖత్వం, జడత్వం, మాంద్యం
**stupor** మత్తు, మైకం, మూర్ఛ, జడత్వం, బుద్ధి జాడ్యం, స్తబ్ధత
**sturdy** దృఢ, బలిష్ఠ, శక్తిశాలి
**stuttering** నత్తి
**stye** కంటికురుపు
**style** *n* శైలి, రీతి, విధం, ఫక్కి, పద్ధతి, వైఖరి; పేరు, వ్యవహారనామం; కీలం, కాడ, గంటంవంటి సాధనం *v* పిలుచు, పేరుపెట్టు
**stylistics** శైలీశాస్త్రం
**stylograph** లిఖితరూపం
**styptic** రక్తస్తంభకి
**suave** నమ్ర, సౌమ్య, సరస, మనోజ్ఞ, రమ్య, మధురభాషి
**sub** ఉప
**sub-agent** ఉపప్రతినిధి
**sub-committee** ఉపసంఘం
**sub-conjunctival** కంటి పైపొరలోని
**sub-continent** ఉపఖండం
**sub-culture** ఉపసంస్కృతి
**sub-dialect** ఉపమాండలికం
**sub-division** ఉపవిభాగం
**sub-editor** ఉపసంపాదకుడు
**sub-field** ఉపక్షేత్రం
**sub-group** ఉపసమూహం
**sub-marginal standard of living** నికృష్ట జీవనప్రమాణం
**sub-marine** *n* సముద్రతలం కింది, జలాంతర్గత *v* జలాంతర్గామి
**sub-mortgage** మారు తాకట్టు
**sub-mountainous** పర్వతభూమి, కొండచరియ, లోయ
**sub-ordinate** *adj* కింది, తక్కువైన, అధీన, అప్రధాన, ద్వితీయ, గౌణ, ఆనుషంగిక, సహాయక, పార్శ్వక *v* అధీనమగు, ఆధారపడు, వశంలోకి తెచ్చుకొను
**sub-phonemic** సవర్ణ
**sub-soil** భూమి కిందిపొర
**sub-soil drain** నేలఅడుగున ఉండే కాలవ
**sub-soil water** భూమి అడుగు నీరు
**sub-tropical** ఉపోష్ణమండల
**sub-unit** ఉపప్రమాణం
**subbing** ఉపసంపాదకత్వం
**subcutaneous** చర్మంలోకిచ్చే
**subdue** జయించు, అణుచు, లోబరచుకొను, నీచంగా చూచు
**subdued colour** తేలిక/తక్కువ రంగు



**subdued effect** తక్కువ ప్రభావం
**subdued light** మందకాంతి, తక్కువ వెలుతురు
**suberosa** చిలకదుద్దుగు
**subject** *adj* అధీన, లోబడిన *n* (=informant, interviewee) వ్యవహర్త, సూచకుడు, సమాచార సంధాత, విషయం, కర్త, కారణం, కథావిషయం, వాక్యప్రసంగం; పౌరుడు *v* జయించు, వశపరచుకొను, ఆధారం కల్పించు
**subject formation** రూపసిద్ధి
**subject heading** విషయశీర్షిక
**subject matter** విషయం, అంశం
**subject matter expert** విషయ (సామగ్రి) నిపుణుడు
**subject term** విషయ పదం, కర్తృపదం
**subject to consent** అనుమతి ఉంటే/ఉన్నప్పుడు
**subjective** వ్యక్తిగత, ఆత్మగత, ఆత్మాశ్రయ, మనసులోని; కర్తృ సంబంధి/బోధక
**subjective test** విషయాత్మక పరీక్ష/నికష
**subjectivism** విషయవిజ్ఞానవాదం
**subjectivity** నైజవాదం; ఆత్మాశ్రయత; వస్తునిష్ఠత
**subjects** పాలితులు, పౌరులు
***sub judice*** న్యాయాధీన, కోర్టు విచారణలో ఉన్న
**subjugate** లోబరచుకొను, జయించు, వశపరచుకొను
**subjunctive** సంభావనార్థక
**subletting** తిరిగి అద్దెకివ్వటం, కిరాయిదారు మరొకరికి కిరాయి కివ్వటం
**sublimate** *adj* మహనీయ, మహోత్కృష్ట, ఉత్తుంగ *n* ఉత్పతనం చెందటం, భావోత్కృష్టత *v* పరిష్కృతం/పరిశుభ్రం చేయు, బాగుపరచు, పవిత్రీకరించు
**sublimation** ఉదాత్తత; ఉత్పతనం; ఉదాత్తీకరణం
**sublime** ఉదాత్త, లోకోత్తర, మహనీయ, శుద్ధ
**sublime indiference** పరిపూర్ణోదాసీనత, వైరాగ్యం
**sublingual** నాలుకకింది, అధోజిహ్వ
**submember** న్యూనఖండం
**submerge** మునుగు/ముంచు
**submersible** నిమజ్జక(ం)
**subminimal** కనిష్ఠకల్ప
**submission** దాఖలు, నివేదన, వినతి, విన్నపం, అధీనత, సమర్పణ, ఆజ్ఞానుకూలత, లొంగుబాటు, లోబడి ఉండటం, విధేయత
**submissive** అణకువగల, లొంగిన, నమ్ర, విధేయ
**submit** లోబడు, నివేదించు, దాఖలుచేయు, ఆజ్ఞ పాలించు, ఇచ్చు, అధీనం చేయు
**submultiple** ఉపగుణిజం
**submuscular** కండరాలకింది
**subnormal** ఉపలంబం; మామూలుకన్నా తక్కువ
**subordinate** *adj* అప్రధాన, గౌణ, కింది, అధీన, తక్కువైన, ఆనుషంగిక, సహాయక, పార్శ్వక *v* అధీనమగు, ఆధారపడు, వశంలోకి తీసుకొను
**subordination** అప్రధానత, పరతంత్రత
**suborn** తప్పు(డు) సాక్ష్యం చెప్పించు/సంపాదించు; నేరానికి పురికొల్పు
**subpoena** నియంత్రణ, హాజరుకాకపోతే శిక్షిస్తామని న్యాయస్థానం సాక్షికి పంపే ఉత్తరువు
**subrogation** రుణదాత మార్పు
**subsale** మారు అమ్మకం
**subscribe** అంగీకరించు, స్వీకరించు; సంతకం చేయు; చందా వేయు, ఒప్పందలతో వాటాకోరు
**subscribe to some view** ఒక అభిప్రాయంతో ఏకీభవించు
**subscriber** చందాదారు; సమర్థకుడు
**subscription** చందా; అవనిర్దేశం; విరాళం (చెల్లింపు)
**subsection** ఉపపరిచ్ఛేదం
**subsequent** తదుపరి, తరువాయి, దరిమిలా, అనంతర, వెనకటి, అనువర్తి
**subsequently** ఆతరవాత, ఆమీదట, అనువర్తిగా
**subservience** పరాధీనత, దాసోహమనటం, లోబడిపోవటం, స్వాధీనత
**subset** ఉపసముదాయం
**subside** మందగించు, శాంతించు, ఉపశమించు, తగ్గు
**subsidence** అవతరణ, నిమజ్జనం
**subsidiary** సహాయక, అధీన
**subsidiary industry** ఉప/సహాయక/ఆశ్రిత/ఆధారిత పరిశ్రమ
**subsidize** ఆర్థిక సహాయం చేయు
**subsidy** ఆర్థిక సహాయం
**subsist** జీవించు, బతుకు, ఉండు, నిర్వహించు
**subsistence** జీవనోపాధి, బతుకు తెరువు, జీవిక, జీవనాధారం, భృతి, సహాయం, మనుగడ, భరణం, ఆలంబం, మనోవృత్తి, చెలామణి
**subsistence allowance** జీవనభృతి
**substance** సారం, సారాంశం; ద్రవ్యం, పదార్థం

**a man of substance** ధనవంతుడు, గుణవంతుడు, బలవంతుడు, పండితుడు
**substandard** అప్రామాణిక
**substantial** సారవంతమైన, బలమైన, గట్టి, దృఢ, ధనం గల, వాస్తవ
**substantially** ప్రధానంగా, గట్టిగా
**substantiate** దృఢపరచు, ప్రమాణీకరించు, నిరూపించు, రూఢిపరచు, సరిచూచు
**substantive** సంజ్ఞ, విశేష్యం
**substantive agreement** ఖాయమైన ఒప్పందం
**substantive law** సిద్ధాంత న్యాయశాస్త్రం, వాస్తవిక/హక్కులునిర్ణయించే న్యాయశాస్త్ర (విభాగం)
**substantive rank** స్థిరమైన పదవి
**substantive real world** సంజ్ఞాత్మక వాస్తవ ప్రపంచం
**substantive structure** విషయాత్మక/ ద్రవ్యాత్మక నిర్మాణం
**substitute** *n* బదులు/ప్రత్యామ్నాయ వ్యక్తి; ప్రతిక్షేపం, ఉపసర్జనం *v* బదులుగా ఇచ్చు, మారుగా పెట్టు, పూర్తిచేయు, ప్రత్యామ్నాయం చూపు
**substituted** బదులుగా నిలిచిన/నిల్పిన, ప్రత్యామ్నాయమైన
**substitution** బదులు, ప్రత్యామ్నాయం, ప్రతిక్షేపణం, ఉపసర్జనత్వం
**substratum** అధఃస్తరం
**subsystem** ఉపవ్యవస్థ
**subtangent** ఉపస్పర్శరేఖ
**subtend** మధ్యకోణం ఏర్పడటం
**subterfuge** మోసం, కపటం, సాకు, నెపం, మిష
**subterranean** భూగర్భ
**subtle** సూక్ష్మ; కుటిల, చతుర, కపట, జిత్తులమారి
**subtract** తీసివేయు, తగ్గించు; వ్యవకలనం చేయు
**subtraction** వ్యవకలనం, తీసివేత, తగ్గింపు
**subtrahend** వ్యవకలితం
**sub-tropical** ఉపోష్ణమండల(ం)
**subungulate** ఉపఖురిత (జంతువులు)
**suburb** ఉపనగరం, శివారు, పొలిమేరలోని స్థలం, నగరపరిసరం, పట్టణభాగమైన పేట
**suburban train** ఉపనగరానికి పోయే రైలు(బండి)
**subvention** (ప్రభుత్వ) ఆర్థిక సహాయం
**subversion** కూలదోయటం, విద్రోహం
**subversive** కూలదోసే, విధ్వంసక, విద్రోహి
**subversive activity** విద్రోహచర్య
**subvert** నష్టపరచు, పాడుచేయు
**succeed** తరువాత వచ్చు, ఉత్తరాధికారి అగు, అధికారానికి వచ్చు, అనుసరించు వచ్చు, సఫలమగు, ఫలించు, జయించు, సాధించు
**success** (వి)జయం, సఫలత, సిద్ధి
**nothing succeeds like success** నడిచినంత వరకే బండి, అదేపనిగా విజయం సాధించటం
**succession** ఉత్తరాధికారం, వారసత్వం, అనుక్రమం, పారంపర్యం, వరస
**second in the succession** ఉత్తరాధికారంలో ద్వితీయస్థానం
**succession certificate** ఉత్తరాధికార (ధ్రువ) పత్రం
**successive** వరసగా వచ్చే, క్రమాగత, అనుయాయి, అనుక్రమిక
**successor** వారసు, ఉత్తరాధికారి
**succinct** సంగ్రహ, సంక్షిప్త
**succour** *n* సహాయం, మద్దతు, రక్ష *v* సహాయం చేయు, రక్షించు, మద్దతిచ్చు
**succumb** లోబడు, ఓడిపోవు, వశమగు; చనిపోవు
**such** అటువంటి, ఆప్రకారమైన, అదే
**suck** తాగు, పీల్చు, చనుగుడుచు; లాభం తీయు
**suck dry** పూర్తిగా పీల్చు, పీల్చి ఖాళీ చేయు
**suckers** పిలకమొక్క(లు)
**sucking** చనుబాలివ్వటం, చనుగుడపటం
**suction** పీల్చు, తాగటం
**suction pump** నీళ్ళుతోడే యంత్రం, ఘటయంత్రం
**sudden** ఆకస్మిక, హఠాత్, తక్షణం, వెంటనే
**sue** దావా/వ్యాజ్యం వేయు, ప్రార్థించు, ఆర్థించు, కోరు, వేడు
**suffer** సహించు, భరించు, అనుభవించు, కష్టపడు, అనుమతించు
**sufferance** ఉపేక్షితాంగీకారం, సహనపూర్వకాంగీకృతి, ఓర్మి
**sufferer** బాధితుడు, బాధితురాలు
**suffering** బాధ, యాతన, కష్టం, వేదన, దుః ఖం, సహనం
**suffice** చాలు, సరిపోవు; సంతృప్తిపరచు
**sufficient** చాలినంత, తగినంత, సరిపోయినంత



**suffix** (పర)ప్రత్యయం, కిత్తు, మాటచివర చేర్చిన పదభాగం
**suffocate** గొంతు పట్టుకొను, ఊపిరాడకుండ చేయు, అణచిపెట్టు
**suffrage** ఎన్నికహక్కు, వోటు హక్కు
**adult suffrage** వయోజన వోటు హక్కు
**universal suffrage** సార్వజనిక వోటు హక్కు
**suffragette** వోటు హక్కుకోసం ఆందోళనచేసే స్త్రీ
**suffragist** వోటు హక్కుకోసం పోరాడే స్త్రీ
**suffuse** నింపు, ముంచెత్తు
**sugar** చక్కెర, శర్కర, పంచదార
**sugar candy** పటికబెల్లం
**sugar cane** చెరకు
**sugar mill** పంచదార కర్మాగారం
**suggest** సూచించు, సంకేతించు, చూపు, సలహా ఇచ్చు
**suggestibility** సూచనీయత
***suggestio falsi*** తప్పుడు సూచన
**suggestion** సూచన, సంకేతనం, ఆలోచన, సలహా
**suggestive** సూచక, సూచిత, సంకేతక, సంకేతిత
**suicidal** ఆత్మ నాశక/ఘాతుక
**suicide** ఆత్మహత్య
**commit political suicide** రాజకీయంగా ఆత్మహత్యచేసుకొను
**race suicide** జాతి (వి)నాశం
**suit** *n* దావా, అభియోగం, వ్యాజ్యం; దుస్తులు *v* తగు, సరిపోవు, అనుకూలించు
**law suit** దావా, వ్యాజ్యం
**suitability** అనుకూలత, అనురూపత, యోగ్యత, ఉచితత్వం, సరిపడటం
**suitable** అనుకూల, యోగ్య, ఉచిత, తగిన, సరిపడ్డ
**suite** పరివారం, పరిచారకులు; వరస, పంక్తి, పరంపర
**suitor** కక్షదారు
**sulcus** ఖనితాలు, గాడులు
**sulky** ఒంటరి, విచారగ్రస్త; రుసరుసలాడే, కొరకొరలాడే, చిరచిరలాడే
**sullage** మురికినీరు
**sullen** ఉద్విగ్న, అప్రసన్న, విషాదమయ
**sully** మాపు, మరకచేయు, కలుషితం/అపవిత్రం చేయు, కళంకం తెచ్చు
**sulphur** గంధకం
**sulphuric acid** గంధకికామ్లం
**sulphur kiln** గంధకం బట్టీ
**sultry** ఉక్కబోసే, ఉష్ణంగా ఉన్న, చిరచిరమనే
**sum** (సంకలన) రాశి, సమూహం, మొత్తం, వెరశి, సారాంశం, భావం, ఆశయం; పరిమాణం, తూనిక, కొలత; డబ్బు
**sum and substance** సారాంశం, తాత్పర్యం, సంగ్రహం
**summing up** సారాంశం, సంక్షేపం, ఉపసంహారం
**sum total** పూర్తి మొత్తం
**sum up** సంక్షేపించి/సారాంశం చెప్పు
**summability** సంకలనీయత
**summarily** సంక్షిప్తంగా, శీఘ్రంగా
**summarization** సారాంశీకరణ/సంక్షేపణం
**summary** *adj* శీఘ్ర, సంగ్రహ, సంక్షిప్త *n* సారాంశం, సంక్షేపం, భావం, సంగ్రహం, సారం
**summary lead** సారాంశ పరిచయం
**summary trial** శీఘ్ర/సంక్షిప్త విచారణ
**summation** సంకలనం (చేయటం)
**summative** సంకలిత
**summative evaluation** సంకలిత మూల్యాంకనం
**summer** వేసవి, ఎండకాలం
**summer-house** చలివేంద్రం
**summer school** వేసవి పాఠశాల; ఒంటిపూట బడి
**summer solstice** ఉత్తరాయణం
**summit** శిఖరం, చరమదశ, పరాకాష్ఠ, ఔన్నత్యం, కొన
**at the summit of power** అధికారశిఖరంలో
**summon** పిలుచు, పిలిపించు, ఆజ్ఞాపించు, సమావేశపరచు
**summons** సమను, తాకీదు, ఫర్మానా, నోటీసు, ఆజ్ఞాపత్రిక
***summum bonum*** గొప్ప మేలు, ముఖ్యలాభం
**sumptuary** అతివ్యయం నియంత్రించే
**sumptuous** పరిపూర్ణ, దివ్య, సుఖప్రద, విలువైన
**sun** సూర్యుడు
**make hay while the sun shines** దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకొను
**sun-bath** ఆతపస్నానం
**sunburnt** ఎండకు మాడిన
**sunflower** పొద్దుతిరుగుడు/సూర్యకాంతం పువ్వు
**sunstroke** ఎండదెబ్బ, వడదెబ్బ
**sun worship** సూర్యారాధన, సూర్యనమస్కారం, రవి పూజ

**take the sun** ఎండలో కూర్చొను
**under the sun** ప్రపంచంలో, భూమ్మీద
**sunder** వేరు చేయు, విభజించు
**sundial** సూర్యఘంట, నీడగడియారం
**sundries** చిల్లర వస్తువులు
**sundry** వివిధ, చిల్లర
**sundry assets** చిల్లర ఆస్తులు
**sunlight** సూర్యరశ్మి
**sunny side** అధికపక్షం
**sunrays** సూర్యకిరణాలు
**sunshine** సూర్యరశ్మి/సుఖశాంతులు
***suo motu*** స్వయంగా, స్వబుద్ధితో
**super** ఉత్తమ, అతీత, ఉపరి
**super-ego** అధ్యహం (భావం), ఉపరిబోధాత్మ
**super-fine** అతి నాజూకు/సున్నితమైన, మేలైన
**supernatural** అతీత, అసహజ, ప్రకృతిబాహ్య, లోకాతీత
**super position** ఉపరిస్థాపనం
**super power computer** అత్యంత శక్తిశాలి గణకయంత్రం
**super saturated** అతిసంతృప్త
**super-state** అధిరాజ్యం
**superannuation** వయసుచెల్లటం, వార్ధక్యం
**superb** దివ్య, మహనీయ, శ్రేష్ఠ
**supercilious** గర్వం/అహంకారం గల, అసహ్య
**superficial** పైపై, బాహ్య, లోతులేని, సారహీన
**superfluous** అత్యధిక, అనవసర
**superheated** అధికంగా వేడిచేసిన
**superhuman** మానవాతీత, అధిమానవ
**superimpose** పైనుంచి విధించిన, అధ్యారోపిత
**superimposition** అధ్యారోపణ
**superintend** అజమాయిషీ చేయు, పర్యవేక్షించు, పై విచారణ చేయు
**superintendence** పర్యవేక్షణ, పై విచారణ, అజమాయిషీ
**superintendent** పర్యవేక్షకుడు, విచారణకర్త
**superior** *adj* ఊర్ధ్వ, మేలైన *n* పై అధికారి
**superiority** అధిక్యం
**superlative** అత్యుత్తమ, సర్వోత్తమ
**supernaturalism** లోకాతీతవాదం
**supernovae** నవ్యోజ్వల తారలు
**supernumerary** సంఖ్యాధిక, నియమిత/నిర్ణీత సంఖ్యకు మించిన, అవసరానికి మించిన

**superscription** అధినిర్దేశం
**supersede** రద్దుచేయు, మార్పుచేయు, కొట్టివేయు, స్వాధీనం చేసుకొను
**supersonic** ధ్వనివేగాధిక, అతిధ్వానిక
**supersonic jet** అతిధ్వానిక విమానం
**supersonics** అతిధ్వానిక శాస్త్రం
**superstition** మూఢవిశ్వాసం, గుడ్డినమ్మకం, పొరపాటు అభిప్రాయం, భ్రమ
**superstratum** ఊర్ధ్వస్తరం, పై పొర
**supertax** పన్నుపై పన్ను, అదనపు పన్ను
**supervise** పర్యవేక్షించు, అజమాయిషీచేయు, తనిఖీచేయు
**supervised study method** పర్యవేక్షితాధ్యయన పద్ధతి
**supervision** తనిఖీ, పర్యవేక్షణ, అజమాయిషీ
**supervision evaluation** పర్యవేక్షణ మూల్యాంకనం
**supervisor** పర్యవేక్షకుడు, తనిఖీదారు
**supervisory body** పర్యవేక్షక సమితి, తనిఖీ సంఘం
**supination** ఉత్తానసం
**supine** ఉత్తాన; ఉదాసీన, సోమరి, మందమైన; వెల్లకిల పడి ఉన్న
**supplement** *n* అనుబంధం, పూరకం, అదనం *v* అదనంగా చేర్చు, కలుపు, (లోప) పూరణం చేయు
**supplemental** అనుబంధ, పరిపూర్తికోసం చేర్చిన
**supplementary** ఆనుషంగిక, అనుబంధ, పరిపూరక, అదనపు, చేర్చిన
**supplementary question** అనుబంధ ప్రశ్న
**suppletion** సర్వాదేశం
**suppliant** ప్రార్థించే, నివేదించే, వేడుకొనే, కోరే
**suppliers** సరఫరాదారులు
**supply** *n* సరఫరా, సామాను, సరుకు, సంచయం *v* ఇచ్చు, సరఫరా చేయు, లోపాలు పూరించు, అందించు
**short supply** కొరత, సరఫరా సరిగా లేకపోవటం
**supply and demand** ఉత్పత్తిగిరాకీలు, సరఫరా గిరాకీలు
**supply base** సహాయకాశ్రయం, ఆధారస్థలం, ఉపాధికారకం, పోషణాధారం
**support** *n* ఆధారం, ఆలంబనం, మోత, ఊత(ం), ఆశ్రయం, ఉపాధి, సమర్థన *v* సాయపడు, పోషించు, భరించు, బలపరచు, పాలించు



**supporting system** ఆధార/సహాయక వ్యవస్థ
**suppose** ఊహించు, అనుకొను; ఒకవేళ, అనుకో
**supposed** కల్పిత, భావిత, ఆరోపిత, ఊహించిన, అనుకొన్న
**supposition** కల్పన, ఊహ, అనుమానం, అంచనా; మాట వరస
**suppress** అణగదొక్కు, అణచి వేయు/పెట్టు, నొక్కు, పైకి రానీకుండు, తగ్గించు
**suppression** తగ్గింపు, అణచివేత, నిరోధం
**suppressive** నిరోధక, అణచివేసే
**suppuration** చీము పట్టడం
**suprasegmental** అధ్యాంశిక
**supremacy** సర్వాధికారం, పూర్ణాధిపత్యం, సర్వోన్నతి; ప్రభుత్వం
**supreme** సర్వోన్నత, సర్వోచ్చ, సర్వాధికారి, సర్వోత్కృష్ట
**supreme commander** సర్వసేనాధిపతి
**supreme court** సర్వోచ్చన్యాయస్థానం
**supreme duty** అంతిమ/పవిత్ర కర్తవ్యం
**supreme soviet** సోవియట్ పార్లమెంటు
**supreme spirit** పరబ్రహ్మ(ం)
**surcharge** *n* అదనపు/అధిక పన్ను, అతిభారం *v* అదనంగా/అధికంగా పన్ను వడ్డించు
**surd** పరుషం, శ్వాసధ్వని; కరణి
**sure** నిశ్చిత, సురక్షిత, దృఢ, నమ్మకం గల, ఖాయం/ఖచ్చితం అయిన
**a sure shot** గురికాడు
**make sure of** ఖాయపరచు (కొను)
**sure-footed** తొణకని, జారని; జాగరూక
**surety** జామీను(దారు), పూచీ(కత్తు), ప్రాతిభావ్యం, హామీ, నమ్మకం
**surface** *adj* పై, ఉపరితలంలోని *n* ఉపరి భాగం/తలం, పైభాగం
**surface cover** ఉపరితలాచ్ఛాదనం
**surface faulting** ఉపరితలభ్రంశనం
**surface flow** ఉపరితల ప్రవాహం
**surface grammar** వ్యక్త వ్యాకరణం
**surface run off** ఉపరితల ప్రవాహం/నిస్సరణ
**surface tension** ఉపరితల తన్యత
**surfeit** *n* ఆధిక్యం, అతిపానం, అతిభోజనం, అధికమొత్తం; మాంద్యం *v* అతిగా/అధికంగా పెట్టు/తినిపించు/తిను
**surge** *n* అల, తరంగం, ప్రవాహం; ఆవేగం

*v* ఎగయు, పెంపొందించు, అలలా కదులు, పైకీ కిందకీ కదలు
**surgeon** శస్త్ర వైద్యుడు/చికిత్సకుడు
**surgery** శస్త్ర వైద్యం/చికిత్స
**surgical** శస్త్రచికిత్సాసంబంధి
**surly** చిరచిరలాడే
**surmise** *n* అనుమానం, భావన, ఊహ *v* అనుమానించు, భావించు, ఊహించు, కల్పించు, అనుకొను
**surmount** అధిరోహించు, అధిగమించు, ఎక్కు, పైకి లేచు, ఉత్తీర్ణమగు
**surpass** అతిశయించు, అతిక్రమించు, మించు
**surplus** మిగులు; అధికం, శేషం, అదనం
**surplus budget** మిగులు బడ్జెట్
**surplus state** మిగులు రాష్ట్రం
**surprise** *n* ఆశ్చర్యం, విస్మయం *v* ఆశ్చర్యపడు, చకితుడగు
**surrealism** అధివాస్తవికత
**surrender** *n* సమర్పణ, పరాజయం, లొంగుబాటు, వదులుకోలు *v* ఓడిపోవు, లొంగిపోవు, వదులుకొను, శరణుకోరు
**surrender value** వదులుకున్న విలువ
**surrogate** మారు వ్యవహర్త; ప్రతినిధి
**surroundings** పరిసరాలు, చుట్టుపక్కలు
**surveillance** అవేక్షణం, నిరూపణం, నిఘా
**survey** సర్వేక్షణ, పరీక్షణ, భూమికొలత
**survival** అవశిష్ట (రూపం)
**survivals** పరిశిష్టులు, అవశిష్టులు
**survive** (మరొకరి తరువాత) జీవించి ఉండు
**surviver** శేషజీవి
**survivorship** అనంతరజీవిత్వం
**susceptibility** వివశత, గ్రహణశక్తి; మార్పుకు ఎడమివ్వటం
**suspend** తాత్కాలికంగా తొలగించు; వేలాడు, వేలాడదీయు
**suspended interest** నిరుద్ధాభిరుచి
**suspension** తాత్కాలికంగా తొలగింపు/నిలుపుదల; అవలంబనం
**sustain** ధరించు, భరించు, సహించు, రక్షించు
**sustainable** పాలనీయ, భరణీయ, నిర్వహణీయ, ధారణీయ, సహనీయ, రక్షణీయ
**suture** కుట్టు, కుట్టడం, సూదనం
**suzerainity** ఆధిపత్యం

**swab** (శుభ్రపరచటానికి వాడే) పత్తిమూట
**swallow** మింగు, కబళించు; తీసివేయు
**swamp** *n* బురద/చిత్తడి నేల *v* నీటిలో ముంచు, బురదలో దింపు, నీటితో నింపు; నిరుత్తరుని చేయు
**swamps** బురద/చిత్తడి నేలలు
**swan-song** హంసగానం; కడపటి పని
**swarm** *n* సమూహం, గుంపు *v* గుమిగూడు, మూగు
**swarthy** శ్యామలవర్ణంగల, నల్లని
**swashbuckler** కలహశీలి, యోధుడు
**swashing blow** గాయం, దెబ్బ; దెప్పి పొడుపు
**sway** *n* డోలనం, ఊగిసలాట; అధికారం, శాసనం, రాజ్యం, ప్రభావం, ఆజ్ఞ *v* తిప్పు, ఊగు, ఊగిసలాడు
**swear** ఒట్టుపెట్టుకొను, ప్రమాణం చేయు
**swearing-in** ప్రమాణస్వీకారం
**sweat** *n* చెమట, స్వేదం; పరిశ్రమ, పాటు *v* చెమర్చు, చెమటలు కక్కు
**sweated labour** కష్టించి పనిచేసే వ్యక్తి, కష్టజీవి, శ్రామికుడు, చెమటోడ్చే పని
**sweat glands** స్వేదగ్రంథులు
**sweater** స్వేదకం; చలితొడుగు, చలిబనీను; శ్రమజీవి
**sweating** చెమట పట్టడం, స్వేదనం
**sweatpore** స్వేదరంధ్రం
**sweep** *n* ఊడ్పు, తుడుపు; విస్తీర్ణం *v* ఊడ్చు, తుడుచు, చిమ్ము, తీసుకొనిపోవు, కొట్టివేయు
**sweeping** ఊడ్పు, తుడుపు, విస్తృత, వ్యాపక
**sweeping statement** (సాధారణీకృత) కథనం
**sweet** *adj* తియ్యని, మధుర, మనోజ్ఞ, మనోహర, సుందర *n* తీపి, మధురత్వం, తియ్యదనం; మిఠాయి
**sweetmeat** తీపి వస్తువు, మిఠాయి
**sweet potato** చిలగడదుంప, గెనుసుగడ్డ
**swell** *n* వాపు, పెంపు, పొంగు *v* అలలుగా లేచు, పొంగు, ఉబ్బు, ఉప్పొంగు
**swelling** వాపు, పొంగు
**swelter** *n* ఉమ్మరం, ఉక్క *v* చెమటోడ్చు, సొమ్మసిల్లు
**swerve** *n* చలనం, పథభ్రష్టత *v* చెదరు, చలించు, దారితప్పు
**swift** వేగం/వడి గల, తీవ్ర
**swim** ఈత, ఈదు
**in the swim** తెలివిడిలో
**swim with the tide** ప్రవాహానికి అనుగుణంగా/కాలానుగుణంగా పోవు/నడుచు
**swindle** *n* కపటం, మోసం, వంచన, పితలాటకం *v* దగా చేయు, మోసగించు, వంచించు
**swindler** వంచకుడు, దగాకోరు
**swine** పంది; తుచ్ఛుడు
**swing** *n* ఊపు, ఊగటం; ఊయల *v* ఊగులాడు, అల్లాడు
**swing bridge** ఊగే వంతెన
**swing shift editor** సంధి(/మధ్య)సమయ సంపాదకుడు
**switch** *n* మీట; చువ్వ *v* బాదు, కొట్టు, మారు; మొదలుపెట్టు
**switch board** మీటబల్ల
**swoon** *n* మూర్ఛ, సొమ్మ *v* సొమ్మసిల్లు, మూర్ఛిల్లు
**swoop** *n* ఆక్రమణ, ఆకస్మిక దాడి *v* అకస్మాత్తుగా ఆక్రమించు, తటాలున తన్నుకొనిపోవు
**sycophancy** ముఖస్తుతి, చాటువు; వ్యక్తిపూజ
**sycophant** చాటుకారుడు, భజనపరుడు, వ్యక్తిపూజకుడు
**syllabary** వర్ణ/అక్షర సమామ్నాయం
**syllabation** అక్షర విభజన
**syllable** అక్షరం; వర్ణం, పదాంశం
**syllabus** పాఠ్య క్రమం/ప్రణాళిక, విషయ సంగ్రహం/ప్రణాళిక
**syllogism** న్యాయ ప్రయోగం, త్రిపాద తర్కవాదం
**symbiosis** సహజీవనం
**symbiotic** సహజీవి
**symbiotic activity** సహజీవి చైతన్యం
**symbiotic nothingness** సహజీవనశూన్యత
**symbol** సంకేతం, చిహ్నం, ప్రతీక, లాంఛనం, గుర్తు, లక్షణం
**symbolic/symbolical** ప్రతీకాత్మక, సాంకేతిక, లాంఛనప్రాయ
**symbolically** సాంకేతికంగా, ప్రతీకాత్మకంగా, లాంఛనప్రాయంగా
**symbolisation** ప్రతీకీకరణం, సంకేతనం
**symbolism** ప్రతీకాత్మకత
**symbology** సంకేతశాస్త్రం
**symmetric** సుష్ఠు, సౌష్ఠవ యుత/పూర్వక
**symmetrical** సుష్ఠు



**symmetry** సౌష్ఠవం, అనురూపత, సమానత, సమత
**sympathiser** సానుభూతిపరుడు, సమర్థకుడు
**sympathize** సానుభూతి చూపు, కనికరించు, దయచూపు
**sympathy** సానుభూతి, కనికరం, దయ
**sympathetic strike** సానుభూతి సమ్మె
**symphony** స్వర/వర్ణ సమ్మేళనం
**symposium** సదస్సు, గోష్ఠి, సమ్మేళనం; చర్చావేదిక; ఏకవిషయకగోష్ఠి
**symptom** లక్షణం, చిహ్నం, సూచన
**symptomatology** రోగలక్షణ శాస్త్రం
**synaeresis** సంకోచం
**synandrium** సంయుక్త కేసరావళి
**syncarpous ovary** సంయుక్తాండాశయం
**synchronic** ఏకకాలిక
**synchronisation** సమకాలీకరణం
**synchronise** ఏకకాలంలో జరుపు, కలిసి జరుగు
**synchroniser** సమకాలీకరణి
**synchronous** సమకాలిక
**syncopation** మధ్యధ్వనిలోప కరణం/భవనం
**syncope** మధ్యధ్వని లోపం; మూర్ఛ
**syncretism** చారిత్రక (సం)మేళనం
**syndesis** సమన్వయనం
**syndicalism** శ్రామిక సంఘవాదం
**syndicate** వాణిజ్య సంఘం/సమితి; (విశ్వ విద్యాలయ) కార్యనిర్వాహక మండలి; సభ, సంస్థ
**syndrome** సంలక్షణం, లక్షణసంపుటి
**synergism** యోగవాహకం
**synergy** యోగవాహకత
**syngenesis** సంయుక్త పరాగకోశాలు
**synod** మతవిషయకసభ, ధర్మసభ; గ్రహ సంయోగం
**synonym** సమానార్థక (పద)ం; పర్యాయపదం, సమానపదం
**synonymous** సమానార్థక
**synonymously** సమానార్థకంగా
**synonymy** సమానార్థకత, పర్యాయపదత్వం
**synopsis** సారసంగ్రహం, సారాంశం
**synoptic** సంక్షిప్త, సార భూత/రూపి
**syntactic** కారక సంబంధి; క్రమబద్ధ
**syntactic structure** సంశ్లేషణాత్మక నిర్మాణం
**syntagmatic** విన్యాసక్రమాత్మక
**syntagme** విన్యాసక్రమాంశం
**syntax** కారకం; వాక్య రచన/నిర్మాణం; వాక్య లక్షణం, శబ్దక్రమం
**synthesis** సంశ్లేషణ(ం), సంయోగం, సమన్వయం, కలపటం
**synthetic** కృత్రిమ, సంశ్లిష్ట, నకిలీ, సమన్విత
**synthetic method** సంశ్లేషణ పద్ధతి
**synthetic rock** కృత్రిమ శిల
**syphilis** ఫిరంగిరోగం, సవాయిరోగం
**syphon** అంకుశనాళి
**syringe** పిచికారీ
**syrup** పా(న)కం, షర్బత్తు
**system** పద్ధతి, విధానం, ప్రణాళిక, వ్యవస్థ, ప్రకారం, పంథా, సంప్రదాయం, రివాజు
**mountain system** పర్వతవ్యవస్థ
**railway system** రైల్వే వ్యవస్థ
**system, alimentary** జీర్ణాశయం, జీర్ణకోశం
**system, reproductive** జననావయవాలు
**system, respiratory** శ్వాసకోశాలు
**system software** వ్యవస్థా మృదుసామగ్రి
**systematic** క్రమ (బద్ధ), క్రమానుగుణ, పద్ధతి ప్రకారం ఉండే/నడిచే
**systematics** వర్గీకరణశాస్త్రం
**systematise** వ్యవస్థీకరించు
**systematization** వ్యవస్థీకరణం, క్రమబద్ధీకరణం, వ్యవస్థాపనం
**systemic** దైహిక
**systemic manner** క్రమబద్ధ పద్ధతి
**systems approach** వ్యవస్థా మార్గం/ప్రదేశనం
**systole** హృదయ ముకుళనం
***syzygium ambslanum*** నేరేడు, గిన్ని

# t

**tab** చివర, కొన, కొస; టేపు; నిఘా
**keep tab on** ఒక కన్నువేసి ఉంచు, కనిపెట్టి ఉండు, నిఘాలో ఉంచు
**table** *n* (మేజా) బల్ల; జాబితా, (కాలంవారీ) పట్టిక, పట్టీ, సారణి; వరస, క్రమం *v* బల్లపై ఉంచు, (సభ) ముందుంచు; ఎదటపడు
**table napkin** చే(తి)గుడ్డ
**table spoon** పెద్ద చెంచా
**table-talk** పుక్కిటి పురాణం; భోజనసమయ ప్రసంగం
**table-tennis** టేబిల్-టెన్నిస్ (పూర్వం పింగ్‌పాంగ్)
**turn the tables** పాచిక వేయు, పరిస్థితిని మార్చు
***tableau*** అద్భుతదృశ్యం; చిత్రం, నాటకం

**tableau curtain** పెద్ద తెర
**tablet** మాత్ర, గుళిక, (మందు) బిళ్ళ; చిన్న ఫలకం
**tabloid** చిన్నసైజు పత్రిక/వస్తువు; మందుబిళ్ళ, మాత్ర
**tabloid paper** ఫలకాభపత్రిక
***taboo(/tabu)*** *n* నిషిద్ధ (పద)ం, నిషేధం; వెలి, బహిష్కారం *v* నిషేధించు, వెలివేయు
**tabular** చదునైన, సమతల; సారణి/పట్టికా రూపి
**tabular form** వరస పట్టీ రూపం
**tabulate** పట్టిక రాయు, పట్టికాబద్ధంచేయు, పట్టీ తయారుచేయు
**taccavi loans** తక్కావీ రుణాలు
**tacheometer** టాకీ మాపకం
**tachycordia** గుండె వేగంగా కొట్టుకోవటం
**tachygraphy** శీఘ్రలేఖనం
**tachypnoea** వేగంగా ఊపిరి పీల్చటం
**tacit** మౌన, అనుక్త, అధ్వనిత, ప్రకటించని, చెప్పని, ఊహ్య, లుప్త, భావించిన
**tacit acceptance** మౌనస్వీకృతి, మౌనాంగీకారం, అనుక్త స్వీకృతి
**tacit consent** మౌనసమ్మతి
**tacit spectator** మౌననిరీక్షకుడు
**taciturn** మితభాషి, అల్పభాషి
**tack** *n* పదునైన మొనగల మేకు; జోడింపు *v* అంటించు, తగిలించు, జతచేయు; సూది గుచ్చు
**tack-on** అతికింపు
**tacking** జోడింపు/అనుబంధీకరణం; టీకావేయటం
**tackle** *n* పడవ/ఆట సామగ్రి; బరువులెత్తే యంత్ర సాధనం *v* పట్టుకొని నిలుపు, సంబాళించు, స్వాధీనంలోకి తెచ్చు; ఎదిరించి పోరాడు
**tact** నేర్పు, ఉపాయం, యుక్తి, చాతుర్యం, సామర్థ్యం
**tactical** చతుర, సమర్థ, నేర్పుగల; యుద్ధకుశల, వ్యూహరచనా సంబంధి
**tactical air force** వ్యూహాత్మక వైమానికదళం
**tactical handling** నేర్పుతో నిర్వహించటం
**tactical importance** వ్యూహాత్మక ప్రాధాన్యం
**tactical reconnaissance** (శత్రుభూభాగంలో) వ్యూహరచనాన్వేషణ
**tactician** (యుద్ధకళా) నిపుణుడు, చతురుడు, నేర్పరి
**tactics** యుక్తులు, ఎత్తుగడ, తంత్రం, వ్యూహరచన, ఉపాయం; విన్యాసశాస్త్రం

**tactile** స్పర్శసంబంధి
**tactual** స్పర్శశక్తి
**tadpole** తోకకప్ప
**taenia** బద్దెపురుగు
**taeniacide** బద్దెపురుగు(ను చంపే)మందు
**tag** పొన్ను, కలయిక; కలుపు, గుదిగుచ్చు
***tagetos erecta*** సూర్యకాంతం
**tagmeme** ప్రత్యయాంశం
**tail** *n* తోక, వెనుకభాగం, కొన, బొరుసు; పరిమితస్వామ్యం *v* వెంటనంటు; వెంటపడు, తోక తగిలించు
**tail-end** అంతిమభాగం, చివరిభాగం, కొన
**tailor** దర్జీ (వాడు), కుట్రపువాడు
**tailoring** దర్జీపని, కుట్రప్పని
**taint** *n* కళంకం, దోషం, అపకీర్తి, కుళ్ళు *v* పాడుచేయు, కళంకితం చేయు
**tainted goods** అంటరాని సరుకులు/సామగ్రి
**take** *n* ఒక ఆవృత్తిలో వచ్చిన సమాచారం; పరిగ్రహం *v* తీసుకొను, పట్టుకొను, తెలుసుకొను
**take after** కనిపించు; అనుకరించు, నటించు
**take effect** మొదలుపెట్టు, ప్రారంభించు
**take exception** తప్పుపట్టు, ఆక్షేపించు
**take for granted** ఒప్పుకొను, సమ్మతించు; తప్పదని అంగీకరించు
**take from** తీసుకొనిపోవు; తగ్గించు
**take in** మోసగించు, లోనికి తెచ్చు; ఒప్పుకొను, అర్థం చేసుకొను, తీసుకొను
**take off** దిగు, పోవు, తగ్గించు, తొలగించు; పైకెగురు; చంపు; మొదలుపెట్టు
**take-off stage of economy** ఆర్థికవ్యవస్థ ప్లవనదశ
**take one at his word** చెప్పినమాట విశ్వసించు
**take over** (అధికారం) తీసుకొను, స్వాయత్తం చేసుకొను
**take the initiative** చొరవ తీసుకొను
**take to** మొదలుపెట్టు; వినోదించు
**take up the bill** చిత్తుచట్టంచేయు, తీర్మానించు; వినిమయపత్రం చెల్లించు
**take up the cudgels** వ్యతిరేకించు, ధిక్కరించు
**take up with** వెంట ఉండు/తీసుకొనిపోవు; స్నేహంచేయు
**talc** పౌడరు, (అలంకారార్థంవాడే) చూర్ణం/పొడి
**tale** కథ, వృత్తాంతం; శాల్తీలవారీ లెక్క



**tale bearer** గుసగుసలాడే వ్యక్తి
**talent** ప్రతిభ, ప్రజ్ఞ, ధీశక్తి, బుద్ధిశక్తి
**talent money** పారితోషికం, బహుమానం
**talent test** ప్రతిభాన్వేషణ నికష/పరీక్ష
**talented** ధీ/బుద్ధి శక్తిగల, ప్రతిభావంతుడైన, ప్రజ్ఞాశీలి
**talipes** సొట్టపాదం
**talisman** తాయెత్తు, రక్షరేకు
**talk** *n* మాట, సంభాషణ, ప్రసంగం *v* మాట్లాడు, ముచ్చటించు, ప్రసంగించు
**small talk** వ్యర్థసంభాషణ
**talk big** గొప్పగా/గంధరగోళంగా మాట్లాడు
**talk down** నోరుమూయించు; మొహం దించుకొను
**talk out** మాటలతో కాలక్షేపంచేయు, చర్చలతో అడ్డగించు
**talk person round** తనవైపు తిప్పుకొను, నచ్చజెప్పు
**talk round** సూటిగా మాట్లాడు
**talk turkey** ఖచ్చితంగా మాట్లాడు
**tall talk** బడాయి మాట(లు)
**talkie** టాకీ, మాటలున్న సినిమా
**tall** పెద్ద, పొడుగైన, ఎత్తయిన
**tall order** భారీ ఆజ్ఞ
**tallow** కొవ్వు
**tally** *n* ఖాతా, జమాఖర్చుల పుస్తకం *v* జమా ఖర్చులు సరిచూచు
**talus** పాదంలోని ఎముక
**tamarind** చింత(పండు)
**tame** *adj* మచ్చికపడ్డ, సాధువైన *v* మచ్చికచేయు, లొంగదీయు
**tamper** అక్రమంగా దిద్దు, తిరగ దీయు/రాయు, చెడగొట్టు, జోక్యంచేసుకొను; సాక్ష్యం మార్చు, సాక్షికి లంచమిచ్చు
**tampering** దిద్దటం, చెరచటం, చెడగొట్టడం, సవరించటం, తిరగరాయటం, సాక్ష్యం మార్చటం
**tangent** స్పర్శరేఖ
**got off a tangent** గతి/ప్రసంగం మార్చు/మార్చు
**tangential** స్పర్శరేఖా(సంబంధి)
**tangible** స్పర్శనీయ, దృశ్య, వాస్తవిక, గ్రాహ్య, స్పష్ట, దృష్ట, నిశ్చిత
**tangible result** స్పష్ట/వాస్తవిక ఫలితం, ప్రత్యక్షఫలం

**tangle** *n* జగడం/తగాదా; చిక్కు *v* జగడమాడు, చిక్కుపెట్టు, వలలో పట్టుకొను/ఇరికించు
**tank** చెరువు, తొట్టి, గుంట, తటాకం; (సైన్యంలో) సాయుధశకటం, టాంకు
**tanker** ద్రవపదార్థాల రవాణాసాధనం, టాంకర్, వాహకం
**tanner** చర్మకారుడు
**tannery** తోళ్ళగోదాం, చర్మకారశాల
**tantalise** ఇష్టభంగంచేయు, ఆశపెట్టి బాధించు/పీడించు
**tantamount** సమాన, తుల్య, సదృశ, సరైన
**tantrum** అల్లరి
**tantrum-temper** పెంకెతనం
**tap** *n* కుళాయి; చిటిక, దెబ్బ, తాడనం *v* తట్టు, మెల్లగా కొట్టు; (కార్చటానికి) బెజ్జంచేయు; వినియోగించు
**tape** *n* నాడా, కొలిచే బద్దీ/రిబ్బను/సాధనం *v* కొలుచు, (టేపుతో) కట్టు/బంధించు
**tape-drive** పట్టికా/బంధనీ చోదకం
**taper** *n* చిన్న మైనపుకత్తి; కత్తిరింపు, పత్రింపు *v* క్రమంగా సన్నగిల జేయు, పత్రించు
**tapestry** చిత్రయవనిక, పరదాగుడ్డ, అల్లికపని చేసిన జాలరు; వాలాంగి పని
**tape-worm** బద్దెపురుగు, ఏలికపాము
**tapping** వాయించటం, తట్టడం, మీటడం
**taproot** తల్లివేరు
**tar** *n* తారు/డాంబరు *v* తారు/డాంబరు పూయు
**tar well** తారు తొట్టి
**tardy** అలస, మందగమనంగల, మెల్లని
**tare** తారం/పడికట్టు
**target** లక్ష్యం, ధ్యేయం, గురిచుక్క; చిన్నడాలు
**target area** లక్ష్య/లక్షిత ప్రదేశం
**target population** లక్షిత(జన)సంఖ్య
**tariff** సుంకాల/ధరల పట్టిక/సూచిక; పన్నుల విధానం
**preferential tariff** రాయితీగల సుంకం
**tariff reform** శుల్క సంస్కరణ
**tarnish** మాపు, మెరుపు పోగొట్టు, కాంతి తగ్గు/తగ్గించు, అశుభ్రం చేయు, మలినపరచు
**tarpaulin** కీలుగుడ్డ
**tarry** ఆగు, ఆలపించు, ఆలస్యంచేయు
**tarsel** చీలమండకు సంబంధించిన
**tarsus** చీలమండ

**tartar** పళ్ళపాచి; తార్తారు జాతి
**task** *n* కార్య(భార)ం, (మూల)విధి *v* శ్రమపెట్టు, పనిపెట్టు; బరువువేయు
**take to task** బాధించు, పనిభారం (విపరీతంగా) పెంచు
**task force** ప్రత్యేక తాత్కాలిక సైనికదళం
**task master** పనిరాబట్టుకొనే వ్యక్తి, సంపీడకుడు
**task wage** పనినిబట్టి (ఇచ్చే)కూలి
**task work** ప్రత్యేక కార్యం
**taste** రుచి, అభిరుచి; రుచిచూచు
**man of taste** మంచి అభిరుచిగలవ్యక్తి
**taste-bud(s)** రుచి బుడిపె(లు); స్వాదాంకురం, రసాంకురాలు
**tasteful** రుచికర, రుచ్య; నాగరక
**tattle** వదరు, వాగు; (రహస్యం) బయటపెట్టు
**tattoo** పచ్చ (బొట్టు); సైనికుల కవాతు
**taunt** *n* ఎత్తిపొడుపు/ఆక్షేపణ, నింద *v* వ్యంగ్యంగా మాట్లాడు, అధిక్షేపించు, నిందించు
**taurus** వృషభం (రాశి)
**tautology** పునరుక్తి, చర్విత చర్వణం
**tautophony** ధ్వన్యావృత్తి, ధ్వనిపునరుక్తి
**tavern** పానశాల; (ప్రయాణికుల) వసతిగృహం; పాకశాల
**tawrdy** డాబయిన, చౌకబారు
**tax** *n* పన్ను, సుంకం, శుల్కం, కరం *v* పన్ను విధించు/నిర్ధరించు
**tax, calling** వృత్తిపన్ను
**tax, capitation** తల(సరి)పన్ను
**tax collector** పన్ను వసూలుదారు
**tax dodger/tax evader** పన్ను ఎగవేసేవ్యక్తి
**tax dodging, tax evasion** పన్ను ఎగవేత
**tax-free** పన్ను లేని/వినా
**tax payer** పన్ను చెల్లింపుదారు
**taxable** పన్నువేయదగ్గ
**taxable wealth** పన్ను విధించదగ్గ ఆస్తి
**taxation** పన్ను విధింపు; పన్నుల విధానం
**taxeme** నిర్మాణాంశ విన్యాసం
**taxi** బాడుగ కారు
**taxis** సమన్వయం
**taxonomy** వర్గీకరణ శాస్త్రం; విభజన విధానం
**tea** తేనీరు, తేయాకు
**storm in tea cup** టీ కప్పులో తుపాను; చిన్న విషయానికి పెద్దతగాదా
**tea-chest** తేయాకుడబ్బా
**tea estate** తేయాకు తోటలు
**tea garden** తేయాకు తోట
**tea party** తేనీటి విందు
**tea picking** తేయాకు గిల్లటం
**tea plantation** తేయాకు తోట
**teach** బోధించు, నేర్పు, అధ్యాపనం చేయు
**teacher** ఉపాధ్యాయుడు, బోధకుడు, అధ్యాపకుడు, గురువు
**teacher-educator** ఉపాధ్యాయాధ్యాపకుడు, బోధకుడు, శిక్షకుడు
**teacher's hand book** అధ్యాపకదర్శని
**teacher-trainee** ఛాత్రోపాధ్యాయుడు, శిక్షణార్థి
**teacher trainer** ప్రశిక్షకుడు
**teaching** బోధన
**teaching aid** బోధనోపకరణం
**teaching assessment battery (TAB)** బోధన పరిగణన పట్టిక
**teaching competence** బోధనసామర్థ్యం
**teak** టేకు, తేకు
**team** బృందం, జట్టు, గుంపు, దళం, సముదాయం
**team teaching** బృందబోధన
**team work** సంఘటితశ్రమ, కలిసికట్టు పని
**tear** *n* కన్నీటిబొట్టు; విచారం *v* కన్నీరు కార్చు; చించు, చీరు
**tear gas** బాష్పవాయువు
**tear glands** బాష్పగ్రంథులు
**tearing** చించే, చీల్చే, విడదీసే, పగలగొట్టే
**tears** కన్నీళ్ళు
**tease** వేధించు, విసిగించు, పీడించు, బాధించు
**teaser** వేధకం; చిక్కుప్రశ్న, కఠినసమస్య; వేధించేవ్యక్తి
**teaser intro** వేధింపు పరిచయం
**technic** సాంకేతికత
**technical** సాంకేతిక, పారిభాషిక
**technical aid/assistance** సాంకేతిక సహాయం
**technical challenge** సాంకేతికమైన సవాలు
**technical committee** సాంకేతిక సంఘం
**technical constraint** సాంకేతిక నిరోధం
**technical education** సాంకేతికవిద్య
**technical error** సాంకేతిక లోపం/దోషం
**technical mission** సాంకేతిక సంఘం/కర్తవ్యం
**technical module** సాంకేతిక పర్విక/సంక్రమం



**technical terms** సాంకేతిక/పారిభాషిక పదజాలం/పదాలు
**technicality** సాంకేతికత్వం, పారిభాషికత
**technician** సాంకేతికనిపుణుడు
**technicolour** పంచరంగులు(న్న), కిమ్మీర
**technicolour film** పంచరంగుల చిత్రం
**technique** సాంకేతిక పరిజ్ఞానం/విద్యామర్మం; (సం) విజ్ఞానం
**techno-economic survey** సాంకేతికార్థిక సర్వేక్షణ/అన్వేషణ
**technological** సాంకేతిక విజ్ఞాన సంబంధి
**technological lag** సాంకేతిక విలంబన
**technologies** సాంకేతిక విధానాలు
**technology** సాంకేతిక శాస్త్రం/విజ్ఞానం
**tedious** విసుగుపుట్టించే, ఎంతకూ అంతంకాని, దుర్భర
**teeming** అసంఖ్యాక
**teen age** 13-19 సంవత్సరాల (మధ్య) వయస్సు
**teeth** పళ్ళు, దంతాలు
**teeth, canine** కోరపళ్ళు
**teeth, decadent** పుచ్చు/పుప్పి పళ్ళు
**teeth, incisor** కత్తెరపళ్ళు
**teeth, milk** పాలపళ్ళు
**teeth, molar** దవడ/నమిలే పళ్ళు
**teeth, permanent** శాశ్వతదంతాలు
**teeth, premolar** పక్కపళ్ళు
**teeth-ridge** దంతమూలం, బర్స్యం
**teeth, wisdom** జ్ఞానదంతాలు
**teething** పళ్ళు రావటం; ఆరంభదశలోని
**teetotaler** మత్తుపదార్థాలకు దూరంగా ఉండేవ్యక్తి
**tegmen** లో(పలి) పొర
**telecast** దూర(ప్ర)దర్శనం
**telecommunication** దూర ప్రసారం/ప్రసారణం
**tele conferencing** దూర సమావేశనం/సమాలోచనం
**telegram** తంతివార్త
**telegraph** తంతి, తంతి వార్తలు పంపేయంత్రం
**telegraphic address** తంతి విలాసం/చిరునామా
**telemetry** దూరమితి
**telepathy** దూరసంవాదం, దూరశ్రవణం; భావనావహనం
**telephone** దూరశ్రవణయంత్రం, దూరవాణి
**telephone exchange** దూరవాణీ నిలయం
**telephotography** దూరచిత్రణం
**teleprinter** దూరముద్రణ యంత్రం, దూర ముద్రాపకం/ముద్రాలేఖిని
**telescope** దూరదర్శిని
**telescopic** దూరదర్శక
**telescopic observations** దూరదర్శన పరిశీలనలు
**telescopic word** సంపృక్త శబ్దం
**telespectroscope** దూరదర్శక వర్ణపటదర్శిని
**television** దూరదర్శిని
**televisor** దివ్యదర్శకం, దూరదర్శకం
**tell** చెప్పు, తెలియ జేయు/బరచు; లెక్కింపు
**tell off** క్రమంలోచెప్పు, లెక్కించు
**tell tale** విస్పష్ట, బయటపెట్టే; దళారి; వదరుబోతు
**telling** కచ్చితమైన, బలమైన, ప్రభావంగల
**tellurium** భౌమం
**temper** పదును, కాఠిన్యం; స్వభావం, ప్రకృతి, నిగ్రహం
**temperament** స్వభావం, వ్యక్తిత్వం
**temperance** పరిమితత్వం, మితపానం; (ఆత్మ) నిగ్రహం, సంయమం
**temperate** సమశీతోష్ణ; మిత, సంయత, నిగ్రహంగల, మితభోగి/మితపాయి అయిన
**temperate climate** సమశీతోష్ణ వాతావరణం
**temperate region** సమశీతోష్ణమండలం
**temperature** ఉష్ణోగ్రత
**tempest** తుఫాను
**tempestuous** అల్లకల్లోలమైన, తుఫాను వాతావరణంగల
**temple** దేవాలయం, కణత
**tempo** (గతి) వేగం, పట్టు, నడకతీరు; స్వరబద్ధ రచన
**temporal** ఐహిక, లౌకిక, తత్కాల
**temporal affairs** లౌకిక వ్యవహారాలు
**temporal behaviour** తత్కాల ప్రవర్తన
**temporal dimension** కాలమితి
**temporal quality** కాలబోధకత
**temporarily** తాత్కాలికంగా
**temporary** తాత్కాలిక
**temporise** సమయానుకూలంగా నడుచు
**tempt** (దుర్వృత్తికి) పురికొల్పు, ప్రలోభపెట్టు, దుర్బోధచేయు, మనసు నాకర్షించు; శోధించు
**temptation** దురాకర్షణ, దుర్వృత్తి
**ten** పది (మంది)

**upper ten** అభిజాతవర్గం
**tenable** సమర్థనీయ, రక్షణసాధ్య, వహించదగ్గ
**tenacious** దృఢ, గట్టి పట్టుదలగల
**tenacity** దృఢత్వం, హఠం, స్నేహం, స్నిగ్ధత
**tenancy** కౌలు (దారీ హక్కు), అద్దె ఏర్పాటు
**tenancy law** కౌలుదారీ చట్టం
**tenant** కౌలుదారు, కమతందారు, అరిగాపు, అద్దె ఇచ్చేవ్యక్తి/కిరాయిదారు
**tenantry** కౌలుదార్లు, రైతాంగం, ఆసాములు
**tend** వంగు, ఉద్దేశించు, ఉన్ముఖమగు, సమీపించు, కాచుకొని ఉండు, ఒకవైపు పోవు
**tendency** వైఖరి, జాడ, ధోరణి, ప్రవృత్తి, ఉద్దేశం, ఇష్టం, ఆసక్తి, ఉన్ముఖత
**tendentious** స్వాభిప్రాయబద్ధ
**tender** *adj* సుకుమార, మృదు, లేత *n* ఒప్పుకోలు, నివేదన, సమర్పణ(ం); తాకితే నొప్పిపుట్టడం *v* ఇచ్చు, సమర్పించు, సంసిద్ధమగు
**tenderness** మార్దవం, సౌకుమార్యం, లేతదనం; తాకితే నొప్పిపుట్టడం
**tendon** స్నాయువు
**tendril** నులితీగ; లతిక
**tenement** వాసస్థలం, కౌలు భూమి, అద్దె ఇల్లు, (గ్రాహ్యమైన) ఆస్తి, (సంక్రమించదగ్గ) మూర్తదాయం, గ్రాహ్యరూపసంపద
**tenesmus** బాధామయ మలవిసర్జన
**tenet** సూత్రం, సిద్ధాంతం, నియమం, నిబంధన
**tenor** మధ్యస్వరం; అన్వయం, ప్రవాహం, క్రమం
**tense** బిగిసిన, ఉద్విగ్న, ఉద్రిక్త, దృఢ; కాల(బోధక)ం; కాలబోధ
**tense situation** ఉద్రిక్తపరిస్థితి
**tension** తన్యత; బిగువు, బిగింపు, ఆతతి, ఉద్రిక్తత
**tensionometre** తలతన్యతామాపకం
**tent** *n* గుడారం, డేరా, కుటీరం; సిద్ధాంతం, మతం *v* డేరా వేయు, డేరాలో బసచేయు
**tentacle** స్పర్శకం; అదృశ్యహస్తం
**tentative** తాత్కాలిక, ప్రాయోగిక, పరీక్షార్థక
**tentative programme** తాత్కాలిక కార్యక్రమం
**tenuous** సూక్ష్మ, స్వల్ప, అరుదైన; సన్నని, బక్కపలచని, సుకుమార
**tenure** అవధి, పరిమితి, (పదవీ) కాలం, గడువు
**tenure of land** భూమిధారణం, భూస్వామ్యం
**tenure of office** ఉద్యోగావధి
**tepid** నులివెచ్చని, గోరువెచ్చని
**teratogenesis** అపురూపజననం, ఆశ్చర్యకర జన్మ/ఉత్పత్తి
**teratology** (అల్పకాలిక) గర్భస్థశిశు శాస్త్రం
**tercentenary** త్రిశతాబ్ది ఉత్సవం
**term** *n* పదం, పదవీకాలం, పరిభాష, పరిమితి, అవధి, గడువు, హద్దు; శబ్దం, షరతు, నిబంధన; విడత; బోధనకాలం
**terms of reference** ఉల్లేఖన నిబంధనలు
**terminable** రద్దుకాదగ్గ, రద్దయ్యే
**terminal** *adj* చిట్టచివరి, తుది, అంత్య *n* చివర, అంత్యం, అగ్రం, ఆఖరు, తుది; అడంగు; కాలావధి
**terminal examination** మధ్యకాలిక పరీక్ష
**terminal output** అంతిమోత్పాదన
**terminal station** (terminus) గమ్యస్థానం, చివరిదశ, చివరిస్టేషన్; ఎల్ల
**terminal tax** అడంగు పన్ను
**terminals** కొనలు, చివరలు
**terminate** అంతమొందించు, పూర్తిచేయు; రద్దగు, రద్దు చేయు; అంతమగు, సమాప్తిచేయు
**termination** అంతం, సమాపనం, సమాప్తి, ముగింపు, ఉపసంహారం, రద్దు; అంత్యభాగం, విభక్తి ప్రత్యయం
**terminology** పరిభాష
**terminus** గమ్యస్థానం
**termite** చెద(లు)
**terms** షరతులు, నిబంధనలు
**ternary** త్రికం
***terra*** భూమి
***terra ferma*** స్థిరభూమి, భూస్థలం
**terrace** పైకప్పు
**terrace cultivation** పందిరిసేద్యం, బండ సాగుబడి
**terracing** పందిరివేయటం
**terrain** స్థానం, భూమి, మైదానం
**terrain feature** భూలక్షణం
**terrarium** భూచరాలయం
**terrestrial** భౌగోళిక, భూమిమీద నివసిస్తున్న, భూసంబంధి
**terrible** భయంకర, ఘోర
**terrific** ప్రచండ, ఘోరాకార
**terrify** భయపెట్టు
**territorial** ప్రాదేశిక, ప్రాంతీయ, దేశ/రాజ్య సంబంధి



**territorial army** ప్రాంతీయ/ప్రాదేశిక సేన
**territorial integrity** దేశసమైక్యం
**territorial sea** ప్రాదేశిక సముద్రం
**territorial waters** దేశాధికారపరిధిలోని సముద్రభాగం
**territory** ప్రదేశం, ప్రాంతం, భూభాగం; దేశం, సంస్థానం
**terror** భీతి, భయం, భయకారణం
**terror, night** పీడకల
**terrorism** తీవ్రవాదం, ఉగ్రవాదం, విప్లవవాదం
**terrorist** తీవ్రవాది, ఉగ్రవాది
**terse** సంక్షిప్త
**tertian** దినంమార్చి దినం వచ్చే, ప్రతిమూడు రోజులకు వచ్చే
**tertiary** మూడో
**tessellations** ప్రస్తరఖచిత
**test** *n* శోధన, పరీక్ష, నికష, నిదర్శనం *v* శోధించు, పరీక్షించు, నిదర్శించు
**test match** పరీక్షా క్రీడ
**test reactor** పరీక్షార్థం నిర్మించిన అణురియాక్టరు
**test works** (in scarcity aeas) మచ్చుపనులు, సహాయకార్యక్రమాలు
**testa** బీజకవచం
**testament** వీలునామా, మరణశాసనం; బైబిల్లో భాగం
**testate** మరణశాసనం రాసిన
**testator** మరణశాసనకర్త
**testicular** వృషణసంబంధి
**testification** రూఢి, నిరూపణ, సాక్ష్యం
**testify** సాక్ష్యమిచ్చు, నిరూపించు, రూఢిపరచు
**testimonial** యోగ్యతాపత్రం
**testimony** రూఢి, సాక్ష్యం, దృష్టాంతం, నిదర్శన, ప్రమాణం, (మూజువాణీ) సాక్ష్యం
**testing** పరీక్ష(ణం)
**testis** వృషణం
**tetanus** ధనుర్వాతం, ధనుర్వాయువు
**tetanus, neonatal** అప్పుడేపుట్టిన బిడ్డల్లో ధనుర్వాతం
**tetany** జోము పట్టడం
***tete-a-tete*** *adj, n* ఏకాంత సంభాషణ
**tether** పలుపు, పగ్గం; పగ్గం బిగించు/కట్టు
**tetra** చతుర్
**tetracid** చతురామ్లం
**tetragon** చతుష్కోణం
**tetrahedron** చతుష్ఫలకం
**tetratology** చతుష్టయం
**tetratomic** చతుష్పరమాణుకం
**tetravalent** చతుస్సంయోగసామర్థ్యం
**text** పాఠం, వ్యవహారఖండిక, మూలగ్రంథం, మతశాస్త్రసూత్రం, పాఠ్యగ్రంథం
**textbook** పాఠ్య పుస్తకం/గ్రంథం
**textile** జౌళిసరుకు, నేసిన వస్త్రం; జవుళినేత
**textile industry** వస్త్ర/జౌళి పరిశ్రమ
**textile-mill** జౌళి మిల్లు, వస్త్రకర్మాగారం
**texture** అల్లిక, నేత
**thalamus** పర్యంక (దేశ)ం; పుష్పాసనం
**thank** అభినందన, కృతజ్ఞత, ధన్యవాదం
**thankful** కృతజ్ఞతగల
**thankless task** వ్యర్థకార్యం
**thanks giving** (దేవుడికి) ధన్యవాదం/కృతజ్ఞత చెప్పడం
**thaw** కరుగు, కరగబెట్టు, వెచ్చనగు
**theatre** రంగస్థలం, నృత్యమందిరం, శాల
**theatre craft** నాటకకళ, నృత్యకళ
**theatre of war** యుద్ధభూమి, రణరంగం
**theatre, operation** శస్త్రవైద్యశాల, ఆపరేషన్‌గది
**theatrical** రంగస్థల/నాటక సంబంధి
**theism** ఆస్తికత్వం, సేశ్వరవాదం, ఆస్తికవాదం
**theist** ఆస్తికుడు
**thematic** వికరణయుత, ప్రాతిపదికాపూర్వక
**thematic approach** విషయస్వభావాధారిత ఉపగమం
**thematic mapper** వికరణయుత మానచిత్రకం
**theme** విషయం, ఇతివృత్తం; ప్రాతిపదిక, వికరణం
**theocracy** మతరాజ్యవ్యవస్థ; బహుదేవతారాధనం
**theodicy** ఈశ్వరనిర్దుష్టతావాదం
**theogony** దేవతావంశావళి
**theologian, theologist** వేదాంతి, మతధర్మవేత్త
**theology** (క్రైస్తవ) ధర్మశాస్త్రం; వేదాంతశాస్త్రం; ఈశ్వరతత్వం
**theophany** ఈశ్వరావిర్భావం
**theorem** సిద్ధాంతం
**theoretical** సైద్ధాంతిక, శాస్త్రీయ, సిద్ధాంతపరమైన
**theoretical input** సైద్ధాంతిక నివిష్టి/ఉత్పాదకం
**theoretically** సైద్ధాంతికంగా, సిద్ధాంతం ప్రకారం, సిద్ధాంత రీత్యా/రూపంగా

**theory** సిద్ధాంతం, వాదం
**theory of reality** యథార్థ సిద్ధాంతం
**theory of relativity** సాపేక్ష సిద్ధాంతం
**theosophist** దివ్యజ్ఞాని
**theosophy** దివ్యజ్ఞానం
**therapeutics** చికిత్సాశాస్త్రం
**therapist** చికిత్సకుడు
**therapist, occupational** వృత్తి చికిత్సకుడు
**therapist, speech** వాక్చికిత్సకుడు
**therapy** చికిత్స
**thereabouts** రమారమి, సుమారు
**thereafter** అప్పటినుంచి, ఆ తరువాత/మీదట
**thereby** దానిద్వారా, ఆకారణంతో, అందువల్ల, అక్కడినుంచి
**therefore** ఇందువల్ల, ఈకారణంతో, అందువల్ల, అందుకని
**thermal** ఉష్ణ/తాప సంబంధి
**thermal energy** ఉష్ణశక్తి
**thermal infrared ray** ఉష్ణ/తాప పరారుణ కిరణం
**thermal power generation** ఉష్ణ/తాపాధార విద్యుదుత్పత్తి
**thermal power station** ఉష్ణ/తాపాధారిత విద్యుత్కేంద్రం
**thermal reduction** ఉష్ణలఘూకరణ/క్షయకరణ
**thermal spectral scanner** ఉష్ణ/తాప వర్ణపట నిరీక్షకం
**thermionic** ఉష్ణాయానిక
**thermionics** ఉష్ణ అయానిక విజ్ఞానం/శాస్త్రం
**thermochemistry** ఉష్ణరసాయన శాస్త్రం
**thermocline** ఉష్ణపతనస్థానం
**thermodynamic** ఉష్ణగతిక
**thermodynamics** ఉష్ణగతికశాస్త్రం
**thermo-galvanometer** తాప గాల్వనీమాపకం
**thermograph** ఉష్ణమాపక లేఖ
**thermolabile** ఉష్ణభరణశక్తియుక్త
**thermo-luminiscence** ఉష్ణదీప్తి
**thermolysis** ఉష్ణవిశ్లేషణం
**thermometer** ఉష్ణమాని, ఉష్ణమాపకం
**thermometer, clinical** జ్వర మాని/మాపకం
**thermometrograph** ఉష్ణోగ్రతాలేఖిని
**thermometry** ఉష్ణమితి
**thermoscope** ఉష్ణతాదర్శి
**thermostat** ఉష్ణస్థాపకం, ఉష్ణోగ్రతాస్థాపకం
**thermostatics** తాపనియంత్రణశాస్త్రం
**thermotropism** ఉష్ణభ్రమణం
**thesis** సిద్ధాంత (వ్యాస)ం, పరిశోధనవ్యాసం; వాదం, పక్షం
**thick** గట్టి, దృఢ, ముతక, దళసరి, మందమైన, భారీ
**thick-skinned** బండబారిన, మొరటు, ముతక
**thick-skulled** మందబుద్ధి, మూర్ఖుడు
**through thick and thin** సుఖదుఃఖాల్లో
**thigh** తొడ, ఊరువు
**thimbleful** కొద్దిపాటి, బొటనవేలంత, పరిమాణం తక్కువ అయిన
**thin** పలచని, సన్నని, బలహీన
**thin-skinned** శీఘ్రకోపి, తొందరమనిషి
**thing** వస్తువు, విషయం, సంగతి, పదార్థం, పని
**think** ఆలోచించు, తలచు, భావించు, విచారించు
**think aloud** పైకి మాట్లాడు, ఆలోచనలు బయటపెట్టు
**think better of** ఘనంగా భావించు
**think fit** యుక్త మనుకొను
**think-tank** ఆలోచనపరుడు, సలహాదారు, ధీసచివుడు
**thinking** ఆలోచన, చింతన
**third** మూడో, తృతీయ
**third class** మూడోతరగతి, తృతీయశ్రేణి; తుచ్ఛ, నీచ
**third party/person** (వ్యవహారంలో ప్రమేయ మున్న) అన్యవ్యక్తి
**third-rate** మూడోరకం; తక్కువ/నాసి రకం
**thirst** తృష్ణ, దప్పిక, దాహం
**thoracic** వక్షస్సంబంధి
**thoracoplasty** వక్షస్సంధానం
**thoracoscope** వక్షోదర్శిని
**thoracotomy** వక్షశ్ఛేదన
**thorax** వక్షస్సు, రొమ్ము
**thorn** ముల్లు
**thoroughness** క్షుణ్ణత
**thought** భావన, చింతన, ఆలోచన, భావచింతన
**thought-reader** పరేంగితజ్ఞుడు
**thoughtful** ఆలోచనాపూర్ణ
**thrash** (ధాన్యం) నూర్చు, కొట్టు, బాధించు, ఓడించు; (పథకం) రూపొందించు, పునః పరిశీలించు



**thrash out** నిష్కర్షగా చెప్పు
**thrashing** (కొరడా) దెబ్బ; నూర్పిడి
**thread** *n* దారం, మరనూలు, పోగు; ఆధారం *v* దార మెక్కించు, మార్గం చూసుకొనిపోవు
**hang by thread** సంకట స్థితిలో ఉంచు/ఉండు
**lose the thread** అన్వయం మరచు/తప్పు
**resume/take up the thread of** పునరారంభించు
**thread worm** నులిపురుగు
**threat** బెదిరింపు
**threaten** బెదిరించు, భయపెట్టు
**threatened strike** సమ్మెబెదిరింపు
**threats and counterthreats** ఎదురు బెదిరింపులు, పరస్పర తర్జనలు
**three** మూడు, ముగ్గురు, త్రికం
**rule of three** (గణితంలో) త్రైరాశికం
**the three r's** చదవటం, రాయటం, అంకెలు వేయటం; పఠన లేఖన గణనలు
**three-cornered** ముక్కోణపు
**three dimensional (3D)** త్రిమితీయ
**threshold** ఇంటిగడప, ప్రవేశమార్గం, గుమ్మం, వాకిలి; ప్రారంభం; ప్రభావసీమ, శ్రవణ/గ్రాహక స్థాయి
**thrift** పొదుపు, మితవ్యయం; అభ్యున్నతి
**thriftless** పొదుపులేని, అమితవ్యయం/దుబారా చేసే
**thrifty** పొదుపరి అయిన
**thrill** *n* పులకరింత, జలదరింపు, రోమాంచం, కుతూహలం, హృదయకంపం, అత్యుత్సాహం; స్పర్శ తరంగం *v* ఒళ్లు జలదరించు; ఉద్వేగపరచు
**thrive** వర్ధిల్లు, వృద్ధిపొందు, గెలుపొందు
**throat** గొంతు, కంఠం; సప్తపథ
**throe** ప్రసవ/మరణ వేదన
**thrombosis** (రక్తం) గడ్డకట్టడం
**throne** *n* గద్దె, అధికారపీఠం, సింహాసనం *v* గద్దె ఎక్కు, రాజగు
**throng** *n* జన/ప్రజా సమూహం *v* (జనం) గుమిగూడు, గుంపు కట్టు
**throttle** పీకనొక్కు, గొంతు నులుము; (యంత్రంలో) కవాటం బంధించు
**throttle down** కవాటం బంధించు; వేగంతగ్గించు
**through** ద్వారా, గుండా, వల్ల, నుంచి
**through bogie** నేరుగా/గమ్యస్థానందాకా వెళ్ళే రైలుపెట్టె
**through proper channel** క్రమమార్గంలో, అధికారక్రమానుసారం
**through traffic** సరాసరి రాకపోకలు/రవాణా
**through train** సరాసరి రైలు
**throughout** సర్వత్రా, అంతటా
**throw** *n* విసురు, విసిరేదూరం *v* విసరివేయు, పారవేయు
**throw away** బయటకు విసిరివేయు, నష్టం కలిగించు
**throw in one's lot with** తోడ్పడు, సహకరించు
**throw overboard** విసరివేయు
**thrust** *n* ఒత్తిడి, పీడనం; పోటు, తోపు *v* తోయు, బలవంతంగా పొడుచు
**thumb** బొటనవేలు
**rule of thumb** అనుభవసూత్రం
**thunder** *n* ఉరుము, గర్జన *v* గర్జించు, ఉరుము, ఘోషపెట్టు
**thunderbolt** పిడుగు, అశని
**thundershowers** ఉరుములతో కూడిన జల్లులు
**thunderstorm** ఉరుములతో కూడిన గాలివాన
**thus** ఆ/ఈ ప్రకారంగా/విధంగా, అలాగు, ఇలాగు, అట్లా, ఇట్లా
**thwart** అడ్డుకొను, భంగపరచు, అవరోధం కల్పించు, నిష్ఫలంచేయు
**thymus** శైశవగ్రంథి
**thyroid** గళగ్రంథి
**Tiagulum** చ్యవనుడు
**tibia** జంఘిక
**tic** (అసంకల్పితమైన) కండరాల సంకోచనం
**tick** పిఱుజు; గుర్తు గీత; గడియారం చేసే ధ్వని
**tick off *(slang)*** గుర్తుపెట్టు; బెదిరించు
**tick-tack** గుండె చప్పుడు, గడియారం ధ్వని
**ticket** చీటి
**tickle** *n* గిలిగింత, కితికితలు *v* గిలిగింతలు పెట్టు, ప్రసన్నంచేసుకొను
**ticklish** గిలిగింతలుపెట్టే; అస్థిర, ప్రమాదకర, కఠిన
**tidal** ఆటు పోట్లు గల, ఉప్పెనకు సంబంధించిన
**tidal energy** వేలాశక్తి
**tidal river** వేలానది, సముద్రపోటుగల నది
**tidal waters/tide waters** ఉప్పెననీరు, సముద్రపోటునీరు, వేలాజలం
**tidal wave** పోటు అల, వేలాతరంగం
**tide** *n* సముద్రపోటు, అల, కెరటం, తరంగం, వేల *v* దాటు, విజయం సాధించు

